# చివరకు మిగిలేది!

[నవల]

బుచ్చిబాబు



దేశి కవితా మండలి
విజయవాడ-2

B
దేశీ ప్రచురణ
ప్రథమ ముద్రణ
౧౦౦౦ ప్రతులు
జూన్ — 1952
హక్కులు రచయితవి
కిసాన్ ప్రెస్, విజయవాడ.
వెల: ఐదు రూపాయిలు

ముఖచిత్రం:
అజంతా చిత్తరువు
నకలు: శ్రీ దశిక శ్రీరామమూర్తి



సంపాదకులు:
బొందలపాటి శకుంతలాదేవి
శివరామకృష్ణ

# చివరకు మిగిలేది!

శ్రీ వేమన గ్రంథాలయము
తేలప్రోలు. (కృష్ణా జిల్లా.)

## వీరి కొన్ని ఇతర రచనలు

నాటకాలు :

ఒమార్ ఖయ్యాం
రాయలి కరుణకృత్యం
తిష్యరక్షిత
ఆత్మవంచన
దారినపొయ్యే దానయ్య

కథలు :

నన్ను గురించి కథ వ్రాయవూ ?
మరతుమన్న మరపురాదు
అడివికాచిన వెన్నెల
మేడమెట్లు
త్రినేత్రుడు
... ... ...

'మీ మిత్రులెవరో చెబితే - మీ గుణగణాలు గ్రహించవచ్చు' అన్నది ఒక సామెత.

'మీ పుస్తకాల ప్రచురణకర్త లెవరో తెల్పితే, వాటి సాహిత్య విలువలు నిర్ణయించవచ్చు' నన్నది మా సామెత.

ఈ సామెత మన దేశంలోకన్న-ఇతర దేశాలలో ఎక్కువ ప్రచారంలోవుంది. మన దేశంలో కూడా ప్రచురణ కర్తలనుబట్టి పుస్తకం విలువ పెరుగక పోవటం లేకపో లేదు.

స్వంతంగా వ్రాసుకున్న పుస్తకాలు అందంగా, అచ్చు తప్పులులేకుండా ప్రచురించుకోటానికి పడిన యిబ్బందులు, చేసిన ప్రయత్నాలు మమ్ముల నీ ప్రచురణసంస్థ నెలకొల్ప టానికి కారణభూతమైనాయి.

ఇంతవరకు ఎక్కువగా అంతర్జాతీయంగా ప్రసిద్ధి జెందిన రచనలను తెలుగు పాఠకలోకాని కందించి సేవ చేయగలిగాం. ఇకనుండి వాటితోపాటు ఆంధ్రదేశంలోని ప్రముఖ రచయితల రచనలన్నీ తీసుకురావాలన్న సంక ల్పాలో - ప్రథమసోపానం ఇది.

ఇక 'బుచ్చిబాబు' గారి రచనల సౌరభాన్ని గురించి మేము వేరుగా చెప్పనవసరం లేదు. ఇందులో ప్రముఖ సాహితీ పరులు యిచ్చిన అభిప్రాయాలే వాటి సాహిత్య విలువను చాటుతాయి.

సంపాదకులు

# ఇందులోని అధ్యాయాలు





అంకితం:
ఆంధ్ర 'మాత' కు

క్ృతజ్ఞత:

ఈ నవలకి నామకరణంచేసి,
ముఖచిత్ర నిర్మాణానికి సూచనలిచ్చిన
ఆచంట జానకిరామ్ కి



# సమర్పణ

ఈ నవల 1943లో తలపెట్టినా, రచన 1946లో "నవోదయ"లో సీరియల్‌గా ప్రారంభమై, పదహారు మాసాల తర్వాత పూర్తయింది. నవల ముగియగానే శ్రీ పిలకా గణపతి శాస్త్రి, శ్రీమతి ఆచంట శారదాదేవి, 'నవోదయలో' విపులంగా, లోతుగా పరిశీలిస్తూ, విమర్శలు ప్రచురించారు. వారికి నా కృతజ్ఞత.

పాశ్చాత్య దేశాలలో నవల జీవితం మూడుమాసాలుట. మన దేశంలో మూడు సంవత్సరాలనుకున్నా, యీ నవల మరుగునపడి నాలుగేండ్లు కావొస్తోంది. 'దేశకవితామండలి'వారి సాహసంవల్ల ఈనాటికి పుస్తకరూపంగా వెలువడుతోందని విని, కొందరు స్నేహితులు యిందులో విశేష మేమిటని ప్రశ్నించారు. నిజంగా నాకు ఏం సమాధానం చెప్పాలో తెలీదు. ఈ ప్రశ్ననే నేనూ వేసుకుని మరొకరి పుస్తకాన్ని చదివినట్లుగా, తిరిగి చదివితే కొన్నివిషయాలు స్పష్టమైనై. కాలం గడిచిన తర్వాత, రచయితకి తనరచనపై, ఘోరంగా ఏవగింపు పుడుతుంది. ఈరకం రోతవల్లనే కాబోలు కొన్ని జంతువులు తమ సంతానాన్ని, పుట్టగానే తినేస్తుంటాయి. ఇన్ని పుటల గ్రంధంతో విసిగించి, యింకా కొంత వ్యాఖ్యానంతో పాఠకుణ్ణి యిబ్బంది పెట్టడం అన్యాయంగా తోచినా, ఏవగింపుని కాసేపు దిగమింగుకుని, నవల పుట్టు పూర్వోత్తరాలని పరిచయం చేద్దామని, ఈ ఉపోద్ఘాతం సాగిస్తున్నాను.

1943లో రాయలసీమ ప్రజల్ని పరిశీలించే అవకాశం కలిగింది నాకు. వార్ని పూర్తిగా అర్థంచేసుకున్నానని కాదు. చాలాకాలం దగ్గర పరిచయంవల్ల వ్యక్తుల్ని అర్థంచేసుకోడం సులభమన్నది నా అనుభవంకాదు. దూరంగా, అప్పుడప్పుడు లభ్యమయ్యే తాత్కాలిక పరిచయంవల్ల, చెత్తాచెదారం లేకుండా, వ్యక్తుల ప్రధాన మనస్తత్వాలు, లక్షణాలు ప్రస్ఫుటమవుతాయనుకుంటాను. ఈ పరిచయంవల్ల రాయలసీమ ప్రజకీ, సర్కారు జిల్లాల ప్రజకీ, పరస్పర వైముఖ్యాలున్నాయన్న సంగతి నాకు స్పష్టమైంది. వారినిగాని, వీరినిగాని విమర్శించాలన్న వుద్దేశం నాకు లేదు. ఆర్థిక స్థితిగతులు, చరిత్ర యీ విముఖత్వానికి కొంతవరకూ కారణాలైనా, కేవలం అవే కారణాలనలేము. అసలు జనం ఎందుకు

పరస్పరం ద్వేషించుకుంటారు? ఇరుగు పొరుగు ప్రాంతాలవారి స్నేహభావానికి ఆటంకాలేవి? పరస్పర ద్వేషం, అసహనం — యివి ఆరోజుల్లో నన్ను కలవర పెట్టినై. భాష, ఆర్థిక పరిస్థితులు, రాకపోకల సౌకర్యాలు—యివన్నీ సంతృప్తిగా ఏర్పాటైనా, యిరుగు పొరుగు ప్రాంతాల ప్రజలలో, ద్వేషచిహ్నాలుంటూనే వుంటాయి. ఒకవేళ, సర్కారు జిల్లాలవారు, రాయలసీమవారు ఏకమై ఆంధ్రరాష్ట్రం సిద్ధించినప్పటికీ, వీరిరువురూ కలిసి ద్వేషించే టందుకు, మరో ప్రాంతం ప్రజ —ఏ తమిళులో, మహారాష్ట్రులో, కన్నడులో— ఎవరో వొకరు కనపిస్తూనే వుంటారనుకుంటాను. ప్రాంతీయ వైరాలు, అంతర్జాతీయ రంగంలోకూడా వుంటున్న విషయం మన మందరమూ గమనిస్తూనే వున్నాము.

ఇందులో నాయకుడు సర్కారు జిల్లాల వాతావరణంలో యిమడలేడు. అనేక అనుభవాలు అతన్ని ఏకాకిని చేస్తాయి. రాయలసీమలో మరో జీవితం ప్రారంభిస్తాడు. అదృష్టవశాత్తు అతనికి భాగ్యం లభిస్తుంది. స్థిమిత పడుతుండగానే మళ్ళా పూర్వపు అనుభవాలు, శత్రువులు అతన్ని చుట్టుముట్టుతాయి ప్రేమ రాహిత్య ప్రవాహంలో పడిపోతాడు. ప్రాణాలతో బైటపడి, మరోచోట, మరో జీవితం సాధించడానికి వెళ్ళిపోతాడు. ఇదీ, యిందులో కథ. అతనేమీ సాధించలేడు. కాని సాధించ లేకపొయ్యానన్న జిజ్ఞాస అతన్ని జీవితానికి కట్టిపడేసినా కూడా, నిస్పృహుణ్ణి చెయ్యలేదు.

గతించిపోయిన యౌవనం, జాడ్యం, బీదతనం, మృత్యువు—ఇవి జీవితంలోని చెడుగు. ఈ చెడుగులో, మానవుడు గుండె బాదుకోవల్సిన విషాదం ఏమీ లేదు. జీవితంలో నిజమైన విషాదం ద్వేషించడం కూడా కాదు; నిజమైన విషాదం ప్రేమించ లేకపోవడం. ద్వేషించడంలో కొంత పట్టుదల, కార్యసాధనకూడా వుండొచ్చు: కాని ప్రేమించలేక పోవడంలో అట్లా సమాధాన పడేటందుకేమి లేదు; * "నాకొరకు చెమ్మగిలు నయనమ్ము లేదు." — కంటె విషాదకరమైన గీతం ఏదుంది? ఈ సమస్య నన్ను బాధించింది. దీన్ని బట్టి యీ సమస్యని నవలలో చర్చించి, వొక సమాధానం కనుక్కున్నానని కాదు. ఈ వస్తువుని వ్రాసేస్తే విషయం నాకు విశదపడుతుందనీ, నలుగురితో పంచుగుంటే బాధనుండి విముక్తి లభిస్తుందనీ తోచింది. వ్యక్తిగతమైన విముక్తి యీనవలకి ప్రేరణ.

* కృష్ణశాస్త్రి

ప్రేమించలేకపోవడం వొకటేకాదు యీనవలలో వస్తువు. జీవితంలో 'చెడుగు' —పాపం — ముఖ్యంగా పెద్దలుచేసిన తప్పిదాలు పిన్నలపైబడి వారి జీవితాల్ని ఏవిధంగా వికసించనీకుండా, పాడుచేసింద—యిదికూడా వొక ప్రధానమైన అంశమె. ఒకరుచేసిన అపచారాలకి మరివొకరు బాధ్యులై బాధ పడటంవల్ల సమాజంలో వ్యక్తిగతమైన నైతిక విలువఃకి తావులేకుండా పో తుంది. ఒకవ్యక్తికి కంటిలో మెల్లవున్నప్పుడు, అతణ్ణి హింసించదలుచుకున్న ప్పుడు సంఘం, అతని గుడ్డితనాన్ని వేలెత్తి చూపుతుంది. ఈకథలో నాయ కుడి 'తల్లి' పాత్ర చిత్రించబడిలేదు. కాని ఆమెచేసిన అపచారాల ఫలితం, నీడలా అతన్ని వెంటాడి, సంఘవిమర్శద్వారా, జీవితాన్ని కలుషితం చేస్తుంది. ఈ దౌ ర్జన్యాన్ని ఎదుర్కోడంలో అతను కొన్ని విలువల్ని సాధిస్తాడు. ఆవిలువలతో యీనవలకి నిమిత్తం వుంది.

ఈసమస్యని కథావస్తువుగా తీసుకొని, యిదివరలో అనేకులు వ్రాశారు. మనప్రాచీన వాఙ్మయంలో రేణుక, జమదగ్నుల కథ ఎన్నదగ్గది. తల్లి అపచారం చేసిందిగనక, ఆమెని సంహరించమని, ఆఋషి తనపుత్రుల నడుగుతాడు. ఎవ్వరూ అంగీకరించరు. ఒక్కకుమారుడుమాత్రం సిద్ధపడి, ఆకార్యం నెర వేరుస్తాడు. తండ్రి దానికి సంతోషించి, ప్రసాదించిన వరంవల్ల, తనతల్లిని బ్రతికించుకుంటాడు. తల్లిని బ్రతికించుకోగలనన్న ధైర్యంవల్లనే, అతనీపని చెయ్యగలిగాడని నాకు స్ఫురిస్తుంది. ఇందులోధ్వని కేవలం 'మాతృప్రేమ కాదు: అసలు మానవత్వంయొక్క ప్రేమప్రకిర్ష.

షేక్స్పియర్ తన 'హామ్లెట్' నాటకంలో యీవస్తువునే ఐశాను గుణంగా ప్రదర్శించయత్నించాడు ఈయత్నంలో షేక్స్పియర్ విఫలుడయ్యా డని తీర్మానం చేస్తూ, T. S Eliot యిల్లా విమర్శిస్తున్నాడు.

* కళద్వారా వుద్రేకాన్ని ప్రదర్శించాలంటే, ఆ వుద్రేకంతో సమంగా తూగే పరిస్థితులను గాని, వస్తువులనుగాని సృష్టించాలి; భౌతికానుభవంలో అంత మయ్యే ఆ పరిస్థితులను, వస్తువులను చిత్రించగానే, ఆ వుద్రేకం వుద్భవిస్తుంది. బాహ్యస్థితి గతులకు, ఆంతరంగిక వుద్రేకానికి సమత్వం కుదిరినప్పుడే రసాను భూతి కలుగుతుంది. 'హామ్లెట్' లో యిదిలేదు. స్థూలజగత్తులో కనపడే వాటికి

---

T. S Eliot "Selected Essays" ('Essay on Hamlet')

మించిపోయిన వుద్రేకానికతను లొంగిపొయ్యాడు. తల్లిచర్య అతనికి రోతపుట్టిస్తుంది, కాని ఆ రోత తీవ్రతకి 'తల్లిప్రతిమ' సరిపడలేదు. అతని ఏవగింపు ఆమెనికమ్మివేసి, అతీతమైంది. ఆబాధకి సరిపడ్డ వస్తువు బాహ్యజగత్తులో లేకపోవడంవల్ల, అతను విముఖుడయ్యాడు."

నాయకుని బాధకీ, స్పృశించగల శక్తులకూ సమత్వం కుదర్చడానికీ నవల యత్నిస్తుంది

తరువాత 1887లో గైడి మొపాసా యీసంఘటననే, తన 'పెరి ఎండ్ జాన్' (Pierre and Jean) అనే పెద్దకథలో చిత్రించాడు. ఇందులో తల్లిచేసిన అపచారాలు ఆమెజీవించి వుండగానే తనసంతానంపై కురిపించిన అరిష్టాలని అందంగా చూపించాడనిపిస్తుంది. మొపాసా తన కథకు వ్రాసిన వుపోద్ఘాతంలో "చిత్రపటం గీయదల్చుకున్న చిత్రకారుడు, ఎముకుల సొంపుని గురించి పట్టించుకోడు" అని వ్రాశాడు. ఫ్రెంచి విమర్శకులు యీరచన చదివినవాడు బాధ పడతాడుగాని, రంజితుడు కాలేడన్నారు. ఎముకల అమరికతో నిమిత్తం లేకుండా చిత్రపటం గీయటానికి పూనుకోడం సాహసమే మరి.

తల్లిదండ్రుల గుణాలుగాని, అవగుణాలుగాని రక్తంద్వారా పిల్లలకు ఏ విధంగా సంక్రమిస్తాయో వివరించడం 'చివరకుమిగిలేది' తలపెట్టదు. తన తల్లిని గురించి సమాజంలో చాటుచాటుగా నీతికీ, అవినీతికీ సంబంధంలేని కథలేవో ప్రచారమవుతుండగా వింటున్న కొడుకుజీవితం ఎన్నివిధాల కుంటుబడి పోతుందో చిత్రించడమే ఈ నవల లక్ష్యం. అంచేత ఈ ప్రచారాలకి తావునిచ్చిన తల్లి జీవితంలోని ఘట్టాలలోని సంఘర్షణ తొలిగించి, వాటిని మరుగు పరచడం జరిగింది.

ఈ సంకల్పం దోష భూయిష్ఠమైందని పాఠకులకి తోస్తే యీ వస్తువే సారస్వతంలో కళానుగుణంగా ప్రదర్శించడానికి అర్హత లేనిదని అనుకోవల్సివొస్తుంది. ఈ విషయం పాఠకునికే వొదిలేస్తున్నాను. ఇవన్నీ అనవసరమని తోచినవారు 'చీకటిసమస్య' అన్న అధ్యాయాన్ని వొదిలెయ్యవొచ్చును.

సమాజాల మధ్యవున్న ద్వేషాలకీ వ్యక్తులు ప్రేమించలేకపోవడానికీ ఏదో సంబంధం వుండివుండాలని నా నమ్మకం. అదేవిటో, ఎల్లావుంటుందో కనుక్కుందామని యీనవలా రచన సాగిందనిపిస్తుంది. ఇదంతా చదివి యీ నవల

సమస్యలలో ప్రమేయంవున్న ప్రచారక గ్రంథం అనుకోవద్దని విన్నపం. తిరిగి చదివి. వెదికితే స్ఫురించే వ్యాఖ్యానా లివన్నీను. సమస్యల చర్చే ప్రధాన విషయ మైతే యీ నవలే వ్రాయను. ఏవొక్క విలువతోనూ యీ నవలకి ప్రమేయం లేదు. అంతమాత్రంచేత, దీనిలో ఏ విలువా లేదనుకోకూడదు.

కొందరు రచయితలవల్లె గ్రంథంలో వుపయోగించే నిమిత్తమై, అనుభవాన్ని నేను అన్వేషించను. సంస్కృతిని, సంతృప్తికోసమే ఆరాధించే వాణ్ణి కాను. ప్రవర్తనపైన, శీలంపైన, వున్నప్రభావంలోనే సంస్కృతి, కళల ప్రయోజనం వుందను కుంటాను. ఇదినేను ప్రగల్భంగా చెప్పటంకాదు. ఇందులో నాయకుడు, చివరలో జీవితానికి అర్థంలేదన్న నిర్ణయానికొస్తాడు. తననిగురించిన నిజం తెలుసుకోవాలని బయలుదేరిన వొకయువకుని అభిప్రాయం గాని, అది రచయిత నేర్చుకున్నపాఠం అనుకోవద్దని కోరుతున్నాను. నిజంగా కూడా, పాఠకునికి రచయిత వుద్దేశాలతోనూ, నమ్మకాలతోనూ, 'స్వీయ'గాథతోనూ నిమిత్తంవుండదు. ఇవి, అతనికి జీవితంపైవున్నజిజ్ఞాసని, సమగ్రంగా, నిజాయితీతో, అనుభవించగలిగేటట్లుగా చిత్రితమైనవా లేవా, అన్నదే పాఠకునికి కావల్సింది.

ప్రథమరచనలో, కొంత పాండిత్య ప్రకర్ష వుంటుంది. తాను తెలుసుకున్న విజ్ఞానాన్ని పాఠకుడికి తెలియచెయ్యాలని రచయిత వుబలాట పడతాడు కాబోలు. ఇదిలోపమే. ఇట్లాంటిది అక్కడక్కడ యీనవలలోకూడా కనిపించింది. కాని అది కథాసంవిధానంలో యిమిడిపోయింది. దాన్నివిడదీసి, సంక్షిప్తం చెయ్యడం నావల్ల కాలేదు. ఆధ్యాత్మిక, సాంఘిక విషయాలను గురించిన తర్కం, జీవిత సమస్యలపై నిర్వచనాలు, కొందరికి విసుగు పుట్టించవచ్చు; మరికొందరికి, కథ, పాత్రలకంటె, యీనిర్వచనాలే ప్రధానంగా తోచొచ్చు. ఇప్పుడు ఆవిషయమై నవలలో శిల్పంగురించి నిర్వచనాలు చెయ్యదల్చుకోవడం లేదు. నవలను గురించిన రచయిత అభిప్రాయాలు, తాను రచించే నవలల్ని సమర్థించేవిగా వుంటాయనుకుంటాను.

ఏ వ్యక్తి జీవితంలోనూ అన్నీ రసవత్తరమైన ఘట్టాలుండవు. చాలాకాలం మామూలుగా జీవించి, వొకక్షణంలో మహత్తరమైన అనుభవాలకి గురి

కావొచ్చు. * "అల్లాగే పెద్దగ్రంథంలో కొన్ని విసుగుపుట్టించే ఘట్టాలుం టాయి...... మొదటి పుటనుండి, చివరి పుటదాకా, చమత్కారంగా, అద్భుతంగా, విసుగులేకుండా నడచిన గ్రంథం, గొప్పగ్రంథం అవదు," అన్నాడు బెర్ట్రండ్ రసెల్. ఈకారణంగా, యీఘట్టాలని భరాయించ మనడంలేదు నేను. రెండుమహా సంగ్రామాల మధ్యకాలంలో, తెనుగునాట కొందరి యువతీ యువకుల జీవితం చిత్రితమైంది యీనవలలో. ఆఅల్లికలో యివన్నీ పోగులు. వాటిని తొలిగిస్తే, మందం తగ్గొచ్చు కాని, ఆకృతి పోతుందనుకుంటాను.

అంతేకాదు. రచయితకి ముఖ్యమని తోచిన విషయాలే, పాఠకుడికి కూడా ముఖ్యంగా తోస్తే, యీ ఘట్టాలని హర్షించడం తేలిక. అల్లా కొందరు సాహితీ ప్రియులు యీ గ్రంథం కుతూహలంతో చదివారనడానికి, యిందు పొందుపరచిన కొన్ని అభిప్రాయాలు తార్కాణం. తన విముక్తికోసం రచన సాగించినా, తన అంతరంగికొన్ని నలుగురితోనూ పంచుకున్నప్పుడే, రచయితకి నిజమైన సంతృప్తి కలుగుతుంది. అట్లా పంచుకోడంలో దానికొక మూల్యం, సామాజిక ప్రయోజనం ఏర్పడుతుంది. ఇందుకుగాను యీ అభిప్రాయాలు తోడ్పడతాయని తోచినప్పుడు వాటిని పొందుపరచడంలో ఆక్షేపణేమీ కనబడలేదు. 'నా ఆనందంకోసం నేను వ్రాసుకున్నాను; ఎవరి కర్థంకాకపోయినా, ఎవరు బాగులేదన్నా నాకులెక్కలేదు' అని నేననుకోలేను. ఏ రచయితైనా, అట్లాఅన్నా అదినేను నమ్మను. నా సమకాలికులలో కొందరు చిన్నలకీ పెద్దలకీ కూడా నే చెప్పదల్చుకున్నవి అవగాహన కావడం, రుచించడం, సానుభూతితో వారు విమర్శించగలగడం నాకు ఉత్సాహాన్ని, సంతృప్తినీ కలిగించింది. ఇది నా అదృష్టం.

ఈ గాధకి నేను మొదట అనుకున్న పేరు 'ఏకాంతం'. కథంతా చెప్పగా విని, 'చివరకు మిగిలేది' అని నామకరణం చేసింది శ్రీ ఆచంట జానకిరామ్. ఈ పేరు, గాథకి సమగ్రత నివ్వడమే కాకుండా, సరిహద్దుల్ని కూడా నిర్ణయించింది. ముఖ చిత్ర నిర్మాణంలో సూచనలు చేసి, రచన సాగుతున్నప్పుడు తన విమర్శలో ఎక్కువ ప్రోత్సాహం కూడా యిచ్చారాయన. ఇట్లాంటివి ఆయనకి నచ్చకపోయినా, కృతజ్ఞత చెప్పడం నా కర్తవ్యంగా తోచింది.

---

* The Conquest of Happiness

ఈ నవలలో పాత్రలు, ఎవర్నీ వుద్దేశించినవి కావని రచయితచెప్పుకోడం, తప్పకుండా అవి ఫలానా వార్ని వుద్దేశించినవి అని చదువరి అనుకోడం పరిపాటి అందుచేత ఆ విషయం కూడా చెప్పడంలేదు.

పుస్తకాలపై, కాస్తోకూస్తో గౌరవం, అభిమానం వుండి, సారస్వతాన్ని నమ్మి, దానికొక స్థానం యివ్వడానికి అలవాటు పడ్డవారు, ఎందరు చదివి అనుభవం పొందితే అంతటి సంతృప్తి. ఎందుకంటె జీవితంపై వొక దృక్పథాన్ని కలగ చెయ్యాలన్న వుద్దేశంలోనే యీ రచన సాగింది. ఆర్థిక, సాంఘిక చారిత్రిక వ్యత్యాసాల కతీతమై మనిషినీ మనిషినీ స్నేహపాశంలో బంధించివేసే మానవత్వం యొక్క శక్తుల్ని తరచి చూసినప్పుడు, ఆ దృశ్యాన్ని తన్మయతతో అనుభవించగలం. కాని ఆ అనుభవాన్ని మాటల్లో చెప్పలేం. ఈజీవిత రహస్యం-దాన్ని తెలుసుకోడానికి మానవుడు చేసే యత్నం — ఏగొప్ప గ్రంధానికైనా యివి పునాది. ఈనవలకీ అదేపునాది.

ఇది చదివినవారు, విషయం ఏమిటో తెలిసిపోయిందికదా అనుకొని విరమించకుండానే యీ ప్రస్తావన ముగించి, నవల సమర్పించుకుంటున్నాను.

విజయవాడ,
1–7–1952.

బుచ్చిబాబు

శ్రీ వేమన గ్రంథాలయము
తేలప్రోలు. (కృష్ణా జిల్లా.)

* * *

"ఒకభక్తుడు స్వర్గలోకానికి చేరుకోగానే, దేవకన్య అతనికొక బంగారు కిరీటాన్ని బహూకరించింది. అతను చుట్టూచూశాడు. మిగత భక్తుల శిరస్సులపై వున్న బంగారు కిరీటాలన్నీ వజ్రాలతో కూర్చబడి వున్నాయి. తనకిరీటంలో ఒక్కవజ్రంకూడా లేదు. ఇదేమిటని అడిగాడు.

"ఆవజ్రాలన్నీ ఆభక్తులు భూలోకంలో వొదిలిన కన్నీటి బిందువులు. నువ్వు ఒక్క కన్నీటి బిందువుకూడా విడవలేదు" అన్నది దేవకన్య:

"పరమాత్మలో ఐక్యమైపోయిన ఆనందంలో నాహృదయం నిండగా, నేకన్నీరెట్లా కార్చను?" అని ప్రశ్నించాడు ఆభక్తుడు.

"కన్నీరుకార్చిన వారికే వజ్రాలు" అన్నదామె;

దుఃఖించే వారు నిజంగా ధన్యులు. బాధపడగల హృదయమే ప్రేమించ గలదు; అదెంత సున్నితమైనదైతే అంత బాధపడుతుంది. విశాలహృదయుల దుఃఖంలో కన్నీటికి కూడా ఆస్కారంలేదు."

సర్వేపల్లి రాధాకృష్ణన్: 'నా సత్యాన్వేషణ.'

* * *

1

# గడ్డిపూచ విలువెంత?

చివరికి మిగిలేదేమిటి? దీనికి సమాధానం తెలిస్తే జీవితరహస్యం తెలుసుకున్నట్లే. అసలు జీవితానికర్థమేమైనా వుంటుంది? మానవుడు యీ ప్రశ్నని వేసే అవసరం రావడమే జీవితానికేదో అర్థం వుందనుకోడానికి తార్కాణం. అర్థంలేదని యితరులు రుజువుచేస్తే మనం అంగీకరించలేము; ఆ నిరూపణ మన …కైక స్థానాన్ని వెక్కిరించి, ధ్వంసం చేస్తుంది. అది మానవుడు సహించలేడు. జీవితానికర్థంలేదన్న నిర్వచనానికి అసలే అర్థంలేదు. కాని దాన్ని మనంతట మనమే ఋజువు చేసుకుంటే, సృష్టి అంత భయంకరంగా వుండకపోవచ్చు. సృష్టికి యితరులు కల్పించిన అర్థాలని మనం అంగీకరించలేము; మనం కనుక్కొని, ఎముకలలో జీర్ణించుకున్న అర్థాలని యితరులకి చెప్పలేం. ఇతరులతో సంపర్కం వొదులుకొని, ఏకాంతంగా మనం తెలుసుకున్న జీవిత…స్యాన్ని యదార్థం అని నమ్మి సమాధానం పడుచుకోవడం, సంఘంతో …త్రం వున్న మనిషికి చేతకాదు కాబోలు. చరిత్ర కట్టుకున్న ప్రాచీన …దులు, సంఘం పాతుకున్న మట్టి విత్తనాలు, వాటిని మినహాయిస్తే మానవుడిలో చివరికి మిగిలేదేమిటి?

చివరికి మిగలడం! పడమటి ఆకాశంలో సూర్యుడు ఎర్రగా ఆవులించి …ప్రపంచంలో మూర్ఛిల్లిపోతే మిగిలినవి, పగటిని వదలలేక రాత్రిని వెతుక్కునే మత్తు మేఘాలు. నక్షత్రాలు భయంతో మెరుస్తున్నాయి. కాలవ తోకని త్రిప్పుకుంటున్న నల్లత్రాచులా వంకరతిరిగి దూరంగా అంతర్థానమైంది. ఆకాశంకేసి చూస్తూ వడ్డున గడ్డిపోచలమధ్య దయానిధి నవ్వుకున్నాడు. గడ్డిపోచని తెంపి, చిటికెనవ్రేలికి చుట్టుకున్నాడు. గాలికి భయపడుతూ దగ్గరగా జరిగి తలకాయ లూంచుకున్న గడ్డిపోచలపై అతను పడుకున్నాడు. గాలికి చొక్కా కాలర్ కదిలి చెవులో చక్కలిగింత పెడుతోంది. శరీరాన్ని ఆవరించుకున్న గాలి అందమైన అల్పానుభవం. శరీరం దాహంతో …రక్తాన్ని లేపి కొత్తభావాలు తీయిస్తుంది గాలి; ఇంద్రియాలు మైకం

చెందుతాయి; చర్మం, లోపలి భాగాన్ని పైకి తెచ్చుకుంటుంది. గుండెలు లయతప్పి మళ్ళా తేరుకుంటాయి; కళ్లు చూడడం మానుకుని దర్శిస్తాయి; పడమటి ఆకాశంలో పూడుకుంటున్న వుండు రాత్రి కెదకటం విరమించుకున్న మేఘాలు, భయం లేకుండా మెరుస్తున్న నక్షత్రాలు, తోకని త్రిప్పడం మానుకున్న నల్లత్రాచులా నిశ్చలత్వం పొందిన కాలవ, పవిత్రంగా కదుల్తున్న గడ్డిపోచలు, మూంగశక్తితో ప్రశాంతంచెందిన ప్రకృతి, తనూ-అన్నీ ఏకమైపోయి, వొక్కసారి చైతన్యం పోగొట్టుకుని, ప్రపంచంతో నిమిత్తం లేకుండా వుండిపోయాయి. 'కాలం', 'స్థలం', 'వునిక', 'లేమి'-'అంతం' 'అనంతం'-యీ ద్వంద్వా లిక లేవు.

'పొద్దోయింది యింటికిరాండి బాబుగోరు.' కాలం పొద్దు, యిల్లు-యీ ద్వంద్వా లెక్కడికి పోతాయి? లేచి కూర్చున్నాడు దయానిధి.

'ఇక్కా ఎక్కడనుంచి నారయ్యా?'

'ఆవుని యింటికి తోలుకెడుతుండానండి. లెగండి పోదాం. అమ్మగారూ మీకోసరం చూస్తూంటారండి...'

దయానిధి లేచి చొక్కా దులుపుకున్నాడు. గడ్డిపూచని త్రెంపి కాలవలో పారేశాడు.

'మధ్యాహ్నం మీరొచ్చేసిం తర్వాత, యింటికాడ పెద్ద గొడవ గింజండి. అయ్యగారు, అన్నయ్యగారు తగువులాడుకున్నారండి. అమ్మగారుంటే నే వుండను. అమ్మగారైనా వుండాలి, నేనన్నా వుండాలి యీ కొంపలో అన్నారండి అన్నయ్యగారు. అమ్మగార్ని అయ్యగారు కూకో[illegible] రండి. అన్నయ్యగారు, భూలక్ష్మమ్మగారు ౫ గంటల బండి కెళ్లిపొయ్యారండి. భూలక్ష్మమ్మగారొచ్చిం తర్వాత, అన్నయ్యగారు మరీ తొందరపడుతున్నారండి.'

దయానిధి మాట్లాడలేదు...నారయ్య నమ్మకస్థుడే; తన చిన్నప్పటినుంచి అతను వాళ్లింట్లో పనిచేస్తూండడంవల్ల యింటి గొడవలు అతనికి తెలిసినా, [illegible]రవాలేదుకాని, అతనిలో యిన్ని ముచ్చటించడం, వి[illegible]గా లో[illegible]స్తుంది.

'నారయ్యా, నువ్వింటికెళ్లు నే కాసేపుండి [illegible]స్తాగా.'

'అమ్మగారు, మీరు మధ్యాహ్నం కాఫీకూడా తాగలేదని, కంట తడిబెట్టుకుని, ఎక్కడున్నారో కొంచం చూసి తొందరగా యింటికి తీసుకు రమ్మని చెప్పారండి: మీరు మద్దినాళే ఎందుకొచ్చారండి! కామాక్షి కూతురు పూర్నించి యింకా రాలేదుగదాండి?'

అతని కీవిషయంకూడా ఎల్లా తెలిసిందో దయానిధికి అర్థంకాలేదు; ఆలోచించడం మొదలెట్టాడు. కామాక్షి చెప్పివుండొచ్చు; లేకపోతే అమ్మే చెప్పింకో...

'నారయ్యా...ఐతే, ఊర్నుంచి ఎప్పుడొస్తుందిట?...సరేలే. నువ్వెళ్లు నేనల్లా షికారెళ్ళి వో గంటలో వొస్తానని చెప్పు.'

నారయ్య దూడపలుపు నడుంకిచుట్టి, పాగాలోంచి చుట్టతీసి ముట్టించాడు.

'అయితే అబ్బాయిగారు - మీరు కోపంరాకు గదాండి, వో సంగతి చెబుతాను. మీరు దబ్బుని పెండ్లి చేసుకోరాదంటండీ?'

నారయ్య నవ్వేశక్తి పోగొట్టుకోలేదు. అతని జీవితంలో కష్టసుఖాలంటూ విడివిడిగా కేటాయించిన అనుభవా లేవీలేవు. పెండ్లాం చంద్రన్నతో లేచి వెళ్ళినరాత్రి పదిమందిని పోగుచేసి చెరువుగట్టున చెరుగుడి ఆడి తెల్లార గట్ల వేడివీళ్ళు పొయ్యమని చంద్రన్న యింటికెళ్ళాడు. మాధవయ్యా గ్రరానికి వాతంకమ్మితే, బెంగెట్టుగుని రెండుపూట్లు సరిగా తిండికూడా తినలేదు. లాలాసాహేబు మేకకి కాలు బరువేస్తే తనింట్లో మంచంకింద పడుకోబెట్టుకుని తెల్లవార్లూ తోమేడు. తనకి ప్రాప్తించిన వాటికి నవ్వుకుంటాడు; ఇతరులకి ప్రాప్తించిన వాటికి ఏడుస్తాడు. నారయ్య స్వభావం అది. దశరధ రామయ్యగారి యింటి వ్యవహారాలు నారయ్య మనశ్శాంతిని భంగంచేసినా అతను నవ్వుకునేటందుకు కనబడ్డ బోలెడు కారణాలలో కామాక్షి కూతురు కోసం, అబ్బాయిగారు కాలవ గట్టుకి రావడం.

దయానిధి లోపల నవ్వుకున్నాడు. ఈ నారయ్య కన్నె తెలుసు. పెద్దవాడైపొయ్యాడు, తెలీనట్లు వూరుకోరాదూ.

'రండి బాబుగోరు, సీకట్లో పురుగు, పుట్రా వుంటుంది జేగిరం రండి.'

నారయ్య ఆవుని తోలుతూ ప్రయాణమయ్యాడు. కొంగలగుంపు సిగ్గ

పడే వెన్నట్లో మెరుస్తూ పోతున్నాయి. ఏదో పిట్ట కాలవ నీళ్ళని కదిపింది. గడ్డిపూచలు కామంతో వొణికి పోతున్నాయి. దూరంగా చెట్లు చీకటి ముసుగుల్ని కప్పుకుని గుసగుసలు మొదలెట్టాయి. నారయ్య చుట్ట తాలూకు పొగ చంద్రుడిదగ్గరకు పోయింది. వేసంగి పగటినిద్ర మత్తుతో బరువెక్కిన మొహంలోని కాంతితో చంద్రుడుచుట్టూ వొళ్లు విరుచుకుంది వెన్నెల అప్రయత్నంగా. వూళ్లోకినడిచి, కామాక్షిగారి దొడ్లోకి చేరుకున్నాడు దయానిధి. ఆ సందులో జనం ఎవ్వరూ లేరు. మూడుగుడిసెలూ, పెంకుటిళ్లు, రెండున్నాయి. మెట్లదగ్గర నీడల్లి నుంచుని తలుపుకేసి చూశాడు. తలుపుమీద అతని నీడని చూసుకున్నాడు.

అతని నీడ ఎంతో బాగుంది. నీడలో అంత అందంగా కనిపించే ముక్కు అద్దంలో అల్లా వుంటుందేం? ఆ తలుపుమీద ఎన్నిసార్లు కోమలి నీడ పడిందో-అదేచోట. తలలో వేళ్లుపెట్టి జుత్తుని కదుపుకున్నాడు. మెట్ల మీదనుంచే కోమలి ఎన్నిసార్లు నడిచిందో, తనో మెట్టుగా మారిపోకూడదు! నవ్వుకున్నాడు. నీడ నవ్వితే అతనికి భయమేసి వులిక్కిపడ్డాడు. ఏదో ధ్వని అతని కంఠంలోనుంచి వొచ్చింది.

లోపల్నించి 'ఎవరది? మంగమ్మా, చింతపండు తెచ్చావా-ఉండు, తలంటు పోసుగుంటున్నా,' ఒకడుగు వెనక్కివేశాడు. ఊర్నించి సాయంత్రం వొచ్చారన్నమాట. తలుపు బీటలోనుంచి తొంగిచూశాడు. ఏదో నేరం చేసిన వాడిలా చిన్నబుచ్చుకున్నాడు. అతని వెనకాల మరో తలుపుసందులోనుంచి అతను యిల్లా చూడడం, మరోరుచూస్తే ఎల్లావుంటుంది. మనల్ని ఎవ్వరూ చూడడం లేదన్న ధైర్యం వున్నప్పుడు ఎన్నో పన్లు చేస్తాం-ఎవరన్నాచూస్తే ఎల్లావుంటుందో వూహించుగుని, అవకాశంవున్నా ఆపన్లు చెయ్యడానికి జంకుతాం. తలుపుసందు నీతి మనది, అనుకున్నాడు.

సందుచివర ఏదో మెదిలింది. తిండి యత్నం విరమించుగుని, కాలక్షేపానికి ఫారాచేస్తున్న గాడిదచేస్తున్న అలజడి. అతనల్లా చూడడం చూసి ఆ గాడిద ఏమనుకుంటుందో. ఎనాటమీ ప్రొఫెసర్ మొహం అచ్చంగా దానిలావుంటుంది. ఎండిపోయిన ఇస్తరాకుల్ని పరామర్శచేసి, వొద్రించడానికి విఫలయత్నంచేసి గాడిద నిష్క్రమించింది. కొంచం ధైర్యంచేసుగుని తలుపు సందులోంచి తొంగిచూశాడు. లోపల ఎవ్వరూ కనబడ్డంలేదు. నేల

మీద నీళ్లు పడుతున్న చప్పుడు. అవిగో చెంబు, చెయ్యి మోకాలుచిప్ప వూగిసలాడడం. తలుపులో బీట కొంచం పక్కగా కుడివెంపున వుండకూడదూ! గుండెలు దడదడ కొట్టుగుంటున్నాయి. అరిచెయ్యి తలుపుమీద ఆనించినచోట, చెమట మరకపడింది. వెనుక్కంటూ నారయ్య తనకోసం రాడుకదా కొంపతీసి, వొస్తేమాత్రం ఏం? నారయ్యకి తెలుసు. "దబ్బుని పెండ్లిచేసుకోరాదంటండి ?' అని అనగలిగేటందుకు అవసరమైన ధీమా వుండాలంటే ఎంతవరకూ తెలియాలో అంతవరకు తెలుసు. చెయ్యి తలుపుమీద నుంచి తీసేశాడు. ఇదివర కెన్నడూ చూడని మోకాలు చూశాడు. అమావాస్య వెళ్ళిన మూడోనాటి చందమామలా మోకాలు తడితో తళుక్కుమంది. ఎనాటమి ప్రొఫెసర్ ఏమంటాడోయీ మోకాలు చూసి!

చెమట డాగుపడ్డచోట తలుపుని ఉఫ్‌మని వూదాడు. మళ్లా ఎడమ చెయ్యి ఆనించాడు. లోపల చెంబుజారి బందలో పడిన చప్పుడు.

'అబ్బ సొట్టచెంబమ్మా!' అన్న కంఠం వినిపించింది. ఏదో ఆశ్చతిక కదిలింది. గంగాళం వూగిసలాట నిలిచిపోయింది. తలుపుమీదనుంచి చెయ్యి తటాలున తీసేశాడు; ఉంగరం రాపిడి 'కిర్' మంటూ ధ్వనించింది.

'ఎవరూ పలకరేం? మంగమ్మేనా? వొస్తున్నా...అమ్మ గుళ్లోకెళ్ళింది...'

తలుపు తెరిచింది. తలుపుతీసిన వ్యక్తిలోపలేవుంది. దయానిధి లోపలికి నడిచి, తలుపు దగ్గరగామూసి నిలబడ్డాడు. తెల్లబట్ట సగంవొంటికి చుట్టుకుని పీటమీద కూర్చుని జుట్టు సవరించుకుంటున్న కోమలి, వెన్నెల నగ్నంగా కూర్చుని తల్లో ఎర్రటి పిచ్చిపువ్వుని అమర్చుకుంటున్నట్లుగా వుంది.

'ఎవరూ-ఇదేమిటి-మీరా!' అని చీరకొంగుని కుడిభుజంమీదనించి లాక్కుని, మెడచుట్టూ తిప్పింది. దయానిధి ఆమెని పరకాయించి చూచాడు. క్రితం నేసంగి సెలవుల్లో మొట్ట మొదటసారి ఆమెను చూచాడు. తరవాత క్రిస్‌మస్‌లో-మొత్తం అంతవరకూ నూట పందొమ్మిది మార్లు చూడడం అతనికి గుర్తుంది. ఆమె నిజమైన సౌందర్యం యీనాడు చూశాననుకున్నాడు.

కోమలిది అన్ని సమయాలలోనూ, అన్నిచోట్లా, వొకేమాదిరిగా కనబడే చక్కదనం కాదనుకుని కొంచం విచారించాడు. పెట్టుపోతలు, సం

రక్షణ, సింగారింపు, యివన్నీ బాగా జరిగితేనే గాని ఆమెలో నిజమైన అందం బహిర్గతం కాదు. వాళ్ళమ్మ మా అమ్మాయి మొన్నే నే రజస్వలైందంటుంది. కాని కోమలికి పదహారేండ్లు నిండాయి. ఐనా ఆమె ఎదగడం పూర్తికాలే నట్లుగానే వుంటుంది. సన్నటి పొడిగాటి చేతులూ, మొనలన్నీ సర్దుకోని భుజాలు, మరో శరీరానికి వుద్దేశింపబడినదానిలా కనబడే సన్నటి నడుం; సన్నగిలటం మానుకుని వ్యాపించిన చోటా, ఏ చీరపడేసినా, చిలకొయ్యిలా పట్టుకునే వొంకర. వికసించటం ప్రారంభించినట్లుగా వుండి, స్ఫుటమైన ఆకృతి తెచ్చుకుని మొగపిల్లాడి రొమ్ములు, పూర్ణ చంద్రుడికి అడ్డం వొచ్చిన పల్చటి మేఘంలాంటి, మెత్తటి శరీరచ్ఛాయ-యీ కోమల్ని చూస్తూ కూర్చోడం, దయానిధికి వొక ఉత్కృష్టమైన అనుభవం. అన్ని ఆకర్షణీయమైన శరీర అవయవా లున్నప్పుడు, ప్రత్యేకం దేనికేసి చూడాలో అతను నిర్ణయించుకోలేడు. అంగ నిర్మాణం సగం సగం చేసి, దైవం వూరుకున్నట్లుగా వుంటుంది. యవ్వనం బైటపడి దర్శనం యివ్వడానికి భయపడు తున్నట్లుగా వుండే ఆమె అమాయకపు మోహాన్ని చూస్తూన్నాడు. ఆ చింపిరిజుట్టు, యిష్టం వొచ్చినట్లుగా అరణ్యంలో సహజత్వాన్ని అనుకరిస్తున్నట్లు పెరిగిపోయి, ఎక్కడ పాపిడి తీసినా లొంగదు. ఆ ముంగుర్లు నుదుటిని గట్టిగా పట్టుకుని, ఏ దువ్వెన్నకీ సందివ్వదు. సౌందర్యం నిద్రలో మూర్ఛపోయి, ఏదో స్మరణకువొచ్చి లేచి నట్లుగా వెర్రిచూపులు చూచే నేత్రాలు అతనికి అమాయకంగా వుండొచ్చు-. లేకపోతే బుద్ధిమాంద్యమేమో!

'ఊ' అంది కోమలి ప్రశ్నార్థకంగా, కనుబొమ్మలు వొక్కసారి వొంకర తిరిగాయి; రెండు పెదవులు ముడుచుకుని, చెక్కిళ్ళ చెర్మాన్ని లాక్కుని సున్నా చుట్టాయి.

'నీకోసం వొచ్చా' అన్నాడు.

'నాతో ఏంటిపని మా అమ్మతోగాని, ఎల్లుండి 'కూర్చున్నమనిషి లేచి, రెండుచేతులు తలుపులకు ఆనించి నిలబడింది. కంఠానికి చుట్టుకున్న కొంగు కిందికి జారింది; రొమ్ముల్లో పట్టుదొరక్క, తడినిపట్టుకుని నడుంమీద నిలిచి పోయింది. ఆనాటి దృశ్యం, అతనికి కొత్త-కొలువు నిచ్చింది. ఆమె అతనికి అర్థం ఐపోయినట్లు తోచింది. స్త్రీత్వంలోని 'మాయ' శరీరాన్ని తాకి క్రోధం

చిన్నవాళ్లకి కాని ఛేదించటం సాధ్యంకాదు. ప్రపంచంలోనో ఏజన్మంలోనో వారిద్దరూ వొకర్ని వొకరు వెదుకుతూ, యీ నాటికి కలుసుగుని గుర్తించుకు న్నట్లు అతనికి అనిపించింది.

'నాకు మీ అమ్మతో ఏం పనుంటుంది?'

'నాతో సీకట్లో ఏం పని మీకు. రాత్రి మాయింటికి రాకండి ఎప్పుడూ-మా అమ్మ సూసిందంటే తన్నుద్ది.'

'నీ కిష్టంలేకపోతే రాత్రిళ్లు ఎప్పుడూరాను. ఇంట్లో గొడవగావుంటే ఏమీతోచక నిన్ను చూద్దామని వొచ్చాను.' అని కొంచం నిదానించి మళ్లా మొదలెట్టాడు.

'ఐతే కోమలి, ఎవ్వరూలేరు కాబట్టి, ధైర్యం చేసి అడుగుతున్నాను నిజంచెప్పు. నేనంటే నీకిష్టమేనా?'

ఈ ప్రశ్న అతను పగలు వేసివుండటు, కోమలి వొకడుగు ముందుకు వేసి వెన్నెట్లో నిలబడ్డింది. తెల్లటిచీర ఆమెకి బాగా తగిందని నిర్ణయించు కున్నాడు. శిథిలావస్థలోవున్న తులసి దిమ్మమీద కూర్చుంది; అతను చీర మడతలు లెక్క పెడుతున్నాడు. శరీరంలో వొంపున్న చోటులో పది పేను మడతలు జమకొచ్చాయి; అల్పమైన మనిషి; వొంటిని తడినికూడా ఆర్పుకోలేని నీరశించిన శరీరం.

'ఊ' అంటూ పెదవుల్ని సున్నాచుట్టింది.

'ఇష్టమంటే?'

అతను ఆమెవైపు నడిచాడు; లేచి దూరంగా వెళ్ళింది.

'అమ్మో, దగ్గరగా రాకండి మా అమ్మచూస్తే తన్నుద్ది.'

'ఇష్టమంటే నీకు తెలీదూ? నాతో వుండాలని వుంటుందీ?'

'ఉండదు.'

'పోనీ నేను నీతోవుంటే నీకు సరదాగా వుంటుందీ?'

'అంటే?'

ఓలగా నవ్వింది. చందమామ నిద్దరోడి మేఘాల్ని ముసుగేసుకుంది. జేస్లు లేకుండానే వుద్భవించి, వృద్ధిపొందిన లతలా, పల్చగా నవ్వింది.

'ఏది, మళ్ళా నవ్వు.'

'నాతో నవ్వుతా లేమిటి? మీరు బ్రాహ్మలు-పెద్దవాళ్లు...'

'పెద్దవాళ్ళతో స్నేహం నీ కిష్టమేగా...'

'భయం.'

'ఎందుకు?'

'మీరు గొప్పోరు. ఇన్నిసార్లు మా యింటి కొచ్చారు నాకోసరం ఏమన్నా తెచ్చారా?'

'మీ అమ్మ అడగమందా?'

"ఛీ, పాడు-మా కట్లాంటి వృత్తిలేదు. అట్టాటివన్నీ మీ వోళ్ల ల్లోనే...'

"అట్లాంటి మాట్లనొచ్చా?"

"మీ రనొచ్చు నేం?"

"అవునుమరి-లేకపోతే డబ్బు విషయం ఎందుకు? డబ్బిస్తే నన్ను వుండ నిస్తావా?"

"ఏమ్మాటులవి? ఊరుకుంటున్నా ననా? వెళ్లండి, మా అమ్మొచ్చిందంటే మాటదక్కదు. మీ ఎదవడబ్బు మాకేమీ అక్కర్లేదు."

"అప్పుడే కోపమే-పోనీ రేపు సర్కస్ కి తీసుకెడతా వొస్తావా?"

"ఎందుకు లంచం-మీ నాన్నగారిలా మేం లంచాల్ తీసుకోం."

"మా నాన్న లంచం విషయం నాకెల్లా తెలుసు?"

"సెప్తారుంటారు. కృష్ణమాచారి అన్నాడు."

"అవన్నీ నువ్వు నమ్మకూడదు-సరదాగా మనిద్దరంకలిసి సర్కస్ చూసివొద్దాం, రేపు- వొస్తావా?"

"నేను రాను, సర్కస్లో పుల్లు, సింహాలూవుంటాయి. నాకు భయం-నన్ను తీసుకెళ్లేందుకు మీదగ్గర డబ్బెక్కడిది? మీ నాన్న యిస్తేగా?"

అతని దగ్గరగా వెళ్ళి "చూపించు జేబు" అని చొక్కాలో చెయ్యిపెట్టి గాలించి, బైటకి తీసింది గడ్డిపూచని.

"ఇదేంటె-ఛీ పాడు-గడ్డి, దాచుకో-"

అని అతని వొంటిమీద పారేసింది.

దాన్ని తీసుకుని ఆమెచేతిని గట్టిగా పట్టుకుని, గడ్డిపూచని తన్లో

పెట్టబోయ్యాడు. ఆమె శరీరాన్ని అతను ముట్టుకోవడం ఆదే మొదటిసారి. అతనికోసం సృష్టించబడిందని, యింద్రియాలు ఋజువు చేస్తున్నాయి. స్పర్శతో అతని శరీరం కంపించిపోయింది. సముద్ర కెరటాలపై నురుగు మంటలు గాలేచి ఆకాశాన్ని ఆవరించుకుంటే మళ్ళా ఆ జ్వాలని ఆర్పేటందుకు, ఆమె శరీరాన్నే తాకాలేమో, అనిపించింది. అతని చేతిని విదిలించిపారేసింది; గడ్డిపూవుని రెండు ముక్కలు చేసి అతని మొహాన్ని కొట్టింది.

"గడ్డి నోట్లో పెట్టాలి, కాని తల్లో కాదు, అంది. ఆ వాక్యంలోని వ్యంగ్యార్థం అతనికి బోధ పడలేదు. అర్థపూరితమైన భాష ప్రయోగించే సంస్కారం ఆమెకి లేదని అతనికి తెలుసు. అందులో ఎంతో కక్కరింపు, "కసి" యిమిడ్చి గలిగింది. అతనికి కోపం వచ్చింది. నరాలు లాగేస్తున్నాయి; రక్తం నూగ్గాలు తప్పి, పొర్లి పొంగిపోతోంది. ఏమీ జరగదు-ఏమీ జరగదు-ఛిన్నపడి పోయింది అతని శరీరం. దేనికి తగలకుండా రివ్వున కదిలిపోయ్యే బాణంలా యింద్రియాలన్నీ సాగిపోతున్నాయి-ఎక్కడికి? అన్ని నీటికాలువలు, నదులు కష్టసుఖాలలోంచి ప్రవహించి మహాసముద్రంలోకి చేరుకుని నిశ్చలత్వంలో పరిపూర్ణతని పొందుతాయి-వాటికి విముక్తి వుంది. అతనికి శరీరంపై యవ్వనం దౌర్జన్యంచేసి అధికారం ఛలాయించ గల్గుకాని, విముక్తి నివ్వలేదు. రెండు ఆకుపచ్చ గాజులు కలుక్కుమన్నాయి. ఎవరో తలుపుకొట్టిన చప్పుడు-తలుపు సందులోంచి ఎవరో రహస్యంగా చూస్తోన్నట్లు. ఎవరో అతన్ని చూస్తే ఏంభయం? ఈ ప్రపంచంలోని జనమంతా వొకరివెనక వొకరు క్యూలో మాదిరి నిలబడి మనిషి మనిషికీ మధ్య తలుపుల్ని అమర్చి, ప్రతివాళ్లూ, తలుపు సందులోనుంచి చూస్తూ నిలబడితే, ఎంత మంది సృష్టి రహస్యాన్ని, తలుపు సందులోంచి శోధించడం మానేస్తారు? ఏ వొక్కడో చూడడం మానేసి, వెనక్కి తిరిగి నిలిచిపోతే ఏమౌతుంది? అర్థంకాక కొందరు, విసుగెత్తి కొందరు చూడ్డం మానేస్తారేమో కాని చూస్తే ఏమీ లేదనుకుని ఎవ్వరూ మానెయ్యరు.

కోమలి వెళ్ళి తలుపు తీసింది. ఎవ్వరూ లేరు.

"వెళ్లండి నాకు పనుంది ఎప్పుడూ రాకండి."

"అంతే? ఊరికే వొచ్చి చూసి పోకూడదూ?"

"చూసేందుకు ఏముంది? ఉత్తుత్త చూపులేగా?"

"నా కవే చాలు; అంతకంటే ఏమీ అక్కర్లేదు."

ఇంతలో మరో వ్యక్తి లోపలికొచ్చాడు; తలకి చుట్టుకున్న టర్కీస్ తువ్వాలు విప్పి దులిపి బుజాన వేసుకున్నాడు; రేగిపోయిన మళ్ళ పాపిడి సరిచేసుకుని అగ్గిపెట్టెకోసం జేబు తడుముకుంటున్నాడు.

"రాండి ఆచారిగారూ-నిప్పు తెచ్చేదా..." అంటూ కోమలి అతని దగ్గరగా వెళ్ళి ఆహ్వానించింది.

"మధ్యాహ్నం వొచ్చావుగదా, కబురేనా చెయ్యలేదేమే?'

'మా అమ్మ మీయింటికాడికి రాలేదు? గుడికాణ్ణించి అట్నా వెడతానండి..."

'ఆఁ, రాండే...ఏమిటి యీపూట వొంట నువ్వేనా ఏమిటి?'

'అన్నంవార్చి ఇంకా సార్చోవాలి...మీరు తింటానంటే గుల్లు ఫ్రలు సొంకుతా..."

'ఛ, ఛా, కోడిగుడ్డులా మొహం నువ్వూనూ, ఏం మాటలివి...'

దయానిధి వాళ్ళకేసి చూస్తూ నిలబడి పోయాడు.

'సరే నేను వెడుతున్నా కోమలీ...' అన్నాడు ఆకాశంకేసి చూస్తూ. ఆ వ్యక్తులు వినిపించుకున్నట్లు లేదు. తులసి దిమ్మమీద ఆచారి కూర్చోబోతున్నాడు.

'ఉండండి - బట్టలు పాడవుతాయి. మంచం వేస్తాగా...' అంటూ కాస్త దూరంగా నూతి పళ్ళానికి ఆనించివున్న నులకమంచాన్ని తెచ్చింది. దానికి వున్న దుష్టచతుష్టయంలాంటి నాలుగు కాళ్ళల్లోనూ, ఒకటి భూమిమీద ఆనదు. భారతదేశంలో ఐకమత్యం లేదనడానికి ఆ మంచం బుజువు.

'ఐతే కృష్ణమాచారిగారూ, నా మొహం కోడిగుడ్డన్నారు గదా, మరి వీడో?'

'కోడిపుంజు...ఏం?'

'కోమలి విరగబడి నవ్వింది. 'లెగండు' అని అతని చెయ్యిపట్టుకు లేవదీసి మంచంమీద కూర్చోపెట్టింది.

'మంచినీళ్ళు కావాలా?'

# గడ్డిపూవ విలువెంత?

'ఆహా! అతిధిని నులకమంచంమీద కూకేసి సత్కా-
పుష్ప, పత్ర, ఫల తోయము లొసంగిన...'

నవ్వుకుంటూ లోపలికెళ్ళింది. నీళ్ల తీసుకొని మళ్ళీ వొచ్చింది.

'మరి నే వెడుతున్నా...' అన్నాడు దయానిధి.

'వెళ్ళండి-సన్నాసికి మీరుతీసుకెళ్ళేదేమిటి? కృష్ణమాచారి నేనూ వెడతాం...'

'అవును. అసలందుకనే వొచ్చానుకూడా. లే, లే. దబ్బున తిండితిని పోదాం' అన్నాడు కృష్ణమాచారి. దయానిధి వెళ్ళిపోయాడు. బయిట మెట్లు మీదనుంచుని అప్రయత్నంగా రెండు తలుపులూ దగ్గరగా జేరవేశాడు. సందు వేపు చూశాడు. కుక్క దూరంగా మొరిగింది. ఎండిపోయిన ఆకులు రెప రెప మన్నాయి.

కోమలి తలుపుతీసి అటూ యిటూ చూసి, మళ్ళా భళ్లుమని వేసేసింది. అతనేదో అడుగుదామనుకున్నాడు. వీపు చరిచినట్లు తలుపు చప్పుడైంది. వెళ్ళిపొయ్యాడు. అతనికి కోమలి ప్రవర్తన అర్థంకాలేదు. తాను ఆమెకోసం ఎంత ప్రాకులాడుతున్నా, ఆమె సమాధానం ఇవ్వదు సరికదా, అతన్ని వెటకారంచేసి ఏడిపిస్తుంది. అతని యౌవ్వనంకాని, చక్కదనంకాని, హోదా కాని,- ఏదీ ఆమెని ఆకర్షించలేదు; అసలాగా ఆకర్షించబడేటందుకు తగినంతగా ఆమె శరీరం పక్వానికి రాలేదేమో. అనేక మందుగుండు సామగ్రి చేసిన పెట్టె; దానికి ఎవరో నిప్పు ముట్టించాలి; అప్పుడు కాని అది బ్రద్దలై [illegible] పడదు. నిప్పుపుల్ల-నవ్వుకున్నాడు. కృష్ణమాచారికి తనే నిప్పుపుల్ల వేస్తానంది. నూనెలో ముంచని కాగడా కోమలి; ఆమె చేతిని తాకినప్పుడు వేడితో తన శరీరం కాలిపోయినట్లు అనిపించింది కాని, యిప్పుడు ఆలోచించిచూస్తే ఆ వేడి తనలోదే ననుకున్నాడు. రాత్రంతా మంచుపీల్చుకుని వికసించలేని పువ్వులాంటి కోమలిని, ఉదయభానుడి కిరణాలు మాత్రం ఏం చేస్తాయి. యౌవ్వనం యింకా గృహప్రవేశం చెయ్యలేదు; నిలయం వెతుక్కుంటూ ఆమె శరీరంలో విహారం చేస్తోంది-ఈ ఉపమానాల సారాంశం ఏమిటి? 'రిజిడిటి' పాపం! ఆమెపై కోపగిస్తే ఏమిటి ప్రయోజనం? మంచుకొండ అగ్ని పర్వతం కాకూడదూ!

# చివరకు మిగిలేది

'మాపుంగ్లో ఏముంది?' అని అన్న మాటల్లో ఎంతో అర్థం ... ఆకర్షణ స్వం కాని అమాయకురా లనుకోకూడదు; స్త్రీ పురుషుల్ని అప్రయత్నంగా వేటకి రగల్చడం, అందకపోడం, మరింత కోరదగింది కావడం యిది అనాదినుంచీ వున్నదే - దాన్నే వ్యక్తపరుస్తోంది. ఆ కృష్ణమూ ర్తి చారెవడూ ?

అతన్ని వేటకి రగల్చడానికీ, వాడితోనా సరసాలు? వాడితో సర్కస్కి వెడుతుందిట! ఎంతధైర్యం, ఎంత తెగింపు! తనంటే ఎంత నిర్లక్ష్యం నిరాదరణ! కాని అదంతా సహజమైన చర్యా, లేకపోతే, నటనా? నటనైతే అతను క్షమించలేడు; ఏమిటో కర్మ, క్షమించక చేసేదేముంది? అతను వేట మానుకోలేడు; ఇంద్రియాలు పీకేస్తున్నాయి. పల్చటి ఎముకలు, చల్లటి మాంసం,- వీటికి తన యవ్వనం దాస్యం చెయ్యక తప్పదు. అతనికి ఏంకావాలి? నిమర్శించి తేల్చుకున్నాడు, సంస్కారం? ఆమెకు లేదు, తనకి అక్కర్లేదు, యవ్వనం లో ప్రాచీనశక్తి తరతరాల వ్యక్తులను కాల్చి మట్టిచేసిన బలంతో. సృష్టిని ఛేదించిన ఆ యౌవనోత్తరశక్తికి, సంస్కారం, వన్నె చిన్నెలు, నగిషీలు, వంకరతిరిగి తిరిగి, స్థిరీకరిన స్థానానికి తెచ్చే మానసిక వొట్టు-శక్తులతో ఏం సంబంధం? తర్కం, తారతమ్యం, మంచిచెడ్డలు, నాది, నీది - యిది సంస్కారం కట్టుగున్న పరిమాణాలు. వీటినన్నిటినీ వొక్క తాపుతన్ని, తడబడే దృష్టితో చీకట్లో చూసి, మట్టిలో కలిసిపోయి నిధి, తెరచుకున్న ద్వారాల మధ్య, ఆత్మహత్య చేసుకున్న యవ్వనపు శక్తి, సంస్కారాన్ని కోరదు.

పోనీ, చదువు, తెలివితేటలు? ఏ చదువు యీ అస్థిపంజరపు నిర్మాణాన్ని మార్చగలదు? బుర్ర, మెదడు, యివి దాస్యానికి, అంతరాయాలే- అతనికి చదువక్కర్లేదు. సిపాయి విప్లవానికి కారణాలతో ఆ ఎముకలకు నిమిత్తమేమిటి? అవే విప్లవంచేసి, దాస్యం అనుభవిస్తాయి.

కుటుంబం, మర్యాద, కులం, గౌరవం యివి కావాలా? మొదలే అక్కర్లేదు. కోమలి వాళ్ళ వాళ్ళల్లో, పుట్టివుండకూడదూ? అదేంకర్మమో వాళ్ళ వాళ్ళల్లో ఎందరో స్త్రీలున్నారు, పెళ్ళికి సిద్ధంగా. వాళ్ళల్లో వొక్కళ్లు నచ్చకూడదూ? అది అతని దౌర్భాగ్యం. మరో దేశపు ముగ్ధ సౌంద ర్యంలో వున్న ఆకర్షణ కోమలిలో వుంది. గట్టిగా ఎముకల్ని పట్టుకునే

చర్మం-పదునైన మాంసం, ఆ కొత్తదనం, మరొకళ్లో వుండి వుంటే ఎంత బాగుండును? కోమలి కుటుంబం, మర్యాద, కులం, గౌరవం-యివన్నీ లేవు. ఇవికూడా తన ఆకర్షణకి కారణాలే కాబోలు ఖర్మ.

కోమలే కావాలి-యింకెవ్వరూ పనికిరారు. ఆమె శరీరానికి అతను దాస్యం చెయ్యవలసి వొచ్చినందుకు తిట్టుకున్నాడు. కోమల్ని మరచి పోవాలి-యవ్వనానికి ఏస్త్రీ ఐతే ఏం, భూ[illegible]ంలో ఎందరు స్త్రీలు లేరు. కోమలికంటె అందమైనవారు, తెలివైనవారు, గౌరవమైనవారు,-తనే ఎరుగున్నవాళ్లు ఆరుగురుదాకా వున్నారు. అతనితో కాలేజీలో చదువుకున్న మళయాళీ పిల్ల శోభ లేదు? భాస్కరరావుగారి చెల్లెలు రమణి లేదు? అప్పా రావుగారి ఆఖరమ్మాయి శకుంతల? అందాకా ఎం[illegible]కు, ప్లీడరు గుమాస్తా కుటుంబయ్యగారి కూతురు శ్యామల? కొంచం పొట్టి [illegible] వున్నా, ఎంత బాగుంటుంది? ఎంత అందమైన [illegible]?

వీళ్ళందర్నీ వొక్కసారి ఊహాప్రపంచంలో తిప్పిచూశాడు. ఆమస్య సంబంధాలు ముందు చూసి వొచ్చాడు. ఒకమ్మాయి తండ్రి, ఇంగ్లండు పంపడానికి సిద్ధపడ్డాడు కూడాను; వాళ్ళనికూడా, సర్కస్ గుర్రాలలా తిప్పిచూశాడు. కోమలి సర్కస్‌కి వెడుతుంది కాబోలు. [illegible] ఏం లాభం? అతని దృష్టి వాళ్లల్లో ఎవ్వరిమీదా కేంద్రీకరించడంలే[illegible] వాళ్లని వాంఛించలేదు-వాళ్ళంతా మహా ప్రతివ్రతలు-వాళ్లెవరూ [illegible] వాళ్ళతో మాట్లాడొచ్చు, చీట్లాడొచ్చు, [illegible] చెయ్యొచ్చు, కాని బాబో, వాళ్ళని తాకడం ఎల్లా? [illegible] గుర్రంలా, ఇంద్రియాలు వెనక్కి నడుస్తున్నాయి; వెలిసిప[illegible] ఐస్‌టబ్‌లో ముంచినట్లు ఛీ, ఛీ ఏమి ఆలోచన్లు. తప్పదు కో[illegible] పోనీ కోమల్ని చంపివేస్తే! ఒక ప్రాణికి, వొక ప్రతిభతో కొ[illegible] హృదయానికి, వొక సృష్టికోసం నిశీధి తలుపులు పగల కొట్టిన ఆమె కలిగించిన బాధకి అదే ప్రాయశ్చిత్తం. అలాంటివాళ్ళని చంప[illegible] అపకారంకాదు; సంఘసేవ. ప్రపంచానికి పరమార్థం.

పాపం, ఆవులించడంకూడా చేతగాని అమాయకురాలు కోమల్ని అని ఏంలాభం. కోమలితో యీ ప్రపంచానికి నిమిత్తం వుంది; ఆమె తల్లిగా అయి, స్త్రీత్వాన్ని నిలబెట్టి, సృష్టికి వొక పుష్పం అర్పిస్తుంది. తనెందుకు?

'అవునవును, మద్రాసులో చదువుకుంటున్న యువకులకి యీ వూళ్ళల్లో ఏం తోస్తుంది? మీ నాన్నగారు క్లబ్బునుంచి వొచ్చారా...'

'తోయ్యకేముండి - పుస్తకాలు, చదువు, క్లబ్బు, స్నేహితులు, కాలవగట్టు - ఎంతో హాయిగా వుంటుంది...పైగా సర్కస్ వొకటొచ్చిం దిగా. వెడదామని బుద్ధిపుట్టింది. మీరు చూశారా...?'

'ఇద్దరి భార్యల్ని భరాయించే అప్‌టుడేట్ భర్తలాంటిది కాదు యీ కుటుంబం - వోరేయి గోవూ, ఆకుర్చీ యిల్లా లాక్కురా...'

ఆ కుర్చీ యిద్దరు ముగ్గురు కలిసి లాక్కొస్తేకాని, వొచ్చేరకం కాదు; ఏభాగాని కాభాగం వూడనూ వూడదూ, అతకనూ అతకదు. వైకుంఠంగారు దాన్ని ప్రేమతో తిలకించాడు.

'నా హెడ్‌మాస్టరీ లాంటిదే దాని బ్రతుకూను...'

'మీకేమండి...కీర్తి సంపాదించారు.'

'మేష్టరుకి బ్రతికుండగా కీర్తిరాదు; ఆ మాటకొస్తే చచ్చిం తర్వాత కూడా రాదు. రిటైరయిం తరువాత దివంగతుడైతే కనీసం సెలవేనా యిస్తారు...' అని ఆయనే నవ్వుకున్నాడు.

'ఐతే మేష్టారు, మొత్తంమీద మీరు మేష్టరుగా పని చేసినందుకు మీకు గర్వంగా వుందా?'

'అసలు జీవించినందుకే గర్వంగా వుందనుకుంటాను...ఏమిటీ, నువ్వు అందరిలోనూ అడగకూడని ప్రశ్నలడుగుతున్నావు? ఏంకథ, కొంప తీసి డాక్టరు చదువు చాలించి మేష్టరవుతావా ఏమిటి?'

దయానిధి నవ్వాడు. 'లేదండి—డాక్టరుగా వుండే మేష్టరీవృత్తి జోడించొచ్చు; పైగా యీ రెండు వృత్తులకీ యింకా దగ్గర సంబంధం వుంది లెండి-మేష్టర్లు నేడు బోధించే బోధనవల్ల, పిల్లలందరూ పెద్దవాళ్లు కాగానే పేషంట్లకింద మారిపోతారు...' అని యింకా వాక్యం పూర్తి కాకుండానే, వైకుంఠంగారు అందుకుని 'ఔను, ఆపేషంట్లని, నేటి డాక్టర్లు, అసలు జబ్బు పేరేనా చెప్పకుండా, పై లోకానికి రవాణా చేసేస్తారు...' పూర్తి చేశారు.

'మేస్టారూ! మీరు యీలోకం, పరలోకం అంటూ వున్నాయని నమ్మకం వుందన్నమాట. ఐతే, జీవితానికి అర్థమేమి టంటారూ?

వైకుంఠంగారు లేచి నిలబడ్డాడు. ఎవరో కొంటె పిల్లాడు ఆయన పాగా లాగేసినట్లయింది.

'చూడు, ఇట్లాంటి ప్రమాదకరమైన ప్రశ్నలు ఇంటిదగ్గర నలుగురూ వింటుండగా వెయ్యకూడదు, తెలిసిందా?' అంటూ, దయానిధి భుజం మీద చెయ్యివేసి లేవదియ్యబోయ్యాడు. ఇద్దరూ రెండడుగులు ముందుకి వేశారు.

'ఇట్లాంటి ప్రశ్న వెయ్యవల్సిన అవసరం ఏమొచ్చింది నీకు యింత చిన్న వయస్సులో?'

'అడగడం తప్పుగా తోస్తే నన్ను క్షమించండి...'

'అదికాదు నీకీ...సృష్టినిగురించి వొకవ్యక్తికి ప్రశ్నలు వేశాడంటే, ఆ వ్యక్తి జీవితంలో ఏదో లోపం వుందన్నమాట. గొప్ప రాజకీయ సంస్థలు వంటింట్లో జనిస్తాయి; గొప్ప వేదాంతపు వుద్యమం పడకటింట్లో పుడుతుంది...మరిచాను, నీకింకా పెళ్లి కాలేదుగా...మా కాంతానికి ఏదేనా సంబంధం చూడవోయి దబ్బున.

దయానిధికి భయమేసింది, అతన్ని చేసుకో మంటాడేమోనని; మాట తప్పించడానికి యత్నించాడు.

'ఇంతకీ నా ప్రశ్నకి సమాధానం చెప్పారు కాదు.' అన్నాడు.

'నీ పెళ్ళికానీ తరవాత అడుగు చెబుతాను. మా కాంతానికి మంచి కుర్రాడిని చూడాలోయ్ - మీ కాలేజీలో నీతో చదువుకున్న వాళ్ళల్లో ఎవరేనా...'

'తరవాత వాక్యం దయానిధి వినిపించుకోలేదు. అతన్ని చేసుకోమని అడగనందుకు ఆశ్చర్యపడ్డాడు. మంచికుర్రాడిని, చూడాలిట! తను మంచి వాడు కాడూ? వైకుంఠంగార్ని గురించి తనకున్న అభిప్రాయం మార్చు కోవాలనుకున్నాడు. ఇప్పుడు తనకి కావల్సింది డబ్బు.

'నేను సర్కస్‌కి వెడదామనుకుంటున్నాను. మీరూ వొస్తారా ఏమిటి?'

'నా ఇష్టం, ఏం సర్కస్—వేరే సర్కస్ చూడటం దేనికి? మా ఆడ రింగ్ మాస్టర్—సారీ, మిస్ట్రెస్...'

'పోనీ, మీ గోపీని పంపండి. ఇద్దరం వెళ్ళొస్తాం...'

'గోపీ మొన్న వెళ్ళొచ్చాడు. ఐనా యిప్పుడేం తొందర, నువ్వింకా నెలదాకా వుంటావుకదా—యీ సర్కస్ వొచ్చింది మొన్ననేగా... వెళ్ళొచ్చులే...' దయానిధికి కావలసిన డబ్బు ఏ మిషమీద అడగాలో తోచలేదు. సర్కస్ దగ్గరికి వెడితే, అక్కడ ఎరుగున్న వాళ్ళెవరేనా వుండొచ్చు; పర్సు పోయిందంటే, ప్రొప్రయిటర్ తరవాత చూసుకోవొచ్చునని, ప్రవేశం యివ్వొచ్చు: అసలు టిక్కెట్టు లేకపోతేమాత్రం ఏమొచ్చింది. అతను చూడదలుచుకున్నది సర్కస్ కాదు గా: ఎలాగా డేరాకి బోలెడు కంతలుంటాయి. వాట్లోంచి చూడొచ్చు—సగం ఆట అయింతర్వాత టిక్కెట్లు పట్టింపు వుండదు. ఏమీ లేకపోతే, ఆట ముగిసింతర్వాత, కోమలి బైటకొస్తుందికదా అప్పుడే చూడొచ్చు. వైకుంఠంగారి దగ్గర శెలవు తీసుకుని నడవడం మొదలెట్టాడు.

నడుస్తుంటే ఏవేవో ఆలోచనలొస్తుంటాయి. స్థిమితంగా కూర్చుని ఆలోచించడం చేతకాదు. ఆలోచన సాగిస్తుంటే ఏదో బరువు తగ్గినట్లుగా వుంటుంది. కాని ప్రస్తుతపు విషయాలను గురించి అతను ఆలోచించలేక పోతున్నాడు; ప్రస్తుతం అంటే—యదార్థం; ఇప్పుడే ఏదో నిశ్చయించుకోవాలి; కర్తవ్యానికి దిగాలి. దీనికి ధైర్యంలేదు; భయంకరమైన యదార్థం; ఇతరుల సలహా పని చెయ్యదు; దీనికి సమాధానం పుస్తకాలివ్వలేవు. చరిత్ర తనని తానే అనుకరిస్తుందన్నది సత్యంకాదు. ఒక సమయంలో వొకచోట ఏర్పడ్డ పరిస్థితులు, ఎప్పుడూ, ఎక్కడా మళ్ళా ఏర్పడవు. ప్రతి సంఘటనం అపూర్వమైనది. దానికదే సాటి. అట్లాంటప్పుడు చరిత్రలో మానవసంఘాన్ని, వ్యక్తియాం

యొక్క పరిణామాన్ని కొలువగుని, అందులోంచి భవిష్యత్తుకి వుపయుక్తమయ్యే సిద్ధాంతాలను, ప్రతిపాదించటం గొప్ప పొరపాటు. ప్రాకృతి సిద్ధాంతాలను అనుకరించవొచ్చు; అవి తప్పవు. వాటిని ఎవ్వరు అతిక్రమించలేరు; సూర్యుడు ప్రతినిత్యమూ తూర్పున ఉదయిస్తాడని అనుకొని ప్రవర్తించడంలో హాస్యాస్పదమేమీలేదు. కాని సిపాయిల తిరుగుబాటు, విజయనగర సామ్రాజ్య పతనం మళ్ళా ఆ పరిస్థితులను సృష్టిస్తే సంభవిస్తాయనుకుని, చారిత్రక సిద్ధాంతాలని ప్రతిపాదించి వాటిని తొలగించడానికి మార్గాలు వెదకటం హాస్యాస్పదమే.

ఆలోచన, వర్తమానాన్నుంచి తప్పించుకుని పారిపోయేటందుకు యివ్వబడిందా?

జరిగిపోయిన విషయాలను స్మరించుకోవడం, ముందు జరగబొయ్యే విషయాలను, వూహించుకోటం - యిదే ఆలోచన చేసేపని. వర్తమానాన్నుంచి పారిపోతుంది. ఫలితం? సగం, సగం ఆలోచనలు; బుర్ర అలసిపోవడం, శరీరం బాధపడటం.

అన్నయ్య దెబ్బలాడి వెళ్ళిపొయ్యాడు— ఆనాడు మెట్రిక్ పరీక్షలోకి గిరవాకెట్టాడు; తక్షణం యింట్లోనుంచి పొమ్మన్నాడు; ఎక్కడికి పోతుంది! 'మా అమ్మని మా నాన్న వొదిలేస్తే, నీకభ్యంతరంవుందా?' ఎంత ధైర్యంగా అడిగాడు! తను అర్థం రాకపోతే, ఏనాడో ఆ సంసారం భగ్నమైపోను. కోమలికోసం పడేబాధ అమ్మకి తెలుసు, రక్తం చెబుతుంది; హృదయంతో అర్థంచేసుకుంటుంది; తప్పుని దండించదు; సరేనంటుంది. ప్రపంచంలో అందరికీ అమ్మలా అర్థంచేసుకునే హృదయం వుండకూడదూ! అమ్మనే సంఘం ఏముంది! హృదయం వున్నవాళ్ళని సంఘం దూషిస్తుంది. సంఘం కోరేది, మానవుడి ఆనందం, క్షేమం కావు. అది కోరేది, నమ్రతా, విలువలు. మనకి లేని అనుభవం, ఆనందం, యితరుల కెందుకు? అనుకొని సంఘం వాటి వినాశానికి దారితీసే ద్వార బంధాలని నిర్మాణం చేస్తుంది.

పాపం, సంఘాన్ని దూషించడం ఎందుకు? సంఘం ఏం చేసింది? శాస్త్రం, నాసుఖాన్ని, ఆనందాన్ని, వీటినిగురించి ఆలోచించడం మానుకుని, కొంచెం వీటిని త్యాగంచేస్తేనా, యితరులుకూడా హాయిగా వుంటారు - కాబట్టి, నేనెప్పటి నియమాలని అతిక్రమించకుండా, జాగ్రత్తగా నడుచు కోమంటుంది సంఘం. 'నీయిష్టం, నీతి అనుకో, సాంప్రదాయమనుకో — నీవు సంఘంలో వున్నంతవరకూ వీటితో నిమిత్తం తప్పదు పిచ్చివాడా' అంటుంది. నక్షత్రాలని తారామండలంలో 'బాధ' పడిపోకుండా నడుపు తుంది; సూర్యచంద్రాదులు, కీటికి అతీతం కాలేదు; చెట్లు, నదులు, కొండలు అట్లాగావుండిపోతాయి; సృష్టిని సైతం నోరునొక్కి కట్టిపడేసింది 'విధి.'

కోమలికి ఇవేమన్నా అర్థమౌతాయా? ఆమె కోసం అతని హృదయం ఎట్లా తన్నుకు లాడుతోందో, తెలియచెయ్యడం ఎట్లా? ఆమె పాదాల బూడిదతీసి, ఫేస్‌పౌడర్ కింద రాసుకుంటానంటే! 'ఛీ' అని వుమ్మేస్తుంది. మరో ప్రపంచంలో వారిద్దరూ వొక శరీరమే; ఇక్కడెందుకో విడిపోయ్యారు తను నశించి ఆమెలో ఐక్యం కావాలంటే యిద్దరూ కైలాసపర్వతం పైనుంచి పారే మంచునదిలోపడి, కొట్టుకుపోయి హతమవాలి, పవిత్రతతో పొంగి పొర్లే ప్రేమకాదు అది. కనులు మూసిపోయి పాడుకునేటందుకు సంఘ టించిన కలయిక కాదు. అదొక జబ్బు - జాడ్యం. దానికన్యాయ బాధ్యులు కారు. పెద్దలు, నీతి, మర్యాద, ఔచిత్యం, సంఘం - వీళ్లెవ్వరినీ నిందించ కూడదు. అశక్తి అతనిలో పుట్టి ఆమెలోనే అంతమొందాలి. కాదు కాదు; అతని శక్తి సంతటినీ ఆమె దాచుకుంది. అతని పంచప్రాణాలు అతనిలో బిగించి తాళం వేసి, తాళంచెవి మెళ్లో వేసుకుంది. మొలచుట్టూ చీరతప్పి అరటిపండులా కట్టుకుంటుంది! అమ్మమ్మ వెనక చెప్పిన కథలో వొక రాక్ష సుడి ప్రాణాలు, రామచిలక కంఠంలో వుండేవిట. అకంఠం పిసికితే వాడు చస్తాడు. తన బ్రతుకు ఆ రాక్షసుడిలాగైపోయింది.

చంద్రుడు పరపరా కదిలిపోతున్నాడు. మేఘాలు కల్పించిన ఆటం

కాలను చుట్టూ కట్టుకున్న చక్రంతో తొలగించి కదిలిపోతున్నాడు. ఇండ్లల్లో పొగ వొయ్యారంగా ఆకాశంలోకి లేస్తోంది. కీటకాలు గాలి వొత్తిడికి తట్టుకోలేక అమాయకంగా మనుషుల మొఖాల్ని కొడుతున్నాయి. ఎండి పోయిన ఆకులు బండిచక్రాలకింద బూడిదవుతున్నాయి. ఎక్కడో అసందర్భమైన కాకి అరుపు; అర్థంలేని కుక్క మొరుగు; కాళ్ళు కడుక్కునేటందుకు మనుషులు చేసే నీళ్ళచప్పుడు; పులిస్తరాకులు పారేసిన శబ్దం — అన్నీ దూరంగా వెళ్ళిపోయ్యాయి. దూరంగా సర్కస్ బ్యాండు, గుడిగంట చప్పుడుని ముంచివేస్తోంది; సన్నగిలిన దీపాలు, గుంపులు మాట్లాడుకొంటున్న చప్పుడు, మానవబృందంలో కులాసాకోసం గుమికూడింది. యీ సమూహంలో కోమలి కనిపించలేదు. అజానబాహు కృష్ణమాచారి కూడా లేడు. లోపల ఎక్కడో వుంటారు; కామాక్షికూడా లేకుండా వాళ్ళిద్దర్నీ వొంటిగా పంపుతుందా?

'లోపలికి దయచెయ్యండి బాబు—'

తనెవర్తైందీ ఆ ప్రొప్రయిటర్‌కి ఎట్లా తెలిసిందో.

'అబ్బే, సర్కస్‌కి వొద్దామని రాలేదు— ఊరికే షికారు బయలు దేరాను...'

'నాన్నగారు రాలేదే? ఇవాళ మోటార్ సైకిల్ జంప్ కూడా వుంది. పోనీ కాసేపు కూర్చునిపొండి...'

నాన్నగారికి కాంప్లిమెంటరీ వొచ్చి వుంటుంది-లేకపోతే వుచితంగా రమ్మంటాడా? లోపలికెళ్ళి కూర్చున్నాడు. అరుగో డాక్టరు గోపాలరావు నాయుడు. భార్య, వాళ్ళ అబ్బాయికూడా వొచ్చారు. రెండో అబ్బాయి యిప్పుడు ఏం చేస్తున్నాడో...దూరంగా పులి ఘర్జిస్తోంది...చుట్టూ చూశాడు ఎక్కడా వాళ్ళొచ్చినజాడ లేదు. తనని బలే దగా చేశారు. ఇంట్లో మాత్రం వొంటిగా ఎందుకుంటారు? వాళ్ళమ్మకూడా వుంటుందిగా. అబ్బ, లోపల వుక్కగావుంది - గాలిలేదు. డేరాలో పైనున్న చిల్లులలోంచి నక్షత్రాలు

కనిపిస్తున్నాయి. ఈ నక్షత్రాలని కానీ కర్చులేకుండా అందరూ చూడవచ్చు కదా. కోమలి వాటికేసి చూస్తూ కూర్చుంటుంది కాబోలు; ఆమె నేత్రాలే మబ్బు మధ్యలో మెరసిన నక్షత్రాలు; తెల్లచీర చంద్రుడుపైనుంచి పచ్చగా కదిలినమబ్బు; ఇల్లా పోల్చుకుంటూ వర్ణనలతో ఎంతకాలం తృప్తిపడటం? భాష, భావాలు, ఊహ, ఉండబట్టిగాని, లేకపోతే మూగబాధ ఎంత చెడ్డది? ఊహించుకుని తృప్తిపడకపోతే వాంఛ మనిషిని హరించేస్తుంది. దానికోసం అప్రయత్నంగా బైటకి కొచ్చాడు.

ఇంకా ఆట ఆరంభంకాలేదు, వాళ్లు యీపాటికి వొస్తూవుంటారేమో-గేటు దగ్గరే నుంచుంటే, తప్పకుండా కనబడతారు, మారువేషం వేసుగుంటే తప్ప. ఏమో వాళ్ళు ఎంతకైనా తగుదురు. కృష్ణమాచారి నాటకాలలో ఆడవేషం వేసే వాడుట—ఎవరు చెప్పారు చెప్మా!—కోమలికీ లాగు, చొక్కా వేస్తే అచ్చంగా కుర్రాడులా వుంటుంది. కాని ఆ జుట్టుని ఎక్కడ దాచుకుంటుంది? నీకూ నాకూ, మధ్య నీడలాపడిన నిశీధి నీజుట్టు—ఎక్కడిదో యీ భావం? భావాలు చాలా చిత్రమైనవి. మన సొంతభావాలు, ఎవరివోలా కనిపిస్తాయి. ఎవరో చెప్పినవి మన సొంతంలా కనిపిస్తాయి. నిజంగా కొత్తభావాలంటూలేవు. ఆకలి, నిద్ర, దాహం, ఆకర్షణ అసంతృప్తి, జీవితంపై మమకారం — అందరికీ యివి సమానమే; క్రొత్తవి ఎల్లా వొస్తాయి? భావాలు, మానవులందర్నీ ఏకం చేస్తాయి. వాటిని చెప్పడంలో ప్రయోగించే వివిధభాషలు, మానవుల్ని విడదీస్తాయి; ప్రాణంపై తీపి తీసుకోండి, చావడానికి ఎవరూ యిష్టపడరు; చచ్చిపోయిం తర్వాతకూడా బ్రతకాలన్నంత తీపి— దానికోసం, మహాలోకం, స్వర్గం, స్వర్గానికి అధిపతి; ఆత్మ అక్కడికి చక్కాపోయి, శాశ్వతంగా వుండడమో, లేక పోతే మళ్ళా కొన్ని జన్మములు ఎత్తి,—మానవ జన్మమే ఎత్తాలి. మళ్ళా-ఆత్మని శుద్ధం చేసుకొని, మళ్లా పైకిపోయి పరమాత్మలో ఐక్యం కావడం, యిన్నిటిని కల్పించుకుంది జీవితంపై మమకారం. అంతేకాదు, యీ జీవితం

అంతా అసత్యం, శరీరం మాయ, బ్రతుకు కల,—పరమాత్మలో జీవాత్మ ఐక్యం కావడం సత్యం, అని నమ్మమని చంపుకు తింటుంది యీ మమకారం.

శరీరంపై, శరీరాన్ని సైతం త్యాగం చెయ్యమని ప్రబోధించేటంతటి మమకారం ప్రాణానికి. ఈ మతాలు, యీ దేవుళ్ళు, యీ ఆదర్శాలు, భాష కల్పించినవేకదా! పాపం, యీ భావాలే యదార్థాలని నమ్మి తృప్తిపడతారు అమాయకపు మానవులు. కోమలి శరీరం మట్టి; హృదయం భ్రమ; ఉనికి ఉత్త మాయ; స్థలంలో లేదు; సమయంలో లేదు. ఆమెని గురించిన భావాలే తనకి గోచరించే యదార్థం. భావాలు లేకుండా బుర్రమాత్రం వుంటే ఎంత హాయిగా వుండును! అదుగో వొస్తున్నట్లున్నారు. అబ్బే, కాదు; వాళ్ళెవరో-మాయ సంఘంలో,— సంసార కూపంలోపడి, జంతుజాలంతో, ప్రకృతితో వుండే బాంధవ్యాన్ని వొదులుకున్న వొకమనుషుల జోడా,—మళ్ళా ప్రాచీనత్వాన్ని పొందడానికి సర్కస్‌కి వొస్తున్న దుస్తులలో జంతువులు. ఆకలేస్తోంది; సోడా తాగాలి. ఆకలి, దాహం, ఆలోచన,—పూర్తికాగానే నీరసం; నాలిక పీక్కుపోవడం, బుర్ర వేడెక్కి బద్దలు కావడం.— ఆకలి, దాహం, ఆలోచన; యుగ యుగాలుగా పెరిగి రంగు పండించుకొని పుష్పించిన రోజాపుష్పం కోమలి అధరాలు; యుగ యుగాలుగా కొండ శిఖారలపై మంచుకురిపించి మస్తెక్కిన చంద్రబింబాలు కోమలి నేత్రాలు; అనంతం నుంచి ప్రళయంలో వుద్భవించి మూగదైపోయిన ప్రపంచం రొద కోమలి కంఠధ్వని—ఆకలి, ఆలోచన—

'ఇక్కడున్నారంటండి, అబ్బాయిగారు... వెనక్కితిరిగాడు.

'ఏం నారయ్యా; నువ్వొక్కడవేనా......'

'పూలకోసం బజారంతా వెతికానండి, కాలవొడ్డి కెళ్ళాను... కామాక్షింటికి కెళ్ళాను...'

'కోమలి వుందా...?'

'ఉంద కెక్కడికి పోద్దండీ? తొంగుంది. ఆఖరికి వైకుంఠంగారు

చెప్పారండి, సర్కస్ కాడికెళ్ళమని......'

'అంత హడావుడి దేనికీ నారయ్యా'

'ఏం చెప్పనండి: అన్నయ్యాగారెళ్ళిన కాణ్ణుంచు అమ్మగారికి కొకటే ఆవేశం, గుండెదడ—మిమ్మల్ని దబ్బున తీసుకు రమ్మన్నారండి.

'మళ్ళా ఫిట్ వొచ్చిందా...?'

'కావుసునండి - మాటాడటం లేదండి... నాన్నగారు డాక్టరుకోసం ఎళ్ళి మిమ్మల్ని తొందరగా రమ్మన్నారండి...బండిమీదెళ్ళండి, నేనింగాగిల్లి తేనె తీసుకొస్తానండి...'

'నారయ్యా, ఐతే కామాక్షింటి కెందు కెళ్ళావూ? అమ్మ వెళ్ళమందా......'

'వాటికేంలెండి - ముందు తొందరగా కదలండి బాబూ......'

దయానిధి యింటివేపు నడవడం మొదలెట్టాడు. అన్నయ్యా వూరికెళ్ళడానికి అమ్మకి ఫిట్ రావడానికి సంబంధంలేదు. ఫిట్లు అప్పుడప్పుడు వొస్తూనే వుంటాయి; రక్తం తక్కువ, నరాలకి పటుత్వం తక్కువ; ఎప్పుడూ ఏదో ఆలోచించి, ఏదో ప్రమాదం తెచ్చిపెట్టే మెదడు; తను స్వంతంగా తయారు చేసుకున్న మందులుతప్ప డాక్టరిచ్చిన మందులు పనికిరావుకదా. ఇంట్లో గొడవలు తను తెచ్చి పెట్టుకొంటున్నవే. వయస్సు మళ్లింది,— హాయిగా పేచీలేకుండా సంసారం చక్కబెట్టుకోరాదూ? తండ్రి సంపాదిస్తున్నాడు; పెద్దకోడలు కాపరాని కొచ్చింది,— యిప్పుడైనా తన జీవితాన్ని వొక మార్గంలో పడేసుకొని, వొడుదుడుకులు లేకుండా నడుపుకోరాదూ? ఎన్ని వుపన్యాసాలిచ్చారు? ఎందరెందరు, ఎన్నెన్ని చెప్పిచూచారు; ఎంత బెదిరించారు; తిట్టారు; ఇంట్లోంచి పంపివేస్తామన్నారు? గోవిందరావుగారు—'ఏరా, అమ్మని పంపించేస్తే నీకిష్టమేనా?' అని అడిగాడు. ఎంత తెగింపు! అన్నయ్య సరేనన్నాడుట; నాన్నకి అర్థంకాక పంచెలో మొహం దాచుకున్నాడట! తను 'వీల్లేదు' అనగలిగాడు. ఎక్కడికి

పోతారు? కుట్రలతో, రహస్యమైన మూగవాంఛలతో, బహిర్గతం కాని ప్రవర్తనతో, కుళ్ళు సంసారంలోనే వుండి, 'మేం మర్యాదస్థులం' అని చెప్పుకుంటూ, గౌరవంగా నటిస్తూ, అందులోనే వుండిపోవాలిగాని, హిందూ కుటుంబం, విడిపోవటమే! కుటుంబంలో ఐక్యత చూపడానికి కావల్సింది, నీతి, న్యాయం, మంచి కావు; కావల్సింది నటన. భర్త దుష్ప్రవర్తనలని భార్య చూడనట్లు నటించాలి; అవసరమొస్తే ఆమోదించాలి; భార్య దుండగాలు భర్తకి తెలియకుండా చేసుకోవాలి; తెలిస్తే భర్త క్షమించాలి; కొడుకు చేష్టల్ని, తండ్రి తలుపు సందులోంచి చూసి, ఏమీ తెలీనట్లు నటించాలి; పెద్దలయెడల వుండవల్సిన గౌరవం, వాళ్ళుచేసే పనులన్నింటినీ, ఉత్తమ కార్యాలని మెచ్చుకుని, పిన్నలుకూడా ఆచరించే అవసరం రావడానికి తగినంత నటన కనపర్చాలి. 'నువ్వు దారుణాలు చెయ్యొద్దు; చేస్తే పట్టుబడి పోకు సుమా' అంటుంది నేటి సంఘంలో మర్యాద. 'ఎల్లాగ' అని చేతులు పైకెత్తి అడుగుతారు. నటించమంటుంది. 'అందమూ నటిస్తే అది నటనగా కనపడదు' అంటుంది. గోవిందరావుగారింట్లో జరిగే పని ఇదే. ఆ పెద్దమనిషి తనిల్లు చక్కబెట్టుకోకుండా, తన ఇల్లే విషయం అతనికెందుకో! కాలేజీలో చదువుకుంటున్న గోవిందరావు కూతురికి పేరు ఎన్నిసార్లో గోడలమీద వ్రాయడం, చెరపడం, వ్రాయడం-మానిపించటం, చేయించటం జరగలేదు! ఆ పెద్దమనిషి తన యింటిని చక్కబెడతాడట. ఇదే ఈ దేశంలో; అసలు ప్రపంచానికి అనర్థం తెచ్చేవాళ్ళు ఇల్లాంటి వ్యక్తులే; ఇతరులని బాగుచేస్తాం, పుణ్యం గ్రహిస్తామన్న వుబలాటం చూపేవ్యక్తులే సంఘ పురోగమనానికి, శత్రువులు. ఏ వొక్కరి పరిస్థితులూ, బుద్ధివికాసాలూ మరొకరికి రావు; ఐనా వాళ్ళందర్నీ వొకే ఫక్కీలో,-వొకడు శాసించిన ఫక్కీలో-నడుచుకోమనడమే, మన దౌర్భాగ్యం. ఎవరి జీవితాన్ని వారు చక్కబెట్టుకుంటే ప్రపంచం బాగుపడుతుంది; తను మధ్యాహ్నం మూడుగంటలకి మతిపోయినవాడిలా యిల్లు వొదిలాడు. ఇప్పుడు పదిగంటలు కావొస్తోంది. అసలు విషయం ఆలోచించడానికి తగి

నంత ధైర్యంలేక, కోమలి సంగతి ఆలోచిస్తూ, వర్తమానాన్నుంచి తాత్కాలిక విముక్తి పొందాడు. కోమలిపై తనకున్న భ్రమంతా, తల్లి తనింట్లో అల్లిన పద్మవ్యూహంలోనుంచి పారిపోయేటందుకు ఏర్పడ్డ అవకాశమే మోననిపిస్తుంది. శరీరాన్ని అందులోనుంచి తప్పించాడు; కాని మనస్సుని తప్పించడం ఎట్లా? ఆ పాడు ఆలోచనలన్నింటినీ, బుర్రలో అమర్చబడ్డ అగ్నోలోకంలో బంధించి, పైన కోటంపై నురుగులాంటి కోమలి సౌందర్యపు ప్రతిబింబాన్ని కదిలించి నింపుకుని తృప్తిపడటం ఎంతటి దుస్థితి!

కోమలి ప్రపంచంలోనుంచి మళ్లా 'యింటి' ప్రపంచంలోకి పోవాలి; తప్పదు. ఏ ప్రపంచంలో కెళ్ళినా మనిషికి సంకెళ్ళే! సంకెళ్లని చప్పుడు కాకుండా మాత్రం మూచుకోవాలంటే మళ్లా 'నటన' అల్లిచ్చిన ముసుగుని తగిలించుకోవాలి.

దయానిధి లోకల్ ఫండ్ డిస్పెన్సరీ దాటి వొంతెన దగ్గరకొచ్చాడు. డిస్పెన్సరీ తలుపులు మూస్తున్న చప్పుడవుతోంది. దూరంగా మిల్లు రొదిస్తోంది జనం పల్చబడ్డాడు. దూరంగా ఎవరో కుర్రాడు 'స్థిరమైన నడవడీ' పాడుకుంటూ పోతున్నాడు. బళ్ళముందు గుర్రాల చప్పుడు, కదిలిపోతున్న ఎడ్ల మెళ్ళల్లో మువ్వల చప్పుడు, తప్ప వేరే అలజడిలేదు. చెట్లనీడలు రోడ్డుమీద నుసకగా పడ్డాయి; వుండివుండి మురుగుపురుగు ఝరుస్తోంది. వొంతెనదగ్గర మళుపు తిరిగాడు.

'ఇంత రాత్రిదాకా ఎక్కడ తిరుగుతున్నావు?' ఉలిక్కిపడ్డాడు; వీపు మీద ఎవరో తట్టినట్లైంది; గుండెలు జల్లుమన్నాయి. స్తంభించిపోయ్యాడు. కాసేపు మాట్లాడలేదు.

"షికార్లకి పగలు చాల్లేదు కాబోలు...' ఏమీ మాట్లాడలేదు.

"ఏం అమ్మ అన్నయ్యని వూరికి సాగనంపింది'...విన్నావా? మాట్లాడవేం?'

"మరేటి. మళ్లా ఏమొచ్చిందే......?'

"అవును నీ కెందుకూ యింటివిషయం - నీ షికార్లు, నీ దీర్ఘాలోచనలు, నువ్వెందుకు పట్టించుకుంటావ్......'

"ఇంతకీ ఏమిటో చెప్పరాదు......'

"అవునవును......అడ్డమైన కొంపలూ తిరిగి ఆ మాత్రం విసుగు కన పర్చొద్దూ మరి......'

'నేను అడ్డమైన కొంపలూ తిరగడంలేదు నాన్నా...ఇంట్లో వుండడం భయమై పోయింది.—కాసేపు యివన్నీ మరచిపోదామని, ఏకాంతంగా కాలవ గట్టుకి షికారెళ్ళాను...'

"కామాక్షి కూతురుతో..."

నిశ్శబ్దంగా యిద్దరూ కొంతదూరం నడిచారు. "మీ" అమ్మకి ఫిట్టొచ్చింది తెలుసా...?"

"అవున్ట-నారిగాడు చెప్పాడు..."

"అంతా "టా"లలో వుంది నీయిది. ఎవళ్ళైనాపోతే నీ కెందుకూ...?"

"లేదు నాన్నా, మధ్యాహ్నం నేను బయలు దేరేటప్పుడు బాగానే వుందే..."

"ఇల్లాంటి ఫిట్లు ఎన్ని చూళ్ళేదూ! నిజం ఫిట్టయితేగా! ఇకో నాటకం ఏదేనా పేచీ కానీ, అవాంతరం కాని వొస్తే, ఫిట్టని మంచమెక్కుతుంది. నాకీ ఖర్చూ, డాక్టర్లంబడి తిరగడం, వాళ్ళు యిదేమిటని లోపల నవ్వడం-యివీ వ్యవహారం..."

"నేనల్లా అనుకోను నాన్నా, అమ్మవొంట్లో అసలు రక్తంలేదు; రోజురోజుకీ క్షీణించిపోతోంది; పాపం ఆయాసం - మందు పుచ్చుకోదు. అందులో అన్నయ్య కేకలు, వొదిన రాద్ధాంతాలు, మీ ఎగురుళ్లూ — ఫిట్లు మొగాళ్ళకే వొస్తుంది మనింట్లో..."

"ఆ, అల్లాగా - నీ నిశ్చితాభిప్రాయం వెలవిచ్చారు, ధన్యులం. అవును మరి అమ్మని వెనకేసుగుని రాకపోతే కామాక్షి కూతురుతో నీ ఆశల్లా

సాగుతాయి! "కామాక్షింట్లోవుంటాడు, కబురంపండి" అంటూ చిలకలా చెప్పింది మాల్లుతూ.

...నీ ఆటల్ని సాగనిస్తూ, నీకన్ని ఏర్పాట్లు అది చేసి పెడుతుంది,- దాని ఆటలికి నువ్వు మద్దత్తవుతావు..."

"అబ్బ, ఆపండి, నానా... నే వినలేను. రోడ్డుమీద ఎవళ్లైనా వింటా రుకూడా..."

"రోడ్డుమీద యిప్పుడు వినేదేమిటి? లోకం యిదివరకే కోడై కూసింది నువ్వూ నేనూ దాస్తే దాగుతుందా? నీకు యిరవై రెండేళ్లు దాటుతున్నాయి. యింతవరకూ నీ కెందుకు సంబంధాలు రాలేదో తెలుసుకొన్నావా...?"

"నాకు సంబంధాలు రాకపోవడం వల్ల దేశానికి అనర్థం రాలేదు. నాకేమీ బెంగాలేదూ...'

"అవునవును, నీకు బెంగెందు కుంటుందీ... నీ ఆటలు సాగుతుంటే"

"ఏమిటి నాన్నా-మనం చదువుకున్న వాళ్లం.-యిల్లాంటి మాటలు..."

'మరి నువ్వుచేసే పను లేమిటోయ్-మొల్లుంచే రోమమెందుకు? చదువు వెలిగించి, నువ్వూ, నీ తల్లీ చేరి చేస్తున్న దేమిటీ...?"

దయానిధి కంఠం పెద్దదైంది,—మాటలు తిన్నగా వుచ్చరించలేకపోతు న్నాడు ఉద్రేకంతో...

'నాన్నగారూ,- నన్ననండి పడతా - నా పాపాలు అమ్మకి చుట్ట కండి పాపం... అమ్మకేమీ తెలీదు..."

'ఏమీ తెలీకపోతే, కామాక్షికోసం ఎందుకు కబురు చేస్తుంది..."

'ఊరికే విందేమో..."

'వినడమేమిటి? కామాక్షి, ఎక్కడ్నో చక్కావొచ్చి, పరాయి మొగాణ్ణి ఉద్యోగస్తుణ్ణి అనేనా లేకుండా, నాతో వాదించడం మొదలెట్టింది-దాని కూతుర్ని నేను కోడలు చేసుకోవాలిట..."

'నిజంగా అల్లా అందా నాన్నా...?"

"నువ్వు రోజూ వాళ్ళ కొంపచుట్టూ తిరుగుతున్నావట. పెళ్ళి చేసుకోకుండా యిట్లా తిరిగితే ఏం మర్యాదగా వుంటుంది, మా అమ్మాయికి పెండ్లి కావాలా - కాబట్టి ఏదో తేల్చెయ్య'మని కూర్చుంది - పో, పో, అవతలికి-పోమన్నాను...ఎవర్తిరా అది?"

'నిజంగా కామాక్షి ఎవరో నాకు బాగా తెలీదు నాన్నా..."

'దానికి మొగుడూ మొద్దూలూ వున్నాడా?"

' నాకదీ తెలీదు నాన్నా...వాళ్లు బ్రాహ్మలు కారు..."

'కులగోత్ర నామాలు లేవు; మొగుడూ, సంసారంలేదు; నలుగురూ ఎక్కే గుమ్మం, దిగే గుమ్మం...నీకు దాని కూతురు కావల్సి వొచ్చిందా ... యింత చదువూ చదువుకుని..."

'మీరు భ్రమపడుతున్నారు. నాన్నా... రోడ్డుమీద వెడుతుంటే కోమలి కనిపిస్తుంటుంది; అంతే...కాని పెండ్లి చేసుకోవడం కామాక్షి అనుకున్నంత సులువు కాదు .."

'ఐతే ఏమిటి నువ్వు చెప్పొచ్చేది?...

'ఏమీ లేదు,-ఊరికే అది అన్నంత మాత్రాన జరిగే ప్రమాదం ఏమీలేదు. నిజంగా పెళ్ళి చేసుకోదల్చుకుంటే కులగోత్ర నామాల్చు, అడ్డు తగుస్తాయా..'

'అవునవును, భూములు తణఖాపెట్టి చదువులు చెప్పిస్తున్నందుకు యీమాత్రం మామీద గౌరవం చూపించొద్దు?...'

'కులగోత్ర నామాలకీ మనుష్యుల శీలాలకీ సంబంధంలేదు నాన్నాగారు. ఎందరో మర్యాదస్తులు చెడిపోవడం మనం చూడటంలేదూ? చదువు లేకపోతే చెప్పించొచ్చు; సంపర్కం వల్ల సంస్కారం తెప్పించొచ్చు; ఎల్లా పడితే అల్లా తయారు చేసుకోవచ్చు; కాని సౌందర్యం ఎక్కడనుంచి తేగలం...'

ఇంటి దగ్గరకి చేరుకున్నారు.

ఏరా గుర్నాథం ఏమన్నాడు డాక్టరు? అన్నాడు దశరథ రామయ్య

గారు అరుగుమీద కూర్చుంటూ.

'ఇప్పుడే పూర్తించి వొచ్చారటండీ-భోజనం చేసి వొస్తామన్నారండి-కాంపౌండ రొస్తున్నాడండి...'

దశరథ రామయ్యగారు పొడుండబ్బీ తీసి కాస్త పొడుం పీల్చారు.

'చాలాదూరం వెళ్ళిందన్న మాట నీ కథ - ఈ లేచొచ్చిన దాని కూతురుతో నువ్వు సరసాలాడుతుంటే మీ అమ్మ సరేనని తాళి మెయ్యడమా...'

'అదే వొద్దన్నది నాన్నాగారు - అమ్మని యిందులో దింపకండి...'

'ఈ భూప్రపంచంలో యిందరుండగా మరి నువ్వు దీనితోరా... గోవిందరావు మామయ్యగారు సుశీల నిస్తామని మొరెట్టుగుంటోంటే అది అక్కర్లేదన్నది యిందుకా...'

'సుశీలని యిస్తామని వాళ్లు ఎప్పుడూ అనలేదు. అదంతా మీ రను కోవడం. పైగా సుశీలని చేసుకుంటే నాకు సుఖం వుండదు. మన గుట్టంతా వాళ్ళకి తెలుసు...'

ఛీ నోర్ముమ్ తప్పడుకూతలు కూస్తావ్! దాని కొడుకువు కాబట్టే నీకీ బుద్ధు లొచ్చాయి...

మీ కడుపున పుట్టినందుకు నేను విచారించని రోజు లేదు...

షప్, వాగుతున్నావ్... అప్రయత్నంగా దశరథరామయ్యగారు అతన్ని లెంపకాయ కొట్టారు.

'కొంచం లోపలికి రావాలి...'

అంటూ కాంపౌండరు అరుగు మీది కొచ్చాడు. వెనకాల నారయ్య నిలబడ్డాడు. గబగబా దశరథరామయ్యగారు, దయానిధి లోపలికెళ్లారు. అంతా ఐపోయింది. దశరథరామయ్యగారు పంచలో మొహం దాచేసుకుని ఏడవడం మొదలెట్టాడు.

దయానిధి మంచం పక్కని కూర్చుని తేరబారి చూశాడు. అతని కర్థం

కాలేదు. గబగబా దొడ్లోకి పరిగెత్తుకుపొయ్యాడు. దేవుళ్లకి మొక్కాడు బ్రతికించమని. ఇంకేమీ కోరనన్నాడు; జీవితంలో అతను కోరింది అది వొక్కటే. కాస్త చేతులు కమిల్తాయేమోనని దొంగతనంగా అటు కేసి చూశాడు. ఏదేముడూ అతని మొక్కు చెల్లించలేదు. ప్రొద్దున్నకి లేవక పోతుందా? లేచి; నిధీ నాబంగారం లేవరా; కాఫీ చల్లారిపోతోంది అనక పోతుందా?

అతనికి ఏడుపు రాలేదు. కాలం ఆగిపోయినట్లనిపించింది.

జెర్‌సొప్పా నయాగరా జలపాతాలు. హిమాలయాపర్వతాలు సింధు భాగీరథీ నదులూ-నీట్లకి మల్లే తల్లి ఎప్పుడూ వుండిపోతుందనుకున్నాడు. ఇవి లేకుండా తన జీవితమే లేదు. సృష్టి వెనక్కి వెళ్లినట్లయింది. చిన్నతనం లో శవాన్ని చూసి నవ్వి ఎవరిదో మనదికాదు అనుకునేవాడు. అతనూ తల్లీ, తండ్రీ, అన్న, శవాలు కారు. తల్లి మరణిస్తే, నక్షత్రమండలం కూలిపో తుంది; సముద్రాలు పొంగి లోకాన్ని ముంచివేస్తాయి; భూమి పీడిపోయి లోకాన్ని మింగివేస్తుంది.

అంతా అయిపోయింది.

పిచ్చివాడిలా కాలవగట్టుకి నడిచిపోయాడు. సాయంత్రం తను పడు కుని వొదిలిన గడ్డిలో పడుకుని ఏడవలేకపొయ్యాడు. కళ్ళు ఎండిపోయాయి; నీళ్ళు రావు; రక్తం గడ్డకట్టింది. చంద్రుడు పైన వాడిపోయి, మరి లేవని నిద్రకో అన్నట్లుఆవులిస్తున్నాడు; నక్షత్రాలు తూర్పు వెలుగులో తడిసి విడిపోతున్నాయి. తూర్పు ఆకాశం తలుపులు తెరచుకుంది; చీకటి రావద్దని గెంటేస్తోంది. కాలవ కదల్దు; పక్షులు చెట్లలో కదలలేవు. ప్రాతఃకాలపు ప్రకృతి అమ్మలాగే పోయింది.

అంతా ఐపోయింది.

అమ్మమ్మ, అమ్మ బాల్యంలో ఎట్లావుండేదీ! చెప్పే కథలు స్మరణకు వొచ్చాయి; పరికిణీ కట్టుకుని కాలవగట్టున ఆడుకునే అమ్మ; పెళ్లికొడుకు

బావగారి పాదాలు చూచి, భర్తయే అనుకున్న పెళ్ళికూతురు అమ్మ; పల్లకీలో దాహంవేస్తే నోరెత్తి అడగలేకపోయిన అమ్మ; బాకాల మోతకి చెవుల్లో వేళ్లు దోపుకున్న అమ్మ; తల్లి గండాన పుట్టాడు, వాణ్ణి చంపేస్తాం అంటే 'అమ్మో' అని భయంతో వొణికిపోయి కళ్ళు పెద్దవిచేసి నిట్టూర్చిన అమ్మ, హాస్టల్లో తండ్రి కోరినప్పుడు డబ్బు పంపకపోతే, గాజులు తాకట్టు పెట్టి మనియార్డరు కట్టిన అమ్మ; తెల్లచీరని చూసి, తమ దీపావళినాడు తెల్ల పట్టు చొక్కాతో మతాబా కాలుస్తుంటే మురిసిపోయిన అమ్మ; కోమలిని వర్ణిస్తుంటే అర్థమైపోయినట్లు, తల పంకించిన అమ్మ;

అంతా ఐపోయింది.

తండ్రికి భార్య; సంఘానికి, దిద్దుకోటం చేతకాని సంసారి; కుటుంబానికి యిల్లాలు; లోకానికి వొకావిడ; సృష్టికి స్త్రీ; తనకిమాత్రం అమ్మ.

ఈ ప్రపంచలో పుట్టి, యింత మందితో యిన్ని యిక్కట్లు పడి, ఏం చేసింది? మాతృత్వం పొంది, తల్లిగా మారింది; తన పని ఐపోయింది; వెళ్ళిపోయింది. అందుకనే వొచ్చింది; అది వ్యర్థ జీవితం కాదు.

కన్నీటితో గడ్డిపూచలు తడిసినాయి. ప్రాణానికి ఎంత విలువుంది? గడ్డిపోచ కంతో అంతే...! ఆపలేకపోతున్నాడు - పొంగి పొరలిపొయ్యే కన్నీటిధారలను. తరతరాల జీవులు ఎడబాపుకోసం దాచివుంచిన కన్నీటి ధారలు; ప్రాచీన మానవులకు అంతంకాని కన్నీరు, ఎన్నో యుగాలుగా వూరుతున్న కన్నీరు ఎవరికోసమో, ఎందుకో తెలీదు; సముద్రాలని సహితం యిముడ్చుకున్న కన్నీటిబిందు; ఆకాశాన్ని ముంచివేసే కన్నీరు ఆనందంతో వుబికిపోతోంది.

అమ్మ జబ్బు బాగుచేద్దామనే తను యీ డాక్టరు చదువు ప్రారంభించాడు. ఆ నాటి ధారలని ఆపలేడదు......తడిసిన గడ్డిపోచ సూర్యుడి తాకిడికి తేరుకుంటుంది-ఏమీ ఐపోదు.

ఇంతవరకూ అతనికి వేరే వునికిలేదు, ప్రతిచిన్న విషయానికీ తల్లిమీద

ఆధారపడ్డాడు; డబ్బు కావలిస్తే తల్లిచేత నాన్నని అడిగించవలసిందే; ఈ సంసారం వొక సముద్రం ఐతే, అతను నిలబడేటందుకు అమ్మ వొక లంగరు. ఇప్పుడు ఆ లంగరు లేదు; ఏదో శక్తి అతన్ని వొదిలిపోయింది; అతన్ని ప్రపంచానికి బంధించిన గొలుసులో గొళ్ళెం ఊడింది — కోమలి అతని గడ్డిపూవ కింద తీసిపారేసి, గడ్డిపూవుని మొహాన కొట్టింది; మృత్యువు తల్లిని గడ్డిపూవ క్రింద తీసిపారేసింది. శక్తి, బలం, సంతోషం, ఆదర్శం అన్నింటిని అమ్మ తీసుకుపోయింది; అంతా ఐపోయింది; చివరికి మిగిలింది తను!

—o—

# 2

## అనుభవానికిహద్దులులేవు

ఏడు మాసాలు గడిచినై. క్రిస్మస్ శెలవలకి, దయానిధి వాళ్ళ వూరికి చేరుకున్నాడు. బండిదిగి ఇంట్లో కాలు పెట్టేటప్పటికి ఉదయం తొమ్మిదిన్నరైంది; గుమ్మందాటి వాకిట్లో కొచ్చాడు; ఏదో పరాయి యింట్లోకి వొచ్చినట్లనిపించింది. అమ్మ వుండివుంటే స్టేషన్‌కి మనిషిని పంపేది; గుమ్మం దాటే ముందు దిష్టితీసేది. నాన్నగారి ఆఫీస్ గదిలోకి వెళ్ళాడు. కిటికీలోంచి జోగప్పనాయుడుగారు కొత్తగా వేసిన మేడ కనిపించింది; తను పట్నం వెళ్ళేటప్పుడు కట్టడం మొదలెట్టారు; చాలా పెద్ద విశాలమైన మేడ; ఎంతో ఖర్చు ఐవుంటుంది; రంగురంగుల అద్దాలమేడ - అన్నీ వున్నాయి వొక్క- అందం తప్ప. టేబిల్ మీద వున్న లెటర్ రాక్‌లో వుత్తరాలు, ఏమీ తోచక తీశాడు; గోడని అమ్మ నాన్నా, పెళ్ళి ఫొటో వుంది; అన్నయ్యా, అమృతం అమ్మా కలిసి తీయించుకున్న చిన్నప్పటి ఫొటో వుంది; కృష్ణాపురానికి బదిలీ అయింతర్వాత, నాన్నగారికి పార్టీయిచ్చి, వీడ్కోలు సందర్భంలో తీసిన ఫొటోలో తనూ వున్నాడు. డ్రాయరులో చిన్న షేవింగ్ మిర్రర్ వుంది; తీసి తన ముఖం చూసుకున్నాడు. రైలుబొగ్గుకి ముఖం వాడిపోయింది; వెంట్రుకలు కాడలగా నుదుట్ మీదకి జారాయి.

దయానిధివి పెద్ద విశాలమైన నేత్రాలు; నల్లటి పాపలు - కోలగా సాగిన కన్నులు; కళ్ళచుట్టూ కాటుక పెట్టుకున్నట్లుగా వుండే నలుపు; సోగగా జారిన కనురెప్పలు.

ఆర్చిలా అమర్చబడ్డ కనుబొమ్మల మధ్య కత్తిరించిన వెంట్రుకల మొనపు. చదరమైన తలకొప్పు, గుండ్రటి పొడుగాటి మెడ. పల్చటి పైపెదవి, నవ్వుతుంటే జాలిగా మెరిసే పళ్ళు—మూతికి కుడివైంపున చిన్ని నొక్కు. అతన్ని చూస్తే అతనికే నవ్వొచ్చింది. అకస్మాత్తుగా అమ్మని చూసినట్లనిపించింది' తనలోంచి తల్లి తొంగిచూస్తున్నట్లు-తనలో ఎవరోవుండి అతన్ని జీవింప చేస్తున్నట్లు. నిజంగా తల్లి చావలేదు. అతనిలోనే వుండిపోయింది. హెచ్. జి. వెల్స్ తన అల్లుడు ఇండియాలో వున్నాడని వ్రాశాడు. అతని మేన మామ నార్వేలో వుండొచ్చు. ఎంతమంది రక్తమో అతనిలో ప్రవహిస్తోంది-కాళిదాసు, అరిస్టాటిల్, సెంట్ ఫ్రాన్సిస్ ఆఫ్ అసీసి, మొల్ల, ఫ్రెంచి విప్లవంలో రాబ్స్‌పియర్, వేమన్న, పీకేశలింకంపంతులు, వీళ్ళందరి రక్తం కోమలిలో ప్రవహిస్తోంది; ఆమె రక్తం అతనిలో-అంతా, అందరూ యీ మానవ రక్తంతో ఏకమైపొయ్యారు. సృష్టి అంతమెందేవరకూ వరదలై మానవ రక్తం ప్రవహిస్తూ, అందర్నీ బంధించి, ఏకంచేసిన మృత్యువుకి అతీత మైపోతుంది. అదే కాబోలు అమరత్వం అంటే! తనలో తల్లి అమరత గడించు కుంది!

తను పట్నంనుంచి, రెండునెలల క్రితం తండ్రికి రాసిన ఉత్తరం తీసి చదవడం మొదలెట్టాడు. 'అన్నయ్యా యిష్టపడకపోయినందుకు విచారిస్తు న్నాను. నాకు ఎట్లాంటి అభ్యంతరమూ లేదు. మొగాడు ఏకాంతంగా వుండ లేడు. నాకు తెలుసు. ఆధారపడి, ఆదుకునేటందుకు స్త్రీ అంటూ వుండక పోతే, మొగాడి జీవితం సంపూర్ణం కాదు. చుక్కానిలేని నావ...'ఉద్రేకం లేకుండా, ఉత్తప్పుడు అట్లాంటి వుత్తరం నాన్నకి వ్రాయగలడా!

'ఇంట్లోకిరా బావా - కాఫీతాగు స్నానం చేద్దువుగాని లే...'

ఉత్తరం మూసేసి వులిక్కిపడి పక్కకు తిరిగాడు,

'అమృతం!'

'ఏం, దెయ్యం అనుకున్నావా...?'

'అమృతం'—! అంటూ గోడనున్న ఫోటోకేసి చూశాడు-'అవును, అమ్ములు...'

ఇద్దరూ నవ్వుకున్నారు. అమృతం నాన్న తాలూకు దూరపుచుట్టం. చిన్నప్పుడు 'అమ్ములు' అనేవారు; ఆ అమ్మాయిని అన్నయ్యకిస్తామనుకున్నారు; ఆ సంబంధం ఎందుకు పొసగలేదో అతనికి తెలీదు; చిన్నప్పుడు కోతిలా అల్లరిచేసేది; జడవుండేదికాదు; అందరూ ఏడిపిస్తూండేవారు. ఇప్పుడెట్లా మారిపోయింది. ఎగా దిగా చూశాడు. అమృతం అతను గుర్తుపట్టలేనంతగా మారిపోయింది—ఈ పదేళ్ళల్లోనూ. మిసమిసలాడే చామనఛాయ, గంభీరమైన కళ్లు; ఉంగరాలు తిరిగి మెడంతా ఆవరించుకున్న పెద్ద జుట్టూ - బలమైన నడుం - గట్టిగా, గుండ్రంగావుండే బుజాలు. అన్నిటికంటే ఆకర్షణీయమైన వక్షస్థలం - ఇంగ్లీషు ఫేషన్ మేగజీన్లలో బొమ్మల్లాగుండే రొమ్ములు - ఆశ్చర్యంతో, భయంతో చూశాడు ఆమెకేసి.

'కాఫీ! బావా! చల్లారిపోతుంది'

అతనికి ప్రాణం లేచివొచ్చింది; అతన్ని యింతవరకూ అంత ముద్దుగా బావా అన్నవాళ్ళు లేరు. మామయ్యగారి సుశీల అసలతన్ని పిలవనే పిలవదు; పైగా ఆమె ధోరణి చిన్నప్పటినుంచీ ఎరుగున్న దానిమల్లే వుంటుంది. అతనేమీ మాట్లాడలేదు.

అమ్మ చెప్పడం తప్ప నిన్ను బాగా ఎరగను, పెద్దబావ బాగా తెలుసు. పాపం అత్తయ్యకి నేనంటే ఎంతో యిష్టం. నువ్వూ నీమొగుడూ శెలవలకి రమ్మని ఎన్నోసార్లు రాసింది. మావారికి ఎప్పుడూ తీరుబడయ్యేది కాదు - ఏదో పాపం, జబ్బుతో బాధపడుతూ వుండటంకంటే, పోనీ పునిస్త్రీ జన్మ...'

కొంగుతో కళ్ళు తుడుచుకుంది. తల్లిపోయిం తర్వాత పరామర్శచేసిన వాళ్ళని చాలామందిని చూశాడు దయానిధి. ప్రతివాళ్ళూ విధాయకంగా, తప్పనిసరిగా ఏడ్చినట్లుగా వుండేది. అమ్ములు కన్నీరు సహజంగా - వుంది

ఇతరుల దుఃఖాన్ని పంచుకోటం తన నైజమల్లే.

'మీ ఆయనకూడా కొచ్చాడా... పేరేమిటి?,

కొంగు కళ్ళమీదనుంచి తొలిగించింది, పసుపచ్చ పల్చటి ఖద్దరు చీర. ఎందుకో అతనికి కాళిదాసు నాటకంలో శకుంతల స్ఫురణకొచ్చింది - బుజాలకి గుండ్రంగా పట్టుకున్న మొద్దు జాకెట్టు, జడలో పడిపోతున్న మందారం లోయలో సూర్యాస్తమయం చూసినట్లుంది అమెకేసి చూడడం. నీళ్ళతో కళ్ళు తడిసి జాలిగా మెరుస్తున్నాయి.

'రంగు పోతుందిస్మా, తడిపితే!' అన్నాడు.

చీరకేసి చూసుకుని తడిసినభాగాన్ని దాచేసి నవ్వడానికి యత్నించింది.

'అవును. మొన్ననే కొన్నాం, యింకా వుతుక్కి వెయ్యలేదు.'

'ఇంతకీ మీ ఆయనపేరు చెప్పావు కాదు...'

సిగ్గుతో తలొంచుకుంది.

'అబ్బో తెలీనట్లు...'

'నిజంగా జ్ఞాపకంలేదు.'

'నాకు తెలీదు-నే చెప్పనబ్బా...సిగ్గేస్తుంది.' అని దగ్గి, వొచ్చే నవ్వు ఆపుకుంది.

'పోనీ, ఏం చేస్తున్నాడు...?'

'వ్యవసాయం-కరిణీకంకూడా వుంది-నువ్వు నా పెళ్ళికి రాలేదు-పోనీ మావూరేనా రాకూడదా ఏమిటి?'

'నన్ను ఎవ్వరూ రమ్మనండే...?

'ఏమ్మాటలు బావా - నన్ను ఎవరు రమ్మన్నారు. ఇష్టంవుంటే సరి...

'బాగుంది-అత్తయ్య చచ్చిపోయింది కాబట్టి చూడ్డానికొచ్చావ్ - అంతేనా?'

'షో బావా - భలేవాడివే! ఇంకా మాటలురావు అమాయకుడి వనుకున్నాను - నాకు మావాళ్ళనందరినీ చూడాలని వున్నా, వొక్కదాన్ని

ఎట్లా రాగలను బావా? నువ్వే చెప్పు. మావారికి పదిమందిలోకీ వెళ్ళడం, తిరగడం సరదాలేదు. ఎప్పుడూ పుస్తకాలో, జమాబందీలో...ఐనా బస్తీలలో వుండేవాళ్ళు మా పల్లెటూళ్ళ కెందుకొస్తారు? మాదో అడివి...'

'నీలాంటి పెళ్ళాం వుండగా అడివిలో కాపరం వుంటేనేం...'

'పో-కొంటే...'

ఆ వాక్యం పూర్తికాకుండానే సుశీల చక్కావొచ్చింది. సుశీల కొంచెం పొట్టిమనిషి; చిన్ని నుదురు; చిన్ని కళ్ళు; గుండ్రని బుగ్గలు, బాగా ఎర్రటి ఛాయ; కంట్లజోడు మొహానికి నిండిచ్చింది.

"హల్లో! డాక్టర్ గారు కాబోలు...మీరు మెయిల్లో దిగినట్లు తెలుస్తుంది కాబట్టి ఎప్పుడొచ్చారని అడగక్కర్లేదేమో..."

"హల్లో సుశీలాదేవిగారు...మీరన్న దాన్ని ఎంతమాత్రం ఖండించను."

"మీ రాక పట్నంనుంచే కాబోలు"

'అవును. మీరు సత్యానికి దగ్గరగా వొచ్చారు."

'అమ్మలు నవ్వుతోంది. ఏమిట్రా ఇదంతాను."

సుశీల కొంటెగా నవ్వింది.

'మొగుడూ పెళ్ళాం సరసాలమధ్య నేనెందుకు..." అని వెళ్ళబోయింది అమ్మలు.

'అమ్మలూ, ఎప్పుడూ అట్లాంటి మాట్లనకు..." అంది సుశీల.

'అందులో తప్పేముంది; వున్న మాటంటే..."

'ఊరుకో అమృతం-నీకు మాట్లాడ్డం చేతకాదు. పల్లెటూరి పిల్ల, మేనర్స్ ఎట్లా వొస్తాయి..."

'తప్పు సుశీలా-నీ యింగ్లీషు కోపం అమృతం మీద చూపించకూడదు.

'లేకపోతే ఏమ్మాటలనీ-ఏం మాట్లాడుకున్నా మొగుడూ పెళ్ళాలు, పెళ్లి గొడవే......తను చేసేదుందిలే పో పల్లెటూరి మొద్దుని..." అమ్మలు పెదవులు అసహాయమైన కోపంతో వొణికిపోతున్నాయి.

"ఏమిటే సుశీ ఆ ఎత్తిపొడుపులు—ఇప్పుడు ఏమన్నాననీ! మొద్దో మహారాజో ఎవరో మొగుడంటూ వున్నాడు-పద్దెనిమిదేళ్లొస్తున్నా, నీకు అదీ లేదుగా..."

"అతిగా వాక్కు!"

దయానిధి కాఫీకప్పు బల్లమీద పెట్టి, అమ్మాన్ని చెయ్యిపట్టుకుని హాల్లోకి తీసి కెళ్లాడు-ఏడుస్తూ మంచం వాల్చుగుని కూర్చుంది.

సుశీల చరచర నడిచి తన గదిలోకెళ్లి చప్పుడయ్యేటట్లు గడియేసు కుంది.

మధ్యాహ్నం భోజనాలవేళ, నరసమ్మగారు సుశీల తల్లి-అతని చదువునిగురించి కుశలప్రశ్న వేసింది.

'ప్రాక్టీస్ ఎక్కడ పెడతావ్?'

'ఇప్పుడెక్కడమ్మా, యింక రెండేండ్ల తరవాత మాట కదా...' సుశీల, అమృతం ఏమీ మాట్లాడకుండా వింటున్నారు.

'సుశీల చదువు సంగతి ఎల్లావుందో కనుక్కున్నావా" అంది నరసమ్మగారు.

'ఎల్లావుండాలి? డాక్టరీ పూర్తయినప్పుడే నా యింటర్ మీడియట్టూ పూర్తవుతుంది—చాలు. నెయ్యి వొడ్డించకు యిక్కడికే నా క్లాస్‌మేట్స్ లావెక్కిపోతున్నానని ఏడిపిస్తున్నారు-హల్లో డాక్టర్, నెయ్యిలో విటమిన్స్ విషయంలో మీ అభిప్రాయం ఏమిటి?'

'నీకు చెప్పేటందుకు నేనెంతవాడ నబలా! కొన్ని విటమిన్స్‌ని ఎక్స్‌పార్బ చేసుకునేందుకు బాడీకి ప్రీడిస్పొజిషన్ వుంటుంది-అంటే ఏం చేస్తే లావెక్కిపోతానో అని భయపడుతూ, 'లావుని' గురించి ఆలోచిస్తావు-జేన్ని ధ్యానం చేస్తే ఇదే ఐపోతావని హిందూ ఫిలాసఫీ చెప్తోంది కూడా; భక్తుడు ప్రార్థనవల్ల దైవత్వం పొందుతాడు. నీ కేస్‌లో ఒబ్సీటీ అనే ఆబ్‌స్ట్రాక్షన్ కన్‌సెప్ట్‌ని వూహించుకుని, భయపడతావు. నీ బాడీ ఇన్‌ట్యూటివ్

గా రీయాక్ట్ ఐ, నువ్వు ఏది కాకూడదనుకుంటూన్నావో అదే అవుతావు...
నరసమ్మగారు అడ్డం వొచ్చి.

'నకేమన్నా తెలుస్తోందే అమ్మ...' అమృతం తలెత్తలేదు.

'నువ్వూ నేనూ చదువులేని మొద్దులం - మనకెందుకు?' అని నవ్వించ బోయింది.

సుశీల అందుకుంది. 'అది మొద్దేం ఖర్మం అది ఆవకాయ పెట్టినట్లు..'

'నాజోలి నీ కెందుకు? ఆవకాయే పెడతానో...'

'అండమాన్స్‌కి రాణీనే అవుతానో యక్స్యాక్ట్ మి...'

"చూశావమ్మా నరసమ్మ పిన్నీ.-నాజోలి తన కెందుకు...మళ్లా నే ఏమన్నా అంటే వొచ్చీ రాని యింగ్లీషు మాటలతో..."

"అబ్బ పోనీలేవే - ఏదో నలుగురూ ఏకమై నవ్వడే అచ్చట్లూ, ముచ్చట్లూ, వేళాకోళం చేస్తే నీకింత కోపమెందుకే...వాళ్ల నాన్న తాసిల్దారు, కాలేజీకి పంపించాడు...అందరి మొగుళ్ళూ ఐ.సి.యస్.లూ, డాక్టర్లూ అవుతారటే' అంది నరసమ్మగారు. ఆ వాక్యంయొక్క తాత్పర్యం దయానిధికి అర్థం కాలేదు...

"అత్తయ్యా, మీ అల్లుడు ఐ.సి.యస్. కాని పక్షంలో ఆ సమయంలో డాక్టరేనా కావలనా ఏమిటి నీ అభిప్రాయం...ఆ రెండింటికీ అతకదే. ఐసియస్ గవర్నమెంట్ సర్వెంట్. డాక్టర్ సిక్ పీపిల్‌కి సర్వెంటు...'

"ఏమో నా కవన్నీ తెలియవు-వాళ్ళ నాన్న తాసిల్దారైవుండి ఐ. సి. యస్.ని తీసుకురాలేదు."

"అల్లుడికి జబ్బుచేస్తే మందు నువ్వే యిద్దుగానిలే...' అని పూర్తిచేసింది. ఆవిడ మనస్సులో వున్నదాన్ని అంత నాజూకుగా తెలియజేసినందుకు నరసమ్మగార్ని లోలోపల అభినందించాడు నిధి. అమ్మయ్యా అనుకుని నిటూర్పు విడిచాడు.

మధ్యలో సుశీల మొదలెట్టింది. "ఐసియస్ వాళ్ళకి గవర్నమెంటు

డాక్టర్లే వుంటారు...'

"యక్సలెంట్ హాట్స్ అఫ్...!' అన్నాడు నిధి.

"ఇంక నేను సుశీల చదువు పరీక్షచేసేదే వుందమ్మా అన్నాచార్యా. సుశీల సెక్రటరీ ఆఫ్ స్టేట్ సర్వీస్ భోగట్టా కూడా వల్లవేసింది. ఇంతకీ మనదేశం లో చదువుకున్న మొగాళ్ళ ఆశయం ఐసియస్‌లు కావడం, చదువుకున్న స్త్రీల ఆశయం ఐసియస్‌లకి పెళ్ళాలు కావడం.'

"తీరా అయ్యేది తాలూకా గుమాస్తా పెళ్లాం...' అని అమృతం వాక్యం పూర్తిచేసింది.

"ఓస్! తాలూకా గుమాస్తా, కరణంకంటె మెరుగేల" అంది సుశీల.

'నేను నీతో అనలేదు, మా బావతో అంటున్నాను'

'నేనూ నీతో అనలేదు, మా అమ్మతో అంటున్నాను.' అంది సుశీల.

'నేను కొంతవరకూ అమృతంతో ఏకీభవిస్తున్నా, సుశీల చెప్పినదాంట్లో కొంతవరకేనా యథార్థం లేకపోలేదని అనుకోడానికి, కొంతవరకూ సాహసిస్తున్నానని చెప్పేటందుకు, సంకోచించవలసిన అవసరం వుందని అనుకోవల్సి వొస్తోంది...' అన్నాడు నిధి.

నరసమ్మగారుకూడా నవ్వుతున్నారు. సుశీల మొహం చిట్లించుకుంది.

'ఇంతకీ నా 'లావుకి' మందు చెప్పలేదు...' అంది సుశీల.

'నీ మొహం - నువ్వు లావని ఎవరన్నారే. ఎదిగే పిల్లలు బొద్దుగా వుండరా ఏమిటి? అమ్ములు చూడు, గుండ్రంగా...కూజాలా జబ్బలూ అవీ..."

'కూజా గొట్టంలా...అంటే బాగుంటుందేమో!" అన్నాడు నిధి.

"నన్నేం ఆక్షేపించక్కర్లేదు. నాకు జబ్బ లెక్కడున్నాయి..." అంటూ అమ్ములు జాకెట్టుకేసి చూసుకుంది. పుస్తెలు గొలుసు పమిట్లో సర్దుకుని—"నాకేం ఫేషన్లు లేవు, చేతుల్లేని రవికలూ..."

"ఇక్కడెవరికీ చేతుల్లేని రవికలు లేవులే మహా. ఇట్లాంటి మాట్లంటేనే నాకు వొళ్ళు మండుకుని వొస్తుంది..."

"వాళ్ళు మండినవాళ్ళచేత ఆవకాయ పెట్టించాలి-" అన్నాడు నిధి. నరసమ్మగారు నవ్వింది.

"ఆవకాయ పెడితే మీ అమ్మే పెట్టాలి... పాపం..."

"అప్పులు చేసినా అత్తయ్యే చెయ్యాలి..." అంది సుశీల. అమ్ములు కోపంగా సుశీలకేసి చూసింది.

"అత్తయ్య చచ్చి స్వర్గాన్నుంది. ఏం మాట లత్తయ్యా..." నరసమ్మగారందుకుంది.

"అవునే మరి బ్రతికున్నన్నాళ్లూ మేం ఎవ్వరం నోరెత్తలేదు. మాట దమ్మిడీ మిట్టలేదు. మరి ఏం చేసేదో, ఎవళ్ళకి పెట్టేదో—మొన్న మొన్న నగలూ, మూండెకరాలూ అమ్మితే ఆ అప్పులన్నీ తీర్చై'

'వెనక డబ్బుపోతేనేం, హాయిగా రాణిలా బ్రదికింది. హాయిగా పునిస్త్రీ చావు చచ్చింది. ఎవళ్ళకో ఎందుకో పెడుతుంది? తన కొడుకులికీ, కోడళ్ళకే పెడుతుంది...' అమృతం వాక్యం పూర్తి కాకుండానే సుశీల అడ్డం వొచ్చింది...

'కోడళ్ళకే అని బహువచనంవొద్దు-కోడలికే అను...'

'సరే, అడ్డంరాకు నువ్వు - నిధికి పెండ్లాముంటూ రాదా ఏమిటి... [illegible]...'

'నాకో లెక్కెట్టద్దని ఎన్నిసార్లు చెప్పినా నీకు జ్ఞానంలేదా...?

'ఏ నీబోటి చదువుకున్నదో అనబోయ్యాను.'

'అబ్బా వుండవే, చెప్పకవే - పోనీలేవే నీ కెందుకు అంత...' అంది నరసమ్మగారు.

'ఔనౌను. నేను నరసమ్మత్తయ్యతో ఏకీభవిస్తున్నాను. ప్రజాపరిపాలనా యుగంలో వాక్ స్వాతంత్ర్యానికి ప్రథమ స్థానం' అన్నాడు నిధి.

'లేకపోతే తన పుట్టింటారికి పెట్టుకుంది. ఉన్నవాళ్లం-నీకూ, నాకూ ఎందుకు పెట్టాలి..." అని పూర్తిచేసింది అమృతం.

'ఇంతటితోనే ముగిస్తున్నాను. అంతేనా అమ్మలు?'

'నేనుమాత్రం ఏమన్నానే; నైర్మల్యమని నాయోగికి తేస్తావ్?'

'అవును పిన్నీ, చచ్చిపోయినవాళ్ళని తిట్టడం ఎందుకన్నాను... నీ కిష్టంలేకపోతే నీ కూతుర్నిచ్చి పెళ్ళి చెయ్యరు... అందుచేత అతనికి పెళ్ళి కాకమానోదు...'

'ఛ, ఛ - మళ్ళా అదే వాగుడు - నా జోలెత్తొద్దంటే నీకు జ్ఞానంలేదా ఏమిటి...' అంది సుశీల.

'నా యిష్టం, అంటాను. నువ్వొక్కదానవే వదువుకోలేదు...'

'నోర్ముయ్...'

'నువ్వే మూసుకో...' అని అమృతం కంటతడిబెట్టుకొని, అన్నం తినడం పూర్తికాకుండా లేచి వెళ్ళి చెయ్యి కడుక్కుంది.

ఇంతలో జగన్నాథం చక్కా వొచ్చాడు. జగన్నాథం అమృతం తమ్ముడు; హైదరాబాదులో అయిదో ఫారం చదువుతున్నాడు. జగన్నాథం ఎందులోనూ అమృతం తమ్ముడులా వుండడు. అమృతం నిగులుగా, ఏదో మనో వ్యాధితో వున్నదానిమల్లే వుంటుంది; మొహంలో విషాదం వుంది; నవ్వుతుంటే, రాజ్యవినాశం జరిగినతర్వాత, శిథిలాలని చూసి, వొకప్పుడు మహావైభవం అనుభవించిన రాణీ నవ్వడంలా నిండుగా, బరువుగా, దీనిగా వుంటుంది. జగన్నాథం సన్నగా వుంటాడు; కొంటెగా, పళ్ళన్నీ కనబడేటట్లు నవ్వుతాడు; నవ్వేటప్పుడు కళ్ళు మూసుకుపోతాయి; తల మెడమీద వెనక్కి వాలిపోతుంది-మనుష్యులకేసి చూస్తూ మాట్లాడలేడు; వొకవైపు చూస్తూ, మగాకరితో మాట్లాడుతుంటాడు. యవ్వనంలోని కాంతి దాగుడుమూత లాడుతూ, అప్పుడప్పుడు బుగ్గలలో దర్శనం యిస్తుంటుంది; ఏ దువ్వెన్నకీ లొంగని ఉంగరాలజుట్టు; చాలా ఛలాకీగా వుంటాడు; వొక్కనిమిషం వూరుకోలేడు. దయానిధిని అతను చూడ్డం అదే మొదటిసారి.

'ఏరా జగం. యింత పొద్దుపోయిందేం? దయానిధిబావొచ్చాడు,

చూశావా? వాడి మొహం, వాడే మెరుగును...'అంటూ నరసమ్మగారు, ప్రశ్నలు వేసుగుని, సమాధానం చెప్పుకుంది.

'నరసమ్మగారూ, నేను కాలవలో స్నానం చేసి వొచ్చా-రేపు మీరు కూడా రండి నాతో... ఏమంటోయ్ బావగారు, మా హైదరాబాద్‌లో అచ్చంగా మీలాంటాయన్నే చూశానండి. మీరు టోపీవేస్తే అల్లాగే వుంటారు..

'ఏముట్రా ఆ వెఱ్రివాగుడు... అంది దూరాన్నుంచి అమృతం తమ్ముణ్ణి మందలిస్తూ.

'ఏమేవ్ యిది వెఱ్రియుంగాదు, వాగుడున్ కాదు,-నీకంటే భోజనం చేస్తే, మస్తుగావుంది - నాకు మాంచి ఆకలిమీదుంది కథ. వాగకుండా ఎల్లా వుండనూ-నరసమ్మగారి చేతిమీగి గోంకూర పచ్చడి మనకి భగవాను డిక్కడ రాసి పెట్టేం గదా...అన్నట్లు ఏమంటోయ్ నిధిగారూ, మా మేస్టారు యీ పూళ్ళో కనిపిస్తే బాగుండునండి- రేపు కాలవ స్నానానికి ఆయన్నికూడా లాక్కు- పోదును. మాంచి సుడిగుండం, యిహా తిరిగిరాడు...'

'అందుకేనా నాయనా నన్నూ రమ్మన్నావ్ - మాంచి పిల్లాడివే...'

'పిన్ని వాడితో మీకేమిటి - వాడిట' పిచ్చవాగుడు. 'పిచ్చవాగు డన డానికి వీల్లేదు - అతని పిచ్చిలో ఫక్కీ వుంది, పద్ధతీ, క్రమం వున్నాయి..'

'Well Said దయాళో...మీరు పిచ్చాసుపత్రికి సూపరింట్ గా వుండాల్సినవారు...'

'ఊరుకోరా, వెధవా...' అంది అమృతం.

'మొగాడు వెధవేమిటి? అది కేవలం స్త్రీ లింగం...'

నరసమ్మగారి కడ్డనతో జగన్నాథం కిక్కురు మనకుండా భోజనానికి వుపక్రమించాడు. ఒడ్డన విషయంలో తినేవాడు నరసమ్మగార్నే కనుక్కో-వాల్సి వుంటుందని అనుభవంమీద అతనికి తెలుసు.

నిధికి, మొత్తంమీద తన యింటికిరావడం, అనుకున్నంత భయంగా కనపడలేదు; కొత్తవ్యక్తుల్ని కలుసుగున్నాడు; వాళ్ళ వైచిత్ర్యాలూ, వాళ్ళ

చేష్టలూ, చాలా చిత్రంగా వున్నాయి. బస్తీలలో మనుషులు, యించుమించు అందరూ ఒకలాంటి దుస్తులే ధరించి, వొకలాగే మాట్లాడి, వొకమాదిరిగానే ఆలోచిస్తారు. పారిశ్రామిక నాగరికత, ఉద్యోగంలో పోటీ, అందరి మనస్తత్వాలనీ, నైతిక పద్ధతులనీ, సాఫీచేసి, వొకేలా వుండేట్లు చేస్తుంది. డిమాక్రసీ జనం అంతా, భిన్నమైన అభిరుచులు, ఆశయాలు లేకపోడాన్నే కోరుతుంది. దాని వునికికి అది అవసరం. అంతేకాదు, నిధి పట్నంలో చెప్పుకోతగ్గ స్నేహితులు చేసుకోలేకపొయ్యాడు; జీవితాన్ని పరిశీలించాలన్నవాడు పట్నంలో వెదుక్కోవల్సిన అనుభవాలు ఏమీ లేవేమో ననిపిస్తుంది. పల్లెటూళ్ళల్లో వ్యక్తులు కొంచెం సహజంగావుంటారు; వైవిధ్యం వుంటుంది.

ప్రతి చిన్ని చేష్టా, మామూలు మాటా, కొత్త అర్థాన్ని, కొత్త విలువనీ తెచ్చుకుంటుంది. అల్పవిషయాలన్నీ నూతనంగా తోస్తాయి.

దయానిధి అనుకోకుండా, మంచి రసవత్తరమైన సన్నివేశం మధ్యలో వొచ్చిపడ్డాడు; ఇంట్లో నటీనటులున్నారు; నాటకానికి అవకాశంవుంది; తెరవెనక చూశాడు, వ్యక్తులు వేషాలు ధరించటం. లోలోపల యుద్ధాలు జరుగుతున్నాయి. ఒక బృందం, తన తల్లిని పోషణచేసి, దూషించటం; మరో బృందం తల్లిని వెనక వేసుగుని రావటం; వొకరు ఉద్యోగం, డబ్బు, హోదా, గొప్ప యివి చాలంటున్నారు; మరొకరు వీటినివదలి హాస్యాస్పదంగా నవ్వుతున్నారు; ఇంగ్లీషు విద్యవేరు చెప్పి పైమెట్లమీద కొందరు నిలబడ్డారు; అది లేనివారు మరో లక్షణాన్ని ఆయుధంగా తెచ్చుకుంటున్నారు. పట్నవాసాలనీ, పల్లెలనీ; యంత్రాలనీ, హృదయాలనీ, పారిశ్రామిక నాగరికతనీ,- పాడిపంటతో నిండిన కమ్మని వ్యవసాయానికీ— దేశంలో, - అన్ని దేశాలల్లోనూ, - నిరంతరం జరిగే మహా సంగ్రామం, తను, తన యింట్లో చూస్తున్నాడు; తను ప్రేక్షకుడుగా వుండలేడు. ఇందులో ఏది మంచిదో నిర్ణయించలేం. — అసలీ సమస్యలు తార్కిక బుద్ధితో తీరవు; శరీరంతో తాకి, హృదయంతో అనుభవించి, నాళాలపై

ఋజువు చేసుకోవాలి.

జగన్నాథం భోజనంచేసి చక్కావచ్చాడు. 'నిధిగారూ...'"

'నిధిగా రేమిట్రా. బావగారూ అనలేవు?

'ఓ గూఢచారిణీ, నువ్విక్కడే వున్నావు!... రైటో బావగారూ.. ఐతే అక్కయ్యా, మన వూళ్లో అసలు బావని, యీయన్ని ఎల్లా, వేరే చెయ్యడం,-ఏమనాలో తోచడంలేదు,-విడతియ్యడంలో What a foolish I am, పిలవడంలో తేడా ఎల్లాగంటావు? ఆఫ్ కోర్సు. మా బావగారికి మీసా లున్నాయంటోంది. మీరు వాటికి Good by కొట్టారే! రైటో ఆయన్ని మీసాలు బావా అని పిలుస్తుంటాను...

'నన్ను?' అని అడిగాడు నిధి.

'నైసెన్ మీసాలు బావా..."

'తప్పుగా కోతీ... అంది అమృతం, ఆకులకి సున్నం రాస్తూ.

'కోతీ—What foolish!... అది కరెక్ట్ జగ్గా, నిధిఅందుకున్నాడు.

'జగ్గా—A jug.-The Crow and the jug! దారుణం: పేరు ఖరా యించండి-'నాగ్' అనండి, వొద్దన్నా..."

'రైటో 'నాగ్', అన్నాడు నిధి."

ముగ్గురూ నవ్వుకున్నారు.

'ఎవరేనా పెద్దమనుషు లున్నప్పుడు, సమయానుకూలంగా 'నాగ్ జగ్" అనికూడా అనొచ్చు...ఇంతకీ మీరు కోతినిగురించి చెప్పబోయ్యేది క్లుప్తి ముగించి చెప్పండి..."

'ఏమీ లేదు జగ్గా..."

'మళ్లీ అదే...

'సారీ, నాగ్! మీ అక్కయ్య కోతీ అనడంలో, డార్విన్ శాస్త్రజ్ఞుడు కొన్నేళ్లు పరిశోధనలుచేసి కనుక్కున్న సత్యాన్ని, యిట్టే కనుక్కుంది.

నువ్వు ముందు ముందు చదువుతుంటావు.—

'మనుషుల పూర్వీకులు కోతులు. అంటే కోతినుండే, మొదట మనిషి పుద్భవించాడన్నమాట. ఆ పక్షంలో, నువ్వూ నేను కోతి సంతానం! Whereas మీ అక్కయ్య తోకలేని కోతి సంతానం..."

'మా కెమిస్ట్రీ మేష్టారి పాఠంలా చాలా గందరగోళంగావుంది.' అన్నాడు జగన్నాథం.

'బావగారికి నిద్రొస్తోంది రాత్రంతా రైల్లో నిద్రలేక మరి—మనం పోదాంపద... "అని అమృతం కదిలింది. పసుప్పచ్చ ఖద్దరు చీరని మెడచుట్టూ గుండ్రంగా కప్పుకుని పెదవులను తమలపాకులతో ఎర్రబడ్చుకుంటూ కదిలింది. మళ్ళాడే వెన్న మెడని కౌగలించుకున్న జడా—ఎందుకో పిల్లల తల్లిలా కనిపించింది నాకి. పిల్లలున్నట్లు లేరు. వుంటే కనబడేవారూ!

'లైటార్పోవు మన్నాడే ఇంతకీ చెప్పవల్సినది చేసుకుంటే; యిందాక లాడ్జి సూపరింటెండెంటు గారితో మాట్లాడొచ్చాను. మా మామయ్య పెన్షను సిద్ధం చెయ్యమన్నాడని చెప్పాను. నా రేపు మనమందరం షికారెడుతున్నాము; Excepting— వరసమ్మగారూ...ఆవిడ చుక్కాని దగ్గర పడివుండొచ్చును కోండి - కాని ఆవిడ తుమ్మడం వల్లనైరా. చేసిందంటే బుడుంగ్ మంటుంది పడవ."

షికారేం ఖర్మం. రేపు; పక్నిక్ కెడదాం' మరి. నిద్రపోనా—" అవులించి పక్కకి తిరిగాడు.

'నేను నేరుగా నారయ్య దగ్గరకి పోతున్నాను అతనితో నాకో పేచీ వుందిలెండి—"అంటూ జగన్నాథం వెళ్ళిపొయ్యాడు.

నిద్రనుంచి లేచేటప్పటికి మధ్యాహ్నం మూడుగంటలైంది. సుశీల టీ తీసుకొచ్చింది. జగన్నాథం ఉత్తరాలు తీసుకొచ్చి అలమార్లో పెట్టాడు. ఒకటి దశరథరామయ్యగారు కాంపు నుంచి వ్రాశారు; ఆయన వారంరోజులవరకూ కాంప్ లో వుండాల్సి వొచ్చింది కాబట్టి నారయ్యద్వారా సరిపడ్డ బట్టలిచ్చి

పంపించమన్నారు. మరో వుత్తరం శ్రీనివాసరావు దగ్గరనుంచి. శ్రీనివాసరావు, నిధి యింటర్ మీడియట్ కలిసి చదివారు; హాస్టల్లో వొక రూములోనే వుండేవారు. వాళ్ల నాన్న డిస్ట్రిక్టు మెడికల్ ఆఫీసర్; అతన్ని అందరూ సీనూ అని పిలిచేవారు. ఇంటి పేర్లో ఆర్ అనే అక్షరం వుండేది. అంచేత రొమాంటిక్ సీనూ అని అనుకుంటూ అందర్నీ అల్లా పిలవమని చంపుకు తినేవాడు. మనిషెప్పుడూ నీరసంగా కనబడేవాడు. ఎప్పుడూ కీళ్ళనొప్పులంటూ కాలేజీ ఎగేసి, గదిలో పడుకుని డిటెక్టివు నావల్సు చదువుకుంటూ గడిపేవాడు. వేళాకోళంగా అతన్ని రిమాటిక్ సీనూ అంటూ పిలిచి ఏడిపిస్తుండేవారు స్నేహితులందరూ. ఇప్పుడు ఆయుర్వేదంలో చేరాడు. శెలవలకి ఆవూరు మీదుగా ఏదో సంబంధం చూడ్డానికి వెళ్ళాల్సిన అగత్యం వుంది; కాబట్టి అతన్ని కలుసుకుని ఒకపూట కాలక్షేపం చేద్దామని వుంది కాబట్టి నిధిని తను ఆ వూళ్ళో వుండేదీ లేందీ వెంటనే తెలియ బర్చమని అతనికి అభ్యంతరం లేకపోతే వొస్తానని వ్రాశాడు. చివరలో తల్లిపోయినందుకు కండొలెన్సెస్ స్వీకరించమని కోరుతూ ఉత్తరం ముగించాడు.

దయానిధి లేచి వెళ్లి మొహం కడుక్కుని, తల కాయ దువ్వుకుని బట్టలేసుకున్నాడు. సుశీల చీరమార్చి, రిబ్బన్లు తీసేసి వొదులుగా జడేసుకుని చక్కా వచ్చింది. నిధి హోల్డాల్ విప్పి, మాసిన బట్టలన్నీ మూటకట్టి దూరంగా వేశాడు. తరవాత ట్రంకుతీసి వొక్కటొక్కటీ సామానులు తీసి చాపమీద సర్దుతున్నాడు. అరడజను పుస్తకాలు రెండు పాకేజీలు (వొకటి పెద్దది, వొకటి చిన్నది) లెటర్ కేస్ మంచంమీద పెట్టాడు

'ఇవన్నీ ఏమిటి కాలేజీ టెక్స్టుబుక్కులా? అంటూ సుశీల పుస్తకాలని పరిశీలించడం మొదలెట్టింది

'నాకోసం ఏం తెచ్చావ్ పట్నంనుంచి డాక్టరు' అంది. దయానిధికి సుశీల అక్కడనుంచి వెళ్లిపోతే బాగుండు ననిపించింది.

సుశీలా; కొంచం దొడ్లో నారయ్య వున్నాడేమో చూసిరమ్మా...

'లేదు బావా, నారయ్యా తమ్ముడూ బీడుమామిడి తోట్లోకి వెళతా మని వెళ్ళారు. ఇంకా వొచ్చినట్టు లేరు...'

అని పక్క గదిలోంచి అమృతం అంది. మంచివాళ్ళు, తమకి తెలీకుండా హానిచేస్తారు, అనుకున్నాడు నిధి. ఎట్లా సుశీలను అవతలకి పంపడం?

'నువ్వు టీ తాగుతావా కాఫీయా సుశీలా?' అన్నాడు.

'నాకా పట్టింపులు లేవు-రెండునూ, ఏం? ఎందుకు?'

'ఏమీలేదు. సాయంత్రంకూడా వొక్కసారేనా కాఫీ తాగకపోతే ఎట్లాగో వుంటుంది. కొంచెం కాఫీ యిచ్చావంటే నీకు సర్వదా కృతజ్ఞుడను.' అన్నాడు.

'ఇప్పుడేగా టీ తాగాం—'

'నే పెడుతున్నా బావా—' అంటూ లోపల్నించి అమృతం అంది.

కాఫీ సామాను, కుంపటి చప్పుడు వినపడుతోంది. మిడ్ వైఫరీ మాన్యుయల్ తీసి సుశీల చూడడం మొదలెట్టింది.

'ఛీ, ఛీ యివేం బొమ్మలు - పాడు...' అని, సిగ్గొచ్చినట్టుగా చేసింది,

'నీకెందుకు సుశీలా, అవన్నీ మా టెక్స్ట్ బుక్స్.'

'నేను డాక్టరీకి మాత్రం చదవను...' అని ఖచ్చితంగా అంది.

'అట్లాగైతే భారతదేశం అధిక జనసంఖ్య తగ్గే ఆశలు మంటకలిసినై' అని అతనే నవ్వుకున్నాడు.

'మా నాన్ డిటెక్టివ్, రాబిన్ సన్ క్రూసో...' అంది గర్వంగా.

'మా బావా ఎంతమంచి పుస్తకమో. డాక్టర్ల బాధపడ్లేకే రాబిన్ సన్ క్రూసో ఏకాంతంలోకి పారిపొయ్యాడు...నరసమ్మత్తయ్య లేచిందేమో... చూడు."

'ఆ పాకేజీ లేమిటి? నాకోసం ఏం తెచ్చావ్ డాక్టర్..."

'ఇవా? యివి మందులు!"

'ఏం మంచితో చూడనియ్యావు, డాక్టర్.'.

'సుశీలా, నువ్వు నన్ను డాక్టర్ అనిపిలవడం బొత్తిగా బాగుండ లేదు. ఇంకా నేను డాక్టర్ని కాలేదు. రెండేళ్ళకి, వొక్క పేషంట్లకే నేను డాక్టర్ని అవుతాను కాని, అందరికీ కాను. పైగా నువ్వు పిలుస్తుంటే ఎట్లాగో వుంటుంది కూడాను...'

అంటూ ఆమెకేసి, ఎగాదిగా తేరిపారి చూశాడు. కనుబొమ్మలు చిట్లించాడు.

'డాక్టరని పిలిచినందుకు Excuse me డాక్టర్' నాలిక కొరుక్కుంది.

'అదే అలవాటై పోయింది. పైగా అట్లా పిలిస్తే నువ్వు సంతోషిస్తావను కున్నాను.' అంది సుశీల

'కాదు. నేను సంతోషించనని నీకు తెలుసు. అది నువ్వు సమాధాన పరుచుకునేందుకు నువ్వు సృష్టించుకున్న కారణం. నన్ను బాధ పెట్టడం నీకు సరదా... నీకు మొత్తం డాక్టర్లమీద వున్న కోపం అంతా నామీద చూపిస్తున్నావు...'

'నాకు డాక్టర్లమీద కోపమెందుకు? నువ్వు చిత్రంగా మాట్లాడుతున్నావు - నిన్ను ఫ్రెండ్ చేశానా?' అంది.

'ఇదివరకే ఫ్రెండ్లై వున్నవాళ్ళని కొత్తగా ఫ్రెండ్ చెయ్యలేం - నిజం చెబితే నువ్వే బాధపడతావు. నిన్ను బాధ పెట్టడం నాకిష్టంలేదు. నాకు చేతకాదు...'

'నేనేమీ అనుకోను. చెప్పు నిజం. నాకు డాక్టర్లంటే ఎందుకిష్టంలేదు చెప్పకపోతే నాకు రాత్రంతా నిద్రపట్టదు...' అంది.

'ఊరకే అన్నాను సుశీలా,—తమాషాకి. ఆమాత్రం వూహించలేవేం?'

'చెప్పితీరాలి - నువ్వు మాట మరిపించేస్తున్నావ్. నిన్ను ఫ్రెండ్ చేశాను. ఎందుకో చెడితే ముందు జాగ్రత్తగా వుంటారు. ఏదో మీ అమ్మ వుందని, మామయ్య వొంటిగా వుంటాడని, యిక్కడే కొచ్చాంగాని'

నీకు మనస్సులో ఏవో బాధలున్నాయంటే మావల్ల, నేను వెళ్ళిపోతాను'
అని సుశీల తలకాయ వొంచుకుంది.

'నిజం, సుశీలా. నువ్వు అల్లా అనుకోవొద్దు. మీరందరూ యిక్కడికి రావడంవల్ల నా కెంతో సంతోషంగావుంది. మీరు లేకపోతే చాలా దిగులు పడిపోదును.—ఏమీలేదు, నువ్వు కట్టుకున్న చీరలాంటిది మా అమ్మకి వుండేది. అది జ్ఞాపకం వొచ్చింది. అంతే' అన్నాడు.

'ఈ చీర మీ అమ్మదే. అమ్మ, కట్టుకుచూడవే, నీకెంతో బాగుంటుం దని చంపుకుతింటే కట్టుకున్నాను...ఇప్పేస్తానుండు...'

'నాముందే, ఖర్మ...!"

సుశీల వెళ్ళింది. బ్రతికానురా దేముడా అనుకుని, చిన్న పాకేజీ పొట్లం కోటుజేబులో దాచేసి, మిగతావి ట్రంక్‌లో సర్దడం మొదలెట్టాడు. ఇంతలో కాఫీ తీసుకుని అమృతం చక్కా వొచ్చింది.

'పట్నంనుంచి బావ ఏవో చాలా తీసుకొచ్చాడే!'

నాకేం తెచ్చావు బావా అని అడుగుతుందేమోనని భయపడ్డాడు.

'బావా; నువ్వు పట్నం మళ్ళా వెళ్ళేటప్పుడు మాపూళ్లో సిగావంటే, నీకు యిల్లాంటి పాకేజీలిస్తాను. తీసుకెళ్ళాలి కాని- అంది' అమృతం

'ఏమిస్తావ్?'

'సొజ్జప్పాలు,—మాకు మంచి పూతరేకు లొస్తాయి-అక్క; కజ్జికాయ లు...'

'...కజ్జికాయలు మనమూ తింటాం...' అంటూ చక్కా వొచ్చాడు జగన్నాథం.

'నీకోసం యిక్కడేం సిద్ధంగాలేవు...'

'ఇవన్నీ ఏమిటంటావోయ్—' అంటూ జగన్నాథం పుస్తకాలను పరా మర్శచేసి, సొంతపెట్టిలా, పెట్టి కెలకడం మొదలెట్టాడు.

'తప్పురా,-అవన్నీ అల్లావుంచు...'

'ఇదేమిటండోయ్...' పాకేజీ కాగితం తొలిగించి అట్టపెట్టి బైటకి లాగాడు. సుశీల చీరమార్చి చక్కావొచ్చింది. ఏదీనన్ను చూడనీ మని ఆ పెట్టి లాక్కుంది. జగన్నాథం మళ్ళా లాక్కుని హాల్లోకి పరిగెట్టాడు. సుశీల తరుముకుంటూ వెళ్ళింది.

అమృతం గుమ్మంలో కొచ్చి నారయ్యని కేకేసింది.

'నారయ్యా వాణ్ణి యిల్లాలాక్కురా. ఆపెట్టి పుచ్చుగుని చక్కా పోతున్నాడు.'

నారయ్య తువ్వాలు నడుంకి బిగించాడు.

'ఈ అబ్బాయిగారి పని మా యిదిగా వుందండి-కోతల్లరి-' అంటూ అరుగుమీద కొంత పెనుగులాట జరిగింతర్వాత ఆ పెట్టిని సుశీల తీసికొచ్చింది.

'అదేమిటో చెప్పేస్తా, నా కేమిస్తావు?', అన్నాడు జగన్నాథం.

'నువ్వెందుకయ్యా పెద్దాళ్ళల్లో కెగబడతావు?' అని కసురుకుని నారయ్య దొడ్లో కెళ్ళాడు. కూకలేసి, అదమాయించేటందుకు, నేటికోవ్యక్తి గొరికాడు గదా అని లోపల నారయ్యకి పరమానందం.

'కెమేరా?'

'ఆఁ కెమెరా.'

'అంటే-ఫొటోగ్రాపులు తీశేదా?' అంది అమృతం.

"నిన్నీ, నాఫొటో తియ్యావ్?" అంది సుశీల.

"మనుషులూ పడతారా?"

'ఒక్క మనుషులేకాదు, ఆకస్మిక ఛాయాచిత్రం, అనగా Snapshot కూడా, రాత్రింబవళ్ళు యిక్కడ తియ్యబడును. సరసమైనరేట్లు' అని పూర్తి చేశాడు జగన్నాథం.

"ఏదీ నన్నుతీ..."అని చేతులు కట్టేసుకుని, మూతి బిగించి నిలబడ్డాడు.

'ఊ-బాగున్నావులే, కోతిలా' అంది అమృతం.

'నేను భవదీయ సోదరుండని మరువకుమీ మరువకుమా...ఈ మహద్భ

తెలుగు దంచేస్తున్నానండి బావగారు; క్లాసులో నా పేపరు అస్కంకాక మా మాష్టారు ఫస్టు మార్కు యిచ్చేసి పూరుకుంటున్నారు...ఈ పూటకి ఫొటోలు తీయుట ఆపు జెయ్యడమైంది. రేపు పిక్నిక్‌లో, మంచి దుస్తులతో, సెంటు, పౌడర్లు వగైరాలతో వచ్చిన వారందరికీ వుచితముగా ఫొటోలు తీసి, వారి వారి ముక్కులకే తగల్చబడును—ఏమంటారు బావగారు..."

"ఐతే నిధీ ఎవర్ని తియ్యాలని?" అంది సుశీల.

'What a foolish'...!

"ఎవర్ని?"

'What a foolsh! నన్నే..."

"మనమందరం రేపుతీయించుకుందాం. లాకుల్ దగ్గర నాచురల్ సీనెరీ వుంటుంది. ఏం, జగ్గు" అన్నాడు నిధి.

"మిమ్మల్ని మీరు సరిచేసుకోండి. నో జగ్ Call meనాథ్."

"రేపు తీయించుకుందాం. మరి యీ పూట నువ్వు, నారయ్యా వెళ్ళి రేపటికి తెడ్లు, తాడు- అన్నీ ఏర్పాటుచేసి, [illegible]టందుకు మనుష్యుల్ని మాట్లాడండి."

"రైటో, కాని నారయ్యకీ నాకూ మాటల్లేవు."

"నేను మీ యిద్దరికీ రాజీ చేస్తాగా..."నారయ్యతో బైట కొంత ప్రసంగంచేసి చక్కా వొచ్చాడు నిధి.

నారయ్య ప్రశాంతాన్ని కొంతవరకూ జగన్నాథం భంగం చేశాడనే చెప్పాలి.

ఏవో కొత్తరకం మొక్కల్ని నారయ్య దొడ్లో పాతాడు; ఒకర్ర పుచ్చుగుని, వొ దానిమ్మపండుని తీసుకుని, పండుని ఆకర్రతో కొడుతూ, దొడ్డంతా జగన్నాథం తిరగడం అప్పటికి రెండుసార్లు జరిగింది. మొదటి సారి చూసి నారయ్య పూహకున్నాడు ఏదో కుర్రాయనగండానని. రెండో సారి అడేమిటనడిగాడు. అది Home Golf అనే ఆటట. మాట దక్క

దన్నాడు నారయ్య. ఆ ముక్కల్ని ధ్వంసం చెయ్యడానికే తన అవతారం ఎత్తినట్లు ప్రవర్తించడం చూసి నారయ్యకి వొళ్ళు మండిపోయి ఆ కర్రని విరిచి అవతల పారేశాడు. గొయ్యితీసి అందులో దానిమ్మకాయని పూడ్చాడు.

జగన్నాథం మళ్ళా అవాళ ప్రొద్దున్న జీడిమామిడి కాయని తీసుకుని సిద్ధమయ్యాడు. ఆ జీడిమామిడికాయలు కొయ్యడానికి తనూ జాగ్రత్తవహించాడు, కనక రాజీకి నారయ్య వొప్పుకున్నాడు ఇద్దరూ లాకులదగ్గర కెళ్ళారు.

దయానిధి లోపలి కొచ్చేటప్పటికి సుశీల మంచంమీద మడిచిపెట్టిన కోటుని తొడుక్కు చూసుకుంటోంది.

"చూస్తున్నావా బావా, వొద్దంటుంటే ఆ కోటుని నలిపి పాడు చేస్తోంది..." అంది అమృతం

"నాకు సరిపోయింది చూశావా, నిధీ నేను నీఅంత లావు వున్నానన్న మాట." అంది సుశీల ఎగాదిగా చూసుకుంటూ. ఆ కోటు సుశీల మోకాళ్ళ దాకా వొచ్చింది. ఆ కుడివెంపున ఆ ఎత్తేమిటంటూ అమృతం విరగబడి నవ్వుతోంది. విరగబడి నవ్వినప్పుడు పళ్ళు అంత బాగుంటాయని తనకి తెలీదు.

'ఎందుకా నవ్వు? నీ కేమన్నా ఫాషన్స్ తెలుస్తా, పాడా? నార్త్ ఇండియాలో వింటర్లో లేడీసందరూ కోట్లేసుకుంటారు. ఒసే అమ్మలూ, మీ ఆయనెప్పుడేనా కోటేసు గుంటాడే..." అంది వెక్కిరిస్తూ సుశీల.

"ఆ ప్రశ్న అడిగించుకునే అర్హత నీకు లేదు కదా? కోటుకోసం పెండ్లి చేసుకుంటుంది కాబోలు పెళ్ళి, బావోయ్..." అంది అమృతం.

"అదుగో మళ్ళా నా పెళ్ళిమాట ఎందుకెత్తుతావ్? ఆ నవ్వేమిటి? పిచ్చెక్కిందా!"

సుశీల మళ్ళా చూసుకుంది; మధ్య బొత్తాం పెట్టడంవల్ల కుడివెంపున ఏర్పడ్డ ఎత్తునిచూసి నాలిక కొరుక్కుని, గోడవైపుకి తిరిగి కోటువిప్పి, జేబులోంచి చిన్న పాకేజీ తీసింది. అమృతం కిందికి జారిపోయిన పమిటకొంగును

సరిగా స్తుంది సుశీల. చేతులోంచి తటాలున నిధి పాకేజీని లాక్కున్నాడు. అదేమిటో చూపించమని అతన్ని యిద్దరూ చంపుకుతిన్నారు.

"నన్నడక్కండి-ఇది మీకు అనవసరం" అన్నాడు.

"దాన్ని మా కివ్వనక్కర్లేదు—అదేమిటో చెప్తే చాలు" అన్నారు.

రహస్యాలంటే స్త్రీలకి గిట్టదు. స్త్రీ హృదయం వొక రహస్య మందిరం. దాన్ని పురుషుడు తెలుసుకోనంతకాలమూ స్త్రీ పురుష వ్యత్యాసా లుండా ల్సిందే అనుకునే సనాతనులు భ్రమపడుతున్నారు. ఆరహస్యం అంతా ఊహకి దాసులైన సౌందర్య పిపాసులు కల్పించేదే, కాని వారిలో ఏ రహస్యం లేకపోవడం సరిగదా సృష్టిలో వారి కష్టంకాని రహస్యాలతో అసలు మాన వునికే నిమిత్తం లేదన్నట్లుగా స్త్రీలు ప్రవర్తిస్తూంటారు. గుప్పెట్లో గాలిని దాచి 'ఇదేమిటో చెప్పకో' అంటే పురుషుడు 'కొంత వ్యవధినివ్వండి ఆలో చించిచెబుతాను' అంటాడు. స్త్రీ గుప్పెటని రక్కేసి వేళ్ళని బలవంతంగా లాగి తీరా చూసి 'ఓస్ యింతే, నాకక్కర్లేదు" పొమ్మంటుంది.

ప్రపంచం పురుషుడికి చెందుతుంది - దాన్ని శోధించి అర్థం చేసు కోవాలి, కాని ఏం లాభం? పురుషుడు స్త్రీకి చెందుతాడు, అందుకే ప్రపంచ రహస్యంతో స్త్రీ కేం నిమిత్తం? వీళ్ళు వొదలేటట్లు లేరనుకున్నాడు నిధి.

"ఇది;—పోకమందు..."

"ఆమాత్రం దానికి యింత దాపరికం ఎందుకు?" అంది సుశీల.

'నేనేం దాచలేదు అందులో సీసాలు బ్రద్దలౌతాయేమోనని నా భయం' అన్నాడు.

'కొంపతీసి పొటాసియమ్ సైనైడా?"

'అంటే?'

'అదో విషం-తాగితే హాయిగా బాధ లేకుండా చచ్చిపోవొచ్చు,' అంది సుశీల.

'అబ్బే-యిది విషం కాదు Artificial gold చేసేందుకు యిదో

ద్రావకం...

'ఏదీ వాళ్ళేఁ?'

ఒద్దు, ఒద్దు వెలుగులో దీన్ని ప్రైటెక్తేస్తే దీని పటుత్వం తగ్గిపోతుంది, అంటూ నిఫ కోటు వేసుకుని అరుగుపూదికి నడిచాడు.

ఎదురుకుండా వొచ్చింది జోగప్పనాయుడిగారి కూతురు నాగుమణి. జోగప్పనాయుడుగారు కంట్రాక్టులుచేసి బోలెడు డబ్బు గడించాడు; పెద్ద కొడుకు ఇంగ్లండు వెళ్ళాడు ఎందుకో ఎవ్వళ్ళకీ తెలీదు; పెద్దపిల్ల మొగుడుకి బొంబాయిలోపని. నాగుమణి రెండోకూతురు డబ్బు గడించడం యిల్లుకట్టడం గొడవల్లోపడి సరిగా కూతురు విషయం కనుక్కోక పోవడం వల్ల స్కూల్ ఫైనల్ మూడుసార్లు ఫేలవడం జరిగిందనీ, ఉత్తుత్తై పరీక్షలు ప్యాసుచేయించడం తన సంకల్పం ఐతే యీ పాటికో పదవేలు తగలేసి బి ఏ కూడా ప్యాస్ చేయించి వుండుననీ, అప్పుడప్పుడు వాపోతో వుంటాడు. ఆ కారణాలవల్లనే వివాహంకూడా చెయ్యలేదంటాడు. ఉద్యోగంలేక పొట్టకూటికి అమ్ముడుపొయ్యే అల్లుళ్ళు దేశంలో అంతమంది వుంటుండగా తనకూతురు వివాహం విషయంలో ఆంధ్రదేశంలో ఎవరూ బెంగపడక్కర్లేదని క్లబ్బులో పైజేస్తు గెలిచిన హుషార్లో అనేసినా లోలోపల పెళ్ళికానందుకు కొంత చింతపడుతున్నట్లు క్లబ్బు స్నేహితులకి కూడా తెలుసు. గుమాస్తా కూర్మయ్య జోగయ్య నాయుడు కొత్తగా కట్టినయిల్లు కామాక్షికోసమే అంటుంటాడు. కాని అతను కుటుంబ సమేతుడై అందులోనే కాపరం వుండటంవల్ల ఆ పుకార్లో యధార్థం ఎంతవరకూ వుందో గట్టిగా నిర్ణయించిన వాళ్ళులేరు. కూర్మయ్య తన వాదం మాత్రం మానడు. ఆ మనిషి ఎట్లాంటి వాడైందీ ఆయన కట్టించిన మేడే చెబుతుంది. అంటాడు కాని యిదంతా యజమాని మీద నౌకర్‌కుండే యీర్ష్య, కసే, కింద కట్టేసి ఆ వాదాన్ని ఎవరూ బల పర్చటంలేదు. ఈమధ్య కూర్మయ్య సందడినాలుక మరోకొత్త పుకార్ లేవదీసింది. జోగప్పనాయుడి గారికి బ్రాహ్మణ కుర్రాణ్ణి అల్లుడుగా తెచ్చుకో

వాలని వుందనీ అందుకే దశరథరామయ్యగారు రబ్బాయితో అంత స్నేహంగా వుంటున్నాడనీ, యీపుకారు సారాంశం. దశరథరామయ్యగారితో వియ్యం పొందాలన్న కామాక్షి సంకల్పాన్ని మెచ్చుకుని, నాయుడిగారి ఆశలు, అంతటితో అడుగంటుతాయి కదా అన్న ధైర్యంతో కూర్మయ్య నిశ్చింతగా వుంటున్నాడు. ఈ విషయమై లోగడ యిద్దరి వ్యాపారులతో స్వల్ప పందాలు కూడా వేశాడట. నాగమణి స్కూల్ ఫైనల్ పరీక్షలకి కట్టేపడబ్బుతో విశ్వవిద్యాలయం అభివృద్ధి చెంది తీరుతుందని కూర్మయ్య కసిగా అంటాడు గాని అల్లాజరిగే చిహ్నాలేవీ లేవు. నాగమణి చదువు చాలించుకుంది.

గిట్టని కూర్మయ్యలాంటి వాళ్లు నాగమణిది పోసకారు తనం అంటారుకాని, అది ఆ అమ్మాయికి అన్యాయం చెయ్యడం. నాగమణి చాలా పొడగరి—శరీరానికి తగినట్లుగా వుండే, పొడుగాటి కోల మొహం; ముల క్కాడల్లా వేల్లాడే సన్నటి పొడుగాటి చేతులు. చెవులని కప్పేసి, సంపల నావరించుకుని వొత్తుగావుండే జుట్టు—పల్చటి పట్టుచీర, అందులోంచి కని పించే లేస్‌తో కుట్టిన పరికిణీఅంచు; కూర్మయ్య అన్నట్లు "ఆ రవ్వల దుద్దులు తీసేసి నుంచోమనండి, అందం పైటపడుతుంది"—అల్లాగైతే ఎల్లా వుంటుందో తెలీదుకాని, ధగధగ మెరిసిపోయ్యే రాళ్ళదుద్దులు, చిక్కటి జుట్టులోంచి, శ్మశానంలో అర్ధరాత్రి మంటలా వెలిగి పోతుంటాయి. కొండ శిఖరాలమధ్య అస్తమించబోయ్యే సూర్యుడిలాంటి ఎర్రబొట్టు, - నాగమణిని కళైన మొహం కాకపోతే, కూర్మయ్యలోటిగాళ్ళు, చక్కదనం లేదని ఋజువుచేసే, అవసరమేరాదు.

నిశినిమాసి నమస్కారం పెట్టింది.

'మీరు ప్రొద్దున్న రావడం చూశాను—' సుశీలని, వృత్తాన్ని చూసి నిలిచిపోయింది.

'మాయిల్లు చూడ్డానికి రారు?"

'రేపు తప్పకుండా వొస్తాను...'

'రేపు మధ్యాహ్నం పిక్‌నిక్‌కి నువ్వుకూడా తప్పకుండా రావా—' అంది సుశీల.

'మీరొచ్చి మానాన్నగారితో చెప్పకూడదమ్మా...అవసరం లేదనుకోండి...'

'ఓ అల్లాగే...'

'అవును మరి - పెళ్ళికానిపిల్ల పరాయివాళ్ళతో షికార్లు చెయ్యడం ఏమంత బాగుంటుంది?' అంది అమృతం.

'మహా చెప్పొచ్చావ్ లెద్దూ. నాగుమణి చదువుకున్నది—నీలా పల్లెటూరిరకం కాదు.'

'ఎంత చదువుకున్నా, మనంవున్నది పల్లెటూరు కాని మహాపట్నం కాదుకదా...నలుగురికీ మనం భయపడాలి...మీ నాన్న పెద్ద వుద్యోగస్తుడు గనక, నీకు పెళ్ళికాకుండా, ఎన్నాళ్ళాడి...'

'అదే వొద్దన్నది. నాపెళ్ళి జోలెత్తకు. నీకు సరదాలేదు; ఉంకోళ్ళు సరదాగా వుంటడం నీకు గిట్టదు. రా, నాగుమణీ, అమ్ములు మాట్లకేమిటి?'

'మనం యీ విషయం, వీధులో కాకుండా, యింట్లో తర్కించుకుంటే బాగుంటుందేమో' అన్నాడు నిక్.

'మరి నే అల్లా వెళ్ళిరానా?...'

'ఎక్కడికి?' అని అడిగింది సుశీల.

'ఎక్కడికైతే నీకెందుకు, మొగాడు తన యిష్టంవొచ్చిన చోటికి...' అమ్ములు వాక్యం పూర్తికాకుండానే సుశీల మొదలెట్టింది.

'నీ కెందుకు నిన్నెవరూ అడగలేదు.'

'ఎక్కడి కేమిటి? క్లబ్బుకి...'

గుమ్మందాటి హాల్లోకెడుతూ నాగుమణి నెమ్మదిగా అంది. 'ఎక్కడికీ- కోమలి యింటికి—'

సుశీల కళ్ళజోడు తీసి కొంగుతో తుడుచుకుంది. అమృతం ఆశ్చర్యంతో.

కళ్లు పెద్దవి చేసుకుని, రెండుసార్లు రెప్పలు కదుపుకుని యింట్లో కెళ్ళింది.

దయానిధి నవ్వుకుంటూ నడిచిపోయ్యాడు. నాగమణి ఎట్లా కనుక్కుందా అని ఆశ్చర్య పడ్డాడు. మనుష్యుల్ని మనుష్యులు అర్థంచేసుకోలేరేమో అనుకునేవాడు. భార్య, భర్త పదేళ్ళు కలిసి కాపరంచేసినా, వొకర్ని వొకరు ఎంతవరకూ అర్థంచేసు కుంటారు? తండ్రి కొడుకుని అర్థంచేసుకో గలడా? అందాకా ఎందుకు? తనకి తనే అర్థమయ్యాడా? నిద్రపోయిలేచి అద్దంలో మొహం చూసుకున్నప్పుడు ఎవరోనని భయపడడం ఎన్నిసార్లు జరగలేదు! స్వప్నంలో తనని తనుచూసుకుని ఎంత ఆశ్చర్య పడ్డాడు! స్వప్నంలో క్రూర మృగాలతో భీకరయుద్ధం; స్త్రీలతో లాలన; సంఘంలో చీకటి శక్తులతో పోరాటం—వీటిలో ఎన్నింటిని తన నిత్య జీవితంలో కనపర్చగల్గుతున్నాడు? నిజంగా ఎవరూ, ఎవరికీ అర్థంకారు. మనిషి మనిషికీ మధ్య గోడలు లేచి వున్నాయి. అవతల్నించి మనం మాట్లాడే మాట్లు వింటారు; మన చేష్టల్ని చూస్తారు. 'ఆ మాటలు మాట్లాడిన వ్యక్తి, ఆ సమయంలో అట్లాగ చేస్తాడు.' అని సంఘం నిర్ణయించుకుని వాణ్ణి తక్కెట్లో తూచి, బరువు కట్టేసి, వాడితో నిమిత్తం వొదులు కుంటుంది. నూటికి తొంభైతొమ్మిదిమార్లు, వాళ్ళు అనుకొన్నట్టుగానే ఆ మనిషి ప్రవర్తిస్తూ వుంటాడు. సంఘంకట్టిన విలువ సరైనదని ఋజువై పోతుంది. అందుకనే తన నియమాల్ని అందరూ పాటించేటట్లు చేసుకునే బలం సంఘానికివుంది. అందుచేతనే సంఘం అంటే అమృతంలాంటి వాళ్లకి అంతభయం.

మనిషికీ మనిషికీ మధ్యలోనే కాదు గోడలుండటం, ప్రతిమనిషి లోనూ వొక తెరవుంటుంది. ఆ తెర వూడిపోకుండా 'సంఘం' కాపలా కాస్తుంటుంది. పగటిపూట, మామూలు సమయాలలో విస్త్రీ మపేతలా ఆ తెర బాగానే వుంటుంది. కాని రాత్రి ఎప్పుడో, మండువేసంగి రాత్రి మైమరచి నిద్రపోతుంటే వాన చినుకులు పడినప్పుడో, కీకట్లు అనంతాన్ని పెల్లగించుకుని ఆత్మని ఆవరించుకున్నప్పుడో, ప్రాచీనశక్తులు వేడిరక్తంలో

కాలిపోయి వుండలేక శరీరాన్ని బ్రద్దలు చేసినప్పుడో, - ఎప్పుడో, ఎందుకో, ఆ తెరవూడి పోతుంది.

పిచ్చాస్పత్రులలో వున్నవాళ్ళందరూ, యీ 'తెరలు' వూడిపోయిన వాళ్ళూను; కొంచం చిరిగిపోయిన వాళ్ళూను.

ఆరోజు ఎన్ని అబద్ధాలాడాడు. ఎంతగుట్టు, ఎంతదాపరికం. ఎంతటి కుట్ర! ఎవర్నో ఖూనీ చెయ్యడానికి సంకల్పించుకున్నట్లు! ప్రేమలో సత్యం వుందని అతను నమ్మలేక పోతున్నాడు. ఆ పవిత్రమైన వస్తువు అతనిచేత అబద్ధా లాడిస్తోంది; కుటిలత్వం నేర్పింది; సుశీల, అమృతంలాంటి వాళ్ళకి భయపడాల్సి వొచ్చింది. పురుషుడి కృత్రిమ మనస్తత్వాలని ఛేదించి సాక్షీ చెయ్యడానికి మరింత 'కృత్రిమం' స్త్రీకి 'సృష్టి' ప్రసాదించింది. అది ప్రేమ కాదేమో! పాపం, ప్రేమని ఎందుకు నిందించటం. ఇతరుల మనస్తత్వాలను తెలుసుకోడంలో మనం చూపించే శ్రద్ధ, ఓర్పు, తెలివి, మనల్ని మనం తెలుసుకోడంలో వుపయోగిస్తే ఎంత బాగుండును. లేక ఏదో శక్తిని సంపాదించుకోటం కోసం, వున్న నాలుగూ శక్తుల్నీ దుర్వినియోగంచేసి, చంపుకునేటట్లు, సంసుం తొక్కిడు చేస్తుంది.

అదుగో క్లబ్బు.

దయానిధి క్లబ్బులో పత్రికలు తిరగవేస్తూ అరగంటసేపు గడిపాడు. కబుర్లు చెప్పడానికి జోగప్పనాయుడుగారు లేరు. అధమం కూర్మయ్య కూడా లేడు. ఓమూల, సుబ్బారావు పరీక్షపోయి సందుకు ఎవరు పరామర్శకొస్తారో నని భయపడుతూ, "తోడా" స్త్రీల బొమ్మలుచూస్తూ, కీక్లీ ఆఫ్ ఇండియా వెనక దాక్కున్నాడు. కోటయ్యగారు, తన బృందంతో కసిగా చీట్లాడుతున్నాడు. ప్రపంచంతో నిమిత్తం లేనట్లుగావో ముసిలాయన స్తంభానికి జేర్లబడి, అనంతాన్ని చుట్టపొగలోంచి తిలకిస్తున్నాడు.

మోడరన్ రివ్యూ తీశాడు. అది నాలుగు నెలల క్రితంది - అది లైబ్రరీ మూమెంట్ లేవదీస్తూ విశ్వనాథంగారు గంభీరోపన్యాసం యిచ్చిన వారంలో

తెప్పించిన తాలూకు, అద్దాలూడి పోయిన బీరువాలో, ఏ నాగరికతకి చెందినవో కొన్ని పుస్తకాలున్నాయి. ఒకటి రెండు బైటకి తీసి చూశాడు - పురుగుల అస్థి పంజరాలూడి పడ్డాయి. పుటలు తిప్పేటప్పటికే, టపటపమని వూడిపోతూ, పొడుమై పోవడానికి సిద్ధపడుతున్న పుస్తకాన్ని హత్య చెయ్యడానికి యిష్టంలేక, దాన్ని, దాని స్థానంలో వుంచేశాడు. గోడమీద యివ్వవల్సిన రోజుకి పుస్తకాలు యివ్వని వాళ్ళపేళ్ళ జాబితా తగిలించారు. అందులో మొదటిపేరు గోవర్ధనరావుగారిది. పాపం ఆయన చనిపోయి ఎనిమిది మాసాలైంది.

మళ్లా దినపత్రికలున్న బల్లదగ్గరకొచ్చి కూర్చున్నాడు. పత్రికలలో విశేషాలేమీ లేవు. కాంగ్రెస్ ప్రెసిడెంట్ హజారాస్టేషన్‌లో దిగినప్పుడు, అమృతలాల్‌గారు, భూలాభాయి దేశాయి తుమ్మినట్లు, అన్సారీగారు ముక్కు పొడుం పీల్చమన్నట్లూ, స్వకీయ విలేఖరి తెలియచేస్తూ, ఆ తుమ్ము, జరుగుతున్న సంప్రదింపులు బాగా సాగటంలేదని సూచించడమేనోనని కొందరు పైవాళ్లు అనుకుంటున్నారనీ వ్రాశాడు. "భావల్ సన్యాసీ" అప్పీల్ చదువుదామనుకుంటే, కాగితంలో సగం భాగాన్ని ఎవరో చించేసి, చెవులో తిరెట్టుగున్నారు. సుబ్బారావు గబగబావెళ్లి బీరువాపైన వున్న పీక్లీల కట్టతీసి, దులిపి, మళ్ళా చదవడం మొదలెట్టాడు.

దూరంగా స్కూలు పిల్లలు ఆడుతున్న బంతాట ముగిసింది. చీకటి కోసం కాచుకున్న దొంగలా చీకటి తూర్పున మెదుల్తోంది. పొగచూరిన చిమ్నీతుడిచి క్లబ్బునౌకర్రాడు దీపం వెలిగించాడు. క్లబ్బు నౌకర్రాడు తన విధి నెరవేర్చాడు కాని దీపం ఎందుకూ వుపయోగం లేదు. సుబ్బారావు బొమ్మలు కనపడక కాబోలు పీక్లీ తీసుకుని బైటకొచ్చి స్తంభానికి జార్లపడి చదవడం మొదలెట్టాడు. అనంతాన్ని తిలకిస్తున్న ముసిలాయన చుట్ట ఆరిపోవడంవల్ల కాబోలు మళ్లా ప్రపంచంలో అశాంతిని తెలియజేస్తూ నీపరీక్ష ఏమైంది, సుబ్బారావూ?' అని కుశలప్రశ్న వేశాడు.

సమాధానం వినకుండానే నిధి క్లబ్బు విడిచి వీధిలోకి నడిచాడు. ఆవులమంద నడిచిన వింతవాసన దుమ్ములో లేచింది. సిగరెట్టు మసిలాంటి రంగుగల పొగ యిళ్ళకప్పులపైన చుట్టుకుంది. చీకటిపడ్డ వాస్తవాన్ని తెలియచేస్తూ పక్షులు చెట్లకొమ్మల్లో పలకరించుకుంటున్నాయి. మదార్ సాయిబు సోడా కొట్టు క్రిందనుంచి నల్లకుక్క వొక్కసారిగా బైటకొచ్చి, ఆకాశంలో నక్షత్రాలనిచూసి మొరిగింది. దాని స్నేహితబృందం గూరాన్నుంచి అందుకుని బృందగానం సాగించాయి. సృష్టిలోవున్న విరక్తిని కుక్కంత విశదంగా ప్రాణికోటిలో మరే జంతువూ ప్రకటించుకోలేదు. అరుగులమీదనుంచి చాలామంది దిగివొచ్చి ఆపుచెయ్యడానికి యత్నించారుగాని లాభంలేక పోయింది. సంత చేసుకొస్తున్నవారి తాలూకా పొరుగూరి కుక్కల్నిచూసి మరింత రెచ్చిపోయి, కుక్క జాతికే తీరనిదని సంభావించినట్లు ఏకస్థాయిలో మొరగడం మొదలెట్టాయి. పట్నంలో వున్నన్నాళ్ళూ మనప్రాయి ఎప్పుడు పోదామా అనుకునేవాడు. ఈకుక్కల గోల అచ్చంగా పట్నంలో ట్రాములు చేసే చప్పుడులావుంది. పొరుగూరికుక్కలకు బదులుగా ప్రయివేటు కార్లు, లారీలూ వుంటాయి. వీటిగోల ఆపుచెయ్యడానికి వొచ్చినవాళ్ళే, అక్కడ పోలీసులు.

సందులోకొచ్చాడు. ఆమ్దాతో కొట్టుకుంటున్న నరాలన్నీ చప్పుడుకి అణిగిపోయినాయి. చెవులున్నా లేకపోయినా, మనిషికున్న వొందేళ్ల ఆయుర్దాయంలో, ఇలా శస్త్రాలు, అ. సం. ఐదేళ్ళయినా వస్తాయి.

తలుపు తట్టాడు. అతను వొస్తాడని తెలిసి కాచుకున్న దాని మాదిరిగా కామాక్షి వెంటనే తలుపు తీసింది. 'రండి, రండి—అంటూ గదిలోకి తీసుకెళ్ళింది. అతను కుర్చీతగిన కాళ్ళసీటు వొకటిమాత్రం వుంది. ఓ మంచం వుంది కాని, సాఫ్సొతగిందిగా లేదు; మప్పటి—చిరిగిపోగా మిగిలిందే - మడతలు లేసిపోయి, చాకలాడికి వద్దేద్దామనుకుని బైటకిలాగి, మళ్ళా ఎందుకులే అనుకుని వొదిలేసినట్లుగా వుంది. తలగడ దిండ్లు వుండవలసిన చోట్లో లేవు.

గదిలోకి రాగానే తలగడాని చూచి కోమలేమో ననుకుని హడిలి పోయాడు. గోడని పైభాగం ఓటపేసిన అద్దంవుంది,—అదేనా గోడని అనుకుని లేదు. ఏస్థలంలో నుంచుంటే కనబడతామో తెలియాలంటే, చూసి తెలుసుకోవాల్సిందే కాని, తిన్నగా వెళ్ళి నవ్వుతూ మొహం చూసుకుంటే కూర్మయ్య భాషలో 'అడ్డంగా మాడిపోతారు'. గోడని రెండు మూడు పటాలుకూడా వున్నాయి. కాని అవి జంతువులవో, మనుషులవో, చెట్లవో, రాత్రిపూట, ఆ దీపంవెలుగులో నిర్ణయించలేరు.

'ప్రొద్దున్న వొచ్చారుటగా... ఇంకా మేం జ్ఞాపకంవున్నామా— మీ అమ్మగారితోనే పోయింది ఆయింటికళ. ఆపడదన్నా వేమి, ఆపద స్నావేమి. గిట్టనోళ్లు ఎన్ననుకుంటే ఏంగాని, భలేతెలంపు. ఆ ధైర్యం; చొరవ, యింతమంది బ్రాహ్మళ్ళే మాశాగాని; ఎక్కళ్లేలోనూలేవు స్మాంఁ... అల్లా ఆపీటమీద కూర్చోండి. ఆ మంచంమీద నల్లులుంటాయేమో...'

కామాక్షిని పరకాయించి చూశాడు.—విశాలమైన పెద్దమొహం, సన్నటి పొడుగాటి కళ్లు; కళ్ళకింద నల్లని గీతలూ నిర్మలమైన పల్చటినుదురూ వొకప్పుడు చాలా అందమైనదని చిన్నవయస్సులో వున్నవాళ్లకి అనిపించినా కూర్మయ్య భాషలో చెప్పాలంటే—"దాంతస్సదియ్యా అది రోజుల్లోనే బాగుండే బాపతు." వెళ్ళిపోయిన యవ్వనానికి పీడకలలులా అక్కడక్కడ నెరసిన వెంట్రుకలు ఆ నిండువిగ్రహానికి పరిపూర్ణత నిచ్చాయి. కోమలి తల్లి పోలిక కాదనుకున్నాడు నిధి

'ఇంక మీకు మాతో ఏం అవసరం వుంటుంది - మీ సుశీల, అచ్యుతం వొచ్చారుగా!' అంది. ఆడవాళ్లకి మనస్సు నొప్పించటం సరదా కాబోలు ననుకున్నాడు.

'సుశీలా, అచ్యుతం యివాళే మావాళ్లు కాలేదు. వాళ్లు నే పుట్టినప్పటి నుంచీ వుంటూనే వున్నారు' అన్నాడు.

'ఎక్కడో వుండానికీ దగ్గరగా వుండానికి భేదంలేదూ?' అంది.

'నువ్వనుకున్నది నిజమే ఐతే; యిక్కడికి నేనెందుకొస్తాను కామాక్షీ. సుశీల తండ్రి తాసిల్దారు; ఆస్తిపరుడు. నాకూ మా అన్నయ్యకి అంతా కలిపి ఆరెకరాలుంది. ఇప్పటికప్పుడే రెండెకరాలు అమ్మేశారు. మాలాంటి బీద సంబంధం వాళ్లకెందుకు?' మధ్యలో కామాక్షి అందుకుంది.

'మీరంటే సుశీలకి చాలా యిష్టంటగా,' దయానిధి నవ్వుతున్నాడు.

'ఏమో నాకేం తెలుసు? పైగా పెళ్లి సుశీల యిష్టంపైనా నాయిష్టం పైనా ఆధారపడదుగా.'

'అదేమన్న మాటలెండి. చదువుకున్నవాళ్లు మీరు ఒకర్ని ఒకరు కోరుకున్న తరవాత, ఆపుచెయ్యడం ఎవరితరం? మీకు యిష్టమేటగా...?'

'నీ కెందుకు ఆ అభిప్రాయం కలిగింది?'

'మా కోమలి అంటుంది.'

'తనలాగా నేను అందరితోనూ స్నేహం చేస్తాననుకుంది కాబోలు.'

చరచరా కోమలి గదిలోకొచ్చింది. వస్త్రప్రదర్శన శాలలోకి చిరత పులి జొరబడినట్లుగా వాతావరణం చెదిరిపోయింది.

'ఆయన కెందుకేమిటి? నాయిష్టమొచ్చినోళ్లతో స్నేహితం చేస్తాను... నేనేం సుశీలని, అమృతాన్ని కాను...'

కోమలి కళ్లల్లో కోపాన్ని చూసి నిధి హడలిపోయ్యాడు; అది భావ గర్భితమైన కోపం కాదు; చాంచల్యానికి జనించిన చమత్కారకోపం; అందు కనే అది మరీ భయంకరంగా వుంటుంది. ఆడవాళ్లు చాలా చిత్రంగా ఎదిగి పోతారు. ఎనిమిది నెల్లలో ఎంత మారిపోయింది! ఇంచుమించు తనంత పొడుగూవుంది; ఇదివరకూ బలహీనంగా కనిపించే గడ్డం యిప్పుడు వొంకర్లు తిరిగి బలంగా 'నాసంగతి కనుక్కోండి, చూద్దాం!' అని సంఘాన్ని సవాల్ చేసి నట్లుగా వుంది. దట్టమైన నల్లమేఘం మధ్యలో మెరిసిన నక్షత్రంలా నల్లటి పాప దీపంలో మెరసిపోతోంది. రాశివాసంలోవున్న రవితో ఎడమ కను బొమ్మని పైకి కదుపుతోంది. పురుషుడు సౌందర్యం ముందు చూపించే మూగ

బాధ, భయం, సిగ్గూ,—అన్నీ శరీరాన్ని చూసే; అంత చిత్రంగానూ, మెదడూ, బుద్ధీ, కూడా, మారి వికసిస్తే ఎంత బాగుండును! శరీరంలో యౌవనం తెచ్చిన మార్పుని, మహాశక్తిలా, ఆరాధించి, ఆమార్పునే, స్త్రీ హృదయానికి కూడా ఆపాదించి, స్త్రీని దేవత కింద పూజించడంవల్ల, పురుషుణ్ణి, లోకువ కట్టి, ఆడించ కలుగుతుంది కాబోలు ననుకున్నాడు. తెలివి తేట్లని అయుధంగా సంపాదించుకుని మొగాడు ప్రపంచాన్ని లోబరుచుకుంటున్నాడు. తెలివితేట్లు వుండక పోతాయా అని భ్రమించేట్లుగానో— లేక అసలే తెలివి విషయం స్మరించకకుండా చేసేలాంటి—నిర్వాణ సౌందర్యాన్ని, స్త్రీ తన ఆయుధంగా సృష్టికి కోరి తెచ్చుకుని, మొగాణ్ణి లోబరుచుకుంది. లేక పోతే ఆ విశ్వాన్ని సైతం ముష్టిలో అమర్చుకున్న పెదవులు, [illegible]ప్రపంచాన్ని వొక్క కేకతో మధుర గానంలోకి పురిగొల్పే ఆ కంఠం - అంచుల్లో నుంచి రావల్సింది 'సేవితం', 'అమృతం' - యివా?

'ఊరుకోవే పిచ్చిపిల్లా'

'నాపూసు ఆయన కెందుకు? తనెవరే?' అని తల్లిని బుకాయించింది.

'ఆగోపాల కృష్ణమాచార్లతో నిన్ను చూడలేనా?' అన్నాడు నిన్న...

కామాక్షి, తెచ్చిపెట్టుకుని కృత్రిమంగా నవ్వింది.

'కృష్ణమాచారెటు-చూశావే,' అంటూ, గడ్డం కింద చెయ్యిపెట్టుకుని, నీళ్ళల్లో కదిపిన ప్రతిబింబంలా మొహాన్ని వొంకర్లు చేసుకుంటూ, కామాక్షి నవ్వడం మొదలెట్టింది. కోమలి కనుబొమ్మల్లో కోపం పెదవులమీదకి దిగజారి, నవ్వుకోసం బుగ్గలు ఆశ్చర్యంతో కదిపింది.

అర్థంకాకుండా అతనూ నవ్వడం మొదలెట్టాడు—

'ఆ కోడుగుడ్డు మొహం కృష్ణమాచారి...' అని మళ్ళా కామాక్షి, అతిగా నవ్వితే వికృతంగా మారుతుందన్న సంగతికూడా మరిచిపోయి, నిర్మొహమాటంగా నవ్వేసింది.

'మా పొలం ప్రక్కనే వాళ్ళ పొలమూను-వాడు అంగవస్త్రోత్త

ఎకశెక్కాలాడతాడు' అంది కామాక్షి.

'పోనీ మరోడు...' అన్నాడు.

'ఎవరన్నారు మీతో?'

'అనుకుంటున్నారు...'

'మీ బ్రాహ్మలకంటె నయమే లెండి మేం. ఇంటో గుట్టంతా కప్పెట్టుగుని, వూళ్ళోవాళ్ళని ఆక్షేపించక్కర్లేదు - బాగుక్కుండేటి...' కోమలి మొదలెట్టింది.

'ఏవేం మాట్లండి-పెద్ద కుటుంబంలో వారుకదా; మీ రీట్లాంటివన్నీ నమ్మొచ్చా. మేమేం కులం తక్కువైనా చెడ్డవాళ్ళం కాదు. మొన్న మొన్నదాకా కోమలి తండ్రి నారాయణాచార్లగారే అన్నీ చూసుకుంటుండేవారు. ఏదో వో ఎకరం భూమి రాసి పొయ్యాడు. హాయిగా బ్రతికిపోయాం. మాకా పాడుబుద్ధంటే యీపాటికి మేడలేకడుదుం. కోమలి సక్కదనం చూచి జమిందార్లు కుక్కల్లా మా యింటిచుట్టూ తిరగుతూ...మర్యాదగా బ్రతికెకోళ్ళం. ఇంకెప్పుడూ యిల్లాంటి మాట్లనకండి..."

"మరే" అంది కోమలి.

"నువ్వింటోకిపోవే-నీ కెందుకు?" అంది తల్లి.

"కానివోనీ - ఏదో బ్రాహ్మళ్ళ గురించి అనబోతోందే!" అన్నాడు.

"అంటానా, యింకా అంటానా. నాకేం భయమా!" కాలుజారి, గుమ్మం పట్టు వూడి, ముందుకి పడింది.

'వెర్రి ఆవేశం - పిచ్చిపిల్లకి. దీనికో మంచి మొగుణ్ణి పడేస్తే, నాకింక బెంగుండదు. మీరు చదువుకున్నవారు గందా, చేసుకోండంటే మీ నాన్న బుస్సుమన్నారు...అమ్మోయ్యరాత...... ఏమున్నాదో. నేనొకటడుగుతాను - ఎవళ్ళతోనూ అనకండేం-మీ అమ్మగారు ఎల్లా చచ్చిపోయారంటారు?... మామూలుగా చావలేదంటగా..'

దయానిధి ఆమెకేసి చూస్తోకపోయాడు — మొహం కిందికి వాల్చాడు.

మంచంమీద దుప్పటీలాగ నేలకి చుట్టుకున్నాడు. ఈ ఆలోచన అతనికి ఎప్పుడూ రాలేదు. ఇది నిజమైతే యింకేమన్నా వుందా? తండ్రి సొంతకొడుకు - తన సొంతకొడుకే కొడుకు. అంధలోకం తలుపుల్ని ఎవరో తెరచి నట్టయింది. అందులో అడివిమృగాలు ఆకలితో గర్జిస్తున్నాయి. ఒక్కసారి ప్రాచీన శక్తులన్నీ అందులోకి చొరబడి భేతాళనృత్యం సాగిస్తున్నాయి. అతనింక మనిషి కాదు. కాలిపోయి, మాడిపోయి నుసై గాలిలో కలిసి విశ్వమంతా వ్యాపించిన మహోద్రేకాల సారాంశం.

“మామూలుగా జబ్బుచేసే...” అన్నాడు తలపైకెత్తకుండా. “ఏమో లెండి-అల్లా అనుకున్నారు. మీ నాయనగారే నంట...ఐనా నాకెందుకు యీ గొడవలన్నీ, గొప్పోళ్ళ ఇళ్ళల్లో బోల్డు గొడవలుంటాయి.”

అతనికి భయమేసింది. హిందూ సంసారంలో మర్యాదస్థుడైన భర్త అంతకంటె ఏం చెయ్యగలడు? నాగయ్యా బోటిగాడు ఎవరివాణ్ణో పొడిచేస్తాడు. భార్యదే తప్పనుకుంటే. భార్యనే పొడుస్తాడు. పెళ్ళాం వొదిలిపెట్టిపోతే దేశానికి స్వతంత్రం వొచ్చినరోజున ప్రజలమాదిరి హాయిగా చెడుగుడు ఆడు కుంటాడు. మర్యాదస్థుడు భార్యని వొదిలెయ్యలేడు-అప్రతిష్ట. సహించి వూరుకోలేడు-అప్రయోజకు డంటారు. దారుణంచేసి అక్కోయిట్లో తేల్చ లేడు-భయం. తన్నుతాను చంపుకోవాలి-చేతకాదు, ప్రాణం మైతీపి. హత్య! అన్నగారిమీదికి రాకుండా వూరికి పంపించివేసి, ఊళ్ళోలేని డాక్టర్‌కి కబు రంపి, తను యింట్లోలేని సమయాన అది కాస్తా చేసేసి, ఏమీ తెలియనివాడిలా రోడ్డుమీద వొంతెన దగ్గర నిలబడి-పోయినప్పుడు ఎవ్వరూ దగ్గర లేకుండా ఎంత చక్కటి పన్నాగం. శవాన్ని బైటకితీసి పరీక్షచేస్తే, దీని నిజం బైట పడుతుంది. ఇప్పుడెల్లా శరీరాన్ని తగలపెట్టేస్తారు. ఆఖరికి ఎముకల్నికూడా నదిలో పారేశారు. తగలేసే ఆచారం యిందుకే పెట్టారు కాబోలు, దూర దృష్టిగల మన పూర్వులు.

లేకపోతే అన్నగారే చేశాడేమో యీపని. మందు సీసాలో, విషం

కలిపి-ఆఖరు డోసు సాయంత్రం ఏడింటికి పుచ్చుగుంటుందిగా మరి-తను నాలుగింటికే వెళ్ళిపొయ్యాడు. హంతకుడు హత్య జరిగినచోట లేడు-ఎవ్వరూ అనుమాన పడరు. పోలీసులు, తండ్రీ కొడుకుల్ని అరెస్టుచేస్తే ఏమౌతుంది? ఎవరిమట్టుకువారు-నేనక్కడ లేందే-అని తప్పించుకుంటారు. ఇంతకీ చంపటానికి తగినంత కారణం ఎవరికుంది? తండ్రి "నువ్వెక్కడున్నావ్?" "కోమలికోసం వెళ్ళాను" కోమల్ని సాక్ష్యంకోసం కోర్టులో కీడుస్తారు. "అబ్బే-మాయింటి కసల్ రాందే-నాతో ఆరికేంపని!" అని కళ్ళు పెద్దవిచేసి కనుబొమ్మలు ఎగరేస్తూ, మూతి సున్నాలా చుట్టుగుని అంటుంది కోబోలు. "ఏమయ్యా రాలేదంటుంది యీపిల్ల. చదువుకున్న వాడివి అబద్ధాలాడతావా?" తలనాయాలా మొదడు గుంటల్లోకి లాగినట్లైంది. అనుకున్నంత అసంభవమా అల్లా జరగడం? తనే ఎన్నిసార్లు ఆపని చెయ్యాలనుకోలేదు?

కాని అల్లాంటివి జరగవు. అనుకోడానికీ, ఆచరించటానికీ మధ్య చాలా దూరముంది. ఒక పర్వత శిఖరంమీదనుంచి, మరోదేశంలోవున్న పర్వతశిఖరం మీదికి దూకడం లాంటిది. ప్రతిదేశానికి, పుష్కరంలా, పన్నెండు సంవత్సరాలకి వోసారి, "యివాళ, అందరూ అనుకున్నవాటిని యథేచ్ఛగా ఆచరణలో పెట్టొచ్చు" అని ప్రభుత్వం టాం టాం వేస్తే, ఏం జరుతుంది? రోడ్డుమీద నడిచేవాళ్ళు, మొట్టమొదట కనిపించిన పోలీసుని కసిగా ఖూనీచేస్తారు; కింద వుద్యోగులందరూ, పైవాడి నోట్లో గుడ్డలు కుక్కతారు; పెళ్ళాం భర్త నెత్తిమీద పులుసు రాచ్చిప్ప వొదిలేసి, కొరకంచుతో కాలుస్తుంది. రోగి డాక్టర్ని మంచానికి కట్టేసి నోట్లో రూళ్ళకర్రదోపి కెంపరేచరుచూస్తాడు. కోడలు అత్తగార్ని ముక్కావలలోకి తోసి యీదమంటుంది. స్కూలుపిల్లలు మేస్టారుచేత గోడకుర్చీ వెయ్యించి "ఏదీ యిప్పుడు చెప్పు, అలాస్కాలో ఏం పండుతుంది" అనడిగి, సమాధానం చెప్పింతర్వాత, గుండు సున్నా "నీ మార్కు" అంటూ చుట్టూ గుండ్రంగా తిరుగుతారు. అంచేత యిట్లాంటివి అసంభవం అనుకున్నాడు నిధి. తనేం చేస్తాడు ఆరో

జున? నవ్వొస్తుంది తల్చుకుంటే; సిగ్గేస్తుంది ఛీఛీ—

"ఇట్టని వాళ్లు అనుకుంటారు." అన్నాడు.

"ఏమోనాస్త్రాండి - మళ్ళా ఎవళ్ళతో నేనా ఆనేది గనక."

"మాలో యిట్లాంటివి జరగవ్." అన్నాడతను.

"అవునవును. బ్రాహ్మనోళ్ళ యిళ్లల్లో పిసుక్కుసావడాలే." అంది కోమలి - తరాలుగా బ్రాహ్మణాలు యితర కులాలపై చేసిన దౌర్జన్యాలకి, వాళ్ళకి సారి తిరుగుబాటు చేసినట్లు. మళ్లా బ్రాహ్మణాడికి పుట్టిందట!

"ఊరుకో నీకెందుకే..." అంది కామాక్షి. కాసేపు నిశ్శబ్దం. కోమలి గుమ్మంమీద కూర్చుంది. తన చుట్టూ తిరుగుతున్న పురుగుని తప్పించుకోడానికి అటూ యిటూ కదుల్తోంది. చెవుల్లో వేళ్ళుగో పురుగుని, కళ్ళు గట్టిగా మూసుకుంది. 'పో, పో - వెళ్ళి అగ్నికుట్టు,' అని ఆ పురుగుని తోసేసింది!

'కుడద్దు.' కుడద్దు—అని అతనిమీదకి వెళ్ళిన పురుగుని చేత్తో తరమడం మొదలెట్టింది. ఏమిటి? ఏం చెయ్యాలి? ఏం చెప్పాలి? వెధవాయని కేకేస్తాడు, వెళ్లలేడు. ఎందుకొచ్చినట్లు? కోమల్ని చూడాలని. కోమలికి చదువు చెప్పించాలి. దాన్ని టూర్ తో ఇండియా అంతా తిరిగి తరవాత ఇంగ్లండుకు వెళ్ళాలి. ఇంగ్లండా, ఫ్రాన్సా? తన హాస్పిటల్లో నర్సుగా వుంటుంది — తెల్లటి యూనిఫారమ్లో కోమలి ఎంత బాగుంటుంది.

'నరసమ్మగారు, సుశీల పెండ్లి నిశ్చయించుకోడానికే వొచ్చారుటగా' అంది కామాక్షి, సంభాషణ సాగనిద్దామని.

'సుశీల నన్ను చేసుకోదు.' అన్నాడు.

'అక్కే. లేదే. సుశీల చేసుకోదు; యీనె సుశీల్ని చేసుకుంటాడు.' అని కోమలి నవ్వింది.

'నీ మొహం' అంది వాళ్లమ్మ.

'మరెవర్ని చేసుకుంటుందండీ?'

'అవన్నీ నాకేం తెలుస్తాయ్?'

'పోనీ మీరెవర్ని చేసుకుంటారు?'

దానికి సమాధానం చెప్పలేదు. కోమల్ని చేసుకుంటాను అని అనే టందుకు ధైర్యంలేదు. అంటే చేసుకోవాలి. దానికితను సిద్ధంగావున్నాడా?

వివాహంకోసం, స్త్రీ, భర్తని అంగీకరిస్తుంది. మొగాడు స్త్రీ కోసం వివాహాన్ని అంగీకరిస్తాడు.

అతనికి కావల్సింది పెళ్లికాదు. పెళ్లంటే ఏమిటో అతనికి అర్థం కాదు. కోమలి పెళ్ళాం ఏమిటి, ఎవరేనా నవ్వుతారు. కోమలి పిల్లల్ని కంటుందా? అన్నం వొండుతుందా? కోమలి అసలు స్త్రీ కాదు. ఏదో పొరబాట్న, యీ ప్రపంచంలో తనూహ మాసి పోదామని వొచ్చిన వొక స్వప్న సౌందర్యం. అసలు కోమల్ని ఏమెంగానూ తాకలేరు; [illegible]; మాట రాదు; కళ్ళు కనబడవ్. కోమల్ని ఎవ్వరూ పెళ్లిచేసుకో గూడదు; ఏమొగాడికీ చెందకూడదు. చంద్రుడు, నక్షత్రాలు, సముద్రం టౌను హాల్ పార్కులు – వీటిని అందరూ వ్రాసికే చూసి ఆనందిస్తారు. ఏ వొక్కరూ యివి నావి అనరు. అల్లాగే కోమలి ఆమె పెళ్ళాం కాకూడదు – ఆమె వొక సామ్యవాదపు సౌందర్య సంపద.

'మిమల్నే' అంది కామాక్షి.

'ఏమిటి?'

'మీరు ఎవర్ని పెళ్లి చేసుకుంటారు?'

'నేను పెళ్లి చేసుకోను.'

'ఈ మాటలకేం లెండి. బోలెడు కట్నంతో ఏపిల్లొస్తే ఆపిల్లని పెళ్ళాడతారు. అంతేనా?'

దీనికి ఏం సమాధానం చెప్పాలో అతనికి తెలీదు. అతని మనస్సులో యీ విషయమై స్పష్టమైన అభిప్రాయాలు లేవు. సాంఘిక దృష్టితో యావ్వసం చూల్లేదు. అతని మనస్సులో వున్నవాటిని మాటలలో ఎల్లా చెప్పాలో తెలీదు; ఎవ్వరికీ అర్థంకాదు. పాశ్చాత్య విజ్ఞానానికి అలవాటుపడి, భావ

నిజంగా చేసుకోడం వొకటి. ఈ కొండమీదనుంచి, ఆకొండమీదికి దూకడం. ఏం చెయ్యడం? ఎవ్వరూ సలహా చెప్పరు. ఎవ్వరికీ అర్థంకాలేదు. తను చేసేది మంచో, చెడో తనకే తెలీదు. అసలెవ్వరికీ తెలీదు. ఈ దౌర్భాగ్యపు భారతదేశంలో, ఎవరి మట్టుకు, వారు ప్రత్యేకమైన దోవత్రొక్కి, అనుభవం వల్ల చివ్వరికి, మంచో, చెడ్డో, ఎవరికి వారు నిర్ణయించుకోవల్సిందే. ఈ సంఘం వొక పెద్ద కర్మాగారం. అంతా పనివాండ్రు; అంతా తలో పని చేస్తారు. ఒకరిది మరొకరికి అర్థంకాదు. నెలనెలకీ పనివాండ్రు, పనిముట్లు మారిపోతున్నాయి-కాని వేతనాలు, చెయ్యవల్సిన విధానం నియమాలు మారడంలేదు. ఇదొక పిచ్చాసుపత్రి; సంఘ కట్టుబాట్లు దానికి సూపరింటెండెంటు.

కోమటి ఆకులంలో ఎందుకు పుట్టాలి? తల్చుకుంటె భయమేస్తుంది.

కామాక్షేనా వూరికే అంది కాని నిజంగా కూతుర్నిచ్చి పెళ్లి చేస్తుందా? అదంతా అతన్ని పరీక్ష చెయ్యడం. ఎంత అసంభవమో హాస్యాస్పదమో కామాక్షికిమాత్రం తెలీదు? అంత అనుభవంగల మనిషి!

'నేను సరే నన్నా, నిజంగా నువ్వు వొప్పుకుంటావా ఏమిటి' అన్నాడు.

'అసండీ—అదైన అడిగారండి...అంతకంటే ఏముందండి-మీకు భూములు, చదువు; చక్కదనం-అన్నీ వున్నాయి - యీ వెర్రి మాలోకానికి మీలాంటి మొగుడు దొరుకుతాడా?'

'ఛీ—యీన మొగుడేంటి—'

'చాలావా; యిప్పుడే యిట్లా గంటోంది. ఇప్పటికే' కృష్ణమాచారి రామనాథం, వగైరా ముగ్గురు యోధులపేర్లు విన్నాం...' ఏదో అనబోయ్యాడు.

'ఏమేనవండీ మీతో అంటూ - నాదగ్గరికి సుకురండి పళ్లూడగొడతాను...'

సీతాకాలపు సందేశా యింటోకి రానిచ్చినందుకా...ఒసే, నువ్వింటో

కళ్ళు-ఊనకష నే కనుక్కుంటూ...' అంటూ కోమలి వాళ్ళ అమ్మని గది లోంచి గెంటేసింది. కామాక్షి 'ఏమైనానమ్మా, మీరూ మీరూ ఏమన్నాకొండి' అని సణుక్కుంటూ వెళ్ళిపోయింది.

కోమలి కళ్ళల్లో ఒక్కసారి కోపం మెరిసింది. కనురెప్పల్ని కొంచెం వాల్చి, మూతి బిగించి, గడ్డాన్ని వయ్యారంగా కదుపుతూ 'ఏంటే, విన్నావన్నది' అని అతనిమీదికి రాబోయింది.

'అవును విన్నాను' అతనికి భయమేసింది. బ్రాహ్మల దౌర్జన్యంపై, దారుణమైన విప్లవం కోమలి నేత్రాలలో చూశాడు.

'మీరే, విన్నారా?' అర్ధంలేకుండా, గర్జించింది.

'అవును. మీ కులంలో అంతేకంటె...?'

'ఏమిటి, మళ్ళాకుయ్యాండి అనాత...'

'అనుకుంటుంటే నేనూ విన్నాను. నాకవి లెక్కలేదు. నీకెందుకంత కోపం?'

అతని దగ్గరకెళ్ళి, తలవొంచి అతని రెండు కళ్ళల్లోకి చూసింది. నీళ్ళకి బదులు రక్తంపోసి పెంచిన గోబాపువ్వంలా కనిపించింది ఆ మొహం.

'నేనూ విన్నా మీ అమ్మగార్ని గురించి. సరేనా?' అంది, సగం ధ్వనిని కంఠంలో బిగించి. అప్రయత్నంగా అతని కుడిచెయ్యి, కోమలి మొహాన్ని మధ్యగా, బలంగా కొట్టింది. ఊపిరి లోపలికి పీల్చి, కోమలి మంచంమీద, భూకంపంలో వేళ్లవూడిన చెట్టులా వాలిపోయి, తలగడా పైన వేసుకుని దుప్పటిలో మొహం దాచేసుకుంది.

గదిలో రొదచేస్తూ తిరుగుతున్న రెండు పురుగులూ గోడనివున్న దీపాన్ని చుట్టుగున్నాయి. ఎక్కిళ్ళతో బాధపడుతున్న దానికిమల్లే, అందులో మంట పైకీ కిందికీ ఆడుతోంది. ఆ ఆటకి వికృతమైన నీడలు గోడ మీద పడుతున్నాయి.

దయానిధి తన చేతికేసి చూస్తున్నాడు. ఆ చెయ్యి, తనతో నిమిత్తం లేకుండా ఆపని చేయించింది. అంతే? మనిషికి శరీరంపై అధికారంలేదు? ఉద్రేకాలని అతను కట్టేసుకోలేడు? వేదాంతంలో సత్యం సత్యం అని మొరెట్టుగుంటారు. సత్యం ఎంత ప్రమాదకరమైంది? నిజంచెపితే ఎవరు సహించగలరు? నిజం కాకపోతే అతనికి అంతకోపం ఎందుకొచ్చింది? కోమలి కెందుకంతకోపం? నిజంగా తను మోపిన నేరాలన్నీ నిజాలై వుండాలి. లేకపోతే అంతకోపం రాదు. అతన్ని నొప్పించాలంటే ఎన్నో సంగతు లుండగా, ఆ ముక్కలే ఏరడం ఎందుకు? మొగాణ్ణి ఏవిధంగా బాధపెట్టాలో, స్త్రీలకే తెలుస్తుంది. సత్యం - నవ్వొస్తుంది. వికృతమైన, అసహ్యమైన సత్యం ఎవరిక్కావాలి? అందమైన అసత్యాలే కావాలి సంసారంలో నెగ్గాలంటే. ఎంతో ప్రేమ వెలిబుచ్చుదామని వొచ్చాడు. చేసినపని యిది. అనుకోడానికీ, ఆచరణకీ మధ్యవుండే లోయని పూడ్చడం ఎట్లాగో ఎవ్వరికీ తెలీదు. కోమలి జడని స్పృశించడానికి తాను పెంచుకున్న చెయ్యి, చేసినపని యిదా!

లేచాడు, కోట్లో పాకెట్ బైటకి తీశాడు. బల్లమీద పెట్టాడు. ముందుకి కదల బోయ్యాడు. కోమలి చివాలునలేచి అతని చెయ్యిగట్టిగా, పట్టుకుంది. అతనికేమీ అర్థంకాలేదు. ఎక్కడ పుట్టిందో, సర్వేశాఖవారు నిర్ణయించలేకపోయిన పిల్లనదిలా కన్నీరు అందంగా బుగ్గమీద జారి, పాయలుగా చీలి, అధరాన్ని తడిపి, గడ్డంకింద మాయమౌతున్నాయి. మంచం బద్దిమీద జారిపోయిన కొంగుని కళ్ళకద్దుకుంది. ఒక్క కన్నీటి బిందువు, వొంటి నక్షత్రంలా, కంటికొనని అంటి పెట్టుకుని వుంది.

'మీరెడతాని కీల్లేదు.'

'ఎందుకు నేనిక్కడ? నీకు నాతో ఏం నిమిత్తం?'

'అసలెందుకొచ్చారు?'

'చూసి పోదామని-బుద్ధిలేక.'

'చూసిపోడమంటే, చెంప పగలెయ్యడమా?'

'అల్లా ఎప్పుడూ అనకు.'

'నన్ననకండి.'

'నీజోలి నాకక్కరలేదు.'

'అక్కర్లేకపోతే నన్ను సూత్తం ఎందుకు? మీరు కాబట్టి సరిపోయింది, మరోలైతే రక్కుదును...'

'ఇప్పుడు రక్కు, అంత కసిగావుంటే.'

'అమ్మో! రక్కడమే. గోళ్లు లేవుగా...'

'చెయ్యోదులు, నే వెళ్లాలి...'

'సల్లో ఎక్కడి కెడతారు... చూడండి, ఎథవ దీపం, సలికి, కిరసనాలులేక, ఊ, సత్తోంది తన్నుకు.' అనిలేచి, చీరంతా సద్దుకుంది-కిరసనాయిలు పోసింది దీపంలో.

'సీరకట్టు నాకు చేతగాదు.—చూడండి. మా అమ్మదీ చీర, తెరసాపలాగుంది కాదు!' అని తనే నవ్వుతుంది. తుపానుకి హడలిపోయి, రాయి వెనక దాక్కుని అవగానే బైటకొచ్చిన గడ్డిపువ్వులా, కోమలి మొహం కలకల్లాడుతోంది. కన్నీరు, పాపాన్ని కొట్టేసి, పవిత్రం చేసింది – ఏడ్చేటందుకు కూడా వోపిగ లేని కోమలి మొహాన్ని.

'చెయ్యి వాసన చూడండి - పాడు కిరసనాయిలు కంపు, -ఛీ,-' అని డోక్కున్నట్లుగా మొహాన్ని వికారంగా చేసుకుంది. ఎంతవికారం చేసుకున్నా, కోమలి మొహం వికృతంగా వుండదు. ఎండిపోతున్న కన్నీటి బిందువుని వేలుతో తొలిగించాడు. నాలికమీద పెట్టుగుని చూశాడు, ఉప్పగా వుంది. కోమలి కన్నీరుకూడా వుప్పగానే వుంటుంది.

'అదేంటి ఊరుకోండి మా అమ్మ తన్నుద్ది.'

బల్లమీద పాకేజ్ విప్పింది. అందులో టాల్కమ్ పౌడరు, స్నోబుడ్డి, సెంటుబుడ్డి, రిబ్బన్, ఏట్సు కీడరు వున్నాయి.

'ఇవన్నీ ఏంటి?' అంటూ వొక్కొక్కదాన్నే తీసిచూడడం మొద

కొట్టింది! కాస్తపౌడరు చేతుల్లో పోసుకుంది.

'ఫో అడ్డి' అని నవ్వింది. గాలికి అదంతా ఎగిరిపోయింది.

'గట్టిగా తగిలిందా?' అని అడిగాడు, యిందాకటి దెబ్బని గురించి ఆలోచిస్తూ.

'ఏంటి? దెబ్బా?-అప్పుడే పోయింది. ఏడిస్తేనిగా, అమ్మ చెప్పినమాట యినకపోతే చితకబాదిచేది. మా అమ్మ ఎంత తన్నినా ఏడ్పురాదు—'

"ఎందుకు ఏడ్చావు?"

"ఏమో, నాకు తెలీదు-నన్నల్లా ఎప్పుడూ అనకండి."

"అసలు యింకెప్పుడూ ఇక్కడికి రానుగా-" అన్నాడు.

"ఎందుకురావు. రాకుండా వుండలేరుగా."

"నీకెల్లా తెలుసు?'

"ఏమో, ఇవన్నీ ఎందుకు?"

"నీకోసం. అవన్నీ దాచుకుని, మంచిబట్ట కట్టుగుని రేపు మాతో పిక్నిక్కి రావాలి."

"పిక్నిక్కేంటి?"

"నేను, సుశీలా, అమృతం-అందరం కలిసి పడవమీద లాకులుకాడికి షికారెళుతున్నాం. అక్కడే కాఫీలు, ఉప్మా చేసుగుని హాయిగా తిరుగుతాం నువ్వురావాలి."

"నే నెందుకు? సుశీల, అముత్రం వున్నారుగా..."

"అముత్రం కాదు. ఏ్, అను; అమృ-"మా" కింద "ర"కారం-అమృ-"అమ్"-"రు"-"తం"-అను."

"నోరు తిరగదు. అమితరం. అమురుత్రం... ఛీ, ఛీ-యీ మాట అంటా లెండి. అమురుత్రం..." అల్లా అనుకుంటూ కూర్చుంది.

"నిన్నే రేపు రావూ?"

"ఆళ్ళల్లోకి రాను, భయం. అమ్మ సంపుద్ది."

"మీ అమ్మతో నే చెప్తాగా." బుజంమీద చెయ్యి వెయ్యబోయ్యాడు. ధైర్యం చాల్లేదు.

"పట్టుచీర మా అమ్మది. ఊ-సూ పుట్టోంది—నేనో చీర కొనుక్కుంటాను; పదిరూపాయలివ్వరూ...నాకొద్దు మా అమ్మ అడగమంది." చీర కొంగు రెండుచేతుల్లోనూ తీసుకుని వేళ్ళతో నలుపుతూ, బొటనవేలితో నేలమీద రాస్తోంది కోమలి.

"మా అమ్మ కష్టమానూ డబ్బు ఏదే?" అంది.

"నీకు లేదూ?"

"ఛీ నాకెందుకు ఎక్కువ డబ్బు."

"మరి నీకు వాళ్ళతోనూ వీళ్ళతోనూ స్నేహం ఎందుకు?"

"నేనేం సేవితాలు చేశానా?"

"న్," "నే" "హా" తం—స్నే—అను."

"అబ్బ, ఉంకోపాలంటూ లేద్దరు. అల్లే మాయింటి సుట్టూ తిరుగుతారు. కృష్ణమాచారి మంచోడు. భలే కబుర్లు సెప్తాడు. రామనాథం మా అమ్మ సుట్టం. నన్ను బుజాలమీద ఎక్కించుకుని దొడ్డంతా తిరుగుతాడు."

'వాళ్ళందరితోనూ అల్లా తిరగొచ్చా?'

'అల్లకి నేనంటే సర్దా.'

'వాళ్లు రూపాయ లిస్తుంటారా?'

'ఓ. కృష్ణమాచారి బియ్యం పంప్తతాడు'

'చీరలుకూడా వాళ్ళనే అడగరాదు?'

'అల్లని అడిగింది మా అమ్మ.'

'ఇదంతా డబ్బుకోసం అన్నమాట!'

'ఛ, ఛ నాకెందుకు డబ్బు? మా అమ్మకి.'

దరహాసానికి ఏమీ అర్థంకాలేదు. డబ్బుగడించడం కామాక్షి వృత్తి మైతే, కోమలిద్వారా వేలు గడిస్తుంది. తిరుపతి కొండమీద గుళ్ళో దప్పె-

అంతా భక్తితో తలో అణా వేస్తారు. ఏడాదిలో నిండుకుంటుంది. కోమల్ని అందరి హస్తాలలోను పడి నలిగిపోయినట్లు వూహించి బాధపడ్డాడు. మానవుడు భరించలేని యీ సౌందర్యాన్ని, ముట్టుకోడానికే తనకి చేతులు రాని యీ మనిషిని, ఆ శుంఠలకు, ఆ మృగాలకి వొప్పగించటం ఎంతటి అపచారం. తను పెళ్ళిచేసుకుంటే యీ బాధ తొలుగుతుంది. కామాక్షికి కావల్సింది డబ్బు కాదేమో; పెండ్లి చేసుకోమంటుందిగా కూతుర్ని.

'నువ్వు పెళ్ళి చేసుకోవు?'

'ఛీ, పెళ్లేంటి?'

పెళ్లి-అందరికీ పెళ్లి. ఆడది పుట్టగానే పెళ్ళి; పెళ్ళికాని మొగాడికి సంఘంలో చోటులేదు. మొగాణ్ణి వొంటిగా వుండనివ్వరు. స్త్రీలు వేటాడతారు; బ్రహ్మచర్యం కాగానే, సంసార జీవితాన్ని వేదాంతులు శాసించారు. పెళ్ళికాని మొగాళ్లు అక్కడక్కడ వుండొచ్చు; కాని ఆడాళ్లు వుండకూడదు. అలా వుండాలనుకున్న వాళ్ళు, నామకహ వొకణ్ని చేసుకుని, కావాలంటే తరవాత వాణ్ణి వొదిలేసో, చంపేసో, వొంటిగా వుండాల్సిందే. పెళ్ళంటే ఏమిటో కోమలికి అర్థకాదు. అసలు ఏవ్యక్తికీ పెళ్లంటే ఏమిటో తెలీదు. అంతా సంఘం చేస్తోంది. ఆ సంకెళ్లు తగిలించి మళ్లా వాటిని వొదిలించుకోమని, వేదాంతం అడుగుతుంది-పెళ్లి వొక పద్మవ్యూహం-వొక కైలు. బైట వాళ్లు లోపలి కెళ్లాలనీ, లోపలి వాళ్లు బైటకి రావాలనీ వువిలాటపడటం. ఎందుకు యీ పెళ్ళి?

గాంధీగార్ని ఎవరో యీ ప్రశ్నే అడిగారు. పిల్లల వుద్దేశం లేకపోతే అసలు పెళ్ళికి అవసరం లేదన్నాడాయన.

పెళ్లి కాకపోతే పిల్లలు పుట్టరనికాదు; పుట్టకూడదని తాత్పర్యం. ఏ మొగాడేనా 'ఈపెళ్లికోసం కాదు, పిల్లలకోసం తప్పదు కాబోలు, కానీ ఏం చేస్తాం అనుకుని వివాహం చేసుగుంటాడా? గాంధీగారికి ఉత్తరంరాసి కనుక్కోవాలి. తీరా చేసుకున్న తరవాత సంతానం కలగకపోతే! అతనికేమీ

అర్థంకాలేదు. కోమలికి పెళ్ళంటే ఏం తెలుసు? అమాయకపు సౌందర్యాన్ని 'వివాహం అనే సంకెళ్లతో బంధించడం ఏం న్యాయం?

'డబ్బు తీసుకుని రాత్రి రానా?'

'రేపు రండి.'

'పగలు నాకు వీలుండదు. ఇవాళే వొస్తాను.'

'భాబో! రూపాయిలూ వొద్దు. ఏమీ వొద్దు. అసలు రాకండి.'

'ఐతే నేనంటే నీకిష్టం లేదన్నమాట.'

'ఏమో, నాకేం తెలుసు కాసేపు నిశ్శబ్దం'

'నేను పిక్నిక్కి రమ్మంటే రావ్! రాత్రొస్తానంటే వొద్దంటావ్ - నాకు నీతో ఏం నిమిత్తం? నే వెళ్లిపోతా. ఇంకెప్పుడూ రాను.'

'కోపం వొచ్చిందా?'

'ఆ.'

'ఎంతపొడుగు? నా జెడంత పొడుగా...'

'నాకు నీతో వేళాకోళం ఏమిటి? మీ రామనాథంతో సరసాలాడు.'

'అట్లాగంటే రక్కుతాను.— ఎల్లుండి ఎప్పుడూ రాకండి.' ఇంతలో 'కామాక్షి లోపల్నించి,' ఏమే తిండి తిప్పలూ అక్కర్లేదా ఏమిటి పొద్దో తోంది—నాకు నిద్రొస్తోంది అని కేకేసింది.'

'వొస్తున్నా...అమ్మ పిలుస్తోంది...ఎల్లుండి రాత్రి, నూతికాడ దీపం పెడతాను. 'దీపం లేకపోతే లోనికి రాకండి... అప్పుడే వెళ్లిపోయింది. ఏదో అడుగుదామనుకున్నాడు. సమయానికి అనుకున్నవి, జ్ఞాపకం రావ్. సంభాషణ నడపటం అవతలవాళ్లమీద ఆధారపడుతుంది.

వొళ్లోకెళ్లి తలుపు తియ్యబోయ్యాడు.

'వెడుతున్నారా?' అంది కామాక్షి.

అతనేమీ మాట్లాడలేదు.

'ఇట్లా నష్టా ఏం తీరుతుంది చేసుకుంటే పెళ్లి చేసుకోవాలిగాని.' అంది.

'నాకా వుద్దేశం ఎప్పుడూ లేదు.'

'ఇదంతా ఎందుకు మం? ఇట్లాంటివన్నీ పెళ్ళిళ్ళలో సాగుతాయేమో గాని, మాకు నీలుపడదు. పదిమందీ నా నోట్లో గడ్డేడతారు. ఎంత తీసిపోయినవాళ్లమైనా, మాకూ మంచీ మర్యాదా వున్నాయి...'

అతను మాట్లాడకుండా వెళ్ళిపోయ్యాడు.

పైట చలిగావుంది. మంచు, చలి, యమపాశంలా వూర్ని బంధించాయి. ఇళ్ళు, గుడిసెలు, వెచ్చగా వుండటంకోసం దగ్గరగా జరిగినట్లున్నాయి.

గదిలో కోమటిముందు పడుకున్నంత సేపూ, చలిమంట కాచుకున్నట్లుగావుంది- వేడితో వాతావరణం బరువెక్కింది. కన్నీరుతో తడిసిన తలగడ దిండుమీద చెయ్యిపెడితే, నిప్పులో వేలెట్టినట్లుగా వుంది. అంతా వేడి-వేడి. వెలుగు మాత్రం లేదు.

ఇంటికి చేరుకున్నాడు. అరుగుమీద జగన్నాథం, ముసుగు తన్ని పడుకోవాలని యత్నిస్తున్నాడు. సుశీల గదిలో దీపం, తలుపు సందులోంచి చూశాడు. పక్కగదిలో నాగమణి, అమృతం గవ్వలాడుకుంటున్నారు. భోజనం దగ్గర నరసమ్మగారు:

'మేం వొచ్చి చాలా రోజులైంది-వెళ్ళాలి. ఆయన రమ్మని వుత్తరం కూడా రాశారు' అంది.

'పోనీ మామయ్యానే రమ్మని వ్రాయకూడదూ?'

'ఆయనకి తీరికెక్కడా? ఎంత తాసిల్దారీ చేస్తున్నా సంబంధాలకోసం తిరగడం తప్పుతుందా?' అన్నది నరసమ్మగారు.

'సంబంధాలకోసం ఆయనెందుకు తిరగాలి? చదువుకున్నది కాబట్టి తనే నచ్చినవాణ్ణి చేసుకుంటుంది. అసలు చాలామంది, సంబంధాలు చూడలేకనే, పిల్లలకి చదువులు చెప్పిస్తున్నారు. పైగా కోరి చేసుకున్న తర్వాత, ఏ వొడుదుడుకు లొచ్చినా, తల్లిదండ్రులని తిట్టరు...' అన్నాడు దయానిధి.

'సరే లే సుశీల మాట ఏం చెప్పావ్! దాని మంచిదానికే తెలీదు
అల్లాగని వాళ్ళని వొదిలేస్తామా? పెళ్ళిళ్ళ విషయంలో ఆదుర్దాపడడం పె
వాళ్ల విధి.

'అవును మరి...' అంటూ లేచి చెయ్యి కడుక్కొని సావిట్లో
కొచ్చాడు. గవ్వలాట ముగించి నాగుమణి వీధి గుమ్మంలో కొచ్చింది. గ
గుమ్మంమీద అమృతం నుంచుంది.

'ఇంతపొద్దోయిందాకా ఎక్కడికి కెళ్ళావు బావా?' అత నేమి
మాట్లాడలేదు.

నాగుమణి రోడ్డుమీదికి వెడుతూ 'ఇంకెక్కడికి? కోమలింటికి.
అంది.

ఆడాళ్లకీ విషయాల్లో అంత చొరవ ఎల్లా వొస్తుందో అతనికి అర్థం
కాదు. పరాయి స్త్రీ మీద వాళ్ళ కంతటి అధికారంవుంది. తనెక్కడికెడితే
తన కెందుకు? తన పెళ్లాం కాదుగా! మొగుడు టైఫాయిడు జ్వరంతో
మూల్గుతుంటే- 'క్రితం సంవత్సరాది రాత్రి ఎందు కాలస్యంగా వొచ్చారో
నాకు తెలుసులెండి'—అంటుంది పెళ్ళాం. అంతే స్త్రీ వాళ్ళకి కావల్సిం
ప్రేమకాదు; పదిమంది యితర స్త్రీలలో తాము వాంఛింపబడటం.

'గవ్వలాటొచ్చునా బావా?'

'రాదు, నేర్పుతావా?

'ఓ.'

గదిలో కెళ్ళారు. మంచం పక్కన కుర్చీలాక్కొని కూర్చున్నాడు
అమృతం మంచంమీద కూర్చుంది.

'అంతే బావా,—కాపులుకి మంచిగా మాట్లాడం తెలీదు. మ
వూళ్ళో కమ్మారమ్మాయుంది...' అ గొడవ చెప్పడం మొదలెట్టింది. అమృతం
కమ్మవా రమ్మాయిమీద కోపం ప్రకటించినప్పుడు నుదుటిమీద అందం
గీతలుపడ్డాయి. అమృతం ఏం చెప్పేవీ అతని కర్థం కాదు - చిత్రకారు

రచించిన బొమ్మతో ప్రసంగం.

'ఏమిటి బావా తెల్లబోయి చూస్తావు?'

'..............'

'ఐతే ఎవరు బావా కోమలి?'

'అమృతం - నేను అవస్థలో వున్నాను? సాయం చేస్తావా?'

'ఏమిటి బావా చెప్పు?- నే నెవ్వరితోనూ చెప్పను - చాతనైతే తప్పకుండా చేస్తాను.

'నేను మంచివాణ్ణేనా?'

'అదేమిటి బావా—చిత్రంగా అడుగుతున్నావ్? నువ్వు చాలా మంచివాడివి.'

'మంచివాడు-అంటే అర్థం ఏమిటి అమృతం?'

'నీకు వుంకోళ్ళ జోలి అక్కర్లేదు. గడుసు తనం తెలీదు - అమాయకుడివి.' అంటూ అప్రయత్నంగా పడుకుని తలని చెయ్యిమీద 60 డిగ్రీల కోణంలో ఆనించింది. అమాయకత్వం అజ్ఞానానికి నిదర్శనం; అట్లాంటి అమాయకత్వం మంచితనం ఎలాగవుతుందో అతని కర్థంకాలేదు. అమృతం ఆరిందాలా లోకజ్ఞానం అనుభవం వున్నదానల్లే మాట్లాడడం అతని కాశ్చర్యం కలుగ చేసింది. స్త్రీలు, మానసికంగా దబ్బున ఎదిగిపోతారు; పురుషుడి శీలం అంత తొందర్లో పరిణామాన్ని పొందలేదు.

'నువ్వనుకున్నంత అమాయకుణ్ణి కాను అమృతం - నీలాగే అందరూ అనుకుంటావు; తను గుణాలని యితరులలో చూడడం మనుషుల నైజం.' అన్నాడు.

"అట్లాగైతే, మన కిష్టమైన వాళ్ళందరూ మంచివాళ్ళు ఇష్టంలేని వాళ్ళందరూ చెడ్డవాళ్లు-సరేనా?' అన్నది.

"ఆ యిష్టాయిష్టాలు దేనిమీద ఆధారపడతా యంటావు?'

"చెప్పడం కష్టమే సుమా. కొందరంటే ఎందుకో యిష్టం వుండదు.

నీకూ అంతేరా?"

"అవుననుకో-దానికి కారణం ఏమిటో తెలుసుకోవాలి. కొందరు మనుష్యుల్ని చూడగానే తొలగిపోతాం; కొందరి మాటలు మనకి సరిపడవు; కొందరు నవ్వడం చూసినా ఒట్టుగా లేసుకొస్తుంది. కాని, యిది తప్పు-అన్యాయం, అనిపించదు నీకు? మనుషుల శీలాన్నిబట్టి, గుణాలనిబట్టి మనం ఆదరించాలని పెద్దలు చెబుతారు; కాని నిజంగా మనం చూసేది యివి కాదు; మనుషుల వాలకం, వైఖరి-యివే యిష్టా యిష్టాలని నిర్ణయించేది."

అమృతం మూత బడుతున్న కను రెప్పల్ని ఆపుచెయ్యడంకోసం నాలుగుసార్లు గబగబా కదిపి, వొచ్చే ఆవులింతని చిటికెన వ్రేలితో ఆపుకో లేక సాగదీసి నవ్వి కాళ్ళమీదికి లాక్కున్న శాలువని తొలగించి లేచి కూర్చుంది.

'నిద్రొస్తోంది కాదు నాకు? అందుకనే సుశీల నన్ను మొద్దంటుంది.

'మావారూ నన్ను అల్లాగే పిలుస్తారు, అప్పుడప్పుడు. నిజంగా మొద్దునే నంటావా బావా?' అని సముద్రంలో కొట్టుకుపోతున్న గడ్డిపోచని చూచి ఓడమీదున్న ఆవుదూడలా, జాలిగా అడిగింది.

"పరిపూర్ణ జ్ఞానంతో విముఖత పొందిన అమాయకత్వం నీది..."

"అబ్బో! యింతకంటె మావారు "మొద్దు" అనడమే బాగుంది. ఊరికే అన్నాను బావా. అందుకనే అమాయకురాలన్నాను. మొద్దుల్నిచూసి, ఏదో పెద్ద పేరెట్టి సంతోషిస్తావు నువ్వు. ఇంతకీ నీ అవస్థ ఏమిటో చెప్పావు కాదు.'

"నీకు నిద్ర వొస్తున్నట్టుంది-నే వెడతాను."

'లేదు, లేదుబావా; నిజంగావినాలని వుంది.'

"ఐతే అడగనా? నాకిప్పుడో యాభైరూపాయిలు కావాలి అమృతం., మళ్ళా కొద్ది రోజుల్లో యిచ్చేస్తాను."

"ఓస్-యింతేకదా, అల్లాగే తీసుకో. నా ప్రయాణానికి ఏం ఫరవాలేదు మావారు నాలుగు రోజుల్లో ఎల్లానూ వొస్తున్నారు ఇప్పుడే? కావాలా?"

"ఈ క్షణం."

"ఇంత రాత్రి ఎందుకు?"

"నీకు తెలుసు అమృతం."

'నాకా? అదేమిటి బావా, నా కెట్లా తెలుస్తుంది' ఆశ్చర్యం తెచ్చి పెట్టుకుని నవ్వింది.

'ఆలోచించు-నీకే తెలుస్తుంది.'

'నాగుమణైతే, 'ఇంకెందుకు, కోమలికోసం' అంటుంది.

'నువ్వసాధ్యురాలివి అమృతం నిన్ను మొద్దన్న మీ అయన్ని చూడా లని వుంది. నిజంగా అందుకే."

'ఏదో అల్లా అంటావు. నాకేం తెలుస్తుంది-ఊరికే అన్నాను. ఐతే కోమలి ఎవరు బావా?"

'ఈపాటికి నాగుమణి మీ అందరితోనూ యాగీ చేసివుండునే."

'ఏదో సుశీలా తనూ మాట్లాడుకున్నారు. మధ్య తన కెందుకు నీ సంగతి...?"

'ఏమిటో!'

'కోమల్ని చూపించవూ?'

'కోమల్ని నువ్వెరగవ్. నే నెల్లాచెబితే అల్లా చేసేదికాదు. దానికి మంచీ మర్యాద తెలీదు. అదొక తలకాయలేని శరీరం; ఆత్మలేని అంగపుష్టి అది దర్శనం యివ్వడమంటే వో అవతారం ఎత్తాల్సిందే...'

'అవును బావా-వాళ్ళల్లో మంచీ మర్యాదా వుండవు. మోటు సరసం మావూళ్ళో కమ్మారమ్మాయంతే. మా వారితో మోటు సరసాలాడుతుంది. దానికి తగినట్లే యీాయనాను.'

'మీ ఆయన కథానాయకుడే నందు.'

'ఏదో అందరిళ్ళల్లోనూ వుండేవే. ఎటొచ్చీ కొందరు నోరుండి బైట

పడతారు. ఆడదానికి సిగ్గులేక పోయింతర్వాత పాపం మావారు మట్టుకేం చేస్తారు.'

'కోమలికి సిగ్గంటె ఏమిటో తెలియదు...'

'అల్లాంటి పిల్ల నీకెల్లా నచ్చింది బావా...?'

'ఏమిటో అమృతం. దానికి సమాధానం తెలిస్తే జీవిత రహస్యమే తెలిసిపోను.'

"అందులో రహస్య మేముంది? చురుకతనపుచేష్టలు. పెద్దయి, సంసారంలోపడ్డ తర్వాత, అంతా బాగుంటారు"

అని దుప్పటిమీదకి జారిన దవనాన్ని తీస్తూ సర్దుతుంది.

"సంసారంలో పడడం అంటే నాకు భయం అమృతం. అవిధంగా బాగుండడం అంటే నాకు అసహ్యంకూడాను. నిర్మానుష్యమైన అడవిలో ఋషిగా వుండొచ్చు, కాని చుట్టూ పరిమళంతో మత్తెక్కించే పుష్పాలుండగా ముక్కు మూసుకుని కూర్చోటం మనుషులకి చేతకాదేమో..."

"అడవిలోనూ అడవి పువ్వు లుంటాయిగా" ఉద్యానవనం తగులడుతోంటే రాణీలు చూసి బాధతో నవ్వినట్లు అమృతం నవ్వింది.

"అట్లాంటి కోమలికోసం వీడికీపిచ్చేమిటని జాలిపడుతున్నావు కాదూ అమృతం?"

'లేదు బావా ఎంత మొద్దునైనా నాకర్థమవుతుంది. పిచ్చివాళ్లనిచూసి మనం జాలి పడ్డట్లే, పిచ్చవాళ్ళు మన్ని చూసి జాలి పడతారు.'

'నీలాంటి ఔదార్యం సానుభూతి అందరికీ వుంటే ఈ సంఘం స్వర్గంగా మారును అమృతం.'

'నువ్వేల్లా అన్నావా, మావారు అసలు ఆడాళ్ళే వుండకపోతే బాగుండునంటారు. ఒక్క కమ్మారమ్మాయి తప్ప—'

'నీలాంటి పెండ్లాన్ని సంపాదించినందుకు మీ ఆయన తపస్సుచేసి వుండాలి....'

'అడివి పువ్వుల మధ్య ఆడివిలోనా?' నీరసంగా నవ్వింది. 'ఐతే బావా, డబ్బు కావాలందా!'

'...............'

'పోనీ అడగన్లే' తాళాల గుత్తికోసం పక్కతడిమి, తలగడ గలీబు లోంచి బైటకి తీసింది గుత్తిని.

'అమృతం—యీ సంగతి ఎవరితోనూ చెప్పకు సుమా. నేను కోమల్ని పెళ్లిచేసుకుంటే నువ్వు ఆశ్చర్యపడతావా?' అమృతం లేచి చీర సర్దుకుంది. నరసమ్మగారు 'ఇంకా పడుకోలేదర్రా' అనడం వినిపించింది.

'అబ్బ. దీపం లాక్కుపోకు అన్న సుశీల కంఠం వినిపించింది.

'నరసమ్మ పిన్నీ, కుంపటిమీది పాలు, ప్లాస్కులోనే పోస్తాను-నువ్వు పడుకోవమ్మా అంది అమృతం.

'దాన్ని పెళ్లి చేసుకొని నువ్వేం సుఖపడతావు బావా.'

'నేను చేసుగుని దాన్నో మనిషిని చెయ్యాలని నా ఆశయం. నేను చేసుకోకుండా వొదిలేస్తే, పదిమందిలోనూ పడి అది ఏమైపోతుందో తల్చుకుంటే భయమేస్తుంది. చక్కదనం వుంది; చదువు, సంస్కారం, మర్యాదా, అన్నీ నా సంపర్కంవల్ల అబ్బుతాయని నే అనుకుంటున్నా. అవసరమైతే వో ఏడాది నీదగ్గర ట్రైనింగ్‌కి పంపుతాను...'

'బాగానేవుంది బావా-కాని దానిసంపర్కం వల్ల నువ్వేమౌతావో ఆలోచించలేదు...' అంది.

'నేను ఏర్పడిపోయాను. ఏర్పడిపోయింతర్వాత మనుషులింకమారరు. నువ్వు మీ ఆయన్ని ఎంతవరకు మార్చగలిగావు?'

'ఏమో, కోమలి యిప్పటికే మంచిది కాదంటుంది నాగమణి.'

'కావొచ్చు. పరిస్థితులనుబట్టి, అది అట్లా ఐవుండొచ్చు. పరిస్థితులు మార్చావంటే, మరోలా అవుతుంది. ఎంత చెడిపోయినా, చచ్చేవరకూ బాగు పడే అవకాశాలుంటూనే వుంటాయి. చెడ్డవాళ్ళని మనం చేరవేసి బాగు

చెయ్యాలి కాని, వాళ్ళని హింసించి. దూరం చెయ్యకూడదు. ప్రతియోగికీ భవిష్యత్తు వున్నట్లే ప్రతిపాపికీ వొక భావికాలంకూడావుందని మా ప్రొఫెసర్ చెబుతూండేవాడు.'

అమృతం ట్రంక్ తెరచి వెండి సబ్బుబిళ్ళ పెట్టిలోంచి నోట్లుతీసి అతని కిచ్చింది.

'నిజంగా అమృతం, నాసంతోషం ఎట్లా తెలియచెప్పాలో చేత కావడంలేదు.'

'ఇందులో ఏముంది బావా. అవసరాలు అందరికీ వొస్తుంటాయి. ఏదో వుంది గనక యివ్వగలిగాను.' మళ్ళా ఆవులించి వంటింట్లో కెళ్ళింది.

దయానిధి కప్పులో పాలుతాగి, గోడగడియారంకేసి చూసి, వీధిలోకి నడిచాడు. అరుగుమీద మూలగా నారయ్య ఏదో చేస్తున్నాడు.

'ఏమిటి నారయ్యా, మూటతో కుస్తీ పడుతున్నావ్?' 'ఏముందండి. అయ్యగారి బట్టలు. తెల్లారగట్ల నాలుగింటికి లేచెడతానండి.'

దయానిధి రోడ్డుమీదికి నాలుగడుగులేసి, వొంతెనమీద కాలుపెట్టి నిలబడి ఆకాశంకేసి చూశాడు. ప్రక్కన నారయ్య నీడపడింది.

'ఇంతరాత్రి ఎక్కడికండి?'

'నిద్రరావడంలేదు - చందమామని చూద్దామనొచ్చాను.'

'దానింటి కెళ్ళమాకండి - వాళ్ళింటికి సుట్టాలొచ్చారుటండి; అబ్బాయిగార్ని రావొద్దని చెప్పమందండి.'

'నీతోనే?'

'అవునండి. దుకాణంకాడ కనపడి చెప్పిందండి?'

'ఎవరు?'

'కుగ్రదేసండి. ఐనా మీకా పోకిరిదాంతో ఏంటండీ?'

'నారయ్యా దాన్ని అట్లాగనడం బాగుండలేదు నాకు. కళ్ళతో నువ్వునిజంగా చూశావా?'

'అయ్యో బాబూ, బాగుంటే ఐపోయిందంటండీ! వాళ్ళు ఎంతబాగుంటే అంత ముదరష్టపు సన్నాసులౌతారండి.' 'రమ్మన్న వాడితోటల్లా పోవడం ఆడోళ్ల నైజం.'

'నారయ్యా నీకు ఆడాళ్లంటే మంచి అభిప్రాయంలేదు. అందరూ నీభార్యలాదిరే ననుకుంటావు. పొరబాటు నారయ్యా... ఇట్లాంటివి ఎవరిముందూ అనకు.'

'అందరికాడా అనడం నాకేం పనండి. వాళ్ళసంగతి నాకు తెలుసు, ఎట్లా చెయ్యాలో అట్లా చేస్తానండి. మంచులో జబ్బండి - లోపలకిరండి...'

ఇద్దరూ లోపలికి వెళ్లారు.

* * *

కిటికీ సందులోనుంచి సూర్యకిరణం గోడమీదున్న జాబ్‌కో కాలెండర్ మీద పడింది. నిధి శాలువాని మరింత దగ్గరగా లాక్కున్నాడు. ఎదురుగుండా క్యాలెండర్ 1934వ-సంవత్సరం చూపుతోంది. ఇక రెండురోజుల్లో 1935 జనవరి వొస్తుంది. ఆ క్యాలెండర్ తీసేవాళ్ళు లేరు. దానిమీది బొమ్మకూడా వికృతంగావుంది. వికృతంగావున్న వొస్తువులు ఎందుకో అంత బాధ కలిగిస్తాయి! గోడమీద వొంకరగా అమర్చబడ్డ ఫోటోలు, పద్ధతిలో పెట్టని కుర్చీలు, బల్లలు, నలిగిపోయిన దుప్పటీ, గొళ్లెంపడని తలుపు, తెరుచుకోని కిటికీ,—యివి నిత్యజీవితంలోని వికృతాల సారాంశం; మానవుడి చీకాకుకి కారణభూతాలు. 1933 నవంబరు 6 తేదీని, పాపిడి తిన్నగా కుదరకపడిన చీకాకు జ్ఞప్తికి వొచ్చింది; దువ్వెన విసిరిపారేశాడు; జుట్టంతా రేపేసుకున్నాడు. అద్దాన్ని నేలమీద బోర్లించాడు; నుంచోబెడితే నిలబడదు ఆ అద్దం; వెనకాల ఎత్తుపెట్టాడు, జారిపోయింది; అద్దాన్ని కిందపెట్టి, అతను బల్లమీద పడుకుని దువ్వుకున్నాడు. బుగ్గలు కిందికిజారి, కళ్ళు పెద్దవయి, మొహం వుబ్బినట్లైంది. అతని ప్రతిమని కోమలి అద్దంలో చూసి, వొంకర

మొహం' అంది. అద్దంలా దగాచేసే వొస్తువు భౌతిక ప్రపంచంలో మరొ
కటి లేదు. అందరి మొహాలూ వొంకరగా కనబడతాయి, కాని ఎవరికి వారు
అది తెలుసుకోలేరు! వుంకోళ్ళు చెపితే కోపం వొస్తుంది.

చీకాకుచేసే యీ అల్పవికృతాలిని సరిదిద్దుకోవాలని ఎవ్వారికీ అనిపిం
చదు. నాగభూషణంగారి వంటింట్లో దేవుడి పటాలని చూసింతర్వాత, నాలుగు
రోజులు నిద్రపట్టక జబ్బుచేసినంత పనైంది. పుష్పించని మొక్క, ఫలించని
ప్రేమ, సిద్ధించని ఆశయం, యదార్థం కాని కల—యివి ఆశాజ్యోతిని ఆర
కుండా చూస్తాయి; తలుపులన్నీ మూస్తే జ్యోతి ఆరకుండా వుండొచ్చు.
కాని అది వెలిగించేది, విప్పుకోని గొడుగు, తాడుతెగిన పిపుసప్పుల సమూ
హం, పట్టుచీరలలో గోచరంకాని ముల్లు-వీటిని.

'బావగారు - నిన్ననే తెల్లారింది, మరి ముసుగులోంచి బైటపడండి-
మీకోసం వో అమ్మాయొచ్చింది.' అన్నాడు జగన్నాథం. నిధి కంగారుగా
శాలువా తోసేసి లేచికూర్చున్నాడు.

'ఎవరు?'

'ఓ అమ్మాయి - కొండొకచో వొకానొక స్త్రీ-'

'స్త్రీ!'

'ఎవరి పూర్వులు తోకలేని కోతో—ఆ యొక్క స్త్రీ What a
foolish తోకలులేని కోతులో...' 'ఇంకా లేవలేదు బావా' అంటూ
అమృతం గదిలోకి చక్కావొచ్చి, అతన్ని తేరిపారి చూసింది. అమృతంకేసి
నిధి పరీక్షగా చూశాడు.

రాత్రంతా ఏడ్చిఏడ్చి మొహం వాచినట్లుగా వుంది. కన్నీటితడికి ముం
గురులు మొద్దుబారి నుదుర్ని పట్టుకుని నిరుత్సాహంగా నిలబడ్డాయి.

'ఏం బావా, నిద్రపట్టలేదా ఏమిటి?'

'హాయిగా పట్టింది - ఆ ప్రశ్న నిన్నడగా లనుకుంటున్నా?'

'నాకా! నాకెందుకు పట్టదు...?' అని దిగులుగా, కళ్లల్లోలేని నవ్వుని

పెదవులమీద చూపించింది.

'ఏమోలే,— భర్తగారి కోసం...'

'ఊరుకో బావా, పొద్దున్నే ఏంమ్మాటలవి...వోరే నారయ్యాని పళ్ళు తోముపుల్లట్టుకు రమ్మను...'

'అతకాడితో మనకి సంప్రదింపులు లేవు...'

'నారయ్యలేడు, పొద్దున్నే నాన్నకి బట్టలు తీసుకుని వెళ్ళాడు' అన్నాడు నిధి.

'శుభవార్త చెప్పారు. బావగారు - దూర్వాసుడు వెళ్లి పోయింతర్వాత ఆశ్రమంలాగ, నేడు మనగృహం... పుల్లయు, తోయము, తువ్వాలున్ మనమే తెచ్చేదంగాత ...' అంటూ చక్కాపొయ్యాడు.

నిధి అరుగుమీదికి వొచ్చాడు. ఆ వొచ్చిన అమ్మాయి, ఆవూళ్లో ట్రైనింగ్ చదువుతున్న క్రిస్టియన్ పిల్ల, రోజ్. అతని తల్లి అప్పుడప్పుడు ఏదో ముట్టజెబుతూ ఆదరిస్తూండేది. పరామర్శకోసం వొచ్చింది. రోజ్ అతనూ వీధిలోకి నడిచి, వొంతెనదగ్గర నిలబడ్డారు.

'మా అమ్మ చచ్చిపోయినంత మాత్రాన, నిన్నిక్కడ చూసేవారు ఎవ్వరూ లేరనుకోకు; అప్పుడప్పుడు వొస్తూవుండు - ఏదో తోచింది యిస్తూంటాను...'

రోజ్ విచారం ప్రకటిస్తూ మాట్లాడలేదు.

'ఇప్పుడేమన్నా కావాలా.'

'ఊరికే ఎల్లా పుచ్చుకోనండి? నాకు చిన్నతనం. మీ అమ్మగారిచ్చే వారంటే అది వేరు...మీరు యిస్తున్నారంటే అందరూ ఏమన్నా అనుకుంటారు.'

'అందరూ ఏమనుకుంటారో అని భయపడేవాళ్లు, ఎప్పుడూ జీవితంలో సుఖంగా వుండరు. మన ప్రవర్తన మనకి నచ్చాలిగాని వూళ్లోవాళ్ళేమనుకుంటే మన కెందుకు? పోనీ వొక సహాయం చేస్తావా?'

'ఏమిటండి?'

'ఈ వూళ్లో కామాక్షి కూతుర్ని ఎరుగుదువా?'

'కోమల్ని ఎరక్కేమండి!'

'ఎట్లా ఎరుగుదువు?'

'అప్పుడప్పుడు మాస్కూల్లో సపోటాచెట్టుకాడి కొస్తుంటుందండి. ఓనాడు మా క్లాస్‌మేట్సు అందరూ భలే గోలచేశారు.'

'ఎందుకు?'

'ఎవరో ఏదో అన్నారు; అది వెక్కిరించింది. ఇహ చూస్కోండి..'

'నువ్వు, నీకు తీరుబడిగా వున్నప్పుడు వాళ్లింటికి వెళ్ళి, మెల్లిగా స్నేహం సంపాదించి, దానికి చదువుచెప్పాలి. జీతం నేనిస్తాను. నావిషయం వాళ్ళతో చెప్పకు...'

రోజ్ అర్థమైనట్లు తలపంకించింది.

'అది చెప్పాకో పోతేనండి.'

'ఎల్లాగో మచ్చిక చేసుకుని, నేర్పాలి...'

రోజ్ వెళ్ళిపోయింది.

కాఫీతాగి నిధి, పిక్‌నిక్‌కి కావల్సిన సరంజాం అంతా సర్దుతున్నాడు.

'నా మిడ్ వైఫరీ మాన్యుఅల్ ఏది? ఎవరేనా చూశారా?'

సుశీల కళ్ళజోడుకేస్ కోసం వెదుక్కుంటూ అక్కడికొచ్చింది.

'పుస్తకం దొరికింది బావా' అంటూ అమృతం చక్కా వొచ్చింది.

'ఎక్కడ దొరికింది?'

'సుశీల పక్కమీద తలగడా కిందుంది.' అంది అమృతం.

'నిన్న అందులో బొమ్మలు చూసి డోక్కున్నదానవు, అంత రహస్యంగా చదవవల్సిన అవసరం ఏమొచ్చింది సుశీలా?' అనడిగాడు నిధి.

'రాత్రి నిద్రపట్టక ఏదో కాసేపు పేజీలు తిరగేశాను. అంది సుశీల కొంగుతో కళ్ళజోడుని తుడుస్తూ. సుశీల కళ్లజోడు తీసేస్తే అమాయకు

రాలిలాగా వుంటుంది; కొంచం లోతుకళ్లు; కుడి కనుబొమ్మల్లో వెంట్రుకలు అంత సమంగా లేవు; జోడు ఆనే చోట ముక్కుమీద చిన్న మచ్చవుంది - సుశీల దృష్టి చిన్నతనంలోనే చెడిపోయిందని కళ్ళ డాక్టరు పరీక్షచేసి జోడు తగిలించడం సుశీల అదృష్టమే.

'ఐతే రాత్రి నీకూ నిద్రపట్టలేదు? వొక్క బావకే ననుకున్నాను.' అంది అమృతం.

'మీరిద్దరూ నిద్రపట్టకపోయినా, రాత్రంతా గుసగుసలతో కాలం గడిపారుగా' అంది సుశీల యీసడింపుతో.

'గుసగుస లేముంటాయి-ఏవో కష్టంసుఖం చెప్పుకున్నాం...' అంటూ అమృతం అందుకుంది.

'ఔను ఇవాళ పిక్‌నిక్‌కి ఏవేం జరగాలో అవన్నీ అనుకున్నాం, కాదు అమ్మలూ...' అన్నాడు నిధి.

'చూశావా వొక్కరాత్రిలో అమృతం అల్లా అమ్మలైంది...' అప్రయత్నంగా సుశీలమొహం ఎర్రబారింది; అర్థం కానిఅసంతృప్తితో ఆమె పెదవి కదుల్తోంది.

'అమ్మలూ అంటే తప్పా? నీకెందుకు? ఆ మూడు ముళ్లూ పడ్డతర్వాత నిన్ను సుశీ అంటాడులే పోనీ. అంటూ నుదుటిమీద గీతలు తెచ్చుకుని అమృతం కోపాన్ని ప్రదర్శిస్తోంది.

'ఏమిటమ్మా, - ఆవిషయం ఎత్తొద్దని ఎన్నిసార్లు చెప్పినా జ్ఞానం లేదేం?'

'అట్లాంటప్పుడు నన్ను అమ్మలూ అంటే నీ కెందుకు అంత దుగ్ధ.'

'అబ్బో, మా అక్కయ్య పెద్ద పెద్దమాటలే వేస్తోంది.' మధ్యలో జగన్నాథం మొదలెట్టాడు:

'నిన్ను అమ్మలూ అంటే నా కెందుకు, అరిటిబొండా అంటే నా కెందుకు - ఏదో తమాషా కన్నాను...'

'హోయ్ హోయ్ - భలే రైమ్...సుశీల యిక తెలుగు మేష్టారిణీగా వుండొచ్చు.'

'పోనీ నేను అరిటిబొండనే - నీలా నాజూకుగా అరిటాకుని కానులే-'

'అరిటాకు! What a foolish!...'

'ఊరుకో జగ్గూ...'

'అదే వొద్దన్నది. అరిటాకులు, అరిటిబొండలు వున్నాయి - ఐతే మైనెస్ మీసాల బావగారు అరిటిపండు కాబోలు; కొట్టో!'

'తప్పురా...'

ఇంతలో నరసమ్మగారు చక్కావొచ్చింది.

'ఏమర్రా,-ఎక్కడికో వెడతామన్నారు. నీళ్ళుపోసుకుని, మరి దబ్బుని తెమలండర్రా'

'నేను రాను - మీరెళ్ళండి, అని సుశీల తన గదిలోకెళ్ళి, తలుపులు చప్పుడయ్యేటట్లు మూసింది.

'తన కెందుకు బావా, అంత కోపం?'

'ఏమో!'

'బావగారూ, సత్యభామాదేవి అలకతీర్చండి మరి...మనకి కావల్సిన వొస్తువులు ఏమిటో చెప్పండి - జాబితా వేస్తాను.' అని కాగితం తీసుకుని జగన్నాథం జాబితా వెయ్యడం ప్రారంభించాడు.

నిధి పక్క గదిలోకి సుశీలని వెదుక్కుంటూ నడిచాడు.

'ఎందుకు రావు సుశీలా? నిన్నల్లా వెడదామని ఎంతో సరదా పడ్డావు.' సుశీల లేచి గోడవెంపుకి మొఖం తిప్పుకుంది.

'ఇటు చూడు సుశీలా' అంటూ దగ్గరగా వెళ్ళి కళ్ళల్లోకి చూశాడు.

'నా వొంట్లో బాగాలేదు.'

'నేను డాక్టర్ని. ఎక్సామిన్ చేసి మందిస్తాగా' అని చెయ్యి తీసుకుని నాడి పరీక్ష చేశాడు.

'ఏమీలేందేనే - దొంగా-' అని జగన్నాథం ధోరణిలో అన్నాడు. నవ్వుతో కదుల్తున్న పెదవుల్ని బిగించింది కాని కన్నీటితో కళ్లజోడు అద్దం మసగ్గైంది. అతను తీసి తుడిచి మళ్ళా చేతికిచ్చాడు.

'ఏదో గుండెల్లో ఆయాసంగా వుంది.' అని మంచం బద్దీమీద కూర్చుంది. ఏడుపు సుశీల ఆభరణం కాదు, కోపం చూపినప్పుడే కొంచెం బాగుంటుం దనుకున్నాడు.

'స్టెతోస్కోప్ తీసుకురానా?'

'వొద్దు. మీ రెళ్ళండి-నువ్వు, మీ అమ్మలూ, మీ కోమలీ... నేను రాను.'

'నీకోపం నామీదా? వాళ్ళమీదా? మధ్యలో కోమలెందుకు?'

'అమృతం చూస్తానంటె కూడా తీసుకోస్తా నన్నావుటగా...'

'నీ కెవరు చెప్పారు? ఐనా, నువ్వుమాత్రం మాదానవు కావా ఏమిటి-ఎందుగీ తేడాలు?'

'అమ్మలొస్తే నేను రాను. నన్ను దొంగంది-పుస్తకం నేను దొంగి లించానా - తనే దొంగ. తనకే కావాలి వూళ్ళో విషయాలు, నీ విషయాలు' దండకంలా చదవబోయింది.

'నా విషయా లేమున్నాయి సుశీలా? నీవన్నీ అనవసరమైన అనుమానాలు. అమృతం ఏదో తమాషాకి అల్లా అంటూంటుంది. చదువుకున్న దానివి. నువ్వు ప్రతిదానికి యిదవుతే ఎల్లా చెప్పు.'

'దాన్ని నా పెళ్ళిజోలి ఎత్తొద్దని చెప్పు.'

'ఓస్. ఇంతేకదా...లే. మరి...నీ కొత్త జాకెట్ చీర సింగారించుకుని, చైనీస్ డాల్ మాదిరిగా...'

'అదుగో నన్ను డాల్ అంటున్నావూ...' అని గారాం చెయ్యపోగా 'స్నానం కరిష్యే' అంటూ జగన్నాథం గదిలో కొచ్చాడు.

'చూళ్లేదు-ఇక్కడ మనుష్యద్వయం వున్నారు. ఇవాళ మనం ఏగదిలో

కెళ్ళినా, మనుష్యద్వయం మంత్రాంగం చెయ్యడమే చూస్తున్నాం.ఆ నారిగాడి మొఖం చూశాను కాబోలు. ఆగదిలో అక్కయ్య నరసమ్మ, ఎక్స్‌క్యూజ్ మి, నరసమ్మగారూ, యిక్కడే యీ...'

'లే మరి... అమృతం నిన్నేమీ అనకుండా చేసే పూచీ నాది.' అన్నాడు నిధి.

'మనం స్నానంచేశాం, యీ వెంగ్రుకా రాజములకు యింత నూనె కోసం యిల్లా తిరుగుతున్నాం కాని, మదీయ యత్నంబులు విఫలంబయ్యే... సుశీలాదేవీగారూ మీ హేరాయిల్ యిప్పిస్తారూ - లేనిపక్షాన, డాక్టర్ జీ యింత ఫినైల్ యిప్పించండి...' అంటూ జగన్నాథం మంచంకింద దూరి పరకాయించడం మొదలెట్టాడు.

'లే మరి-చూడు. జగన్నాథం స్నానంకూడా చేసేశాడు' అన్నాడు నిధి, సుశీలని సమదాయిస్తూ.

మంచం కిందనుంచి జగన్నాథం 'మిమ్మల్ని మీరు సరిచేసుకోండి- నాథ్ అనాలి-జగన్నాథం కానండోయ్ మహాప్రభూ. మీ రల్లా పిలవక పోతే, పిక్‌నిక్‌కి నేనూ రానూ. రాకపోవడంలో సుశీలకు తీసిపొయ్యేవాళ్ళు ఎవళ్ళూ లేరు...' అన్నాడు.

'ఎక్స్‌క్యూస్‌మి నాథ్-ఐతే తమరు మంచంకింద పరిశోధిస్తున్న దేమిటో తెలిసికోవొచ్చా?' అన్నాడు నిధి వేళాకోళంగా.

'నిరభ్యంతరంగా - What a foolish! మూతా, మూతీ లేని కొబ్బరి నూనె సీసా తాలూకు మిగిలిన భాగం...' సుశీల కొంగుతో కళ్లుతుడుచు కుని నవ్వుకుంటూ స్నానాని కెళ్లింది.

దయానిధి స్నానంచేసి, రాయవల్సిన రెండుత్తరాలు రాసి, టపా తీసుకున్నాడు. 'రిమాటిక్ సీనూ' దగ్గరనుంచి మరో వుత్తరం వొచ్చింది. అతను పెండ్లి సంబంధం చూడడానికి వెళ్ళే అవసరం లేదనీ, అంచేత అక్క- డికి రాలేక పోయాననీ, మళ్లా ఏదేనా అవాంతరం వొచ్చి, రావల్సిన అవ

సరం వొస్తే, టెలిగ్రామం పంపుతానని వ్రాశాడు. టైము అప్పటికి పదిగంటలైంది కాని పక్కగదిలో గోడ గడియారం ఏడుగంటలు కొట్టి నిల్చిపోయింది. దాని కథ కనుక్కుందామని పక్క గదిలోకి నడిచాడు. గదిలో మంచం మీద, 'మూడు' అంకెలా ముడుచుకుని అమృతం పడుకుంది. అది నిద్రపోడానికి సిద్ధంచేసుకున్న పక్కకాదు; దుప్పటీ అంతా రాత్రి నిద్రకి నలిగిన స్థితిలోనే వుంది. ఒకదిండు తలాబుదిక్కునా, రెండోది కాళ్ళవైపునా వుంది. అమృతం తల దిండుమీద లేదు. ఆమెలో ఏమో మార్పు జరిగిందనడానికి అదే నిదర్శనం.

'అమృతం, గడియారం ఎన్నిగంటలు కొట్టిందో విన్నావా?' సమాధానం లేదు.

'అమృతం, అల్లా పడుకున్నావే?'

'ఏమీలేదు బావా' అని అవతలకి తిరిగి పడుకుంది.

'గడియారం విన్నావా?'

'లేదు.'

మనస్సులో జరిగిన మార్పులు శరీరంలో బహిర్గతం కాకుండా చేసుకోలేరు స్త్రీలు. కొందరి స్త్రీలకది అలంకారం; మరికొందరికి ఆయుధం. బాధపడటం వాళ్లకి సంతృప్తినివ్వదు; అదృశ్యాన్ని యితరులుచూసి సానుభూతి ప్రకటిస్తేనే ఆబాధ తీరుతుంది. ఆ యితరులు మళ్లా స్త్రీలు కాకూడదు. కొంత బాధ అల్లావోదార్చే దగ్గర మొగాళ్ళు లేకపోవటంవల్ల కల్గుతుంది. బహిర్గతమైన వుద్రేకంయొక్క అంతర్యం తొందర్లో అవగాహనకాదు యితరులకి. అది కోపమో, దుఃఖమో, విరహమో - వారే నిర్ణయించుకోలేరు. అదే, దౌర్బల్యం, అబలత్వం అనబడుతోంది.

'అల్లా పడుకున్నావేం, అమృతం లేచి స్నానం చెయ్యవూ? మనకి వేళవుతోంది...' అంటూ ఆమె ఎదురుగా ట్రంకుపెట్టె లాక్కుని కూర్చున్నాడు.

'ఏమీలేదు - వూరికే నేబావా.' లేచి, కళ్లు నులుముకుని, చేతులు మెడవెనక ఓగించి వయ్యారంగా ఆవులించి 'నిద్రొస్తోంది' అనుకుని, మళ్ళా పడుకునే వుద్దేశంతో శరీరాన్ని మోచేతిమీద ఆనించింది. నవ్వొకటి గారంగా కళ్లల్లోనే కరిగి కాటుకచుట్టూ జారింది.

'ఎందుకల్లా వున్నావు అమృతం, మీ ఆయన జ్ఞాపకం వొచ్చాడా?'

'ఏంమాటలు బావా... నేనేం చిన్నపిల్లనా ఏమిటి?'

'లేకపోతే మనమల్ని మోసిన ముసలి పండువా?' నిర్జీవంగానవ్వి, చీర మడమల మీదికి లాక్కుంది. కాలి బొటనవ్రేలి పక్కవ్రేలు, బొటనవ్రేలికంటె పొడుగ్గా వుండటం చూశాడు. అప్రయత్నంగా తన పాదం కేసి చూసుకున్నాడు.

'పాదాలు చూసుకుంటున్నా వెందుకు బావా?'

'నేనుడదాన్నయితే నీలా పట్టాలు పెట్టుకుంటుందునుకదా, అని' అన్నాడు.

'పట్టాలు బాగుండలేదా? తీసేస్తాలే; మావారికీ యిష్టంలేకే.'

'లేదు లేదు,-నీ పాదాలకి చాలా బాగున్నాయనుకుంటున్నా.'

'ఏం ఆక్షేపిస్తావులే...'

'కాదు, కాదు. నిజంగానే అంటున్నా.'

'దొంగమాటలు నీవి.'

కొంచంసేపు ఎవ్వరూ మాట్లాడలేదు.

"చాలా పొద్దుపోయింది,-మనం వెళ్ళొస్తూ- దబ్బున లేవు. సుశీలా వాళ్ళు సిద్ధం అయ్యా రప్పుడే."

"నేను రాను, - మీరెళ్ళండి బావా."

"ఎందుకురావు? నిన్న నెంతో సరదాపడ్డావు."

"ఎల్లాగోవుంది. నేనెందుకు? సుశీలావాళ్ళు వున్నారుగా. నేను రావడం సుశీలకి ఇష్టంలేదు."

"అదంతా సరిచేశేశాగా. ఇప్పుడు నువ్వు రాకపోతే తినూరానంటుంది" అన్నాడు.

"అబ్బో, యీ మాటలకేంలే - అంతా నాటకం."

"కాదు - కావాలంటే జగన్నాథాన్ని అడుగు" అని కాసేపాగి అన్నాడు - "ఇంతకీ రాత్రివెళ్ళనేలేదు." అర్థంకానట్లు కళ్ళు పెద్దవిచేసింది అమృతం; లేచికూర్చుంది.

"ఏం?"

"వెళ్లలేదు. అంతే." అసలు కారణం చెప్పడానికి యిష్టంలేక అబద్ధం ఆడినందుకు అతనేమీ నొచ్చుకోలేదు.

'రాత్రంతా నిద్రపట్టలేదు నాకు. నువ్వు లోపలికి రావడం, దీపం తగ్గడం, పొద్దుడం, పడుకోడం - అన్నీ గదిలోంచి కనిపెడుతూనే వున్నా' అంది.

'మీ ఆయనకోసం కాబోలు!' అన్నాడు.

'ధీ - ఏంమ్మాటలు. రాత్రి నీతో మాట్లాడేటప్పుడు మా వార్ని గురించి నీతో అట్లా ఎందుకు చెప్పానా అని దిగులేసింది.'

'ఓస్ - యిదా — నేనేమీ అనుకోలేదులే. మీ ఆయన ఎట్లాంటి వాడైందీ నాకుమాత్రం తెలీదు? నువ్వేం బాధపడనక్కరలేదు.'

'ఆయన చాలా మంచివాడు.' అంది.

మంచివాడంటే ఎవరో నీకూ నాకూ తెలుసు. దానికి దిగులెందుకు? కాని పదిమంది మొగుణ్ణి మెచ్చుకుంటే, పెళ్ళానికి మొగుడు చెడ్డవాడు, పదిమందీ మొగుణ్ణి తిడితే, పెళ్ళానికి మొగుడు మంచివాడు-అనుకున్నాడు.

'ఆయన విషయం ఎవళ్ళతోనూ చెప్పకూడదు అనుకునేదాన్ని. ఏమిటో నిన్న దాన్నే చెప్పాలనిపించింది' అంది తనేదో అపచారం చేసినట్టూ, దాన్ని సమర్థించుకుంటున్నట్టూ.

'నువ్వు చెప్పినవని, నాకేమీ అంత ఘోరాలుగా కనిపించడంలేదు'

ఆ వాక్యం తాత్పర్యం అమృతానికి బోధపడలేదు. తన సౌందర్యాన్ని భర్త అనుభవించే సంస్కారం కలవాడు కాడని అనుకోడంలో, భర్తపై అసంతృప్తికంటె, తన సౌందర్యంపై ఆమెకున్న ప్రీతిని ఋజువుచేస్తుందని అమృతం వొప్పుకోలేదు. తనని అర్థం చేసుకోడం అంటే, తన అందాన్ని అనుభవించినట్లు తెలియపర్చడం. ఈ పని ఎవరు చెయ్యగలుగుతారు? 'నేనేం బావుండను, నేను కోతిని—పోనీ లే—' అని స్త్రీ అన్నదంటే, ఇతర విషయాలకంటె తన చక్కదనం గురించి ఆలోచించుకోడంలో ఎక్కువకాలం వృథా చేస్తోందన్న మాటే! నిజంగా బాగుండమని తెలుసుకున్న వాళ్లుకూడ యిల్లా వృథా చెయ్యడం మానరు అదేం ఖర్మమో!

అమృతం చిక్కపడిన జడని సవరించుకుంటూ లేచింది.

'నే నింట్లోవుంటా - మీరంతా వెళ్లిరండి - వనజమ్మ పిల్ల వొక్కతే వుంటుంది పాపం' అంది.

'అసలిదంతా మీకోసమేగా ఏర్పాటుచేసింది. అంత యిష్టంలేకపోతే అందరం మానేద్దాం, పోనీ' అని నిధి లేచాడు.

'కోపం వొచ్చిందా బావా - వుండు యిప్పుడే వొస్తాను.' అంటూ దూరంగా వెళ్లింది. అమ్మయ్య యిప్పటికి తెమిలిందనుకొని నిధి హాల్లోకి నడిచాడు. జగన్నాథం హాల్లో [illegible]వాకింద కుర్చీలో ఏదో పాడుకుంటున్నాడు...

'మొన్న తాళ్ళు కనబడ్డాయికాని జోడు కనబడలేదు - యివాళేమో జోళ్ళున్నాయికాని తాడు కనబడ్డంలేదు.' అని స్వగతం మొదలెట్టాడు. దొడ్లోంచి వనజమ్మగారు, పక్కదొడ్లో నాగమణిని స్టౌవ్ పొడిచే పిన్ను కావాలంటోంది. దయానిధి యథాలాగా కుర్చీమీద నిలబడి గోడ గడియారాన్ని గంటలు కొట్టిస్తున్నాడు. ఇంతవరకూ కొన్ని నిబంధనలకు కట్టుబడిన ఆ గడియారం, పూర్ణస్వరాజ్యాన్ని, యిష్టమొచ్చినట్లు గంటలు మోగిస్తూ ప్రకటించుకుంటోంది. తరతరాలుగా దాస్యానికి అలవాటుపడి తిరుగుబాటు చేతకాని ప్రజలమాదిరి, ఏళ్ళకొలది పనిచేస్తున్న గడియారం 'కీ' లేకుండానే

తిరుగుతూ వుంటుంది. అద్దం తలుపుతీసి అందులోంచి సిగరెట్టు పెట్టె అట్ట లతో చేసిన పర్సుని బైటకి లాగాడు నిధి. గడియారం మూలుగు విని జగ న్నాథం లోపలికి చక్కావొచ్చాడు.

'ఏమండోయ్, - దాని జోలికి పోకండి. అందులో మనతాలూకు ఖజానా వుంది' అని ఆపర్సుని లాక్కున్నాడు.

గడియారాన్ని బాగుచెయ్యటం. చేతకాక, నిధి ఆ యత్నంమాని, కుర్చీదిగి మళ్ళావాళ్ళలోకి రాబోయ్యాడు. అమృతం దూరంగా మూల నిలబడి వుంది.

'ఏమిటి యింకా యిక్కడే వున్నావు - స్నానానికి వెళ్ళావను కున్నాను.' ఇంకా మూలగా నడిచి, జడని ముందుగా వేసుగుని పమిట నిండుగా కప్పకుంది.

'నేను రావడానికి వీల్లేదుగా' అని తలకాయ కిందికివొంచి, అతని కేసి చూసింది.

'ఏం?'

'పో—' నవ్వుకోసం పెదవులు మెదిలాయి, కళ్ళల్లోని నల్లటి ఆశల్ని, పళ్ళల్లో తెల్లటి సిగ్గుదాచలేక పోయింది.

అతనికి అర్థమైంది. చూస్తుండగా ఎదిగిపోతున్నట్లు కనిపించే అమృ తాన్ని చూస్తే అతనికి భయంవేసింది. అమృతం ప్రకృతిలో ఐక్యమైపోయింది. తన వునికితో వాతావరణంపై వొత్తిడి కలిగించింది ఆమె - అప్రయత్నంగా ఆమెని తాకాలనిపించింది. ఏపని బహిష్కరించబడుతుందో ఆపనే చెయ్యా లని మనిషెంతో వుబలాటపడు తుంటాడు. అనుభవానికి అసహ్యమైనహద్దులు లేవు. రహస్యంయొక్క పరిమితి తగ్గిన కొద్దీ అనుభవంలోని విలువ సన్న గిల్లుతూ వుంటుంది.

'దూరం, దూరం—'

'ఇది అర్థంలేని ఆచారం - ఈ వొక్కసారి దీన్ని మానెయ్యాలి...

'అమ్మయ్యో!' అని కళ్లు పెద్దవి చేసుగుని, గుండెలమీద చెయ్యి వేసుకుంది.

'నిజంగా ఆలోచించు - ఇందులో అర్థంవుందా? అందరూ యిల్లా చేస్తున్నారు కాబట్టి కొందరు చెయ్యకపోతే తప్పుగా ఎంచబడుతోంది కాని, చెయ్యకపోడం తప్పు కాదు. ఈ సమయంలో విశ్రాంతి కావాలి. ఇల్లా పెట్టకపోతే విశ్రాంతి పొందలేదేమోనని భయపడి, ఈ ఆచారం పెట్టారు కాని...'

'అయ్యో బాబో-ఎవరికేనా తెలిస్తే యింకేమన్నా వుందా...!'

'ఉస్ - కేక లెయ్యకు...ఎవ్వరికీ చెప్పొద్దు, మామూలుగా వుండు లే, స్నానాని కెళ్లు...'

'తప్పు బావా-అమ్మో నాకు భయం. రేపు మీ ఆవిడచేత యివన్నీ చేయిద్దువు కాని లే...'

'అమృతం-చూడు-నామాటంటే నీకు గౌరవం వుందా?'

'ఉందనుకో...'

'నేను తప్పు విషయం చెప్పగలనని నువ్వు వూహించగలవా...? ఏదేశంలో, ఏ స్త్రీ యిల్లా చెయ్యదు; వొక్క మనదేశంలో, కొన్ని కులాలలో మాత్రం వుంది. నిజంగా దీనివల్ల ఎంతో నష్టం, చిక్కు వుంది...'

అని periodic cycle, menopause elimatoie ను గురించి లెక్చరివ్వాలనుకున్నాడు గాని, దానికి సరైన మాటలు దొరకలేదు - పైగా అమృతంతో ఎట్లా చెప్పాలో మొదటే అర్థంకాదు; స్త్రీతో మాట్లాడే టప్పుడు కావల్సిన మానసికబలం అతనికింకా రాలేదు; సిగ్గుపడ్డాడు; తడ పడ్డాడు; పెద్దనేరం చేసినవాడిల్లే కుంగిపొయ్యాడు. వాళ్ళు ఏమనుకుంటు న్నారో, వాళ్ళకి తెలుసు - భావశేకుండా, మనుషులు వొకర్ని వొకరు అర్థం చేసుకునే నిశ్శబ్దాలలో అది వొకటి, ఆ విచిత్రమైన అనుభవం, అతన్ని అమృతానికి బాగా దగ్గరగా తీసికెళ్ళింది. పంచేంద్రియాలూ, ప్రకృతి పిలు

పుకి మారుమ్రోగిన మూగ అనుభవం.

నిధి, చాపచుట్టి మూలకి గెంటాడు. జగన్నాథం, పొడుగుచేతుల చొక్కాకి కఫ్‌లింక్స్ వెదుక్కుంటూ చక్కా వొచ్చాడు. ఊడిపోయిన రెండింటినీ దారంతో కట్టి అక్కయ్యాని కఫ్స్ దూర్చమన్నాడు. అమృతం దూరంగా వెళ్లిపోయింది. దయానిధి ముక్కుమీద వేలేసుకుని వొద్దని సంజ్ఞ చేశాడు. నరసమ్మగారు, సుశీలా కూడా చక్కా వొచ్చారు. అందరూ ఏకమైపోయారు. మనుషులే ప్రకృతిని మైల చేశారు.

భోజనాలు చేశారందరూ. వీధులో రెండు వొంటెద్దుబళ్లు సిద్ధంగా వున్నాయి. సుశీల జార్జెట్ చీర కుచ్చిళ్లు కుదరక అమృతాన్ని సద్దమంటోంది. అమృతం ఖద్దరు ఎర్రపువ్వుల చీర పమిటంచు బాగుండలేదనీ నరసమ్మగారితో ఫిర్యాదు చేస్తోంది.

“ఎట్లావుంది బావా యీచీర?”

అది అర్థంలేని ప్రశ్నని అతనికి తెలుసు.

“ఈ చీరలో నే నెట్లా వున్నాను - అని అంతేనా!”

“పోనిలే చెప్పకపోతే -” అని అద్దంలో గుండ్రంగా తిరిగి చూసుకుంది. పమిట చేతులో పట్టుగుని వెన్ను చూసుకుంది. రవికకీ, చీరకీ మధ్య చర్మం కనిపిస్తోంది. “బిగుతమ్మా జాకెట్టు-యిప్పేస్తా” అంటూ స్వగతం చెప్పి మళ్లా గదిలో కెళ్లింది.

జగన్నాథం, ఎడంకాలి జోడు పట్టక, పడుతూ, లేస్తూ గుమ్మంమీద కసరత్తు సాగించాడు. నాగుమణిని గుమ్మందగ్గర అటకాయించి జోడు వ్యవహారం చూడమన్నాడు! “హాక్ హాయ్” అన్నాడు గాలిపీలుస్తూ. నాగుమణి వాడిన నైట్ క్వీన్ పరిమళం హాలంతా వ్యాపించింది. జగన్నాథం నాగుమణి బుజంమీద చెయ్యేసి, ఎడంకాలి మడమని గుమ్మానికి తన్ని, మొత్తానికి జోడుని కాలుకి తగుల్చుకున్నాడు. నాగుమణి తెల్లసిల్కు జాకెట్టు మీద గుమ్మానికి కొత్తగా రాసిన పసుపు తాలూకు మూడువేళ్లు గుర్తుపడింది.

"క్షమించండి - కాలవలో స్నానంచేస్తే, అదంతా పోతుందిలెండి" అన్నాడు జగన్నాథం.

"మంచి పిల్లాడివే" అని సణుక్కుంటూ నాగమణి వాళ్ళింటికి వెళ్ళి పోయింది.

సుశీల జార్జెట్ వొంటిమీద నిలబడటంలేదని తీర్మానించుకుని, అది మార్చి సేలం పట్టుచీర కట్టుగుని అద్దం ముందు చూసుకుంటోంది.

"చీర సొంతమేనా?" అన్నాడు జగన్నాథం కుర్చీమీద నిలబడి జోళ్లని అద్దంలో చూసుకుంటూ.

"ఒక్కటేస్తాను" అని కొట్టబోతూ యిద్దరూ హాల్లో పరుగులు మొదలెట్టారు. గుమ్మంమీద నాగమణితో ఢీకొట్టుకుని ఆమెని గుమ్మానికి చేరేశి 'క్షమించమన్నాడు.' పసుపు మరకలు చీర కొంగుమీద పడ్డాయి. "ఛీ, పొద్దున్నే ఎవరి మొహం చూశానో' అనుకుంటూ మళ్లా యింటికి వెళ్ళింది.

దయానిధి గోచీపోసి పంచి కట్టుగుని లాల్చీ, పైన కండువా వేసుగుని బండిదగ్గరికి హాజరయ్యాడు. జగన్నాథం హుషార్‌గా 'మీరజాలగలడా సత్యాపతి' పాడుతూ పచార్లు చేస్తున్నాడు. చిన్ని బోర్డర్ మందారం రంగుచీర, తెల్లంచు రవికా వేసుగుని అమృతం సిద్ధమైంది. జడ మెలి తిప్పి 'బర్మా' ముడిగా మెడమీద అమర్చుకుని మందారాలని దోపుకుంటోంది.

"సాల్వేషన్ ఆర్మీవేషం!" అన్నాడు జగన్నాథం.

"నోర్ముయ్."

"మూశాం."

దయానిధి నవ్వుతున్నాడు.

"ఏం బావా, బాగాలేదా? పోనీలే. ఏం చెయ్యను, ఇంతకంటె మంచి చీరలు నా కెక్కడనుంచివొస్తాయి?" అంది.

"చాలా బాగుంది. రంగుచీరల సెలక్షన్‌లో నువ్వు చిత్రకారుణివి' అన్నాడు.

"ఏం ఆక్షేపిస్తావులే."

ఇంతలో నరసమ్మగారు "యింకా బయలుదేరలేమర్రా" అంటూ బైటకి వొచ్చింది. మొసలి చర్మం శాండల్స్ తొడుక్కుని సుశీలకూడా వొచ్చింది.

'వాదులాడగలడా నాతో యిక - ఎక్కండి, ఎక్కండి' అని జగన్నాథం అరుగుమీదవాళ్లని ఆహ్వానిస్తున్నాడు. వీధులో గేదిమీదనుంచి దిగి పాలేళ్లకుర్రాడు, కర్రమీద మెడ ఆనించి యీదృశ్యాన్ని చూస్తూ నిలబడ్డాడు.

"ఇవాళ జగన్నాథం తెగ యెగిరి పోతున్నాడు-సారయ్య లేడు కాబట్టా? -" అంటూ నరసమ్మగారు నవ్వడం మొదలెట్టింది.

"ఆ రోజులు వెళ్లిపోయినాయండోయ్! సారయ్యే మవీయకోపాగ్నికి తట్టుకోలేక వెళ్లిపోయాడని గమనించ ప్రార్థన" అన్నాడు జగన్నాథం.

కళాసి "బికారి" కొంత సామాను బండిలోకి జేరేశాడు.

"నీజోళ్లేవి అమృతం?" అని అడిగాడు నిధి.

"మాకు జోళ్లెందుకు?"

"మాకు" అని నన్నుకూడా కలపకు: నాకున్నాయి. ఇవాళే బొగ్గు పొడి కొబ్బరినూని కలిపి పాలిష్‌కూడా వేసుకున్నాను" అన్నాడు జగన్నాథం. నాగుమణి కొత్తచీర ధరించి బండిలో ఎక్కింది. బండి వెనక్కీ-ముందుకీ కదిలి పదిగజాలు ముందుకి నడిచింది.

"నేను నాగుమణి, వో బండిలో" అంది అమృతం.

"What a foolish జగ్గు! నేనూ బావగారు, వో బండిలో, మిగత అందరూ, వో బండిలో." అన్నాడు జగన్నాథం.

"మీరందరూ ఎల్లాగో అల్లా రండి-నేను నడుస్తాను." అన్నాడు నిధి.

"ఐతే మనమూ నడుస్తాం." అని పూర్తిచేశాడు జగన్నాథం.

పాలేళ్ల కుర్రాడి నల్లమొహంలోంచి తెల్లటిపళ్లు కనిపిస్తున్నాయి. కొంత గింజుకోటాలు, తోసుకోటాలు దిగడాలు, ఎక్కడాలు, కాడి వ్రాద్దం అందరూ దిగడం, అందరూ ఎక్కడం-అన్నీ జరిగాయి. ఆఖరికి నాగమణి, నిధి, జగన్నాథం వో బండిలో, మిగతా యిద్దరూ, 'బకాసి' మరో బండిలో ఎక్కారు. బళ్ళు కదిలాయి. సందు మలుపు తిరిగింది. అది ఈస్టిండియా కంపెనీ కాలంలో పరిచినరోడ్డు; ఆనాటిది రాంబాట. జగన్నాథం జోళ్ళకాళ్ళకి పట్టుదొరక్క అటూయిటూ ఎగిరిపడుతున్నాడు. నాగమణి ముందుకుపడి నిధి మోకాల్ని గట్టిగా పట్టుకుంది. వొణికింది. బండి ముందు బరువన్నారు. జగన్నాథం వెనక్కి పాకాడు. మళ్ళీ గొయ్యి. నాగమణి నిధి బుజాన్ని పట్టుకుంది, చేతులు తొలిగించాడు. మళ్ళీ పెద్ద గాడు. నిధి చెయ్యిని ఓగించి పట్టుకుంది. తోసేశాడు. అతని కళ్లల్లోవుంది. దిగి నడుద్దామనుకున్నాడు. నాగమణి నవ్వుతోంది.

'నీలు తేబోతుంటె నీతోడె వోలమ్మో, నన్నెనకవోను తన్ని సూస్తుంటాదే...' అని జగన్నాథం 'ఎంకిపాట' మొదలెట్టాడు.

నాగమణి అతన్ని పదేపదే తాకటం, నిధికి తప్పుగాతోచినా, బాధ కలిగించినట్లు వొప్పుకోలేక పోతున్నాడు. అదో అల్పమైన, తాత్కాలిక అనుభవం. ప్రేమికుల నిరంతర యాత్రలో, లక్ష్యం చేరుకునేముందు, మార్గాన్నిచూపే మైలురాళ్ళు యీ అనుభవాలు. ఆ చేష్టలకి ఏమీ అర్థంలేదు; ఎవ్వరూ యిల్లా చెయ్యాలని అనుకోరు; పరిస్థితులనుబట్టి యాత్రికులు సృష్టించుకున్న మజిలీలు. ఎప్పుడూ ఎవర్నో వొకర్ని ప్రేమిస్తూ వుండటం మానవుని నైజం. ఈ చేష్టలన్నీ ప్రేమరాజ్యంలో సామంతరాజులు, అప్పుడప్పుడు, అవకాశాలనిబట్టి సామంత రాజులు, కేంద్ర ప్రభుత్వంపై తిరుగుబాటు సల్పడం జరుగుతూ వుంటుంది. చివరికి వారి ఓటమి తప్పదు; అప్పుడు రాజు వారిని దండించకూడదు. వారు లేందే తన రాజ్యమేలేదు!

అతను చెయ్యాకాలూ దూరంగా లాక్కున్నాడు. ఇంతలో కాలు

మళ్ళా ఆమెకేసి ఎల్లా జరిగిందో! ఏకాంతంగావున్న తన చేతిమీదికి నాగు మణి చెయ్యి ఎల్లావొచ్చింది? ఇద్దరూ అది గమనించడం, గమనించనట్లు ఏదో కేవలం బండికుదుపుకే అల్లా జరిగినట్లు నటించడం-జరుగుతునేవుంది. అతని చెయ్యిని గట్టిగా అదిమింది. చెయ్యిమార్చి, అరిచేతిని పైకితీశాడు. ఎక్కడో అడుగు దూరంలోవున్న ఆమె కుడిచెయ్యి, ఆ చేతిమీద ఆని, వేళ్ళువేళ్ళ కలిపి బిగించేసింది. సామంత రాజుల తిరుగుబాటు, సన్నటి పొడుగాటి, గట్టి వేళ్ళు!

లాకుదగ్గరకి బళ్ళు చేరుకున్నాయి.

రెండు టాపులేని డింగీలనీ, మధ్యతాడుకట్టి వొకటిచేశారు. చుక్కా-నికి గురవయ్య సిద్ధమయ్యాడు. ముందు పడవలో, డేరాకోసం తెచ్చిన పెద్ద దుప్పట్లు, రెండు కంబళ్ళు, టీ సామాను పెట్టి, కారంబోర్డు, వుంచి జగన్నాథాన్ని కూర్చోమన్నాడు. అమృతం కూడా అందులోనే కూర్చుంటానంది. సుశీలా, నాగుమణి వెనకాల దాంట్లో ఎక్కారు.

హై లెవెల్ కాలవ వడిలేకుండా గట్లనిండుగా అదుముకుంటూ, ఎటుపో, వాలో, తెలీకుండా పాకిపోతోంది. రెండు పక్కలా చెట్లకొమ్మల్ని నీళ్ళల్లోకి చాచుతూ ఆహ్వానంకోసం హాజరైన స్కౌట్ల సిబ్బందిలా పొడుగూతా వుంటూనే వున్నాయి. నల్లటి నీడల్ని పరిచేందుకు తగిన తీక్షణంలేని శీతాకాలపు సూర్యుడు నీళ్ళల్లో వజ్రంలా మెరుస్తున్నాడు. దిక్కులేని గాలి, నీళ్ళని ఉత్తర దక్షిణాలకి గెంటుతోంది. ఎగిరిపడుతూ మొహాన్ని మూసేస్తున్న పమిటని అమృతం తలమీద గుండ్రంగా ముసుగేసుకుని, కొంగుని జబ్బమీద రవిక అంచులో దోపుకుంది. ఎగిరిపోతున్న నాగుమణి కొంగుని సుశీల తన పళ్ళతో బిగించి పట్టుకుంది. జగన్నాథం క్రాపింగు పాపిడి ఎప్పుడో చెదిరిపోయి వెంట్రుకలు పైకి నిలబడ్డాయి. అక్కయ్యాని దువ్వెన తియ్యమన్నాడు. కసురుకుంది. ఊరుకుని కాసిన నీళ్ళతో జుట్టుని తడుపుకుని [illegible]స్తున్నాడు. దయానిధి పిల్ల నీడల్ని నీళ్ళల్లో చూస్తూ గట్టున నడుస్తున్నాడు.

ముందు పడవకి తాడుకట్టి 'బికారి' గట్టున లాగుతూ నడుస్తున్నాడు. మలుపు తిరగ్గానే ఫర్లాంగు రాయిదగ్గర బికారి ఆగిపోయ్యాడు. గోచీ పెట్టుకుని, ఎర్రగుడ్డ పాగాచుట్టుకుని నల్లరుద్రాడు కొబ్బరిచెట్టు మొగలో వుండి, కాయలు దింపుతున్నాడు. కింద మరోవ్యక్తి నడుంకి తువ్వాలుచుట్టి, కొబ్బరికాయలు కొడుతున్నాడు. రెండోచెట్టు వెనకాల బండమీద కోమలి కూర్చుని గుంజు తింటోంది.

బికారి చెట్టుమీదినుంచి రుద్రాణ్ణి దిగమని ఆజ్ఞాపించడం, కొంచం వెనక నడుస్తున్న దయానిధి విన్నాడు.

'ఏమయ్యా పెద్దమనిషీ, కుర్రోడికి, వాడికి బుద్ధి చెప్పడం పోయి నువ్విదేంపనయ్యా—జుల్మానా తెలుసా? సర్కారు చెట్లు యివి.' అని బికారి నడుంతువ్వాలు వ్యక్తిని కూకలేస్తున్నాడు. ఆ వ్యక్తి కాయలుకొట్టడం మాని కాలవలో చేతులు కడుక్కున్నాడు.

'ఎవరిది? యీసెట్టు, మాది—కొట్టు, రంగయ్యా—ఏంటి భయం!' అంటూ కోమలి చెట్టువెనకనుంచి వొచ్చింది. రెండు మూడు రకాలచెట్లు మొదళ్ళలోనే అల్లుకుపోయినట్లుగా జడంతా ముళ్ళుడిపోయి, విడిపోయిన వెంట్రుకలు చెంపని పరదాలో కప్పివేశాయి. అంచులేని పచ్చటి ఆకుపచ్చచీర గాలికి రెండు కాళ్ళనీ పట్టుకుని, వెనక్కి గోసీకోసం ఎగురుతోంది. కుడి చేతికి వొక్కటే ఆకుపచ్చగాజు; అక్కడక్కడ రాళ్ళులేని దుద్దులు, ఎర్ర గళ్ళ నల్లరవిక—ఖరీదైన వేషంలోవున్న కోమలి, కోపం ప్రకటించడానికి కొంతప్రయత్నం చేస్తోంది.

నల్లరుద్రాడు కిందికి దిగాడు. 'నాకు తెల్దండి—ఆ లెక్కమన్నా రండి.'

'పో, వెధవ—' అన్నాడు బికారి.

'పోతానండి' అంటూ వాడు పరుగెత్తాడు.

'మాయిష్టం, మాసెట్టు; నీ కెందుకు?'

'నువ్వెక్కడకి దాపరించావ్?' అన్నాడు ఓకారి. దయానిధి వారిని కలుసుకున్నాడు.

'మీరు వొచ్చారే!' అంటూ తెల్లబోయింది కోమలి.

మళ్ళా అందుకుంది 'మాడండి—యీ సెట్టుమాది, అల్లద్దిగో ఆడుం డేది మా పొలం, మా అమ్మకూడా వుందక్కడ. యీమూడూ సర్కా రోళ్ళని...'

అది నిజమే సర్కారుచెట్లపై నెంబర్లు చెక్కివున్నాయి. నెంబరులేంది కామాక్షిది. అన్నీ కలిసి దగ్గర్లో వుండడంమూలాన, యిట్లా కళాసీలు ఆ చెట్టుపై అధికారం చూపినవాళ్ళని బుకాయించడం పరిపాటైపోయింది.

"అబ్బో - సాలామందే వున్నారే...రంగయ్యా, నువ్వింటికి పో. అమ్మతో కాసేపుండి వొత్తానను." రంగయ్య తువ్వాలు తలకి చుట్టుకుని, రెండు కొబ్బరికాయలు మెలేసికట్టి బుజాన వేసుకుని నడవడం మొదలెట్టాడు.

"తొందరగా రా,..." అని దురాన్నుంచి సంజ్ఞచేశాడు రంగయ్య—ఎవరో?...కోమలి వింత ప్రపంచంలోని విచిత్ర వ్యక్తులలో వొకడు. కోమలి ప్రభావం, వాళ్ళందరిమీదకూడా వొత్తిడి కలిగించింది.

పడవలో గుసగుసలు బైలుదేరాయి. జగన్నాథం, పడవని వొడ్డుకి నెట్టి, గట్టుమీదికి దూకాడు.

"నాకీ కైలుఖర్మేం? హాయిగా నడుస్తా"

"నేనూ నడుస్తా బాబూ—" అంటూ సుశీలకూడా దిగింది. మొత్తం మీద వొకరివెనక వొకరు, అందరూ దిగారు.

చుక్కానీవాడు పడవలో పడ్డ చేపను పట్టుకుని కాలవలో పారె య్యడానికి యత్నాలు చేస్తూ కూర్చున్నాడు.

"సేపని పడతం రాదు—యింతేనా—" అంటూ కోమలి చుక్కానీ వ్యక్తిని చూస్తోంది. తను గబగబా పడవలోకి ఎక్కి, చేపకోసం వేట పారంభించి, యిట్టేపట్టుగుని గట్టుమీది కొచ్చింది.

చేలల్లోంచి సన్నటి కాలిబాట వుంది; చేలుదాటగానే పెద్ద పచ్చగడ్డి మైదానం—అడుగు ఎత్తు ఎదిగిన గడ్డిపోచలన్నీ గాలికి తలలాడిస్తున్నాయి. మైదానం మధ్యలో జట్టుగా సర్వీచెట్లు జెడలు విరబోసుకున్నట్లుగా పలకరించుకుంటూ మెదుల్తున్నాయి. వాటిని ఆనుకుని పెద్దమామిడితోపు—సూర్యరశ్మి సోకకుండా, దట్టంగా అల్లుకుని రహస్య నిశ్చలత్వాన్ని నిరూపిస్తున్నాయి. వాటికొమ్మలు, మధ్యగా వున్న చిన్న చెరువులోకి వ్రేల్లాడుతున్నాయి. ఆ చెట్లు మెత్తటి చలినీడలలో వాళ్లు విడిది చేశారు. తపోభంగమైన ఋషిలా, వొడ్డునున్న కప్ప నీళ్లల్లోకి ఎగిరిపడింది. ఎవరి కాలుకిందో మామిడిరెమ్మ పటుక్కుమంది; ఆకులు రెపరెపలాడాయి; పశ్చిమపవనం ఆకుల్ని పోగుచేసుకుని జోహారిస్తూ వర్షించింది; రామచిలుకలు చెప్పరాని సిగ్గుతో తలకాయల్ని దాచుకుని సైగలు చేస్తున్నాయి—ఈలపిట్ట మత్తుతో వొళ్ళు విరుచుకుంది—ఒక్కసారిగా ప్రకృతి జీవించి, చోద్యం చూస్తోంది.

కోమలి చెరువుగట్టున వికృతంగా కాళ్ళుముడుచుకుని కూర్చుంది. మెల్ల మెల్లగా ఆకృతి పొందుతున్న పొడుగు కెరటం, ఆమె మొహాన్ని అవతల గట్టుదాకా వ్యాపింపచేసింది. నీళ్లల్లో ప్రతిమలా, శీలంలేని మొహం—చన్నీళ్ల లోతులో గోరువెచ్చదనం దాచుకున్న చల్లటి మొహం.

'కళ్లెత్తితేసాలు, కనకాభిషేకాలు' అన్నపదం జ్ఞాపకం వొచ్చింది నిధికి—కాంతులు కురిపిస్తూ, ధగధగ సిరితో మెరిసి, కోర్కెతో మండిపోతున్న నేత్రాలు.

చెట్లకింద అన్నీపరిచి, నాగుమణి స్టౌవ్ ముట్టించింది; సుశీల చూస్తూ కూర్చుంది; కోమలికేసి, నిధికేసి—వారిద్దరూ తన్ని చూడకుండా, వొకర్ని వొకరు చూసుకుంటున్నప్పుడు—సుశీల తన్ని చూడకుండా, అదంతా అమృతం చూస్తోంది; నాగుమణి, అమృతం సుశీలని చూడకుండా, సుశీల వాళ్లని చూడడం, అమృతం గమనించకుండా, అందర్నీ చూస్తోంది. కోమలికి అన్ని యింతమంది చూస్తున్నారని తెలీకపోయినా, తెలిస్తే తాను ఎల్లాచూసు

నో, అల్లా చూడాలని యత్నిస్తున్నదానికి మళ్లీ చూసి, చూసి, ఆఖరికి వచ్చేశింది—ఏదో గట్టుమీదనుంచి చెరువులోపడి, కెరటం, ప్రయాణం ప్రారంభంలోనే - నవ్వింది

'ఇదేనా—పిక్నిక్కు?'

సుశీల నవ్వింది— కళ్లజోడు పట్టుజారి వూడేటట్లుగా.

'పెద్ద నవ్వాలా ఏమిటి?' అంది అమృతం.

'టికిక్, పికిక్ చికిక్'—అంటూ నాగుమణి ఆక్షేపణ మొదలెట్టింది.

కోమలికి కోపం వొచ్చింది.

'మహా—పాసిపళ్లి మా లచ్చి' అని పళ్లచిగుళ్ళు చూపిస్తూ వెక్కిరించింది.

'నీవో—నీవి...' ఏమనాలో నాగుమణికి తెలీలేదు. పళ్ళు పటపట కొరికి స్ట్రాప్ పిన్ను విరగకొట్టింది.

'చూస్కో—దాపళ్లకేం' అని కోమలి పళ్లని ప్రదర్శించింది, దయానిధికి నవ్వొచ్చింది.

'మిమ్మల్ని యిది చూట్టానికేనా తీసుకొచ్చింది?' అని సుశీల అడిగింది చెట్లని సంబోధిస్తూ.

'ఏదో ఇంగ్లీషు రాదనుకో-అంటే కోపం రాదా ఏమిటి?' అంది అమృతం.

'నువ్వేం వెనకేసుకుని రానక్కరలేదు?'

'అవును. పాపం అల్లా అనడం ఏం బాగుంటుంది?'

'మధ్యన మీకెందుకండి...' అని నాగుమణి అంటుకుంది.

'ఏమిటిబావా. అల్లా చూస్తూ వూరుకుంటావ్' అంది అమృతం.

'నూత్తమే ఆయనకి బాగా సేతవును' కోమలికి ఏం మాట్లాడాలో తెలీడంలేదు. అల్లా అనడం తప్పేమో ననుకుంటూ,—'సూత్తింకూడా తెల్దు' అంది.

సుశీల నవ్వుని కొంగుని పళ్లలో బిగించి ఆపుగుంది.

'తానం ఆడ్తారా?' అంది కోమలి అందర్నీ వుద్దేశించి.

'నీకీ తొచ్చునా?'

'ఓ—'

'గోదావరి అట్నించి యిటు యీదినవాడు-నేనూ వొకే రైల్లో ప్రయాణం చేశాం— అంచేత స్నానానికి మనం సిద్ధం...' అంటూ జగన్నాథం ప్రవేశించాడు.

'ఇంతసేపు ఏం చేస్తున్నావురా?' అమృతం అడిగింది. 'బికారతో స్వైర విహారం.'

'ఆ వెనకాల చేతులో ఏమిట్రా?'

జగన్నాథం చేతులు వెనకాలబిగించి కోమలి దగ్గరగా వొచ్చాడు.

'ఇందాక మీద నీళ్ళుపోసి, పదిమందిలోనూ, పరాభవంచేసిన అంగన నువ్వేనా? బావగారు! యీపూట తెనుగు దంచేస్తున్నాను...'

'ఏంటి పిల్లోడా!' అని వెనక్కి తగ్గింది. మొహం చిట్లించి కళ్ళు మూసేసుకుంది, సూర్యరశ్మి భరించలేని పద్మలా.

'**What a foolish!** మళ్లా మనవిచేసుగుంటూ--బైది బై, బావగారు, యీ యువతీలలామ ఎవరో కించెత్ శెలవిచ్చారుకారు....'

'కోమలి రా—అదేం వాగుడు తిన్నగా మాట్లాడలేవా?' అంది అమృతం.

'**More foolish ! Italian of the East.** స్వచ్ఛమైన తెనుగు భాష ప్రయోగిస్తుంటే **to call it** వాగుడు!'

'ఏంటబ్బాయి—మీదిమీది కొస్తుండా...' అని యింకా వెనక్కి జరిగింది కోమలి.

'నీకలవాటేగా.' అంది నాగుమణి—

'తప్పు' అంటూ అమృతం ముక్కుమీద వేలేసుగుంది.

'ఏంటికూశావ్ - మళ్ళీకుయ్.' అని కోమలి నాగుమణికేసి కసిగా చూసింది.

**What a foolish!** కూత! ఇందాక నామీద జలకర ప్రయోగం చేసిన అబలవు నువ్వేనా...' అంటూ, చేతులోవున్న ఆకుల కొమ్మని మోచేతికి రాశాడు. కోమలి గోక్కోడం మొదలెట్టింది.

'ఆ ఆకులేమిట్రా - యిల్లా పట్రా' అంది అమృతం. కోమలికి దురద ఎక్కువైపోయింది. జగన్నాథంకేసి కొంటెగా చూసి, మంటని బలవంతంగా ఆపుగుని, ఆ కొమ్మని లాక్కోబోయింది. జగన్నాథం పరుగెత్తాడు-అతన్ని తరుముతూ వెనకాల పరుగెత్తుతోంది కోమలి. ఈ దృశ్యం చూస్తూ దయానిధి నడవడం మొదలెట్టాడు. అంతవరకూ ఏదో చెప్పరాని అనుమానాలతో మూగదైపోయిన వాతావరణం, కంఠం సవరించి, సాక్షీచేసుకున్నట్లుగా మిగిలిన వ్యక్తులందరూ, మామూలు ధోరణిలో పడ్డారు- నీళ్లన్నీ ఎండిపోయిన కాలవ.

చింపిరి జుట్టులో జొరబడి పాపిడిలో దారిచూసుకుంటూ నడిచిపోయిన మెరుగు పురుగులా కోమలి గడ్డిలో పరిగెత్తుకు పోతోంది - జగన్నాథాన్ని తరుముకుంటూ. దూరంగా సర్వీచెట్టు వెనకాల దయానిధి నిలబడి చూస్తున్నాడు. కోమలి జగన్నాథాన్ని పట్టుకుంది; యిద్దరూ పెనుగులాడుకున్నారు; అతని చేతిలోవున్న దూలగుండ మొక్కని లాక్కుని అతన్ని బుజాలమీదికి ఎత్తుకుంది; ఆ మొక్కని అతని మొహం అంతా రాసింది. అతను గడ్డిలోకిదూకి ఆమె చేతులోంచి ఆ మొక్కని లాక్కున్నాడు. మళ్ళా పరుగులు ప్రారంభించారు, ఆమెముందు, అతను వెనకా. గడ్డిపోచలే ప్రాణం తెచ్చుకుని ఎదిగిపోయి, మనిషిగా మారినట్లు పచ్చ చీరలో కోమలి కదిలిపోతోంది. సర్వీచెట్ల వెనక మాయమవుతూ, నల్లటి మేఘాల మధ్యనుంచి ఆకస్మికంగా మెరిసిన మెరుపులా, ప్రకృతిని తనలో ఐక్యంచేసుకొంటోంది. ఇంకా దూరంగా వెళ్లిపోయింది.- ఆకుపచ్చగా, పల్చబడి, అంతర్థాన

మైపోయింది. చెట్లు, గట్లు, పుట్టలు, పిట్టలు, అన్నీ అటుకేసి కదుల్తున్నట్టుగా మెదుల్తున్నాయి. ఆకాశం విశాలంగానవ్వి, సూర్యుణ్ణి అరచేతి మేఘంతో కప్పింది. నీలం ధగనితేకుండా నవ్వుతోంది. నీలం, ఆకుపచ్చన్ని దూరంగా కోమలి చెయ్యి చెయ్యీ కలిపింది.

అట్లా గడ్డిపోచలమధ్య గంతులేస్తూ ఆకాశాన్నీ, భూమిని బుజ్జగిస్తూ స్నేహంచేసుకుంటూ వుండవలసిన వ్యక్తి కోమలి. ఆమె నిజస్థానం అది- పుట్టిల్లు పచ్చగడ్డి, అత్తిల్లు ఆకాశం. పిట్టలు పువ్వులు సంతానం. మనుషుల మధ్య, యిండ్లల్లో వుండి, ఎంగిళ్లు ఎత్తవల్సిన మనిషికాదు. కొందరు, కొన్ని వాతావరణాలకోసం వుద్దేశింప బడతారు, ఆవాతావరణం మధ్యనే వారికి పరిపూర్ణత, వుంటుంది. స్వేచ్ఛా జీవనానికి ఆలయాలు వాతావరణమే. అందులోంచి తొలగిస్తే వారు నీరువిడిచిన చేపలు - శృంఖలాలు లేని బాని స॥. స్వేచెట్లు వానాకాలంలో పీల్చుకున్న వర్షం నీటిని యీనాడు మెల్ల మెల్లగా వొదులుతూ, కోమలిని మధ్య కూచోబెట్టి తలంటుపోస్తోంది. గాలి సిగ్గులేని పిచ్చి పువ్వుని బలవంతగా తల్లో అమరుస్తుంది. వానకి చెలించిన వేడి, భూమిలో మైకంచెంది సుగంధ పరిమళంకింద ఆమెని ఆక్రమిస్తుంది. ఎర్ర పువ్వులను బంధించుకున్న గడ్డిపోచలు గాలికి ఎండలో మెరుస్తూ లయగా ఆరపెట్టిన ఆకుపచ్చ పట్టుచీరలా, ఎండుకుని కోమల్ని చుట్టుకుంటాయి. ఆకలి దాహాలులేని అనామయపు ఆశ, దారుణాలు ఎరగని దైవత్వం, హద్దులులేని అనుభవం ఆమె.

రాతి శిధిలాల మధ్యవుండవల్సింది అమృతం. ఎక్కడో, ఏ హంపీ లోనో-అన్నీ రాళ్ళు - భగ్న ప్రతిమలు. వొంటరిగా నిల్చిపోయిన స్తంభాలు ప్రేమకోసం గుండెరాయి చేసుకున్న రాకుమార్తెల విగ్రహాలు - అన్నీ శిధిల మైపోయి, ఏ అర్ధరాత్రో అడుగులచప్పుడూ, నిట్టూర్పు వినబడితే కదులు తాయేమో ననిపించే ప్రమాద స్థితిలో పడివుంటే వాటిమధ్య అమృతం కూచుని, విషాదంతో నవ్వుతుంది. ఆమె, గడిచిపోయిన అనుభవపు వైభవా

లని తల్చుకుని, ఏడ్చి ఏడ్చి, అతీతం ఐనప్పుడు కన్నీరు చుక్కలు చుక్కలుగా రొమ్ముల మధ్యనుంచి జారి యీనాటికి నదిగా ప్రవహిస్తోంది. తన దుంఖం నదులై పొంగి పొంగి దేశాన్ని ముంచివేస్తుంది - తప్పు! తను ఏడ్వకూడదు - విషాదంతో నవ్వుతుంది. ఆనాడు సౌందర్యం తనయాత్ర ముగించుకుని ఆమెను శిలగా మార్చివేస్తుంది. ఏరాత్రిని నిట్టూర్పుతో కదిల్చినా అమృతం కలలో కార్చిన కన్నీరల్లే నీరైపోతుంది.

సుశీల వాతావరణం వేరు. పెద్ద బస్తీలో మధ్య, బంగాళాలో, మూడో అంతస్థుమీద మధ్య గదిలో, మధ్య సోఫాలో కూర్చుంటుంది. పైన ఆకు పచ్చరంగు ఫాన్; ఎడమవైపున బ్రాకెట్ బల్ల, దానిమీద చేతులో ఎలక్ట్రిక్ బల్బు పట్టుకున్న వీనస్ డిజైనులో బ్రాంజ్ ప్రతిమ. - పక్కన ఇరవై మూడు పుస్తకాలు పట్టే అద్దాల బుక్‌షెల్ఫ - దానిమీద ఫొటో స్టాండ్‌లో తోరుదత్ తైలచిత్రం, తొమ్మిదిగజాల ఆగ్రా మస్లిన్ చీరచుట్టూ నాలుగుసార్లు తిప్పి కట్టుకుని, చైనీస్ డిజైన్ లాంప్ షేడ్‌కింద, ఇండియా పేపర్ ఎడిషన్‌లో వొచ్చిన Scot's Bride of Lammermoor పుటలని దంతపు పేపర్ కట్టర్‌తో కోస్తూ కూర్చోవలసిన మనిషి. జ్ఞాపకం తెచ్చుకుని బాయ్‌ని కేకేసి తన కళ్ళజోడు Chest of Drawers మూడో అరలో మంచి గంధపు పెట్టెలో వుంది తీసుకు రమ్మంటుంది కాబోలు!

జగన్నాథాన్ని తక్షించమని దయానిధి దగ్గరగావొచ్చి, ఆకుల్ని అతని వొంటికి రాస్తుంది కోమలి. అక్కడుండి యిక్కడలేని కోమలి గంతు లేస్తూ, ప్రకృతంతా వ్యాపిస్తుంది. అతను వెనకాల తరమడం మొదలెట్టాడు. ఒక మహత్తర శక్తి వారిద్దర్నీ ఎక్కడికో తోసుకు పోతోంది. చోద్యం చూస్తూ ఉడతల జంట వెంటపడింది. అది చిన్నకొలను; గడ్డి వొయ్యారంగా నీళ్ళల్లోకి వొరిగింది. మాసిపోయిన అద్దంలోలాగా సూర్యబింబం నీళ్ళల్లో చలించకుండా, జలచరాలని రంగు రంగులుగా చలింపచేస్తోంది. కోమలి అక్కడ పడిపోయింది, అవయవాలు పట్టుతప్పిపోయి నిస్పృహగా వుండి

పోయ్యాయి; చీరచుట్టువిడి వొంటిని అంటి గడ్డిలో కలిసిపోయింది. అతను ఆమె రెండుచేతులూ పట్టుకున్నాడు; పచ్చగాజు పటుక్కుమంది. ఉడతలు సిగ్గుతో కొమ్మమీద దగ్గరగా జరిగాయి. నాలుగుకళ్ళూ వాళ్ళకే వొప్పజెప్పి మాటలు బిగించుకుని రహస్యాన్ని తెలుసుకున్నట్లు నివ్వెరపోతూ,—అతను కొమ్మనుపీకి అవతల పారేశాడు; ఆమె రెండుకళ్ళల్లోకి తీవ్రంగా చూశాడు.

భరింపరాని సహజ సౌందర్యం అతన్ని శక్తిహీనుణ్ణి చేసింది. అతనికి వొస్తువులు కనబడక, చూపు తడబడుతోంది. కళ్ళు గట్టిగామూసుకుని, మాలిని కున్నాలా చుట్టుకుని:

'ఏంటది!' అంది కోమలి - సైకం చెందిన ఉడత కొమ్మమీది నుంచి పడింది. అర్థంలేని అయోమయపు మూగ బాధ అది.

గాజు పటుక్కుమన్నచోట రక్తంబొట్టు చూసుకుంది; లేచి కూర్చుంది; చెయ్యి వొదిలించుకుంది; ఆపలేని ఆయాసాన్ని ఆపుకుంటోంది. రెండు చెమట బిందువులు నుదిటినుంచి జారి కనురెప్పల్ని అంటిపెట్టుకున్నాయి - చెమటబిందువులో, ఆనందంతో మెరుస్తున్న కన్నీటిబిందువులో తెలియకుండా, రెండు ఉడతలు దగ్గరగావొచ్చి. చెవులు నిక్కబొడుచుకుని వింటున్నాయి.

ప్రశ్నలు అతనికళ్ళని కలవర పరుస్తున్నాయి. ఏంకావాలి? 'ఎప్పుడు, ఎక్కడ?'- ఈరెండింటికీ సమాధానం, చేతిని చూసుకుని 'రకతం' అంది. రుమాలులో తుడిచాడు- ఎరుపులేని, వొపికలేని పల్చటి, ఎర్రటి రక్తాన్ని.

'ఏంటది - అల్లా చూస్తారు? అమ్మో - ఉడత!' అంటూ ఉడతలకేసి చూడమంది. ఉడతలజంట భయంతో దూరంగా గెంతాయి.

ఉడతలాగే తనూ మొహం బిగించుకుంది. అప్రయత్నంగా అతని బుజంమీద చెయ్యివేసి పైకి లేవబోయింది. అతను చేతిని గట్టిగా పట్టుకోబోయ్యాడు, కాని అప్పుడే జడ మెడమీదినుంచి ముందుకు జారి అతని మొహాన్ని కప్పేసింది. 'నీకూ నాకూ మధ్యనిశీధిలాపడ్డ నీజడ' అన్నవాక్యం

జ్ఞప్తికొచ్చింది.

'తప్పు - ఏంటది!' అని చిత్రంగా ముక్కుమీద వేలేసుకుంది. లేచి నిలబడింది. 'ఇస్' అని చప్పుడుచేసి, ఉడతల్ని దూరంగా తరిమేసింది. 'రాతిరి నూతికాడ దీపం పెడతాగా...రాతిరి...' అని 'రాతిరి'ని సాగదీసి ఉచ్చరిస్తూ కళ్ళు గట్టిగా మూసుకుంది. ఉడతలు అర్థమైనట్లు గుసగుస లాడుకుని, విసుగేసి వెళ్ళిపొయ్యాయి. కోమలి పడ్డచోట కోమలంగా వొంగిపోయిన గడ్డి, మెల్లిగా యథాస్థానంలోకి లేచి కదుల్తోంది. జలచరాలు అవతలవొడ్డుకి నవ్వుకుంటూ వెళ్ళిపోయాయి, రంగులతో. చీరలో దిగడిపోయిన ఆకుల్ని, గడ్డిపూవుల్ని అతను విడదియ్యడం మొదలెట్టాడు. లాక్కుని వెనక్కి అడుగేసి, పట్టుజారి కొలనులో పడింది కోమలి. అతను చెయ్యిపట్టుకుని పైకిలాగాడు. నోట్లోంచి నీళ్లు వొదిలేసింది; నీళ్ళకి తడవనంతటి వొత్తైన జుట్టుని తనచేత్తో వెనక్కి సర్దుకుంది, తడి, వొంటిమీ చీరని అదిమేసి, ఆరేస్తే గాలికి కొట్టుకుపడ్డ చీర మడతలాగైంది. బుజాలవొంపు వికృతంగా పైకి పడింది. చలికి వణుకుతున్న చర్మం, ఆమెలి. గొంతులోంచి కదలడానికి పైటకి దీసిన, థర్మాస్ ఫ్లాస్కులా, పచ్చగా మెరిసేటట్టు చేసింది.

ఒడ్డున మోకాళ్ళ చుట్టూ చేతులు బిగించుకుని, వొణికిపోతూ కూర్చుంది.

'సలి పుడతోంది - ఏదేనా తీస్కురండీ - అబ్బ - ఏంటది - 'మొగాళ్ళు, దూరంగా సెట్టుకాడి కెళ్ళండి.'

దయానిధి అటూ యిటూ దిక్కులు చూస్తున్నాడు. అతని కండువా తోటల్లో చెట్టుకొమని వొదిలేశాడు. ఏంచెయ్యడం? చివాలున అతని పంచి గోచీలోంచి తొలగించి మొహం తుడుచుకుంది, రుమాలిచ్చాడు. తలకి చుట్టుకుంది. వస్త్రాలు లేనిరోజుల్లో పూర్వీకులు ఏం చేశేవారో? చెట్ల మొదళ్ళు, ఆకులు - వీట్లతో తుడుచుకునేవారు. ఎక్కడేనా అరటాకు దొరుకుతుందేమోనని దూరంగా చూస్తున్నాడు.

'ఇక్కడున్నారంటండి-నాన్నగారొచ్చారు. మిమ్మల్ని తొందరగా రమ్మన్నారు...రండి రండి...'

వెనక్కి తిరిగాడు; స్వీచెట్టు వెనక నారయ్య.

'ఏం నారయ్యా - అప్పుడే...'

'జట్కాబండిలో వొచ్చారండి - కాలవకాడున్నారు, మిమ్మల్ని దబ్బున తీసుకురమ్మన్నారు...'

కూర్చున్న కోమలిని చూశాడు నారయ్య. 'నువ్వెందుకొచ్చా, యిక్కడికి?'

'నేనే రమ్మన్నాను.' అన్నాడు నిధి.

'ఆరే! రమ్మనలేదు - నేనే వొచ్చామాపొలంకాడికి - నాయిష్టం, నీకెందుకు?' అని, వొంకర మాటలతో అంది కోమలి.

నారయ్య కళ్ళల్లో కోపాగ్ని చల్లార్చుకుని, నవ్వుని బలవంతంగా ఆపుగుని, పొగాకుడ్డతీసి కోమలి వొంటిమీద గిరవాటెట్టాడు.

'ఛీ - పాడు...' అనుకుంది తనలో.

'ఏడి శావ్ - నీళ్ళల్లో తడిసి ఆరేసుకుని కట్టుగుర్రా, పద. నీ ఫ్రాక రెయ్యమని చెబుతా మీ అమ్మతో...' అన్నాడు నారయ్య.

'అంత తొందరేమొచ్చింది నారయ్యా?' అని నిధి ప్రశ్నార్థకంగా అడిగాడు.

'నాకేం తెలుస్తుందండి. లెండి, పోదాం.'

ఇంతలో 'పిత్తొచ్చింది, పిత్తొచ్చాడు' అని కేకవేస్తూ జగన్నాథం చక్కా వొచ్చాడు.

'అదేంటయ్యా, పీతేంటి పత్రాయనా?' అని అడిగాడు నారయ్య.

జగన్నాథం జోరుతగ్గింది; గుటకలేసి.

'సుశీల పిత ..' అన్నాడు.

'అంటే?' అన్నాడు నిధి.

'ఓస్. యింతమాత్రం తెలీదుటండీ - పిత - తండ్రి

'సుశీల పితా - సుశీల నాన్నగారు - వొచ్చారని, తాత్పర్యం' అన్నాడు.

'గోవిందరావ్ మామయ్యా!'

'అతగాడు సుశీల పితైతే అతగాడే......ఓహో గోపికా జలక్రీడా ఫలితంబా యిది. ఓహో, శ్రీకృష్ణుం డెవ్వరో కోక్!...' అంటూ కోమలి కేసి చూస్తున్నాడు.

'ఏంటయ్యా. ఆ పిచ్చివాగుడు?'

'దగ్గర కొచ్చావంటే సూస్కో.' అంది కోమలి జగన్నాథాన్ని బెదిరిస్తూ.

'మనకి నీళ్ళంటె కించిత్ భయం. అందులో నీళ్ళాడిన అంగనలంటే మరీని. పాపం రెవిక లేదు కాబోలు. శివదీక్షా పరురాలనురా - చీర ఎంతైనా విడవనురా...ఇదుగో, యీ చీని చీనాంబరం ధరింపుము...' అని చొక్కా తీసేసి కోమలికిచ్చి, తొడుక్కోటమని సంజ్ఞచేశాడు.

'ఛీఛీ పాడు పిల్లడ...'

'మీరు రండి-అది బట్టలార బెట్టుకుని యింటి కొడుతుంది లెండి...' అని యిద్దర్ని కదిపాడు నారయ్య.

'ఎల్లిపోతుండారా...' అంటోంది కోమలి.

'పోయ్‌నయ్యో యిప్పుడు ననుబాసి...' అంటూ పాడుకుంటూ జగన్నాథం పరుగెత్తాడు.

పిక్‌నిక్ సరంజాం అంతా కట్టేసి అందరూ కాలవవొడ్డుకి నడవటం సాగించారు. సుశీల అందరికంటె-ముందుగా నడుస్తోంది, విడిగా.

అమృతం ఫ్లాస్క్ పుచ్చుకొని, కండువా బుజాన్న వేసుగుని మెల్లగా నడుస్తోంది. పక్కనే నాగుమణి.

'కాస్త టీ యిచ్చి తాగుబావా.' అని ఫ్లాస్క్ తీసి మూతలో కొంచం

పోసిచ్చింది.

'ఎక్కడి కళ్లావు బావా..'

అతనేమీ మాట్లాడలేదు.

'ఇంకెక్కడికి, ఆ కోమలితో సరసాలు...' అంది నాగుమణి.

సుశీల జోళ్ళో యిరుక్కున్న మట్టిబెడ్డ తీస్తూ నిలబడి వాళ్లని కలుసుకుంది.

'ఆ పెంట ముండతో సరసాలా?' అంది గీర్వాణంగా.

'తప్పు సుశీలా - పెంటదెల్లాగేంది. ఏదో మనకి నాలుగు ఇంగ్లీషు ముక్క లొచ్చునకదా అని...' అంటోంది అమృతం.

'నువ్వు చెప్పకొనే అమృతం...నీకూ మీ ఆయనకీ పెంట వాళ్ళ మధ్య ఆ పల్లెటూళ్ళల్లో వుండడం మరిగి, వాళ్ళందరూ దేవకన్యలలా కనిపిస్తారు.'

'మే మేం పెంటవాళ్లమధ్య లేం. మావూళ్లో అరవై బ్రాహ్మణ కొంపలున్నాయి. నీలా డాబులు చెయ్యకపోతే సరా...' అంది అమృతం.

'పల్లెటూరి మొద్దువి నీకు మాట్లాడ్డం తెలిస్తేగా...'

'చూశావా బావా, ఎంతలేసి మాట్లంటోందో—తన్ని వీరున్నానని, తనకీ గర్వం అంతా తండ్రి తాశిల్దారనేగా. అవునుమరి. మర్యాదగా సంసారంచేసే నాబోటి మొద్దులు నీలా గడుసుగా ఎట్లా మాట్లాడగలరులే...'

'పోదూ, ఎల్లాగో సంపాదించావు, వో మొగుణ్ణి...'

'పోనీ - నీకా మొగుడూ లేడుగా...' అంది అమృతం.

'మొగుళ్లకేం, కట్నాలు పారేస్తే కావల్సి నంతమంది.'

మధ్యలో నిధి అందుకున్నాడు—'ఇంతకీ మీ దెబ్బలాట కోమలి గురించి...మీరు నిన్నల్లా చూస్తామన్నారని, నే తీసుకొస్తే, మీరుచేసేపని లాదా...'

సుశీల అంది— 'మాకేం తెలుసు! కోమలి కోమలంటే ఏ రంభో

తిలోత్తమో, అనుకున్నాం...'

'ఊర్వసో...' అని నాగుమణి.

'మీ ఎవ్వరికీ కోమలి నచ్చలేదా?' అని అడిగాడు నిధి.

'మాకిది క్వశ్చన్ పేపరా ఏమిటి?' అంది సుశీల.

'నీకెల్లా నచ్చింది?' అంది నాగుమణి.

'బావని 'నువ్వు' అంటున్నావే'...అంది అమృతం. 'మాకు నచ్చలేదు' అని సుశీలా, నాగుమణీ అన్నారు.

'నాకు నచ్చింది బావా...'

'నే నేమీ అనలేదు.' అన్నాడు నిధి.

'అనక్కర్లేదు. తెలుస్తూనే వుంది; మీ అమ్మ బుద్ధు లెక్కడికిపోతాయి. నీ కట్లాంటివాళ్ళే నచ్చుతారు.' అంది సుశీల కసిగా.

'సుశీలా.' అన్నాడు కోపంతో కళ్ళు పెద్దవిచేసి.

'ఏమిటి సుశీలా, అట్లాంటి మాటలు? చచ్చి స్వర్గానవున్న అత్తయ్యని!'

దయానిధి కళ్ళల్లో నీళ్లు తిరుగుతున్నాయి. కోపంతో సుశీల పీక నులమాలనుకున్నాడు. ఎట్లాగో అంతా మింగేసుకొని తలవొంచుకుని, వాళ్ల ల్లోంచి విడిపోయి, వొక్కడూ చరచరా నడిచిపొయ్యాడు... ఎవ్వళ్ళూ మాట్లాడలేదు. కాలవొడ్డుకు చేరుకున్నారు.

గోవిందరావుగారు, దశరథరామయ్యగారూ కూర్చుని మాట్లాడు కుంటున్నారు.

'అమృతం - మీ అత్తగారికి కొంచం సుస్తీ చేసిందట, నిన్ను తీసు కెళ్ళడానికి కాంతారావొచ్చాడు. సాయంత్రం ఆరుగంటల బండికి ప్రయా ణం అంటున్నాడు, ఓ పదిరోజులపాటు అందరూ వుంటారనుకున్నాను.' అన్నాడు దశరథరామయ్యగారు, అమృతాన్ని సంబోధిస్తూ.

'అల్లాగా...ఐతే వెళ్ళిపోవాలి మామయ్యా - మీరందరూ మావూరు రాకూడదా ఏమిటి?' అంది.

'అల్లాగే వొస్తానమ్మా. ఇంక రిటైరయింతర్వాత చేసేపనే అది. ఓ ఏడాది మీవూళ్ళో మకాం.' అన్నాడు.

'ఏడాది కాకపోతే, పదేళ్ళుండండి - మాకేం బరువుకాదు. సేద్యాలు దేరేప్పుడే అత్తగారు కొంచం నలతగావున్నారు.' అంది.

'అరరే, సుశీలతోపాటు, నువ్వుకూడా మావూళ్ళో వోపదిరోజు లుంటావనుకున్నాను. అత్తగార్ని ఫిఆయన చూసుకోలేడూ...' అన్నాడు గోవిందరావుగారు.

'ఏపీ, - పాపం ఆయనకి తీరికెక్కడుంటుంది, పగలల్లా పొలంలో పడిపోతుంది...'

అంటూ అమృతం జెట్కా ఎక్కింది. జగన్నాథాన్ని బండి ఎక్కమంటోంది.

'పోనీ, అతను తరవాత రాకూడదూ?' అన్నాడు నిధి.

'మమ్మల్నందర్నీ వుండమంటావు - నువ్వు మావూరు రాకూడదా ఏమిటి బావా? పట్నం వెళ్ళేటప్పుడు దిగరాదూ - ఇదుగో స్కూల్ ఫైనల్ గట్టెక్కితే, చదువుకి పట్నంలో నీదగ్గరే వుంటాడులే.' అంది.

'అమృతం - వ్యవహారే-' అన్నాడు గోవిందరావుగారు.

'ఇంకానయం...' అన్నాడు దశరథరామయ్యగారు. సుశీలా, అమృతం, జగన్నాథం, గోవిందరావుగారు. బండిలో ఎక్కారు. బండి కదిలింది. నాగుమణి, బికారీ, కోమల్ని తీసుకుని పడవలో వెనకాల రావ డానికి నిశ్చయమైంది. నిధి, నారయ్యతో కోమల్ని జాగ్రత్తగా పడవలో తీసికెళ్ళి, వాళ్ళింట్లో దింపమని చెప్పి, తండ్రితో కలిసి కాలవగట్టున నడవ డం సాగించారు. రెండోబండిని, వాళ్ళ వెనకాల మెల్లగా నడిపించుకు వోస్తున్నాడు బండివాడు.

'ఏం నాన్నా, అకస్మాత్తుగా వొచ్చారేం? గోవిందరావుగారు, నువ్వు ఎక్కడ కలుసుకున్నారు?'

'నగసమ్మని, సుశీలని తీసుకెడదామని, కాంప్‌లోకే వొచ్చేశాడు. ఐతే,- నువ్వు సుశీలని పెళ్ళిచేసుకుంటావా?'

ఈ ప్రశ్నకి సమాధానంకోసం, కాంప్ ముగించుకుని నాన్న వొచ్చేశాడా అనుకున్నాడు నిధి.

'ఏం?'

'ఏదో వొకటి తేల్చెయ్యాలి.'

'సుశీల నన్ను చేసుకుంటుందా అని ఆలోచించారా?' అన్నాడు నిధి.

'ఆ అనుమానం నీకెందుకు కలిగింది?'

'నన్ను వొకమాటంది యిందాక. దాంతో సుశీల వైఖరి తెలుసుకున్నాను. నాకూ ఆ అమ్మాయికీ, సరిపడదు.'

'ఏమంది?'

'నాకు ఆమాటలు మళ్ళా అనుకోడం యిష్టంలేదు. బాధగా వుంటుంది'

వాళ్ళకీ యిష్టంలేనట్లుగానే తేల్చారు.' అన్నాడు దశరథరామయ్యగారు.

'బతికాం.'

'అందుకనే వొచ్చేశాను.'

'అంటే?'

'ఏమీలేదు. మాధవయ్యగారని, పోలీస్ ఇన్‌స్పెక్టర్ కొత్తగా బదిలీ అయిందిట. ఒక్క కూతురూ, కొడుకూ, నాలుగువేలదాకా కట్నం యిస్తానని, కాంప్ దగ్గరకి వొచ్చాడు. రేపే పిల్లని చూడడానికి వెళ్ళాలి.'

'ఇప్పుడు నా పెళ్ళికి తొందరేం నాన్నా?'

'తొందరే పెద్దమనిషికి మాటిచ్చాను. రేపే వెళ్ళి చూసి, వొంకలెట్టక వొప్పేసుకుగా. అప్పుడే నా ఆఫీసర్, మీవాడిపెళ్ళి దబ్బుని కానిచ్చెయ్యండి, - మేళం ఏర్పాటు చెయ్యమంటూ, అల్లరి మొదలెట్టాడు.

ఆఫీసర్ల సౌకర్యంకోసం, పిల్లల జీవితాలు నిశ్చయం చేసెయ్యడం — —

యింతే తండ్రుల బాధ్యత! అనుకున్నాడు నిధి.

'ఆఫీసర్‌కి పార్టీయిద్దాం కావాలంటే' అన్నాడు నిధి.

'నీ అభ్యంతరం ఏమిటి?'

'ప్రాక్టీస్ పెట్టింతర్వాత చేసుకోకూడదూ?'

'అంతవరకూ ఆపిల్లని అట్టేపెట్టరు - ఓవేళ పెట్టినా, వాళ్లు మనస్సు మార్చుకోవొచ్చు.'

'ఆపిల్ల కాకపోతే, మరో పిల్ల.'

'అంత సులభంకాదు.'

'అంటే?'



'నీకు పెళ్ళికావడం ఓ సమస్య అని మరిచిపోకు. నీకుపుట్టుకూ తెలీదూ?'

'ఏమిటినాన్నా,- దాచకండి.'

"నీకింతవరకూ సంబంధాలు ఎందుకు రాలేదో ఆలోచించావా?"

"లేదు."

"ఐతే ఆలోచించు యిప్పుడేనా. మనకుటుంబ వ్యవహారాలు తెలిసిన వాళ్లు, ఎవ్వరూ పిల్లనివ్వరు. మాధవయ్యగారు కొత్తగా వొచ్చాడు. గొడవలు యింకా ఆయన చెవినిపడి సంబంధం చెడిపోకముందే నిశ్చయం చేసేసుకుంటే మంచిది. లేకపోతే సమస్యే." నిధికళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి. కుడుచుకున్నాడు.

"దానికీ దీనికీ సంబంధం ఏమిటినాన్నా?" అన్నాడు.

"పిల్లనిచ్చేవాడు కుటుంబ మర్యాదలు చూస్తాడు. పెళ్ళికొడుకుతల్లి ఫలానా అని చెప్పుకుంటారు."

"ఇంక చెప్పకండి నాన్నా...ఇవి ఎక్కడ తెలిసిపోతాయోఅని భయపడుతూ కాపరం ఎంతకాలం చెయ్యగలను? ఇవి లెక్కచెయ్యకుండా నన్ను కోరుకుని చేసుకునే స్త్రీ వొచ్చినప్పుడే చేసుకుంటాను.

"అట్లా ఏ స్త్రీ రాదు; యింతవరకూ రాలేదు."

"వొస్తేనే చేసుకుంటాను..."

"కోమల్నా...?

"మాట్లాడవేం?"

"తప్పా?"

"నేను బ్రతకడం నీకిష్టంలేదా?"

నిధి కన్నీరు నిలుపుకోలేక పోయ్యాడు. కండువాతో కళ్లుతుడుచుకుంటూ, బండెక్కాడు. దశరధరామయ్యగారు కూడా ఎక్కారు. బండి జోరుగా వెళుతోంది. సూర్యుడు ప్రయాణంచేసి అలసిపోయినట్లుగా, మొహం ఎర్రబడి, మేఘాల వెనక విశ్రాంతిగా దిగుతున్నాడు. దూరంగా కాలవ మడుపులో పడవలు కనిపిస్తున్నాయి.

ఇంటికి చేరుకున్నారు.

దయానిధి తోచకుండా వొక్కడూ గదిలో కూర్చుని మెడికల్ ఎసోసియేషన్ జర్నల్ పేజీలు తిప్పుతున్నాడు. సుశీల ఏదో కావల్సివొచ్చి ఆగదిలో కొచ్చింది.

"సుశీలా నీతో మాట్లాడాలి." అన్నాడు.

"నాతో ఏం మాట్లు...!"

"మీనాన్న నీపెళ్ళివిషయం ఆలోచించాడా?..." అని మొదలెట్టాడు,

"నాతో ఏంమాట్లాడలేదు...నన్ను చేసుకోవాలని బెంగగా వుందా ఏమిటి? కోమలుందిగా..."

"నీ అభిప్రాయం ఏమిటి పెళ్లివిషయంలో..." నరసమ్మగారు చక్కా వొచ్చింది.

"మేం వెడుతున్నాం, రాత్రి తొమ్మిదిగంటల బండికి. పట్నం వెళ్ళే టప్పుడు మావూరు రాకూడదూ? పెళ్లివిషయానికి యిప్పుడు తొందరేం

వాళ్లనాన్న చదివిస్తాడు. ఎవడో వొకడు రాసేవుంటాడు...

"బంధువుల్లో సంబంధాలు మంచివి కావంటారు అందుకే..." అంది సుశీల.

"ఇంతకీ ఘటనుండాలి..." అని పూర్తిచేసింది నరసమ్మగారు.

ఇంతలో కాంతారావు, అమృతం గదిలో కొచ్చారు.

"వెళ్ళొస్తా బావా...మావారు... వుందుకుగాని అత్తగారికి వొంట్లో బాగాలేదట...

"ఏం జబ్బు?"

"జలుబుచేసింది -ఊ, దగ్గు..." అన్నాడు కాంతారావు. అతనిది పెద్ద మధ్యపాపిడి జుట్టు, గుండ్రటిమొహం, లావుమెడ, కోశాలమైన దవడలు.

"నువ్వు మాతోవొచ్చి మందివ్వకూడదా ఏమిటి?" అంది అమృతం.

"అత్తగారిమీదే ఎక్స్‌పెరిమెంటా?" అన్నాడు నిధి. అందరూ నవ్వితే కాంతారావూ నవ్వాడు.

సంభాషణ జరగడంలేదు. కాంతరావు చేతులతో ఏదోపుచ్చుకుని భార్యని బండికి టైమైందంటూ వీధిలోకి కెళ్లాడు.

"ఏదో మాట్లాడుకుంటున్నట్లున్నారు. మరి నే వెళ్లిరా..." అంది అమృతం

"మాటలు మీకుగాని మాకేముంటాయి." అంది సుశీల.

"మా సుశీల వెర్రిపిల్ల - ఏమీ తెలీదు, కోపం తప్ప." అంటూ సుశీల నడుంచుట్టూ చెయ్యేసి బుజ్జగిస్తోంది అమృతం.

"సుశీ, - మరి నేవెళ్లిరానా - ప్రతిదానికి కోపం తెచ్చుకోకూడదమ్మా వెర్రిదానా..." అని సుశీలని దగ్గరగా తీసుకుని కౌగలించుకుంది.

జగన్నాథం ప్రవేశించి 'పార్టింగ్‌సీన్స్' అని 'Good bye, డాక్టర్ జీ. ఈవియోగ జలధి...' అనే కీర్తన పాడబోయాడు.

"నేను మిమ్మల్ని వొదల్ను. మళ్లా వస్తానంటేనే - వెళ్లేకి. అని

ర్తిచేశాడు.

"ఎవరి పెళ్ళిరా పిచ్చికనవా." అంది అమృతం.

"మందేలే. . ." నిష్క్రమించాడు. జగన్నాథం.

"సుశీలా, నే వెళ్ళిపోతున్నాను, వొక్కసారి నవ్వవు." అంటూ గడ్డం తిప్పుకుని నవ్వించ బోయింది అమృతం. సుశీల బలహీనంగా ...

"చూసుకో అద్దంలో, - ఎంతబాగున్నావో-కాదు బావా?"

సుశీల వెళ్ళిపోయింది. దయానిధి లేచాడు.

"ఇంత తొందర్లో వెళ్ళిపోతా వనుకోలేదు అమ్మలూ" అన్నాడు నిధి.

"ఏం చేస్తాం. దేశాలు తెగించి పోవడం లేదుగా. జ్ఞాపకం వుంటా నేను." అంది అమృతం.

"నువ్వెళ్ళిపోతే దిగులుగా వుంటుంది."

"నీకేందిగులు బావా, మొగాడవు - చదువు ఉద్యోగం, బోలెడుం టాయి. . . ఎందుకు బెంగ?"

"అందరూ వెళ్ళిపోతే ఇల్లు శేవురుమంటుంది. ఎప్పుడేనా ఉత్తరం రాస్తుంటావా?" అన్నాడు. అమృతం చిత్రంగా నవ్వింది.

"ఉత్తరాలెందుకుబావా, జ్ఞాపకా లుండాలి కాని.'

"నీడబ్బు. . ."

మళ్ళా నవ్వింది.

"నీదగ్గర వుండకూడదా ఏమిటి? ఈవిధంగానేనా జ్ఞాపకం వుంటా నేమో. . .ఇద్దుగానిలే. . ."

నిశ్శబ్దం.

బీరువా కిందనుంచి ఎలిక తొంగిచూసి పారిపోయింది. ఎందుకో, అతని కళ్ళ: కిచూసి, మొహం తిప్పేసుకుని వెళ్ళిపోయింది అమృతం.

"మీఆయన చాలా మంచివాడులా వున్నాడు."

"నువ్వింకా ఆయన్నెరగవ్. చాలా మంచివారు నేవెళ్లినా, మావూరు తప్పకుండా రావాలి..."

'కమ్మారమ్మాయిని చూపిస్తావా?'

'హో, కొంటెబావా...'

అమృతం, జగన్నాథం, కాంతారావు వెళ్ళిపోయ్యారు.

రాత్రి ఎనిమిదింటికే అందరి భోజనాలు అయ్యాయి. రైలుకి జట్కా-బండి సిద్ధంగావుంది; సామాన్లు వొక్కొక్కటే నారయ్య బండిలోకి చేరేస్తున్నాడు. నిధి పెళ్ళివిషయం వొకటి రెండుమాట్లు నరసమ్మగారు మాట్లాడబోయింది కాని, ఆవిషయం ముచ్చటించేందుకు గోవిందరావుగారు వుత్సాహం చూపించలేదు. దశరథరామయ్యగారన్నాడు— 'మావాడి పెళ్ళి ఏప్రెల్లో ఏర్పాటుచేస్తాం; నరసమ్మను రెండునెలలేనా ముందుగా పంపించవతర్యా'

'ఐనా రోజుపెళ్ళి - మొగ పెండ్లివారికేం పనులుంటాయి.' అన్నాడు గోవిందరావుగారు.

'ప్రాక్టీస్ ఎక్కడ పెడతాడు?'

'ఏదీ, యింకా పూర్తికాందే...'

గడియారం కేసి చూస్తూ చేసే సంభాషణ అది. నరసమ్మగారు, గోవిందరావుగారు బండెక్కారు.

'మాతో రాకూడదమ్మా?' అంది నరసమ్మగారు...

'ఈవూరు వొదిలిరాకేం!' అన్నాడు గోవిందరావుగారు. సుశీల వీధులోకి వెడుతూ గదిలోకొచ్చి, తను తీసుకొన్న రెండు పుస్తకాలూ నిధికి యిచ్చేసింది.

'కావాలంటే నీదగ్గరే వుంచుకో. తరవాత పంపుదుగాన్లే.' అన్నాడు.

'అక్కర్లేదు.'

ఏదో చెప్పాలనుకుని నిల్చిపోయింది.

'నేనంటే కోపమా?' అని అడిగింది.

'ఎందుకు?'

'ఉంటే చెప్పు...'

'లేదు, లేదు... నేనంటేనో...?'

'.............'

ఏదో చెప్పాలని బాధపడింది; చెప్పలేక వెళ్ళిపోయింది. అతను స్టేషన్‌కి వొస్తానన్నాడు. చీకట్లో, చల్లో ఎందుకు వద్దన్నారు. బండి కదిలింది.

దశరథరామయ్యగారు, పక్కింటి, పేపర్ చదువుతూ కళ్ళుమూశారు. పది కావొస్తోంది. నారయ్య చాపకోసం గదిమూల వెదుకుతున్నాడు. దయానిధి దొడ్లోకెళ్ళి పొయ్యిముట్టించి, కాగుతో నీళ్ళుపెట్టి కాగేదాకా సుశీల తిప్పి యిచ్చేసిన పుస్తకాన్ని ఏమీతోచక విప్పిచూడడం మొదలెట్టాడు. చివరపేజీలో సుశీల తన పేరు నాలుగుసార్లు రాసుకుంది—రెండుసార్లు రాసి కొట్టేసింది. ఒకచోట ఏవోరాసి, తెలీకుండా పూర్తిగా కొట్టేసింది. అతని కేమీ అర్థంకాలేదు. అహం అనేక విధాలుగా బైటపడుతుంది. ఎవరేనా కలంయిచ్చి, వ్రాయమంటే మొట్టమొదట తమ పేరే రాసుకుంటారు. స్వార్థం బైటపడుతుందని భయపడి, కొందరి ఎదట వారిపేరు వ్రాస్తారు.

రెండోపుస్తకంలో సుశీల కాలేజీ స్నేహితులతో తీయించుకున్న గ్రూప్ ఫోటో వుంది. అటిద్దరూ, యిటిద్దరూ, మధ్యతనూ. ఫోటోవెనకాల 'నేనెవర్ని చెప్పుకో' అని రాసుకుంది. అది ఆపుస్తకంలో ఎందుకు వొదిలేసిందో తనకి అర్థం కాలేదు. పొరబాటేమో!

నీళ్ళుకాగాయి. దొడ్లోకెళ్ళి స్నానంచేశాడు. పల్చటి తెల్లచొక్కా తొడుక్కున్నాడు.— తెల్లపంచి గూడకట్టుకోసం తీశాడు. చాకలి ఆరేసిన కంపవాసనా, క్లోరిన్ వాసనా ఆపంచిని అల్లాగేవుంది. ఎంతో జాగ్రత్తతో పాపిడి తీశాడు. పట్నంనుంచి తెచ్చిన సెంట్ కొంత రాసుకున్నాడు. జగన్నాథం చెట్టుచాటునుంచి దొంగతనంగా తీసిన కోమలి ఫోటోని

'డెవెలప్' చెయ్యడం వీలుపడ్లేదు. ప్రొద్దున్న చెయ్యొచ్చు. బుజాన్న తువ్వాలు వేసుకుని వాకిట్లోకొచ్చాడు. నారయ్య అరుగుమీద పడుకున్నాడు. తలుపు దగ్గరగా జేరేసి వీధిలోకి నడిచాడు. కాళ్ళకింద యిసిక చల్లగావుంది. జోగప్పనాయుడుగారి మేడలో దీపాలే లేవు. సందులోకొచ్చాడు. రెండు మేకలు సందుమొగని చూరుకిందికి జరిగి జాలిగా అరుస్తున్నాయి. అంతటా చల్లగా నిశ్శబ్దంగా వుంది. చలికి తట్టుకోలేక మేఘాలుకూడా చంద్రుడికి దూరంగా కదిలిపోతున్నాయి. ఒంటిగావున్న చంద్రుడు అనంతాన్ని నిర్మలంగా చేశాడు. నక్షత్రాలు మెరవడం మానుకున్నాయి.

కామాక్షి యింటి దొడ్డివెంపు తలుపులు దగ్గరగా జేరేశివున్నాయి. సందులోనుంచి తొంగిచూశాడు. నూతిపళ్ళెంమీద సన్నగా తగ్గించిన దీపం కనిపిస్తూవుంది. రాత్రి దీపం పెడతానంది కోమలి. అంటే ఎవ్వరూ లేరన్న మాటే. వాళ్ళమ్మ ఎక్కడుందో - పిలవడమా, సకిలించడమా, యీలెయ్యడమా - తలుపుతట్టడమా? తలుపు తెరుచుకుని నిర్భయంగా లోనికి వెళ్ళటమా? కామాక్షంటేనా భయం? కోమలంటేనా? లేకతనంటే తనకేభయమా? "నేను బ్రతకడం యిష్టంలేదా? అది సంఘం, సాంప్రదాయం, తనతండ్రిచేత అడిగించిన ప్రశ్న. మరి దానికి తర్కంలేదు, వాదంలేదు. ఎవ్వరూ ఆపలేని సూర్యోదయంలాంటిది. 'ఆ వెంటు ముండతోనా సరసాలు?' 'సౌందర్యానికి' అనూయచేసిన నామకరణం. 'దాంతో ఏం సుఖపడతావు బావా?' పాపం సుఖపడటం అంటే మనుషులకు అంతభయం. ఎవ్వరూ ఆచరించలేని వున్నత ఆదర్శాలు మా కక్కరలేదు. మాకు రెండోరకం—చవకవి—యిప్పించండి; భరింపరాని మహత్తర సౌందర్యం, బాబోయ్, మాకొద్దు దానికి మేం తగం- పోనిస్తురూ! సంసారపక్షం చాల్లెస్తురూ—(కూర్మయ్య) ఆలి మర్కటం. ఇల్లు యిరుకు, పెళ్లాం కోతి—వీటిని కోరుకున్నారు మన పూర్వులు. ఫర్లాంగు దూరంలోవున్న చెరువునుంచి రెండు బిందెలు నీళ్ళు తనే మోసుకొచ్చి, యిరవైమంది జట్టీలటాంటి మొగాళ్ళకి అన్నం వొండి పారేసి,

సంవత్సరం అయ్యేటప్పటికల్లా పిల్లనికంటూ-మీ కన్నెళ్ళని స్త్రీని ఎవ్వరూ అడగనక్కరలేదు - ఎంతమంది సంతానంవుంటే అన్నేళ్లు, సరేనా - ముసిలిది అవకుండానే చచ్చిపోవాలి, మొగుడికంటె ముందుగా-హిందూస్త్రీ. కోమలి హిందూస్త్రీ కాదు. కోమలి అసలు స్త్రీయేకాదు. అన్ని శక్తుల్నీ తనలో కలుపుకుని దహించేసే వొకజ్వాల. సాంప్రదాయాలు, ఆచారాలు, నైతిక విలువలు కట్టుబాట్లు- అన్నింటినీ ముంచెత్తివేసే మహాసముద్రంలోని అఘాతం. అందుకనే లోపలికెళ్ళడమంటే అంతభయం.

భయంతో నరాలన్నీ కదిలిపోయి, మళ్ళీ కొత్త పద్ధతిలో సర్దుకున్నాయి. ఎవరో, ఎప్పుడో సహాయపడతారన్న ఆశవున్న మనుషులే భయపడేది. ఎవరూలేరు. ఎప్పుడూరారు. అని నిర్ధారణ జరిగిపోయి, ఏకాకీ అవగానే, భయం పోతుంది. తను వొక్కడే తనకోసం జీవించి యీ శక్తులను ఎదుర్కోవాలి. స్నేహితులు, బంధువులు, గురువులు, గ్రంధాలు, సలహాలు, వేదాంతాలు - అన్నీ కడసారి యదార్థాన్ని యెదుర్కొన్నప్పుడు, వృధా. అదే కొత్తబలం, నూత్న విశ్వాసం. అది మొండి-గుడ్డి ధైర్యంకాదు. ఇంద్రియాలన్నింటినీ ఏకగ్రీవంగా జీవింపచేసి, సర్వశక్తుల్నీ ఖంజాయింపుచేసుకుని, మూడోనేత్రం తెరచుకుని, వొక్కసారిగా చెలరేగిన సాహసం అది. తలుపు తెరుచుకొని లోపలికివెళ్ళాడు దయానిధి.

అంతా నిశ్శబ్దం. వెన్నెట్లో వొస్తువులన్నీ తెల్లటిపొర కప్పుకున్నట్లుగా వున్నాయి. నూతి పళ్లెంపక్కనే మంచం సగం మండువాలోనూ సగం బైట వెన్నెట్లోనూ వాల్చివుంది. ఆ మంచం పైన కోమలి పడుకునివుంది. అది, వూడినతాళ్ళు క్రిందికి వేళ్లాడుతున్న నులకమంచం; పైన దుప్పటీకూడాలేదు. తలగడ అనుకోవల్సినచోట గట్టిబద్దీ తలకిందవుంది. దానిమీదనుంచి వూడిపోయిన జడ కిందికి వేళ్లాడుతూంది. కుడిచెయ్యి మెడకింద, ఎడమచెయ్యి మడిచిన మోకాలుమీదా వున్నాయి. చీరకొంగు పొత్తికడుపుమీదికిజారి గాలికి కదుల్తోంది. ఇంటి కప్పుమీదనుంచి జారిన వెన్నెలవెలుగు నుదిటి

మీద శిలా లదుతోంది. ఆనాడు సౌందర్యం తనయాత్ర ముగించుకొని ప్రవ్వళిస్తోంది.

పరిమళం బరువుకీ, రంగు వొత్తిడికీ తట్టుకో లేక వాడి పడిపోయిన అడివిపువ్వు; పర్వత శిఖరాన్నుంచి జారి విడిపోయిన మంచు ముద్దలోని నిర్మలత్వం; నిశీథిలో సృష్టి వేసుగున్న మంటలో నడిజ్వాల; అర్ధరాత్రి జీవులు కన్న స్వప్నంలోని మూగబాధ.

మంచం తలాబుదిక్కున కూర్చుని రెండు చేతులూ రెండు బద్దీలమీదా ఆనించి, వెనకనుంచి ఆమె మొహంలోకి చూశాడు. విశ్వగానానికి లయ శృతులలా వినిపిస్తున్న శ్వాస అతన్ని చుట్టుకుంది. ఆకస్మికంగా ప్రాణం తెచ్చుకున్న స్వప్నకాంత శరీరం మోయలేని వేడి, సముద్ర కెరటాలపై బహిర్గత మైన వేడిలా లేస్తోంది. వేసంగి సాయంత్రం వాన వెలిసిం తర్వాత భూమి వొదిలేసిన వేడిలాంటిది, ఆమంట. ఎక్కడా అనించడానికి అతనికి చేతులు రావడంలేదు. వేసంగి సాయంత్రం, వడగళ్ల వానకి సరస్సులో చేపలు కదిలినప్పుడు పైటపడే పరిమళం అతన్ని ఉక్కిరిబిక్కిరిచేసింది. ఏదో శక్తి అతనిలో ప్రవేశించి అతన్ని కార్యశూన్యుణ్ణిచేసింది. ఏదో కాంతి కిరణం అతని చీకటి హృదయాన్ని మెలుపులా వెలిగించింది. కోమలి అతనిలోకి ప్రవేశించి అన్ని తలుపులూ మూసేసినట్లనిపించింది. ఎక్కడతాకినా అన్ని రేకులూ వూడిపొయ్యే పువ్వం. వేలుతో తాకితే, అంతా వొడిలి విడిపోతుంది; రంగులన్నీ పోతాయి. నశింపైపోతుంది.

చూడలేక అతనికళ్ళు చిత్రంగా మూతలు బడ్డాయి. మూర్ఛపోయి తెప్పరిల్లుకున్నాడు. అతని శరీరాన్ని చూసుకున్నాడు. సిగ్గేసింది. తనదికాదు ఆశరీరం. ఎక్కడికో వెళ్లిపోయింది. దాన్ని వెదికి తెచ్చుకోవాలి. పారిపొయ్యే శరీరాన్ని పట్టుకోడం ఆత్మచేసే పనులలో ఒకటా? శరీరం 'ఇది అన్యాయం' నేనీపని చెయ్యలేను. నేనే సౌందర్యం. నన్ను నేను ధ్వంసం చేసుకోలేను. ఇతరులనీ ధ్వంసం చెయ్యలేను, నన్ను వొదిలెయ్యి' అంటోంది.

అతనికి భయమేసింది – సౌందర్యాన్ని ఎదుర్కొన్న మనిషి అతను. గొప్ప సౌందర్యం అనుభవంకాదు. గొప్ప సౌందర్యం అంటే ఐపోవటంకాదు; ముందుకాకటంకాదు; ఎల్లప్పుడూ 'అవుతూండటం'. హద్దులులేనిది అనుభవం. గొప్ప సౌందర్యానికి హద్దులులేవు. రెండింటికీ శరీరంహద్దు కాదు; కాకూడదేమో – శరీరం – మరోశక్తి. విడిపోయిన ఆ అనుభవానికి హద్దులులేవు. లోకం అంతటావ్యాపించి తనలో యిముడ్చుకున్న శక్తి.

అతను తేరుకున్నాడు. నవ్వొచ్చింది. శరీరంతోవున్న మనుష్యులందరూ పిచ్చివాళ్లు – అనిపించే సమయం అది. ఆ అనుభవం అతని శక్యల్లేదు. అనుభవానికి హద్దులులేవు. కవర్లో వున్న ఐదునోట్లూ దిండుకిందవుంచి మెల్లగా లేచి వీధులోకెళ్ళి తలుపులు దగ్గరగా మూశాడు.

—o—

# 3

## మూణ్ణాళ్ళ ముచ్చట

(శుక్రవారం)

రాజభూషణం సిగరెట్ నోట్లో పెట్టుగుని అగ్గి పెట్టెకోసం దిక్కులు చూస్తున్నాడు.

'అగ్రిమెంట్ ప్రకారం ఇన్స్పెక్టర్‌గారు మొగ పెళ్ళివారికి అగ్గిపెట్లు సప్లై చెయ్యరు కాబోలు' అన్నాడు.

'మీరు ఫిలాసఫీ చదువుతూ సిగరెట్లేమిటండీ–చుట్టయినా బాగుండిపోను.' అన్నాడు, నిధి అన్నగారు, రామానందం.

'హిందూదేశంలో వేదాంతదృష్టికి బహిర్గత చిహ్నం చుట్టకాదండోయ్ చుట్ట వార్ధక్యానికి చిహ్నం; వార్ధక్యం వేదాంతానికి చిహ్నం. యవ్వనానికీ వేదాంతానికీ అతకదు; అతికించడం కొంతవరకూ సిగరెట్టు చెయ్యగలదేమో ననుకుంటున్నాను, హిందూ, ముస్లిమ్ కలయికకి బీడీ కాల్చినట్టు!' అన్నాడు రాజభూషణం. రాజభూషణం, ఫిలాసఫీ ఆనర్స్ రెండో ఏడు చదువుతున్నాడు పట్నంలో. మనిషి చాలా ఎత్తరి: కసరత్తుచేసే వ్యక్తికి వుండవలసిన ఛాతీ వుంది; కండలు తిరిగిన జబ్బలూ అవీ కనపడాలని, వొళ్లుకనిపించే

పల్చటి లాల్చీ వేసుకుంటాడు. ప్రపంచాన్ని ధిక్కరించినట్లుగా పైటకి పొడుచుకొచ్చిన గడ్డం, ఏదో కొంటెమాటాడేటందుకు సిద్ధపడినట్లుగా వంకర తిరిగిన పెదవులు, మాట్లాడేటప్పుడు ఎదరవాడి నెత్తిమీదనుంచి చూసేకళ్లు-మొత్తంమీద అతను వేదాంతం చదువుతున్న విద్యార్థిని, ఫ్రొఫెసర్లే దబ్బుని నమ్మలేక పోతున్నారు. స్కూలులో చదువుకునే రోజులలో 3 × 0, సమాధానం, '0' అని అతను వొప్పుకోలేక పోయ్యాడు-పదార్థానికి నశింపంటూ లేదుకదా, దాన్ని సున్నాతో గుడిస్తే, సున్నాగా నసింపు కావడం,సృష్టికే వ్యతిరేకమని వాదిస్తూ వొచ్చాదు, చరిత్రలోకూడా యిట్లాంటి క్లిష్ట సమస్యలే అతన్ని ఎదుర్కున్నాయి. యుద్ధాలకి కారణం ఏమిటి? తిండికోసం కొట్లాట. మొగుడూ పెళ్లాం కొట్టుకోడం - నిజంగా వేరే కూస్పుని తిండి తినడంకోసమే - దీన్నే ప్రబంధకవులు ప్రణయ కలహం అన్నారు.

తండ్రి కొడుకూ ? - అది కుటుంబకలహం.

రాజూ, రాజూ ? - అది మహాయుద్ధం.

సరే తిండి దొరికిందయ్యా; పోనీ తరవాతేనే సుఖంగా వుంటారా? లేదు.

ఎందుకు?

తరవాత, రాణీలకోస కొట్లాట.

పైనాగోడ, రామేశ్వరం గుడి, టాజ్ మహల్, కట్టిన వ్యక్తులకు తిండి తినడం చేతకాదు పాపం. చరిత్రనుంచి మానవుడు గుణపాఠం నేర్చుకోడు అని నేర్పుతుందిట చరిత్ర. ఇట్లా వుండటానికి కారణం ఏమిటండీ అని మేష్టర్ల నడిగితే, పుస్తకాల జాబితా తయారుచేసి, చదువుకోమని యిస్తారు. విశేస్తే 'కర్మ' అనేస్తారు. దేవుడు నిర్ణయించాడు. కాని దేవుడు, పాపం, మంచివాడు, దయామయుడు, ఆపద్బాంధవుడు, ప్రేమేదైవం...!

ఈ విషయం యొక్క అంతు కనుక్కుందామని రాజభూషణం చరిత్రమానేసి ఫిలాసఫీలో చేరినా; క్లాసులోవున్న ముగ్గుర్నీ ఫేల్ చేస్తే, వాళ్ళవుద్యోగాలే తీసేసి, అసలు ఫిలాసఫీయే ఎత్తేస్తారని వున్న యిద్దరు

ప్రొఫెసర్లు హడిలి, అందర్నీ ప్యాస్ చేస్తారన్న ధైర్యం వుండబట్టే 'రాజా' ఫిలాసఫీలో చేరాడని, అతని మిత్రులు అంటారు. మరేదేనా ఫేల్ కావడం సులభమే కాని, ఫిలాసఫీ, ఎవ్వరూ ఫేల్ కాలేరు మరి! అనేసి 'రాజా'ని చులకనగా చూసిన వ్యక్తులు కొందరు తమ అభిప్రాయాలని మార్చుకుంటున్నారు. 'రాజా' కొన్ని సమస్యలని బాగా విశదంగా పరిశీలించ గలడు. ప్రతి దానికి పునాదులు తవ్వి, పేకముక్కలతో కట్టిన తార్కిక భవనాలను కూలదోశాడు. కూలదోయ్యడంలో అతను ప్రతిభావంతుడు. పునాదులు తవ్వితే ఏర్పడిన గోతులను పూడ్చడం; అతనికింకా చేతకాలేదు.

వివాహం చేసుకుంటే భావ స్వాతంత్ర్యం పోతుందని భయపడి బ్రహ్మచారిగానే వుంటానంటాడు 'రాజా'.

'దేవుడులేడని ఋజువు చెయ్యగలం - కాని, మహాప్రభో పెళ్ళాం ఉన్సుంది తప్పని ఋజువు చెయ్యలేం.'

'ప్రేమపూర్తిగా నశించిన తర్వాతగాని వివాహానికి మనుషులు అర్హులు

[illegible] గతికి కారణ భూతాలైన శక్తులపై విప్లవంచేసి నశింపు

[illegible] స్త్రీకి కట్టిపడేసి, వివాహం అనే జైలులో

[illegible]తాంతికి [illegible] వివాహం'

తిప్పుకుందామన్న పట్టుదలలేదు. అతని అభిప్రాయాలు అతనికి చాలామంది శత్రువులను సంపాదించిపెట్టాయి. వాటికి తట్టుకుని, అదుకున్నవాడు 'నిధి'

వారిద్దరూ వేర్వేరు కాలేజీలంలో వుంటున్నా ఆంతరంగికం తగ్గలేదు. తన వివాహానికి రమ్మని నిధి వద్దనుండి ఆహ్వానం రాగానే, 'రాజా' వెస్టర్ మార్కు వ్రాసిన 'పెండ్లి, - దాని కథ, కమామీసు' (History of Marriage) అనే పుస్తకం చదవడం ప్రారంభించాడు. అతనికి కొన్ని సందేహాలొచ్చాయి - సరే. యీ పెళ్ళికి హాజరయి, సందేహ నివృత్తి చేసుకుందామని చక్కా వొచ్చాడు. సిగరెట్టుని సమర్థించుకునేందుకు రాజా అన్న మాటలువిని, దశరథరామయ్యగారు.

'అగ్గిపెట్టికోసం, ఎంత దండకం చదివావయ్యా!' అన్నారు.

ఇంతలో దయానిధి వొచ్చాడు. వెనకాలేనో కుర్రాడు అరడజను అగ్గిపెట్లు రెండు సిగరెట్టు డబ్బాలు తీసుకొచ్చి పెట్టాడు.

'మాశారుటండీ - మామగారి ఖ్యాతిపోకుండా, తనే అగ్గిపెట్లు సప్లై చేస్తున్నాడు!" అన్నాడు 'రాజా' అగ్గిపుల్లని వెలిగిస్తూ.

'వారి ఖ్యాతి నిలబెట్టడం రాత్రి తొమ్మిది
దాపూచీ వీనిలేదు - నిజానికి లగ్నం తొమ్మిదీ
అన్నాడు దయానిధి. కాబోయే మామగార్ని పరిహ

## మూణ్ణాళ్ళ ముచ్చట

తాలూకు అమ్మలక్కలు, వొక్కొక్కరే, ఏదో మిషమీద వొచ్చి, చూసి చేసుకుని వెళ్ళడం జరుగుతోంది. పెళ్ళికొడుకు, జంతు శాలలోకి కొ... వొచ్చిన సింహంలాంటివాడు.

అబ్బో, ఎంతజూలో!'

'అన్నా బక్కలాగుందేం!'

'ఎక్కణ్ణించి తెచ్చారో - ఎంతో!'

'అబ్బే, మూడుపూట్లా తిండిపెట్టి మూడు వేలుటుండి.'

'పెళ్ళికొడుకు ఏదో అంటున్నాడు-వుండండి. సింహం గర్జిస్తోంది.'

అదీ అమ్మలక్కల గుసగుసల సారాంశం.

'సైమెంతండీ?' అంటూ వెంకటాద్రిగారు, పెళ్ళికొడుకు విడిదిలో కొచ్చాడు. దశరథరామయ్యగారు, ఆయన్ని ... ండి' అంటూ ఆహ్వానించారు. వెంకటాద్రిగారు– ... ంత కాలింఫింపకే, ...

# చివరకు మిగిలేది

'రాజా' ఆయనదగ్గరగా వెళ్ళి 'మీ గడియారాన్ని కూడా రిపైర్ చేసి నీ యిప్పిస్తాను.' అన్నాడు. పూడగా మిగిలినపళ్ళతో వెంకటాద్రిగారు తగా నవ్వారు.

'నాదాంట్లో ఎనిమిదిన్నరైంది.' అన్నాడు విధి అన్నగారు, రామానందం.

'తమకే?' అని వెంకటాద్రిగారు, తమ్ముడి కాబోయ్యే అల్లుణ్ణి సంబోధించాడు.

'ఈ గడియారం అతనిది కాదు; గాది-కాసేపు ఎరువు పెట్టుకున్నాడు. మామగారు మంచి గడియారం యిప్పించాలి' అన్నాడు రాజా.

'ఓస్, యింతేఃదయ్యా. వెనక గడియారం' అన్నాడు వెంకటాద్రిగారు.

చెప్పించండి.' వెంకటాద్రిగారు 'రాజా'కి

అవీ, యింకా,

వొక దొంగని యిద్దరు పోలీసులుచేత పట్టించి, చేతులకి సంకెళ్ళు వేసి, తీసుకొస్తుంటే వాడు మధ్యలో నిలిచిపోయి కాలకృత్యానికని, గోడలా లేచిన బొమ్మజెముడు కంచి ముందు కూర్చున్నట్టుగా కూర్చుని, కంచిమీద నుంచి దూకి పారిపోయ్యాడుట: ఆకంచి దాటేటందుకు వెంకటాద్రిగారు కాని, పోలీసులు కాని సాహసించనందున వొక 'నల్లమచ్చ' పడిందని, అధికారులు అన్నారట. దానితో ఆయనకి మరింత కోపం వొచ్చేసింది. ఇప్పుడు ఆ దొంగని ఎల్లాగైనా పట్టుకుని అతిథి సత్కారంచేసి, ప్రాయశ్చిత్తం చెయ్యాలన్న సంకల్పంతో 'కసిగా' పొంటున్నాడు వెంకటాద్రిగారు.

మాధవయ్యగారి కిల్లాంటి మచ్చలులేవు. ఆయన పనిచేసిన పొలిమేరలో సైకిల్‌మీద యిద్దరు వ్యక్తులు ఎక్కటం, ఎప్పుడూ జరగదు. ఓ వేళ ఎక్కితే, ఆ యిద్దర్నీ నిలేసి, జుట్టుపట్టుకుని తలకాయల్ని పిడిక్కిలు కొట్టి పంపుతాడు; అప్పుడప్పుడు యిద్దరిచేతా సైకిల్ని మోయిస్తాడు. నిజంగా దొంగతనం చెయ్యని వాళ్ళకూడా 'బాబో నేనే చేశానండి, మరి వొదలండి అనిపించ గలడాయన. ఈయనకి రావ్ బహుదూర్ కాకపోయినా కనీసం రావ్‌సాహెబ్ ఐనా రానందుకు, పోలీస్ సూపరింటెండెంట్ నంబియార్ కూడా ఆశ్చర్య పడ్డాడు. లోలోపల మాబాగా అయింది అనుకున్నా వెంకటాద్రి గారుకూడా దీనికి నివ్వెర పడ్డాడు. అధికారుల ఆదరాభిమానాలు, దైవ మాయలా వీరోవ తీస్తాయో ఎవరు నిర్ణయించగలరు లెండి అనుకున్నారు కొందరు.

అన్నదమ్ములిద్దరికీ వొక విషయంలో మాత్రం తేడావుంది. అన్నగారికి ఆరుగురు మొగ సంతానం. మాధవయ్యగారికి ముగ్గురూ ఆడపిల్లలే, ఇప్పుడు వివాహంకానున్న ఇందిర పెద్దపిల్ల. గుంటూరు, కృష్ణా జిల్లాలలో పనిచేసినా కూతుర్ని గోదావరి జిల్లాలో యివ్వాలన్న ఆశయం యీనాటికి, నెరవేరినందుకు ఆయన సంతోష పడ్డాడు. మహావైభవంతో యీ పెళ్ళి చెయ్యాలని ఏర్పాట్లు చేస్తున్నాడు.

ఇందిర చదువు యింటిదగ్గరే జరిగింది. సంగీత అచ్చే సూచనలుండ బట్టి, విడవకుండా వీణ చెప్పించాము. అల్లుడు ఆయనకి అన్నివిధాల నచ్చాడు. చదువుకున్నవాడు అందమైనవాడు; కాస్తోకూస్తో ఆస్తికూడా వుంది; అత్తగారి పోరులేదు; మరి ఆడబడుచులులేరు, ఐతే వొక్కవిషయం ఆయనకి సరిపడలేదు. అల్లుడు డాక్టరికి చదువుతున్నాడు. బి. ఏ. ప్యాసై వుంటే, పోలీసు డిపార్టుమెంట్‌లో ప్రవేశపెట్టి, రావ్ బహదూర్ చేసి వుందును, ఇప్పుడు ఆ అవకాశం లేకపోయిందికదా అని భార్యతో వాపో యాడు. 'అమ్మాయికి నచ్చాడు, పిల్లాడు, కావలిస్తే రెండో అమ్మాయి మొగుణ్ణి రావ్‌సాహెబ్‌ని చేద్దురుగానిలెండి' అందిట సుభద్రమ్మగారు.

వెంకటాద్రిగారికి తమ్ముడు అల్లుడి మంచి చెడ్డలూ, సత్తా, తెలుసు కోవాలని కుతూహలాన్ని పైటకి కనబర్చకుండా, యుక్తిగా కనుక్కోవా లని సాగిస్తున్న యత్నం దయానిధికి అర్థమైంది.

'ఒక్క గడిగూరం మట్టుకేకాదు; కారు ప్రాక్టీస్‌కి కావల్సినసామగ్రి అన్నీ లాగొచ్చు. నిదానంమీద మావాడు సమయంవొస్తే కర్చుకి ముందూ వెనకా చూడడు లెండి.' అన్నారాయన.

"తాళంచెవి మీ అమ్మాయి దగ్గరే వుంటుంది. కాబట్టి ఫరవాలే దండురూ..." అన్నాడు 'రాజా'.

"ఐతే ప్రాక్టీస్ ఎక్కడ పెడతావయ్యా?"

"మీ సలహా ఏమిటి?"

"అల్లుడు మామగారు ఆలోచించుకోవల్సిన విషయం కాని, మధ్య వాడేముంది" అన్నాడు వెంకటాద్రిగారు.

"ఐనా తమరు పెద్దలు, మీవుద్దేశం కూడా తెలవియ్యండి." అన్నాడు రాజా పొగ ముక్కులోంచి వొదుల్తూ.

ఇంతలో మాధవయ్యగారి దూరపుచుట్టం, లక్ష్మయ్య వొచ్చాడు. ఆయన పెళ్లి పెంగుదారు; ఆయన అక్కడివాళ్ళని యిక్కడికి, యిక్కడి

వార్ని అక్కడికి పిల్చుకు పోతూంటాడు గాని, ఆయనలో ఏం మహత్యం వుందో, ఎవ్వళ్ళూ ఆయన చెప్పినట్లు వినరు.

"సీతాలూకు ముగ్గురు బంధువులొచ్చారు." అని లక్ష్మయ్య వాక్యం పూర్తికాకుండానే, బండిలోంచి జగన్నాథం, అమృతం ఆడబడుచు విశాలి, ఆవిడభర్త భుజంగం, దిగారు.

"ఏ తెంచిటన్ సకల యిక్కట్లు దాటి మైడియర్ బావగారు... రెక్కలు లేని పక్షిలాగె—పక్షి–పక్కి వికృతి–తెనుగు నంచేస్తున్నాం..." అంటూ మొదలెట్టాడు జగన్నాథం.

"ఏం జగ్గూ, అమృతం రాలేదూ?" అని అడిగాడు నిశి.

"నన్ను సమాధానం చెప్పమనేనా నీ వుద్దేశం?"

"ఏం ఎందుకు రాలేదు?"

"ఈ ప్రశ్న పరంపర కురిపించే ముందు మిమ్మల్ని మీరు సరిచేసుకోండి—"

"....................?"

"పెళ్ళికొడుకువి అయ్యుండి యింకా, యీ వసో బస్తీలో, ఇప్పుడూ, జగ్గు ఏమిటయ్యా. అడిగేవారు లేకగాని..."

"ఓస్, అదా, చంపేశావ్..."

"షామి దీ శవం, కొండకచో కళేబరం."

"లక్ష్మయ్య గారితో వెళ్ళి ఫలహారాలు చెయ్యండి..."

"రండి బాబూ రండి..." అంటూ అహ్వానించాడు లక్ష్మయ్య.

"ఊరక రారు మహాత్ములు— సన్నాయి మేళం చేయించండి... శాభవ మందమతీ నేను ఏమంటావోయ్— యీ అంగన విశాలి,—మా అక్క వుమన్ యూహ్ —ఆడపడుచు భుజంగం,— మై గురుజీ —యీజ్ వాట్ కాంతారావ్ యీజ్ టు మై సిస్టర్"

"ఆడ × పడుచు, ఆడపడుచు కాదబ్బాయ్ ఆ సంధే లేందే—పైగా

తెమగు దంచేస్తున్నా నంటున్నావ్." అని మధ్యలో అందుకున్నాడు రాజా.

"వీరెవరో తెలుసుకోవొచ్చునా—కొంపతీసి తెమగు పండితుడు కాదుకదా?"

"సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్" అన్నాడు నిధి.

"ఐతే భయంలేదు-ఆడపెళ్లి వారితాలూకా?"

"కాదు కాదు—మనతాలూకే..."

"చంపక చెముదురు...తమ మిత్రమండలిలో ఆయనా..." అన్నాడు జగన్నాథం.

"చివరికి సత్యం కనుక్కున్నావు, బాలకా" అని రాజభూషణం, పూర్తిచేశాడు.

"ధన్యతముండను. క్షీరకసాయన సమ్మేళనం కాస్తంత సేవించి వచ్చెద. రండర్రా..." అని విశాలిని, భుజంగాన్ని, విడిదింట్లోకి ప్రయాణం కట్టాడు.

దశరథరామయ్యగారి, పెద్దకొడుకు రామానందానికీ, భార్యకీ, వేరే పక్కమేడలో పెద్దగది ప్రత్యేకంగా ఏర్పాటుచేశారు. గదిపక్క పెద్ద హాలుంది. అందులో కొత్తగా వచ్చినవాళ్ళందరికీ విడిది ఏర్పాటుచేశారు. దశరథరామయ్యగారు, రామానందం వారి విడిదింట్లోకెళ్ళారు. ఇక్కడికి కాఫీ ఫలహారాలు తెప్పిస్తాం వుండండని, జగన్నాథాన్ని పెళ్ళిపెద్ద లక్ష్మయ్యగారు వాదిస్తున్నా, ఆడపెళ్ళివారి విడిదిలోపడి, పెండ్లి కూతుర్నొకసారి చూసి రావాలని జగన్నాథం వుబలాట పడుతున్నాడు.

"నాథ్—మీ అక్కయ్యరాలేదేం—" అని నిధి ప్రశ్నించాడు.

"ఊరికే నేనండి"

"ఊరికే ఏమిటబ్బాయీ—సత్యాన్ని శోధించటం నీపథి..." అని రాజా.

"వాళ్ళాయన వొద్దన్నాడా?"

'అబ్బెబ్బె—రోజూ, అక్కయ్యని, డాక్టర్ గారి పెళ్లి ఎప్పుడంటూ

'ఈ అబ్బాయ్, మీకేమవుతాడండి...' అని అడగగలిగాడు.

'అబ్బాయ్ అనే వొద్దన్నది—' అని వెంకటాద్రిగారి, చెవిని పట్టుకున్నాడు. తాపీగా పొడుండబ్బీ తట్టడం మొదలెట్టాడు.

'ఈ నాసికా చూర్ణప్రియునకు కించిత్ చెముడా ఏమి? మీరు సెలవియ్యండి, రాజాజీ.'

'అవునబ్బాయ్ కొంచెం గట్టిగా చెబితే—చాలు.'

'వినకూడనివి బాగా వినబడతాయండి ఏం మాయో చెవుడికి. అబ్బాయిని కానండి.' అని జగన్నాథం, వెంకటాద్రిగారి చెవిలోఅన్నాడు.

'పోనీ అమ్మాయివా?' ఆఖరికి విసుగుతో, ఆవలిస్తున్న లక్ష్మయ్య కూడా నవ్వాడు. ఏదో జగన్నాథం మళ్ళా అనబోయ్యాడు. అది ఏమైపుండునో ఎవరూ నిర్ణయించలేదు. ఎందుకంటే ఆసమయంలో అక్కడికి నారయ్య వక్కా వొచ్చాడు. జగన్నాథం జోరుతగ్గింది

'అబ్బో, కుర్రాయనొచ్చాడే?' అన్నాడు నారయ్యఆశ్చర్యంతో. నారయ్య శుభ్రమైన ఖద్దరు పొట్టిచేతులచొక్కా, చిరుగులులేని పంచి, మంచి పాగా వేసుగున్నాడు.

'కుర్రాయన్ని, ఆరునెల్లప్రతం.' అన్నాడు జగన్నాథం.

'ఐతే ఆరుమాసాలంటయ్యా-కోతూసులూ నువ్వూ...మీ అక్కయ్యగారు రాలేదంటయ్యా?' లేదన్నట్లుగా తల పరకించాడు జగన్నాథం.

'వచ్చేనాళ్ళ దాకాసేగొల్ఫ్ ఆడేసుకుందా మంటయ్యా; పెళ్ళొంకుర్రాళ్ళని పోగుచేసాను' అన్నాడు నారయ్య. జగన్నాథం కొంచం తేరుకున్నాడు. అతన్నిగురించిన అభిప్రాయం మార్చుకోవాలని సంకల్పించుకున్నాడు.

'ఈమధ్య మావూళ్ళో చెడుగుడి మొదలెట్టాం.' అన్నాడు జగన్నాథం.

'ఏదేనాసరే సై.'

'స్నానాలూ అవీ చేశ్గురుగాని లేవండి' అంటూ లక్ష్మయ్య వాళ్ళని

తీసుకుని వెళ్ళాడు.

జగన్నాథం శీఘంగోనుంచి పరుగెట్టుకుంటూ మళ్ళా అరుగుమీదికి వొచ్చాడు.

'ఆర్చిబిషప్ ఆఫ్ కాంటర్ బరీ—పోపు, వొస్తున్నారు' అన్నాడు.

'పోపేంటయ్యా కుర్రాయనా?' అని, నారయ్య వీధివెంపువాళాడు. దయానిధి, రాజభూషణం లేచారు.

'బౌద్ధ భిక్షువులు.' అన్నాడు మళ్ళా జగన్నాథం.

వెంకటాద్రి గారు వీధులోకెళ్ళి. ఆవొచ్చిన ముగ్గురు వ్యక్తులకీ నమస్కారంచేసి, వారిని అతిమర్యాదతో తీసువొచ్చి అరుగుమీద తివాసీ పరచి, స్తంభానికి దిండ్లు జేరవేసి, అక్కడ కూర్చో పెట్టాడు.

స్తంభానికి జార్లపడి, కాలుమీద కాలేసుకుని, రెండుచేతులూ కట్టేసుకొని ధీమాగా కూర్చున్నవ్యక్తి అపురూపానందస్వామి, పక్కన కూర్చున్న యిద్దరూ, వారి శిష్యులు. అపురూపానందస్వామికి, తూర్పుగోదావరి జిల్లాలో 'ముక్తిసాధన అనే పేరుగల ఆశ్రమం' వుంది. మొదట్లో ఆయన మలబార్‌నుంచి వొచ్చినా, చాలాకాలం తెలుగుదేశంలో వుండడం మూలాన వ్యవహారరీత్యా, తెలుగువాడనే చెప్పుకోడం. వేదాంత దృష్టిలో, దేశమంటూ లేదు,—విశ్వమే నాదేశం అని చెపుతూండడం, ఆశ్రమంలో వుండేవారికి తెలుసు, ఆయన, మళయాళం, తమిళం, తెలుగు, ఆంగ్లం, కొద్దిగా గుజరాతీ మాట్లాడటగలడు. అమెరికాలో ప్రచురింపబడే 'వెలుగు' అనే వేదాంత పత్రికలో అప్పుడప్పుడు ఆయన ముక్తిసాధనగురించి రాస్తూంటాడు. జమీందార్లు, రిటైర్డ్ వుద్యోగులు, మున్నగు వారికి ముక్తిసాధన మార్గాన్ని బోధించి విరాళాలని స్వీకరించి. 'శాంతి' అనే పత్రిక, నాలుగు భాషలలో కొంతకాలం నడిపిన మాట చాలామంది ఎరుగున్నదే ఐనా, ఎందుచేతో ఆపత్రిక ప్రచారంలోకి రాలేదు. ఈపత్రిక కోసం పాటుబడ్డ వారిలో సర్కిల్ ఇన్‌స్పెక్టర్ మాధవయ్యగారు ముఖ్యులు. ఆయన యాజమాన్యంకింద

రెండు ప్రత్యేక సంచికలు వెలువడ్డాయి. అందులో మొదటి దానిలో, విరాళాలు యిచ్చిన వాళ్ళ పేర్లు; ఆరుమాసాలు తరువాత వెలువడిన రెండో సంచికలో విరాళాలు యివ్వని వాళ్ళపేర్లు—యివీ వాటి ప్రత్యేకత. కొమార సుధామినాన్ అనే మళయాళీకన్య ఆశ్రమంలోవుంటూ కొంతకాలం సంపాదకురాలుగా పనిచేసింది. వేదాంతం స్త్రీలపొత్తు కాకూడదనీ, అందులో దక్షిణాది వాళ్ళ ప్రమేయం పనికిరాదనీ, కావలంటే, 'స్వామీజీ' కూడా వెళ్లవచ్చే ఆకన్యకోసం సినిమాకంపెనీ లేవదీస్తాం అంటూ, ఆశ్రమం చుట్టు పక్కల వుండే ఆంధ్రులు ఆందోళన చెయ్యగా, సుధామినాన్ హరిద్వారం వెళ్ళి అక్కడ వో బ్రాంచి పెట్టిందట. ఈ విషయం తెలియపరుస్తూ 'శాంతి' లో వో వ్యాసం పడింది. అందులో ముక్తిస్థానిన, గాయపడినా అసలు నిజం అదే అని కామయ్య లాంటి వ్యక్తులు చెపుతూ అన్నారు.

సుధామినాన్ వెళ్ళగానే ముక్తిస్థాన ఆశ్రమానికి ముక్తిపొచ్చినదను కోడం పొరబాటు. అపురూపానందస్వామికి చాలా ఆస్తివున్న మాటనిజమే. ఆ ధన యింకా అనేక ఆశ్రమాలు తీవస్తూవున్న సంకల్పమూ నిజమే. కాని, ఆశ్రమం మొక్క పరపతి తగ్గడానికి కొంతవరకు గవర్న మెంటు వుద్యోగులు అనవసర స్థానాలు మారడమే కారణమనాలి, అందులో మాధవయ్యగారి లాంటి పెద్ద వుద్యోగులు కలుగచేసుకోడం మనీ ప్రమాణించింది. అసలు మీద మట్టికొట్టుకుంటూ ఎన్నడో అడుకునే ఆంధ్రులు 'స్వామీజీలు' గవర్నమెంటు ఏర్పాటుచేసిన సన్యాసులు, పోదురూ' అన్నారు. కాని కర్పులేకుండా, రాజాలా బ్రతకడానికి కొందరు వేసేవస్తు, అని నిరుద్యోగులు అసూయతో అన్నమాట. తెగ పాపాలుచేసి, యిప్పుడేనా పరిహారం చేసుకుందాం అని కాకపోతే యీ పెద్దవాళ్ళకి వేదాంతం ఎందుకయ్యా, చెప్పండి' అని కామయ్యలాంటివాళ్ళన్నారు.

మాధవయ్యగారికి యిటీవల పరలోకచింత, ఆధ్యాత్మికదృష్టి ఎక్కువైనమాట వాస్తవమే. ప్రతిశనివారం తను ఏ ఆశ్రమానికో వెళ్ళి వేదాంత

'రాజా' అడిగాడు.

"తప్పకుండా రావొచ్చు. నేను బ్రహ్మచారినికానూ!" అన్నాడు స్వామిజీ. శిష్యులు ఆశ్చర్యం ప్రకటించకుండా, మనం 'నవ్వు' అనుకునే దాన్ని చూపించారు. నారయ్య దూరంగా చేతులుకట్టుకుని వినయంగా నిలబడ్డాడు. అరుగుమీద పదిమంది పోగైనారు.

"అసలు ముక్తిసాధన అంటే ఏమిటో సెలవిస్తారా?" అని 'రాజా' అడిగేశాడు.

"మావాడికి వేదాంతంలో అభిలాష జాస్తి" అని దయానిధి చెప్పబోతుంటే, స్వామిజీ నవ్వి అంటున్నాడు— "ముక్తిసాధనగురించి చెప్పడం నావిధి. మీబోటి చదువుకున్న యువకులంతా ఆధ్యాత్మికచింత చూపడం, మంచిసూచన..."

"ఎందుకంటున్నానంటే, మావాడికి దేవుడంటే బొత్తిగా నమ్మకం లేదు. అసలు మతం అనేదే లేకపోతే, ప్రపంచం హాయిగా వుండునంటాడు.." అని దయానిధి అంటున్నాడు.

"ఏ వొస్తువు లేదని [illegible]

లేదని ఋజువుచెయ్య[illegible]

[illegible]?" అ[illegible]

"మానాడు నా అభిప్రాయాలను విశదంగా చెప్పలేకపోవొచ్చు. మీ సందేహాలని నేనే నివృత్తి చేస్తాను?" ముందు 'ముక్తి, అంటే ఏమిటో సెల విస్తారా?"

"మీరేమనుకుంటున్నారు?"

"నేను 'ముక్తి', 'మోక్షం' అనేవి అర్థశూన్యమైన ధ్వనులను కుంటున్నాను. ఒకప్పుడు వాటిని వాడినవారికే, వాడగా విన్నవారికే, వొక 'అర్థం' వుండేది. ఇప్పుడదిలేదు." 'శివ' ఆశ్చర్యపడ్డాడు, వారయ్య వొక అడుగు ముందుకు వేశాడు. వెంకటాద్రిగారు, పొడుం దట్టి మూశాడు.

"ముక్తి— మోక్షం—అనగా పరమాత్మలో ఐక్యం కావడం." అన్నాడు స్వామీజీ.

"ఆహా!" (సభలో వొక కంఠం)

"చిన్న నదులన్నీ సముద్రంలో పడినట్లు" అన్నాడు శివ.

"పరమాత్మ—అనేది, వొక వ్యక్తా, స్థితా, వొస్తువా?"

"పరమాత్మ—బ్రహ్మన్, అందులో ఐక్యం ఐనవారికి మర జన్మలేదు. జన్మ రాహిత్యమే, ముక్తి." అన్నారు స్వామీజీ. "అంటే మళ్ళీ యీ ప్రపంచంలో పుట్టకుండా వుండటం, ముక్తి అందురా. మాకా ముక్తి అక్కర్లేదు. అన్నిలోకాలల్లోకి, యీ ప్రపంచం వుత్తమం; మానవజన్మ మహోన్నతం, ఈ సినిమాలు యీ రాజకీయాలు, ప్రకృతి సౌందర్యం,—వీటిని విడచిపెట్టలేం. ఎన్నో జన్మలు ఎత్తాలని వుంటుంది. కాబట్టి మాకు జన్మరాహిత్యం అక్కర్లేదు" అన్నాడు రాజా. దయానిధి అంత జోరుగా మాట్లాడొద్దని కళ్ళతో సంజ్ఞ చేస్తున్నా, అతను అది గమనించలేదు.

"జన్మరాహిత్యం అంతసులభం కాదు; అధ్యాత్మిక కృషి పూర్వజన్మ సుకృతం—వారివారి కర్మఫలాల్ని బట్టి, మనుజులు దైవాన్ని తెలుసుకుంటారు వారేపుణ్యాత్ములు."

"పుణ్యం అన్నాకూడా ముక్తన్నమాటేనా."

"అది పిచ్చిసాధన. పరమాత్మలో ఐక్యం కావడానికి మొదట్లో యిష్టంలేదు మాకు; మాకు యిల్లా విడివిడిగానే వుండి, అస్తమానా యీ లోకంలోనే పుడుతూవుండాలని వుంది—అసమం విశాలం ... వొచ్చే వరకేనా, ప్రతిమనిషి జన్మలు ఎత్తుతూ వుండవల్సిందే, కామంతానికీ, ఐక్యం అవడం మాచేతుల్లో, మాయిష్టంలో లేదంటూం, మమ్మల్ని ... కోసం, ప్రార్థన, యోగాభ్యాసం, దీక్ష, వ్రతం, వగైరా చెయ్యనవసరంలేదు. మీబోటి పుణ్యాత్ములు రెండుమూడు జన్మలలోనే ఐక్యం అవుతారు. నాబోటి పాపాత్ములు, మరో ఇరవై జన్మలు ఎక్కువ తీసుకుంటారు; అంతే తేడా. మీరు ముందెడతారు; మేం కొంచం ఆలస్యంగా వెడతాం. దానికింత గడబిడ ఎందుకండి......?"

జీవ, సజీవలు తెల్లబోయి చూస్తున్నారు. గురువుగార్ని యింత ఘాటుగా ఖండించటం ఎప్పుడూ చూడలేదు సజీవ. ఈవాదాన్ని తప్పని ఋజువు చేసేందుకు తనూ ఏదో అనాలి, లేకపోతే బాగుండదు—అనుకుని కొన్నిమూసు కుని ఆలోచించి, చివరికి 'ఓం!' అన్నాడు.

వెంకటాద్రిగారు 'రాజా' అన్న ముక్కలకి లోపల సంతోషిస్తున్న ట్లుగానేవుంది, ముహంలో చిరునవ్వునిబట్టి.

"ఐతే, దైవాన్ని ప్రార్థించి సాధించిన మహానుభావు లెవరూ లేర వెంగళీప్పలే అంటావు? రామదాసు, కబీరు, త్యాగయ్య, రామకృష్ణ పరమ హంస, వివేకానంద..."

"చాలామంది వున్నారు."

"అవేం, వారంతా తెలివితక్కువవాళ్ళు, మీ దృష్టిలో మహాను భావులూనా?"

"మాదొరలు అనక్కరలేదు; మీరూ ఇంగ్లీషు చదుకొని ఆ దొరల వుద్యోగం చేసినవారే."

"ఏదో పెద్ద ముండావాళ్ళే అన్నాను."

"అయ్యో, అట్లాగే, ఎంతమాట—ఏదో కుర్రతనం అనుకోండి—ఆ దొరలలో కూడా అట్లాంటి మహానుభావులున్నారు. ఫ్రాన్సిస్ ఆఫ్ అసీసి, ఎడ్మండ్, అగస్టైన్, ఫేంసా, మార్కస్ అరీలియస్, స్పినోజా, వొందలు... వాళ్ళందరూ యీ ప్రపంచాన్ని చూసి కదలి పోయ్యారు. ఈర్ష్య, వ్యాధి, అజ్ఞానం, పశుత్వం, యుద్ధాలు, మృత్యువు—వీటిని సహించలేక హడిలిపోయి, మరమ్మత్తు చెయ్యడం చేతకాక, యీ దౌర్భాగ్యపు లోకంలో ఎల్లాగో అల్లాగ, సంతోషంగా గడపడానికి, వారొక ఉపశీత విధానాన్ని, వొక ప్రశాంతదృష్టిని అలవరచుకుని, సమాధానపడ్డారు ఆమార్గం యితరులకి తెలియజేశారు. ఆనందాన్ని ఆశిస్తాడు మానవుడు. అది వాడి నైజం. అనేక మంది అనేకరకాలుగా ఆనందాన్ని సాధిస్తారు; కొందరు తాగుతారు, కొందరు వ్యభిచరిస్తారు; కొందరు పద్యాలు రాసుకుంటారు; పాడుకుంటారు; మరికొందరు రాజకీయంలో పడి దేశసేవ చేస్తారు; ఇంకా కొందరు చిత్రపటాలు గీస్తారు; ప్రకృతిని ఆరాధించేవారు సౌందర్యాన్ని ఆరాధించేవారు—అందరూ తలో రకంగానూ వారివారి పరిస్థితులను, సంస్కారాలనుబట్టి, ఆనందాన్ని సాధిస్తారు; ఆధ్యాత్మిక చింతద్వారా ఆనందాన్ని సాధిస్తారు, మీబోటి కొందరు వారు చేసే చేష్టలు, చెప్పేకబుర్లూ, యితరులకి అపకారం చెయ్యకుండా, పోటీపడకుండా, యితరుల ఆనందానికి అడ్డుతగలకుండా వుంటాయి. కాబట్టి, వారిని మహానుభావులనీ, వారిమార్గం, వున్నతమైనమార్గం అనీ, అంటున్నారు. ఉదహారణకి చూడండి: సౌందర్యాన్ని ఆరాధించేవాణ్ణి తీసుకోండి—ఒక అందమైన స్త్రీనిచూస్తాడు, కోరతాడు; ఆ స్త్రీనే మరోడు కోరడం జరగొచ్చు; ఆ స్త్రీకి భర్త వుండొచ్చు లేకపోతే, ఆ స్త్రీయే ఏమీ ప్రత్యుత్తరం యివ్వకుండా, తృణీకరించవొచ్చు; వీటన్నింటిలోనూ యితరులకి అడ్డురావడం, బాధకలిగించడం జరుగుతోంది. కాని దేవుణ్ణి ప్రేమించడంలో యిల్లాంటి చిక్కులులేవు. ప్రకృతిలో—అడవులు. శృంగాలు ముళ్ళూవుంటాయి; కవిత్వంలో, కఠోరపదాలు, చెప్పలేనిబాధ, అర్థంకాని స్వనులు వుంటాయి; సౌందర్యం మాసిపోతుంది; యవ్వనం నెరసి

స్తుంది, ప్రజాసేవకి పలుకుబడి, డబ్బు, ఓర్పువుండాలి; చిత్రకారుడికి, వాడిబొమ్మలుచూసి మెచ్చుకునేందుకు తగినంత తీరుబడివున్న జనంకావాలి. దేవుడికి యీ యిబ్బందులులేవు, అసలు కనబడడు-ఏకలలోనో, ఏభూతంగానో తప్ప, యిందుగల డందులేడు; నీలోవున్నాడు లేడు; సర్వాంతర్యామి; నిరాకారుడు. ఎంతపట్టుగుని పూజించినా విసుగురాడు, వాడిపోడు; సమాధానం చెప్పడు, నేను చిత్రకారుణ్ణిఅంటే 'ఏదీ నీ బొమ్మలు చూపించి ఋజువుచేసుకో' మంటారు; కవిని పద్యాలువినిపించు విలువకడతాం అంటారు. దేవుణ్ణి ప్రార్థించేవాడికి యీ యిబ్బందులు లేవు. తను చేసేపనికి సాక్ష్యం కట్టే వాళ్ళులేరు; ఏడీ నీ దేవుడు 'చూపించు, ఋజువుచెయ్యి' అని అడగలేరు. ఉన్నదీ లేనిదీ, ఋజువుచేసుకోలేక; కేసు వాయిదా వేయించుకో లేకపోయిన ప్లీడర్లా వొట్టి దద్దమ్మలాంటివాడు, దేవుడు. అసలు మంచి దేవుణ్ణి సృష్టించడం, మానవుడు యీ లోకంలో చేసిన మహాకార్యం అన్నాడు బట్లర్..."

"ఎవరిదగ్గర బట్లరు?" అన్నాడు వెంకటాద్రిగారు.

"అయ్యో, మార్క్స్! బట్లర్ అనే ఆయన వొక సుప్రసిద్ధ ఆంగ్ల రచయిత." అన్నాడు 'రాజా'

'అయ్యోరామ! అనడంమాని అయ్యోమార్క్స్! అంటారా మీరు?' అని స్వామీజీ అడిగారు.

'మార్క్స్ వొకడేకాదు; ఆధునిక శాస్త్రజ్ఞు లందరూను: డార్విన్, లమార్క్, బఫ్ఫన్, పాస్ట్యూర్, ఫ్రాయిడ్, వాట్సన్-వీరందరూ, వ్యాధులు, అజ్ఞానం, మూఢత్వం, వీటిని వొక్కొక్కదాన్నే నిర్మూలం చేస్తున్నారు. అన్నీ నిర్మూలమైనప్పుడు, మనిషికింక దేవుడితో నిమిత్తంలేదు. కుళ్ళు, చీకటి, పశుత్వం జాడ్యం, వీటితోనే అజ్ఞానకూడా నిష్క్రమిస్తాడు.

'హెలెన్ ఆఫ్ ట్రాయ్‌ని చూశానండోయ్—మైడియర్ ప్రొఫెసర్ జీ ......" అంటూ జగన్నాథం దక్కొచ్చాడు.

అరుగుమీది బృందాన్ని చూడగానే కొంచం తమాయించాడు. "ఫలారం చేశావంటయ్యా కుర్రాయనా?" అన్నాడు నారయ్య.

'ఓ. అంతేకాదు. వధూ సందర్శనా క్షీర కషాయాన్నికూడా గ్రోలాం.—" రాజభూషణం కేసి తిరిగి "సమాసం తప్పనుకోండి; శుభ కార్య సందర్భాలలో వొకప్పుడు భాషాస్వేచ్ఛ వోపదగున్, అబ్బో, చాలా బరువైనమాటలు పడుతున్నాయండోయ్ బావగారు.'

మధ్యలో రాజభూషణం అందుకున్నాడు.

'వధువును స్పష్టంగావర్ణించి, ఆమె కుటుంబ పరివారాన్ని సూక్ష్మీకరింపుము.—'

'**All questions carry equal marks** దంచేస్తాం. అసలు తెలుగు పేపర్లు **do not carry any marks**....."

'ఫిలాసఫీ క్వశ్చన్ పేపర్ మాదిరి—' అన్నాడు నిధి. స్వామీజీ కూడా వింతగానవ్వాడు. వెనక చెలువుగట్టున వెంటపడిన కృత్తల జంట మాదిరి, జీవ, సజీవలుకూడా ఆశ్చర్యంతో చూస్తున్నారు.

"**To begin with**—ఇందిర—ఇందీవరశ్యాము...లా వుండండి. సింహములాంటి నడుము, శంఖంలాంటి మెడ, మధ్యముక్కు అడ్డం వొచ్చింది కాని, లేకపోతే వొకే కన్నులాగుండే నేత్రద్వయం—కాళిదాసు గుండెలు బాదుకుంటాడు—అసలు ముక్కే లేదు—...పోస్, పో'

'కుర్రాడు పుట్టినవాడే—ఏం చదువుకుంటున్నాడు?'

**Ask me** నన్నడగండి, సెకండరీస్కూల్ లీవింగ్, కాలేజీ కోర్స్ ఎంటరింగ్, మారేజ్ ఎలిజిబిలిటీ **Examination** కొండొకచో **S.S.L.C.**

'మంచివాడివే...'

'మావాడేనండి, బిగ్గరగా ఆలోచించే అలవాటువల్ల అల్లా మాట్లాడు తుంటాడండి. నిజంగా అందరూ అల్లా వుండగల్గితే ఎంత బాగుంటుందా అని పిస్తుంది' అన్నాడు నిధి. జగన్నాథం చెవి పుచ్చుగుని, తన దగ్గరగా తీసు

కున్నాడు. బావగారి తొడమీద తల ఆనించుగుని పడుకున్నాడు జగన్నాథం.

'కర్ణరంధ్రము దవియనేలా...'

'చూడూ నాథ్—స్వామీజీ వారు.' జగన్నాథం స్వామీజీకి నమస్కరించారు.

'ఓం!' అన్నారాయన.

'నాక్కూ అంతేనండి. ఇడ్డెన్ల చట్నీలో కారం ఎక్కువగా వేశారో ఏమో. పూ, ఎక్కిళ్లు—మంచితీర్థం...'

'రాజా జగన్నాథాన్ని లేవదీసి కూర్చోబెట్టాడు. 'ఎక్కిళ్ళు కావు నాయనా—'ఓం' అనేది ఓంకారాన్నుంచి పుద్భవించిన వోళ ధ్వని—అంటే 'సృష్టి' అన్నమాట. ఈ విశ్వం అంతా 'ఓం' అని ధ్వనిస్తూ కదుల్తుంది.'

'అవునండోయ్ — దీనివిషయం విన్నాం. మా డ్రిల్లుమాష్టరు స్టాండ్ ఎట్ యీజ్ లాంటిది. దీని మహత్తు ఎటువంటిదో కొంచం తెలపిస్తారా?'

స్వామీజీ నవ్వులో జ్ఞానకాంతులు మెరిసాయి.

'ఆధ్వని సర్వ మానవభాషకీ పునాది. ఆధ్వనిలోంచి, భాష: భావం, ప్రాణిసృష్టి, విశ్వం—అన్నీ జనించాయి. అది బీజాక్షరం. ఓంశ్రీకృష్ణ ప్రీత్యర్థే గీతా పారాయణే జపేవా వినియోగః...'

సజీవ సంచీలోంచి భగవద్గీత పైకి తీశాడు. 'కాని దాని మహత్తు ఎట్టిదో తెలవిచ్చారు కారు.' అన్నాడు జగన్నాథం.

'సంతోషమైంది, సకల ప్రాణులకీ, సర్వమానవ కోటికీ మూలపురుషుడు పరమాత్మ — 'ఓం' దైవోపాసన, ప్రార్థన...'

'దానివల్ల ప్రయోజనం?' అన్నాడు రాజా!

'దుఃఖం, బాధ, పాపం—అన్నీ పటాపంచలై ఆత్మవికాసం, జ్ఞానం పొంది, పరమాత్మలో చేరుకుంటుంది. జీవి, ముక్తిని పొందుతుంది. అదే జీవిత పరమార్థం. దానికి గీతాపారాయణ, యోగం, పుపాసన, ప్రార్థన యాత్ర, యజ్ఞం—యివన్నీ పుపకరాలు..."

"నా వుద్దేశంలో, అందరి అనుభవంలోనూ, మీరు చెప్పిన వాటివల్ల బాధ దుఃఖం, పాపం, యివి తొలగిపోవడమనేదికల్ల. ఈ ప్రచారం హిందూమతానికి, జాతికి నష్టం చేస్తోందనుకుంటాను. దేవుణ్ణి వుద్దేశాలు మంచిచెడ్డలు, వీటికి కట్టుబడిన వాడిలా చిత్రిస్తోంది యీ వేదాంత దృష్టి. దేవుణ్ణి ప్రార్థించడం, వో కలంచం యివ్వడంకింద వుంటోంది. నన్ను పరీక్ష ప్యాస్ చెయ్యి, నాకు బోలెడు కట్నంతో మంచిపిల్లనిచ్చి వివాహంచెయ్యి, నాకు పిల్లలులేరు మొగపిల్లవాణ్ణి ప్రసాదించు, నాకు యింక్రిమెంట్ యిప్పించు;— నీకు కొబ్బరికాయ కొడతాను, తిరుపతి కొండపై డబ్బులో ఏదో వేసుగుంటాను... అనమంటోంది. మొద్దు, దుర్మార్గుడు, దుర్నీతిపరుడు, బలహీనుడు... వీళ్ళందరికి దేవుడే శరణు. "నీ యిష్టమొచ్చినన్ని పాపాలుచెయ్యి, ఏం భయంలేదు నేవున్నాను, చివ్వర కాస్త పశ్చాత్తాపపడు, అన్నీ కొట్టుకుపోతాయి" అంటాడు దైవం. ఈ దృష్టి నిజంగా పాపిని ప్రోత్సహిస్తోంది. అన్ని మతాలు దేవుడికి రెండు లక్షణాలని ఆపాదించాయి; మొదటిది — అపారమైన శక్తి, రెండోది అనంత ప్రేమ. మానవజాతి యిన్ని యుగాలు యీ గోళంమీద జీవించింది, మానవుడికి తిండి తినడంచేతకాదు — జాడ్యం, బాధ, పేదత్వం, చెడుగు యివి ఏవీ మానవుడు ఎంతమంది దేవుళ్ళని మ్రొక్కినా తొలిగిపోలేదు. నిజంగా దేవుడు శక్తిగలవాడై వుండికూడా యీ చెడుగుని తొలిగించలేక పొయ్యాడంటే, ఆయనకి ప్రేమ లేదేమో ననుకోవన్సి వొస్తోంది; పోనీ దయామయుడు, ఆపద్బాంధవుడు;— అనంతమైన ప్రేమకలిగిన దేవుడు యీ చెడుగుని తొలిగించ లేక పోయాడంటే, ఆయనకి శక్తిలేదని బుజువవుతోంది. ఏనాడు ఆయనికి వీటిని నిర్మూలించే శక్తిలేదని వొప్పుకుంటున్నామో, అప్పుడు ఆయనకి ప్రేమకూడా లేదనుకోవడం కష్టంకాదు. ఈ ప్రేమా, శక్తిలేని దైవం మాకక్కర్లేదు.'

"సంతోషమైంది" అంటూ మధ్యలో స్వామి అందుకున్నాడు. మీ కక్కర్లేకపోయినా ఆయనే మీదగ్గరికి వొస్తాడు. అదే, ఆయనలో విశేషం."

సదీవ సంతోషం పట్టలేక 'ఓం' అన్నాడు. సముద్ర కెరటంపైన కొట్టుకునిపోతూన్న గడ్డిపూచలా, రాజభూషణం తను స్వంతంగారగుల్చుకున్న వుద్రేకంలో కొట్టుకొనిపోవడం దయానిధి గ్రహించాడు. అతన్ని మరో కప్పు కాఫీ తాగమని, అందుకోసం జగన్నాథాన్ని పంపించాడు. మరో సిగరెట్టు ముట్టించమన్నాడు. అగ్గిపుల్ల పారేసి, ఆకస్మికంగా కొత్తభావం తట్టినవాడిలా 'రాజా అన్నాడు. "పనీ పాటాలేకుండా. ఎందుకూ పనికిరాని సోమర్లకి యింత అన్నం పెట్టడం తప్ప యీ మతంవల్ల మరో వుపయోగం లేదు. శక్తులన్నీ అడుగంటిన అమ్మమ్మలూ, తాతయ్యలూ, దీనిపేరిట యితరులపై ఆధ్యాత్మికంగా అధికారం చలాయిస్తుంటారు. ఆధ్యాత్మిక జీవితంలో నాయకత్వం బహు సులువుగా సంపాదించవొచ్చు. దీనికి కానీ ఖర్చులేదు; పరీక్షలు ప్యాసవ నక్కరలేదు; సంఘుకట్టు బాట్లతో మొదలే నిమిత్తంలేదు. ఇంత సులభం కాబట్టి యీ ఆధ్యాత్మిక జీవితానికి అంత పలుకుబడీ, ప్రచారమూను.

"ఐతే రాజా, నువ్వు ఖండించేది దైవాన్నా, మతాన్నా, ఆధ్యాత్మిక జీవనాన్నా" అని అడిగాడు నిధి.

"ఈ మూడింటినీ కట్టకట్ట—యీ మూడూ వొకటే."

"కాదు. నేనోసారి బరంపురంలో జ్ఞానానందస్వామిని కలుసుకున్నాను. ఆయన ఏమన్నాడంటే, మత వైషమ్యాలకి కారణం, యీ మూడూ వొకటేననుకోడం—ఆధునిక విజ్ఞానశాస్త్రం దైవాన్ని ఖండించదు; ఎందుకంటే దేన్ని ఖండించినా అదొక నైతికవిలువ ఐపోయి వుంటుంది; నైతిక విలువల్ని గుర్తించడమే ఆధ్యాత్మిక జీవనం—అన్నాడు. నువ్వు యీ మూడూ వేరని అంగీకరించాలి."

"సంతోషమైంది; జ్ఞానానందస్వామిని మీరు చూచి వుండారుకదా; ఆయన దేన్ని నైతిక విలువ లన్నాడు?"

జ్ఞానానందస్వామివిషయం చెప్పేటప్పుడు, స్వామీజీ కళ్ళల్లో యీ

కదలడం, నిధి గమనించాడు. ఋషులకు, దేవుళ్ళకు, పడకపోవటం, పెద్ద చిన్నలు, పోటీలు వుంటుంటే, మనుషులు ప్రజాస్వామ్య సిద్ధాంతాలని అనుసరించడం, తప్పకు కాబోలు. భూస్వాముల పరిపాలనాతత్వం, దేవుణ్ణి గూడా పాడుచేసేసిందికదా!

"సృష్టితో అసంతృప్తి పడటమే నైతిక విలువల్ని ఋజువు చేస్తుంది. అసంతృప్తికి కారణాలైనవాటిని నిర్మూలించెయ్యడానికి అవలంబించిన మార్గమే ఆధ్యాత్మికజీవితం; అందరూ, అంటె చాలామంది—ఆమార్గలనే అవలంబిస్తే, అది మతం. మతం ప్రబోధించిన అనేక మార్గాలలో మోక్షసాధన, పరమాత్మ—వొకటి..." అన్నడు నిధి

"ఇవన్నీ ఆయనే చెప్పినాడా?" అనిఅడిగాడు స్వామీజీ. 'జీవ' నమ్మడం కష్టం అన్నట్లుగా తలపంకించాడు.

"సరిగ్గా యీ మాటలు ఆయన వాడలేదు. నేనుసారాంశం మాత్రం చెబుతున్నాను. ఈదృష్టిసరియైనదని మనం వొప్పగుంటే, 'మాంరాజా' చెప్పిన విషయాలని సులభంగా పరిశీలించ వొచ్చు.—" నిధి గొంతుక సవిరించుకున్నాడు. నారయ్యావొకడుగు ముందుకువేసి కూర్చున్నాడు.

'మనిషికి కావల్సింది తిండి. అదిలేనిదే ఏదీచెయ్యలేడు. ఇంతవరకూ యిది మానవుడు సంపాదించుకోలేకపొయ్యాడు. అందరికీ సమానంగా భోజనం లభించే మార్గాలని గురించి ఆలోచించక, యీమతం; దైవం అంటూ ఎందుకు కాలం వృధాచేస్తారా అని, 'రాజా' విచారిస్తాడు. అవునా? అంటే, అందరికీ తిండిని సంపాదించడం రాజకీయ మార్గంఅవుతుంది. ఆమార్గాన్ని అవలంభించ మంటాడు. ఆతిండిని సృష్టించేది దేవుడే అని మీరంటున్నారు. ఆదేవుణ్ణి పూజిస్తేతిండిరాదు, ఎందుకు వృధాగా పూజించడం అంటాడు రాజా. లభ్యంకాని వొస్తువుని ఆశించడం మానవుడి నైజం... రాజాకి **Karl Marx, Lenin, Morris,**—వీరికి తిండిలభ్యం కాదు. మీకు, రామకృష్ణ పరమహంస, స్పైనోజా,' దయానంద సరస్వతి—వీరికి దైవం

లభ్యంకాదు. ఇద్దరిదీ ఆధ్యాత్మిక జీవనమే. అంచేతే పూర్వులు అన్నం పర బ్రహ్మస్వరూపం అనేసి యిద్దరికీ రాజీచేశారు..."

"వేళాకోళం చేస్తే నేను వాదించను." అన్నాడు రాజా. "సంతోషమైంది. కాని, మీరు జ్ఞానానందస్వామి చెప్పిన విషయాలు బాగున్నా యన్నారుకదా. ప్రజాసేవ, పెరుమాళ్ సేవకంటె ముఖ్యమంటారా?" అని అడిగాడు స్వామీజీ. జ్ఞానానందస్వామి మోక్షం సాధించాడని స్వామీజీకి అసూయలేదు. ఇతరులకు ఆమార్గం చూప గలిగాడంటేనే యీాయనకి కొంచం కష్టంగావుంటుంది.

దయానిధి అన్నాడు— "మతానికీ, దైవానికీ బదులు, ఆధునికులు, ప్రకృతిని, కళనీ ఆరాధించడం, జరుగుతోంది; కొందరు ప్రజాసేవతో తృప్తి పడుతున్నారు. కాని యివేవీ ఆధ్యాత్మిక దృష్టిలో దైవానికి బదులుగా, వుండకూడదనీ, అల్లావుండటమే నేటి నాగరికతకి అరిష్టలక్షణం అని రాధాకృష్ణన్ మొదలైనవారు అంటున్నారు. దైవచింత వొక మహత్తరమైన ఆధ్యాత్మిక అనుభవం. ఆ ఆకలి చల్లార్చుకున్నవారికి, ఆవెలుగు చూసినవారికి మరి ఏ యితర వొస్తువూ అక్కర్లేదు. వారుదేన్నీ ఆశించరు, కోరరు; ద్వంద్వాలులేవు; అసంతృప్తిలేదు. అన్నింటికీ అతీతమైపోయి, వొక నిశ్చలమైన ఆనందాన్ని పొందుతారు. దీనిముందు రాజకీయ రంగంలో మానవుడు పొందిన అఖండవిజయం, కళారంగంలో చవిచూసిన అనంత సౌందర్యం—అన్నీ సూర్యుడిముందు నక్షత్రాలు లాంటివి.

"మాకెవ్వళ్ళకీ యీ ఆకలిలేదు: మేం దీనికి తగం; మాకక్కర్లేదు. తిండి తినడం చేతగాని యీ కుక్క అస్తిపంజరానికి అతీతమైన అందానికి అక్కతలేదు—" అంటున్నాడు రాజా.

"నా కాకలేస్తోందంకోయ్." అన్నాడు జగన్నాథం. ఉప సభ్యులు నవ్వారు; పాపం వారికీ ఆకలేస్తోంది గాబోలు. 'రాజా' సిగరెట్టు పారేసి, భగవద్గీతని చేతులో తీసుకున్నాడు. సభ్య వారించ బోయ్యాడు. రాజాకి

కోపం వచ్చింది.

"ఈ ఖండాలపు హస్తం యీ పుస్తకాన్ని తాకకూడదా ఏమిటి...?"

సరావ నాలిక కొరుక్కున్నాడు. స్వామీజీ గ్రంథాన్ని తీసుకుని, గుడ్డతో తుడిచి రాజాకి యిచ్చాడు.

రాజా పేజీలు తిరగేస్తూ అన్నాడు—"ఈ గీతవిషయం చూడండి. దీన్ని గురించి మొదటి అసత్యం యిది కేవలం ఆ కృష్ణ పరమాత్ముడే వ్రాశాడని. నిజానికి, ఆనాటి మహారాజు తమ చిరాస్తులని ప్రజాబాహుళ్యం తిరుగుబాటు చేసి దోచేడి చెయ్యకుండా, వ్యాసుడికో అగ్రహారం పారేసి, యీ గ్రంథాన్ని వ్రాయించారు. ఇందులో కృష్ణుడు చెప్పిన సందేశం ఏమిటి? ఓ ధనంజయా, యీ భవనాలు, యీ ఆభరణాలు, భూములు, భార్యలునీవి; వీటిని కాపాడుకోడం నీవిధి. నీ వార్ధక్యంలో ఎవ్వరూ నిన్ను పోషించరు; అంచేత యుద్ధం చెయ్యి; నాకూ వున్నారు బోలెడుమంది భార్యలు; పట్టు నీతో కలిసి నేనూ యుద్ధంచేస్తాను." అని కేవలం భూస్వాముల తత్వం యొక్క ప్రచారంకోసం వ్రాయించిన గ్రంథం, యిది. ఇదట భారతీయుల పవిత్ర గ్రంథమట! సిగరెట్టు కాల్చిన చేతులతో దీన్ని ముట్టుకుంటేనే అపవిత్రం ఐపోతుందట! దీన్ని అచ్చువేసింది ఎవరో— ప్రెస్సులో పనిచేసేవాడు; వాడికి సరిగ్గా రెండోపూట తిండివుండదు, సిగరెట్టు కాల్చడు. రాత్రి గుడ్డిదీపంలో దృష్టి ఆనక, బీడి సగంకాల్చి, ఆర్పేసి, చెవివెనక దోపుకొని, ఆచేతులతో అచ్చొత్తిన యీపుస్తకం, పవిత్రగ్రంథం ఎట్లాగైందో నా కర్థంగాదు—"

జగన్నాథం చప్పట్లు కొట్టాడు.

"రైట్, అందుకనే మా తెనుగు టెక్స్టుబుక్కు పాడు వాసన; ముఖ్యంగా భర్తృహరి సుభాషితాలు కేవలం పత్రముఖీ—అనగా బీడీ పొగ తాలూకు పరిమళం..." దయానిధి అతని చెవిని మెలిపెట్టాడు——

'పోనీ క్షమించండి. కాగితపు ముఖీ, పొగ తాలూకు, పరిమళం; తమరు డాక్టరు కాబోలు. రైట్, ఐదోఫారం వాసన. ఓ. కె?"

అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యంతి తవాహితాః,
నిందంతస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్?

అంటే నీ శత్రువులు నిన్ను శుంఠఅని నిందిస్తారు. దానికి మించినదుఃఖ మేమిగలదు, అని తాత్పర్యం. అది పోటీపడటం కాదు? కేవలం **Capitalist Competativeness.**

మరొకటి.

'హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్
తస్మాదుత్తిష్ఠ కౌంతేయ! యుద్ధాయ కృతనిశ్చయః,

అంటే యుద్ధంలో చనిపోతే స్వర్గమూ, (అంటే రంభా వగైరా స్త్రీలతో కులాసాలు) గెలుపొందితే రాజ్యభోగము పొందగలవు. అందుచేత, లే, యుద్ధం చెయ్యి, అని. మాంసాహారా, భోగాలకోసం, శరీర సుఖాలకోసం, మంచిబట్టలు, హైక్లాస్ సిగరెట్లు, మోటార్, రేడియో, వీటికోసం యుద్ధం చెయ్యమని ప్రబోధం. ఈనాడు అన్నిదేశాలు చేస్తున్న పనేయిది. దీని ఫలితంగా మనదేశం, మననాగరికత, ఏమైందీ మీకందరికీ తెలిసిందే. పరీక్షలో ఫెయిలైన విద్యార్థి గోదావరిలోపడి ఆత్మత్యాగం చేసుకుంటాడు. శీలం తాలని నిల్పలేకపోయిన బ్రహ్మచారిణులుదింపడతారు. ఈభోగాల కోసం, రాజ్యాలు, దేశాలు నాశనమై పోతున్నాయి. ఇది సద్గ్రంథం ఎట్లావుతుందో నాకర్థంకాదు."

"సంతోషమైంది" అంటూ స్వామీజీ ఆ భగవద్గీతని చేతుల్లోకి తీసుకుని, మరోపుట తీసి శ్లోకం చదవడం మొదలెట్టారు.

"విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని.
శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః.

సజీవా, దీనికి తాత్పర్యంచెప్పు.

సజీవ గొంతు సవరించుకొని!

"విద్యావినయ సంపన్నే, అనగా, విద్యావినయములుగల; బ్రాహ్మణే

బ్రాహ్మణుని యందును, గవి, గోవునందును, హస్తిని—

"హస్తిని, అంటే ఏమిటోయ్ నాథ్" అని మధ్యలో అరిచాడు నిధి.

"హస్తిని, చిత్తిని, పద్మినా జాతి స్త్రీములు—"

"ఊరుకో—" అన్నాడు రాజా.

"పిల్లుపడ్డ కోలువలె," అని నోరు మూసుకున్నాడు జగన్నాథం.

సజీవ అంటున్నాడు—, "హస్తిని, ఏనుగు నందును, శుని చ, కుక్కయందును, శ్వపాకే చ, చండాలునియందును, పండితాః, పండితులు, సమదర్శనః, సమభావము గలవారు".

నిధి అన్నాడు — "మహారాజా, నీకొక్కసారి సోషలిజమ్ యిందులోవుంది."

"అదేలేదు. ఈ పుస్తకం వ్రాసినవారు బ్రాహ్మలు. వారు కాయకష్టానికి ఓర్చుకోలేరు. పొలం దున్ని పండించుకోలేరు. అంచేత రెడ్లని, రాజుల్ని కాకా చేసి, ఏదో మేము పండితులం అని చెప్పుగుంటూ, వారిదగ్గర సలహా దార్లుగా చేరి పొట్టనింపుకున్నారు. ఈనాడు, ఎంతమంది పండితులు, బ్రాహ్మలు, చండాలునితో కలిసి భోజనం చెయ్యడానికి సిద్ధపడుతున్నారు?

లక్ష్మయ్యగారు "వొడ్డించేశారు. లేవండి.''అన్నాడు. అందరూలేచారు; బట్టలుమార్చుకున్నారు. పీఠలలోకొచ్చారు. ఆబృందంలో నిధికూడావున్నాడు.

"మీకు యిక్కడికే పంపుతాంగా" అన్నాడు వెంకటాద్రిగారు.

"ఎక్కడైతే ఏంలెండి—నేనూమావాళ్ళతో కలసి అక్కడే భోజనం చేస్తాను."

వెంకటాద్రిగారు నవ్వి--"అట్లాకుదరదు. పెండ్లిజరిగిం తరువాత గాని, మీరు భోజనం చెయ్యకూడదు."

"చేస్తే ఏం జరుగుతుంది?"

"మనఆచారం."

"అది అర్థంలేని ఆచారం. నేనీపూట అక్కడేచేస్తాను."

"అదికుదరదు."

"అంటే, లేకపోతే అన్నంవొడ్డించరా?"

"పోనీ మీనాయనగార్ని అడగండి."

"అడగ నక్కర్లేదు. నేను అక్కడేకాని భోజనం చెయ్యను." అన్నాడు. నిక్కచ్చిగా.

"**Well said,** బావగారు—మీరు రాకపోతే నేనూ భోజనం చెయ్యను. **although** మనకి ఆకలి బాహాటముగా అయ్యేడిన్- యివాళ అంతా 'ఆ' మీద నడుస్తోంది మనభాష." అన్నాడు జగన్నాథం.

"అట్లాపట్టింపులకి పోవడం తప్పుబాబూ" అని వెంకటాద్రిగారు వాపోతూ, ఏంచెయ్యాలో తోచక లక్ష్మయ్యని పిలిచారు.

"ఇక్కడికి పంపుతాం కానీయండి."

"నాకళ్లో అందరి చూపులూ పడి అపవిత్రంకావొచ్చు." అన్నాడు రాజభూషణం.

స్వామీజీ, శిష్యులూ 'ఓం' అనుకుంటూ భోజనాలకివెళ్లిపోయ్యారు.

"ఐతే వుండండి, మీమామగారికి కబురు చేస్తాను." అంటూ వెంకటాద్రిగారు వెనక్కి తిరిగి నడవడం మొదలెట్టారు.

"......సరసన, కాబోయే భావుగారు." అన్నాడు నిధి.

జగన్నాథం విరగబడి నవ్వుతూ -"హియర్ హియర్- తప్పొప్పుల పట్టిక- మొదటికూర్పు, టప్పణము, వెయ్యిప్రతులు, వలయువారు, ఇందిరా కార్యాలయానికి వ్రాయండి." అన్నాడు.

ఆడపెళ్లివారి పంక్తిల్లో పెద్ద పెద్ద పొడుగాటి బల్లలు ఏర్పాటుచేశారు. వొందమందికి పైగా పెళ్లివారి జనం భోజనాలకి కూర్చున్నారు. స్వామీజీ స్తంభానికి జార్లబడి కూర్చున్నారు. ఎదురుగా దశరథరామయ్య గారు, రామానందం వున్నారు; నీళ్ళకావిడి బ్రాహ్మలు అటూ యిటూ తిరుగుతున్నారు. పెళ్లికొడుకు తాలూకు జనాన్ని చూడ్డంకోసం, ఏదోపని

కల్పించుకుని అమ్మలక్కలు వాగిస్తూపోతూవున్నారు. వచ్చిన ఆలస్యం కనబడకుండా, పెళ్ళివారి కులాసాకోసం త్రివిక్రమదాసు గారు గుక్కతిప్ప కుండా మాట్లాడుతూనే వున్నాడు, ఎవరువిన్నా, వినకపోయినా. ఆలస్యం ఎందుకో ఎవరికీ అర్థంకాదు. పందిట్లోకి మాధవయ్యగారు ప్రవేశించారు; కొంతఅలజడి తగ్గింది; ఆఖరికి త్రివిక్రమదాసు కూడా మెల్లిగా మాట్లాడడం మొదలెట్టాడు.

"బావగారూ, మనవారందరూ వొచ్చారుగా,-ఇంకెఆలస్యం దేనికి?" అన్నాడు, దశరథరామయ్యగార్ని సంబోధిస్తూ. "ఇంకావారి తాలూకు కొందరుండిపోయారు," అన్నాడులక్ష్మయ్యగారు. అసలువిషయం వెంకటాద్రి గారి తమ్ముడు పెరటిలో వూదాడు.

"ఆయనకి చెవుడు లేదయ్యా, మహానుభావా" అని త్రివిక్రమదాసు కేకేశాడు. అందరూ నవ్వడం సాగించారు.

పెళ్ళికొడుకు కూడా యిక్కడే భోజనం చేసే ఏర్పాటు లేకపోతే సత్యాగ్రహం, వుపవాసం వుంటాడని, అతని ముఖ్యఅనుచరులు కూడా, యిక్కడికి భోజనానికి రారనీ వార్తవినగానే, మాధవయ్యమండిపడతాడని, వెంకటాద్రిగారు, పందిట్లో మరికొందరు బంధుజనం అనుకున్నారు. కాని, తీరావిన్న తరువాత మాధవయ్యగారు, పెదవి చప్పరించి - "ఓస్ యింతేగదా, అందర్నీ రమ్మనండి- దానికభ్యంతరం ఏముంది!" అన్నాడు. గుసగుసలు బైలుదేరాయి; మొగాళ్లకి హుషారెక్కువైంది; వోముసలమ్మ పందిట్లోకి చక్కావొచ్చి-"మేంమాయిళ్లలో ఎక్కడా, యింట్లాంటివి ఎరగమ్. అమ్మో, మేమూంచేశాం,అబ్బాయిల పెళ్ళిళ్లు,యీపట్టింపులు మా కుర్రనాగమ్మలకు తెలియవర్రో" అంటూపారంభించింది. యువకబృందం నవ్వింది. ముసలమ్మకి వొళ్లుమండిపోయింది. "ఇంకానయం,పెళ్లికొడుకూ తనూకలిసి యిక్కడే భోజనంచేస్తాం అన్నాడు కాదు- ఆమూడుముళ్లూ పడకుండానే, ఏంవిడ్డూరం!" త్రివిక్రమదాసు తనవుపన్యాసం ఆపుచేసి,-

"ఏమండీ వోదినగారూ, పెండ్లికొడుకు ఎంత మంచివాడో చూశారా! పెండ్లికాకుండానే, అత్తవారింట్లో ముచ్చట్లు జరిపించుకుందామని వుబలాట పడుతున్నాడు. మీరు ఎన్నాళ్లు తపస్సుచేస్తే అల్లాంటి అల్లుడు దొరుకుతాడు-" అని, ఆయనే నవ్వుతున్నాడు. పరంధరామయ్యగారు బింకంగా కూర్చున్నాడు.

"సరేలే ముచ్చటముక్కలైనట్లేవుంది. రేపు నీకూతురి పెళ్ళిఅలాగే చేద్దువుగాని,- నువ్వెళ్ళి ఆయన్ని దిగిరమ్మను" అంది ముసలమ్మ.

"దేనిమీదనుంచి దిగమంటారండోయ్." అన్నాడు మరోవ్యక్తి,

"గుర్రం-సొట్టుబండి." అంది ముసలమ్మ. అందరూ నవ్వడం మొదలెట్టారు:

"ఐతే ముసలమ్మగారు వోడిపోయినట్టే! ఆచారం మంటగలిసినట్టే!"

"ఇక్కడ ఎట్లా భోజనం చేస్తాడయ్యా, రానీ, నే మాట్లాడతాను, పెళ్ళికాకుండానే యిక్కడ భోజనం చెయ్యటానికి సిగ్గులేదా అని నిలేసి అడుగుతా," అంది ముసలమ్మ.

"ఇంకామీరు అడిగేదేమిటండీ- ఓమూల పెండ్లికొడుకు వొచ్చిపడుతుంటే?" అన్నాడు శ్రీకృష్ణదాసు.

ఇంతలో, వెంకటాద్రిగారి వెనకాలే, దయానిధి, జగన్నాథం రాజభూషణం, యింకా ముగ్గురూ, పందిట్లోకొచ్చారు. జనం వొక్కసారి మాట్లాడడం మొదలెట్టారు. పెళ్ళికొమూర్తగాలూరు ఆడంగులు, వోడజను హైగా గుమ్మంలో నిలబడ్డారు, చోద్యంచూస్తూ. పరంధరామయ్యగారు లేచి కొడుకు దగ్గర కెళ్ళారు.

"ఏమయ్యా, స్నేహితులు మారుంటున్నారండి, మావాడికి చేసినబోధ యిదా.?" అని అడిగాడు రాజభూషణాన్ని సంబోధిస్తూ. "మేం, బోధ చెయ్యలేదు. అతనే మమ్మల్ని పురికొల్పుతున్నాడు." అన్నాడు రాజా.

"పోనీనాన్నా, వాడికి వాడిస్నేహితులతో కలిసి కూర్చోవాలని

అల్లుడువారకడం అదృష్టం కాదూమరి. ఐతే, నువ్వు విడిదిలో భోజనం చెయ్యాబూ, ఇక్కడ తప్పా. బ్రాహ్మలకి కోపాలొస్తాయి.—"

ఇంతలో "భోజనకాలే గోవిందా......"అంటూ కేకలు ప్రారంభ మయ్యాయి.

'పోనీ మీ అత్తగార్ని పిలవనా?' అంది ముసలమ్మగారు.

'మీరు మాత్రోటే భోజనానికి కూర్చోరాదుటండీ--' అన్నాడు త్రివిక్రమదాసు. అందా నవ్వారు. ముసలమ్మగారికి ఏమీ అర్థం కాలేదు. మరో అవకాశం వొచ్చినప్పుడు తన అధికారం చెలాయిద్దా మనుకుని, యింట్లోకి వెళ్ళిపోయి, నేతి గిన్నె పుచ్చుకుని వడ్డించడం మొదలెట్టింది. కూరలవడం ఐ, పచ్చడిలోకి వొచ్చారు. త్రివిక్రమదాసు పద్యాలు పాడ మన్నాడు. "పెళ్ళికొడుకుచేత పాడించాలని" అన్నాడు త్రివిక్రమదాసు, ముసలమ్మని వుద్దేశించి. నిధి నాకు సంగీతం రాదు, నే పాడలేనన్నాడు. "ఇప్పుడెందుకు పాడతావు......" ముసలమ్మ వాక్యం పూర్తికాకుండా, వొక శాస్త్రిగారు శ్లోకాలు చదవడం మొదలెట్టాడు. జనానికి రుచించ లేదు. పురకారు ముసలమ్మనే పాడమన్నారు. ఆవిడ వొప్పుకోలేదు; వేడివేడి నెయ్యి చేతిమీద పొయ్యడానికి వెయ్యమని వెళ్ళి, కొంచం తమా యించింది. శ్లోకాలు ఎవరికీ నచ్చలేదు; ఓకోటి బండివాడా కావాలన్నారు; పోనీ రామనాథశాస్త్రి పద్యాలు పాడమన్నారు. ఆడపెళ్ళివారి తాలూకు, నాగేశ్వరరావు, "సర్వేశ్వరుండగు" పాడాలి; జగన్నాథం తనని ఎవరేనా పాడమంటారేమోనని అటూయిటూ చూసి గొంతు, సవరించుకున్నాడు. త్రివిక్రమదాసు చూపులు అతనిమీద పడ్డాయి.

"హా, హా, మనం గానం చెయ్యడం తప్పదండీ రు" అన్నాడు జగన్నాథం. తప్పదన్నారు పట్టూ జనం.

"స్టైటో, సభికులకి, ఏదో గానంలో కోరుకునే టంగుకు సంప్రదికారం వుంది—"ఎక్సెప్ట్ త్యాగరాజ కృతులు, చెప్పు" పులుసు వొడ్డన జరుగుతోంది.

జగన్నాథం "ఎంకివంటి పిల్ల లేదోయ్" పాడ్డం మొదలెట్టాడు; కొంత వరకూ పాడి, మధ్యలో మాటలు మరిచి పోయాడు. "కతలూ సెప్పిందంటె తర్వాత...?" ఎవరూ మాటలు అందివ్వలేదు; స్వంతంగా సాగించాడు.

"కతలూ సెప్పిందంటే కర్రకాయ్ నవలా...

పదమూ పాడిందంటె పూగాను పీల్చాల..."

శ్రీమద్రమారమణ... జనం గొడవ సాగించారు.

"బావగారు, రాహు కేతువుల్ని పాడమనరూ?" అన్నాడు జగన్నాథం మెల్లిగా.

"రాహు కేతువు లెవరూ? అంటారు స్మా."

"వాళ్ళేనండి-కాషాయ వస్త్రధారి, మురారి అడుగు దాటగలడా, నారాయణని గాళ్ళండి..."

"ఓ, జీవ, సజీవలా? తప్పు వింటారు." రాజభూషణం విన్నాడు. "నే పాడిస్తానుండు శిష్యా..." అంటూ సజీవని ఆ శ్లోకం చదవమని కోరాడు.

"ఏదీ యిందాకా, హస్తినీ, వైరాగి, భగవద్గీతలోనిది."

సజీవ గొంతు సవరించుకుని, గుర్వుగారి కేసి సూక్ష్మంగా చూసి శ్లోకం మొదలెట్టాడు.

"విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవిహస్తినీ, శునిచైవ శ్వపాకేచ పండితాస్సమదర్శినః" దానికి జగన్నాథాన్ని తాత్పర్యం చెప్పమన్నాడు నిధి.

"ఓకే. బ్రాహ్మణుని యందును, గోవు, కుక్క యందును, చండాలుని యందును..."

ఇంకా పూర్తి కాకుండానే, ఓ నల్లకుక్క పందిరవతల తలుపుతోసుకుని చక్కా వొచ్చింది.

"ఛీ ఛీ, కుక్క, కొట్టండి..." జనంలో అలజడి బైలుదేరింది. లక్ష్మయ్యగారు దాన్ని తరవడం మొదలెట్టాడు. అది కుంటుకుంటూ మళ్ళ బర్లో

లోనుంచి పరామర్శిస్తూ ప్రయాణంచేసి, వెళ్లేటందుకు తోవలేక రెండో బంతిలోంచి నడిచి, మధ్యలో అంతా అగమ్యగోచరంగా వుండేసరికి, వెనక్కి లక్ష్మయ్యగారి కాళ్ళమధ్య నుంచే నడిచి మూడో వరసలోకి ప్రయాణం కట్టింది.

"చూస్తారేం, పట్టుకు చావతన్నక"

"అసలు ఎల్లా వొచ్చింది లోపలికి?" అంటూ నో కంఠం ప్రశ్నించింది.

"ఏముంది, బహుసులభం. రెండు తలుపుల మధ్యా ముందుకాలుతో గీరి, కొంత సందు చేసుకుని, తరవాత కాస్తంత మూతిని లోపలికి పెట్టి, ముక్కుద్వారా లోపలి పదార్థాన్ని ఆఘ్రాణించి, బృందాన్ని నేత్రాలతో చూసి, ధైర్యం తెచ్చుకుని, మెడతో తలుపు సందు కొంచం పెద్దదిచేసి..." అంటూ జగన్నాథం వర్ణన మొదలెట్టాడు.

"అదికాదు నే నడిగేది, అసలు దీన్ని లోపలికి ఎవరు రానిచ్చారనీ" అంది మళ్ళా మొదటి కంఠం.

"వెరీ సింపిల్, కేవలం ఆ శ్రీకృష్ణ పరమాత్మ. ఇంకెవరు? శునిచ భక్తికి సంతసించినవాడై, తన తన భక్తాగ్రేసరులైన జ్ఞానులని పరిశీలింప. యిట్టి తరిన్ గాంచె...'తరి' తరవాత అరసున్న వుంది."

లక్ష్మయ్య కాగడా అమర్చిన కర్రని పెల్లగించి, ఒక్క టంటించాడు. అసలే కుక్క కుంటిది: ఈదెబ్బ తగలగానే దాని కాలు సాఫీ ఐనట్లుగా, యీ భోజనశాల, తనస్వైర విహారంకోసం వుద్దేశింపబడ్డ పుణ్యభూమిలా 'కేళి' సాగించింది.

"బెదరకొట్టకూడదయ్యా—నా యిస్తర్లల్లో జొరబడుతోంది." అని జనం మొరెట్టుకుని, లక్ష్మయ్యని కసిగా చూసి, అంతా తలో తిట్టూ తిట్టారు. పరోపకారం చేసేవాడు, యీ త్యాగాలన్నీ చెయ్యాలి మరి!

"కొట్టకుండా,—ఎత్తుకుని తీసుకెళ్లి వుయ్యాల్లో బజ్జో పెట్టమంటారా?" అని అడిగాడు లక్ష్మయ్య.——

"ఇంచుమించు అల్లాంటిదే మా అభిలాష" అన్నమీదట, ఆయనవే వెంకటాద్రి, త్రివిక్రమదాసు (ఆక్షణంలో అంవడ తినడం మానేసిన త్యాగి) లేచి దాన్ని గంజికావిడి పట్టి, బైటికి చేరేరారు.

ఛాందస బ్రాహ్మణులు కళ్ళు మూసుకుని నైవూర్ పాకం నములు, తున్నారు–ఏమిటో, తిండి తినాలి, తప్పుతుందా మరి.

జగన్నాథం వెంకటాద్రిగార్ని కేకేశాడు.

"ఏమండోయ్, ఆ శునకరాజాన్ని, సరీవ ఒళ్ళో కూర్చో పెట్టండి; కొండొకచో తొడమీదన్–" మెల్లగా రాజా తో–" 'ద' తర్వాత అర సున్న లేదనుకోండి."

నల్లకుక్క నిష్క్రమించగానే కొంత అలజడి తగ్గింది.

ఇంతలో మాధవయ్యగారు చక్కావొచ్చి, వొకసారి పంక్తుల్లో పచారుచేసి, కనుక్కుంటున్నారు. జగన్నాథం ఆయన్ని కేకేసి.

"మామగారు. ఇఫ్ ఐయాం రైట్–ఆ లుంగీ వ్యక్తిని కాస్త కొళంబు వొడ్డించమనండి." అన్నాడు.

మాధవయ్యగారికి నవ్వొచ్చింది.

"పట్టుపంచి లుంగీలో దోషం లేదుగా. ఒరే రాముడూ, యిల్లారా" అని కేకేశాడు. సిల్కు లుంగీ రాముడు వొడ్డించడం మొదలెట్టాడు.

"లుంగీ బాగానే వుందండి–ఎక్కడ కొన్నారు, ఎంతకి కొన్నారు,? ప్రశ్న ద్వయం."

"అవన్నీ నీకెందుకు" అన్నాడు లుంగీ రాముడు.

"కేవలం, స్వార్థరహితమైన కుతూహలం! సత్యాన్వేషణ; ఏమంటారు స్వాములోరు! సమాధానం చెబితే సంతోషమౌతుంది; చెప్పకపోయినా సంతోషమౌతుంది." మాధవయ్యగారు నవ్వుతూ–"పోనీ చెప్పరా ఎక్కడ కొన్నావో?–"

"సరే, వాల్తేరులో,"

"నా రెండో ప్రశ్న?"

"..........."

" ? " కనుబొమ్మలు చిట్లించి.

"......" పెదవి చప్పరించి.

" !! " మూతి బిగించి.

"......" తల పంకిస్తూ.

"మావగారు, యిఫ్ ఐయాం నాట్ రాంగ్ సత్యాన్ని అన్వేషించగలిగాను. కనుగొంటినీ శ్రీరాముని నేను...త్యాగయ్య, అఫ్ కోర్స్ ఈ లుంగీ వీరి స్వంతంకాదు."

మాధవయ్యగారు విరగబడి నవ్వారు. లుంగీకి వొళ్ళుమండి ముందుగా నడిచిపొయ్యాను.

జగన్నాథం అన్నాడు– "వెడలెను కోదండపాణి–ఐ బూట్ రాముడు, పులుసు జారీతో. వయ్యారం బొటక వెడలె–'బొ' తర్వాత అర సున్న వుండాలి..."

ఇంతలో దూరంగా తలుపు సందులోనుంచి ఒక తలపాగా, పాల కావిడీ, 'లోపలకి తొంగిచూశాయి. మాధవయ్య, ఆ దృశ్యాన్ని చూసి తొందరగా వెళ్ళి, ఆ పాగాని బైటకి నెట్టి, కాగడా కర్రతో వొక్కటి వొడ్డించాడు. తలపాగాని చూడగానే, భోజనం చేస్తున్న శాస్త్రిల్లుగారు లేచి పొయ్యాడు—ఆయన జీవితం అపవిత్రం ఐపోయింది. ఆ పాగా వ్యక్తి పేరు, నారన్న; కాపు; పొరుగూరునుంచి పాలకావిడి మోసుకొచ్చాడు. బ్రాహ్మలు భోజనాలు చేస్తున్నారని తెలుసుకోకుండా, లోపలికి ప్రవేశించి అపవిత్రం చేశాడు. అక్కడికీ మాధవయ్యగారు యిల్లాంటి ప్రమాదాలు జరక్కుండా, గుమ్మందగ్గర కాపలా పెట్టిన ద్వారపాలకులిద్దరూ, నోట్లో చుట్టలతోసహా, గుమ్మానికి జార్లపడి, నిద్రాదేవి హస్తాలలో బిగించబడ్డారు.

లేచి బైటికి వెళ్ళిన శాస్త్రిలు గారిని మాధవయ్యగారు సమదా

యించి, క్షమాపణ కోరుతున్నారు.

"ఈ పాలకాపు చూసినందుకు కాదు నేలేచింది. వాడి వెనకాల, గడ్డి మోపు ఏనాదికూడా తొంగిచూశాడు." అన్నాడు శాస్త్రిల్లుగారు. మాధవయ్యగారు, ఆ ఏనాదిమీదికి కాగడాకర్ర ఎత్తి వోడ్డించ బోతుండగా, దయానిధి తొందరగా వెళ్ళి, ఎడంచేత్తో, ఆ కర్రని పట్టుగున్నాడు.

నారన్నకాపు, గడ్డిమోపు ఏనాది ఎండలో ఎన్నోమైళ్ళునడిచి, బొగ్గతో చెక్కిన బొమ్మలలా తయారయారు; వారిశరీరాలమీద నుంచి తిలంటు సమయంలోనూని కారినట్లు, చెమటకారి యిసకలో పడుతోంది. వాళ్లు నిక్క మొహాలేసి "ఏం సూశేదండీ—సూత్తే సేత్తాంటండి బాబయ్యా—" అని మొత్తుగుని, ప్రాధేస్తున్నారు. దయానిధి కాగడా కర్రని దూరంగా గిరవాటేశాడు. శాస్త్రిల్లుగారికి వొళ్ళుమండి పోయింది. "నేనింక భోజనం చెయ్యను." అని వెళ్ళిపోతున్నాడు.

"నేనూ భోజనంచెయ్యను.—" అన్నాడునిధి.

"మీరు వెళ్ళితినండి— ఇప్పుడొచ్చిన ప్రమాదం ఏమీలేదు." అన్నాడు మాధవయ్యగారు.

"ముందు వాళ్ళకి యింత మజ్జిగ దాహం యిప్పించండి." అన్నాడునిధి.

దయానిధి వెనకాలే రాజా, జగన్నాథం కూడ లేచి వొచ్చేరు.

"వెళ్ళకొడుకు అలిగాడుటగా......" అంటూ ముసలమ్మగారొచ్చింది. ఆవిడ, మాధవయ్యగారు, వెంకటాద్రిగారు, దయానిధిని భోజనం పూర్తిచెయ్యమని ప్రతిమలాడారు. కాని లాభంలేకపోయింది. నారన్నకాపు కూడా "తప్పండి—మాకోసం మీ రందుకండి తిండి మానడం—మా కేం కష్టం లెక్కేంటండి లెగండి..." అని బతిమాలాడు. నిధి రాజా, వారి విడిదిలోకి నడవడం మొదలెట్టారు.

"హస్తిని శునిచైవ శ్వపాకే చ పండితా స్సమదర్శిన... నారు తినగడు, ఏం చెయ్యను.?" అంటూ జగన్నాథంవారి వెనకాల బైలుదేరాడు.

గదికి వెళ్ళగానే నారయ్య 'టపా' అందిచ్చాడు. వాటిలో రిమాటిక్ సీమా వ్రాసిన ఉత్తరం, టెలిగ్రామూ, పంపా వున్నాయి. ఉత్తరంలో, సాయంత్రం బండిలో ముహూర్తం వేళకి వొస్తున్నాను, స్టేషన్‌కి ఎవర్నైనా పంపమని వ్రాశాడు. టెలిగ్రాంలో, కారణాంతరాల వల్ల రాలేక పోయినందుకు చింతించి, ఆశీర్వచనాలు తెలియజేశాడు.

సాయంత్రం ఆరుగంటలైంది. జగన్నాథం, మరికొందరు పిల్లలూ, నారయ్యా, వీధుల్లో ఆట్లాడుకుంటున్నారు. దశరథరామయ్యగారు, రామానందం, మరికొందరూ, బంధువులూ, కొత్తదుస్తులు వేసుకుని సామాన్లు సర్ది పెళ్లిపందిట్లోకి వెళ్లడానికి సన్నాహాలు చేస్తున్నారు. మధురంగా సన్నాయి వాద్యం వినబడుతోంది. నీళ్లుచల్లిన కుంకుమబొట్టులా పడమటి ఆకాశం ఎర్రగా కప్పుకున్న ముసుగులోనుంచి, వొక్కొక్క నక్షత్రాన్నే బైటపెడుతోంది. మేఘాలు, ఆకాశంలో బాణసంచా కాలుస్తున్నాయి. నిశీథ అన్ని వేపులనుంచి తొంగిచూస్తూ, [illegible] ప్రవేశిస్తోంది. పడమటి ఆకాశం వేసిన రంగుల కాగితాలని, వొక్కొక్కదాన్నే ఆర్పేస్తూ, నక్షత్రాలద్వారా మెరుస్తూ నవ్వుతోంది. నిధి కనురెప్పలకింద ఎర్రగా మెరిసిన తడి నీలంగా మారింది. అతని భుజం పైన 'రాజా' చెయ్యి వేశాడు.

"'లేరా'—బట్టలుకట్టుగో – మరి వాళ్లంతా వొస్తారు. ముహూర్తం టైమవుతోంది." అన్నాడు.

"అదేవిట్రా, ఏడుస్తున్నావు ? శుభసమయంలో ఆనందబాష్పాలా?"

నిధి చిటికినవ్రేలితో కన్నీటి చుక్కల్ని తొలిగిస్తున్నాడు—ఎందుకో తెలీకుండా, ధారగా ప్రవహిస్తున్న కన్నీటి చుక్కలు.

"ఇదేమిట్రా—పెండ్లికూతురు అత్తవారింటికి కెళ్ళేటప్పుడు చెయ్యవల్సిన అభినయం. యిప్పుడే నువ్వు చేస్తున్నావు?"

"ఏమీలేదు." అని, నిధిలేచి కూర్చున్నాడు. కళ్లు వర్షం పోగొట్టుకున్న మేఘంలా, తేటగా వున్నాయి.

"ఎందుకురా — నాతో చెప్పకూడదు? నేను నీ అంతరంగిక స్నేహితుణ్ణి కానూ?"

"ఏమీలేదు, ఏవేవో జ్ఞాపకానికొచ్చాయి."

"కోమలా?"

"ప్రత్యేకంగా యిదీ అని చెప్పలేను......" అన్నాడు నిధి, పడమటి ఆకాశంలోకి చూస్తూ. మళ్ళా ఏదో స్మృతికి వొచ్చిన వాడిలా — "కోమలి విషయం నీకెల్లా తెల్సింది?" అని అడిగాడు.

"ఇల్లాంటివి తెలీకుండా వుంటాయా మరి. ఆదేం చిత్రమో మనం, మన రహస్యాలని స్నేహితులకి మినహా, అందరితోనూ చెప్తూ వుంటాం. స్నేహితులు ఎల్లాగో తంటాలుపడి తెలుసుకుంటారు..."

"ఇందులో రహస్యం ఏముంది? ఒక పురుషుడు, వొక స్త్రీని వాంఛించడంలో, ప్రపంచానికి టాం టాం వేసేటందుకు తగినంత విశేషం ఏముంది?"

"అవును, వొక స్త్రీ, వొక పురుషుణ్ణి వాంఛించిందంటే ఆ విషయాన్ని ప్రపంచమే టాం టాం వేస్తుంది. నా అభిప్రాయం, మొదటినుంచీ నీకీ పెళ్ళి సుతరామూ యిష్టంలేదని. నిజమేనా?"

"నీకా అభిప్రాయం ఎందుకు కలగాలి?"

"నీ వుత్సాహం తెచ్చిపెట్టుకున్నట్టుగా కనబడుతోంది. స్వల్పవిషయాలు, చీకాకు కలగచేస్తే, ఆ మనిషిలో ఏదో చెడిపోయిందన్నమాట. పెళ్ళివాళ్ళింట్లో భోజనం చేస్తాననడం మూర్ఖమైన పట్టింపు కాదూ? పరాచికాలాడి మామగారు వుడికిస్తే, కోపగించి లేచిపోవటం మూర్ఖంగాదూ? గంటలో పెళ్ళి కాబోతుంటే, వొక్కడవు గదిలో ఏడుస్తూ కూర్చోడం మూర్ఖం కాదూ? ఇంకా నిదర్శనాలు కావాలా?" దయానిధి పెదవులు నవ్వుకోసం విప్పుకున్నాయి; కంటికింద బుగ్గమడత పడింది.

"చెమట పడితేనూ, ప్రమోషన్ రాకపోతేనూ, సినిమాకి టిక్కెట్లు

దొరక్క పోతేనూ, ప్రియురాలికి లేఖ వ్రాసి అణాబిళ్ళ అంటించడం మరచి పోయి పోస్టులో వేసినప్పుడూ, విచారించడానికి అలవాటుపడిన వ్యక్తులు నిజమైన దుఃఖానికి కారణాలని గాని, దానిలోతుని కాని నిర్ణయించలేరు. ఆకాశంలో అస్తమించే సూర్యుణ్ణి చూసి ఏడుపు రాకూడదమూ? కాలం గడచి పోతోంది, స్మశానంలో మంటలు చల్లారిపోతున్నాయి; కన్య, పళ్ళు వూడిపోయి, జుట్టు నెరసిపోయిన అవ్వని చూసి జడలిపోయి నవ్వడం మానేస్తుంది; వానకి వొణికిపోయిన పువ్వు వికసిస్తుంది — ఈ దృశ్యాలని తల్చుకుంటే దుఃఖం రాకూడదమూ? అట్లాంటి దుఃఖమేమో నాది!"

"కొంపతీసి కవిత్వం రాస్తున్నావా ఏంరా" అన్నాడు రాజా.

"ఇదంతా కోమలి లోంచి పుట్టిన కవిత్వమే కాబోలు. పోని కోమల్నే పెళ్ళి చేసుకోలేక పొయ్యావు? గ్రంథం ఎంతవరకూ నడచింది? ఇప్పుడెక్కడుంది?..." అంటూ 'రాజా' బోలెడు ప్రశ్నలు అడిగాడు. ఇతరుల ప్రేమ గాథలు వినడం కంటే విసుగు పుట్టించేది మరోటి లేదన్నాడు నిధి. చెబితే కాని వల్లకాదన్నాడు రాజా; మరి యెవ్వరితోనూ చెప్పను, అంటూ ప్రమాణాలు చెయ్యడం మొదలెట్టాడు.

"నువ్వు నమ్ముతావా, రాజా?"

"నిజం చెబితే."

"ఐతే విను. నేను కోమల్ని ప్రేమించలేదు, వాంఛించాను."

"ఈ రెంటికీ తేడా ఏమిటో నాకు తెలియదు."

"నువ్వు ఫిలాసఫర్ వి, నీకు తెలీదంటే ఆశ్చర్యంగా వుంది. వాంఛించిన వొస్తువుని ఎవ్వడూ ప్రేమించలేడు. వాంఛించడం అంటే అనుభవించడం; అనుభవించడంవల్ల ఆ వొస్తువు నశిస్తుంది, నశింపు కాకుండా చేసేదే నిజమైన ప్రేమ అనుకుంటాను."

"ఇదంతా ప్లేటోలో చదివాను; పూర్వకవులు ప్రబంధాల్లో ఘోషించారు. కాకబుర్లన్నీ ఆత్మవంచనే ననుకుంటాను. చండాలపు పనులని

సమర్థించేటందుకు వాళ్లుకల్పించిన భాషతప్ప యదార్థంకాదు; ప్రేమకి వాంఛతప్ప మరోఆశయం వుండనుకోను" అన్నాడు 'రాజా'

"నీయిష్టం వొచ్చినట్లనుకో— కాని ఆరెండింటికీ తేడావుందని గుర్తించమంటున్నా. కోమలి వొక ప్రత్యేకమైన వ్యక్తని నేను అనుకోలేను; ధ్వంసంచేసి నాలో ఐక్యం చేసుకోవాలన్నంతటి వాంఛ. ఆరాత్రి సమయం దొరికింది. రాత్రికి రమ్మంది; వెళ్ళాను. అన్నీ అవకాశాలే; నేనుధ్వంసం చేసి వుందును; వేరేవుండటం సహించలేక చంపేసి వుందునేమో! కాని, రాజా! నువ్వు నమ్మాలిసుమా, ఎందుకో ఆకస్మికంగా, ఆమెను ప్రేమించడం జరిగింది.. ..."మౌనంలో పడ్డాడు నిధి.

"ఇంతకీ ఏం జరిగింది?"

"నవల్స్‌లో మాదిరిగా, నీకు ఐదునిముషాల్లో రొమాన్సు రావాలి. ఏమీలేదు, ప్రేమించాను; ఆమెని క్షమించాను; తనని తనగావుండనిచ్చాను. నాకు చంద్రుడూ, నక్షత్రాలు, మేఘాలు, హిమాలయాపర్వత శిఖరం, కోమలీ—అందరూసమానులే. ఇవిలేకపోతే నేజీవించలేను. వీటెనివాంఛించను, ప్రేమిస్తాను. అర్థమైందా?"

"ఐతే, కోమల్ని ఏమీ చెయ్యకుండా, అమాయకుడిలా వొదిలేసి చక్కావొచ్చాను, నమ్మమంటావ్!"

"నమ్మలేవా?"

"నమ్మలేను. నేననుకోడం, ఏమన్నా చేస్తే వివాహం చేసుకోవాల్సి వొస్తుందేమోనని భయపడ్డావు; పెండ్లి చేసుకునేటందుకు ధైర్యంలేదు నీకు, నైతికంగా పిరికివాడవయ్యావు. పైగా కోమలి మహాపతివ్రత అనీ, దేవకన్యకనీ నువ్వు కలలోనైనా అనుకున్నావని నేననుకోను; కొంత అసూయ; ఆమె నుంచిప్రోత్సాహంలేకపోవడం—ఇవన్నీ నిన్ను కలతపెట్టివుండొచ్చు. అందుచేత ఆరాత్రి ఏంజరిగిందీ చెప్పక, యీ నీతి తాలూకు ముసుగు కప్పుకున్నావు. అన్నాడు రాజా.

"నువ్వుచెప్పినకారణాలన్నీ నిజంకావొచ్చు. కాని, ఆరాత్రి కోమలిని ఏమీ చెయ్యకుండా, నావాంఛని త్యాగంచేసి వొదిలేసి వెళ్ళిపొయ్యానని నమ్మితే నేనింకేమి అడగను."

"అంటే కోమలి కన్య, కొత్తపిల్ల, అమాయకురాలు—మొదట కొంత మచ్చికచేసుగుని, మొన్నాడు రావొచ్చుకదా అనుకున్నావేమో! స్త్రీని, నూనిలో తడిసిన కాగాడాతో పోల్చవొచ్చు; ఏపురుషుడో అగ్గిపుల్ల అంటిస్తేనే కాని, మండదు. నావుద్దేశం స్త్రీకి అసలు ప్రేమలేదని; ఏవొక్క పురుషుడి మీద గురివుండదు; తన ఆశయాలని పురుషుడిమీద లగ్నంచెయ్యగు; ఆమెకి కావల్సింది సంతానం; అది కాస్తా తీర్చేవరకూ పురుషుణ్ణి వేటాడుతుంది; మాతృత్వం అనుభవించిన తర్వాత, పాత రిబ్బన్‌లా తీసి పారేస్తుంది. గోడ్డుమీద నడిచేవాళ్ళు, (అంటే సంఘం) అయ్యోపాపం, రిబ్బన్ పారేసుగున్నారు, తీసుకోండి అని మళ్ళా ఆమెకి యిస్తారు; దాన్ని తడిపి ఎండేస్తూ బీరువాలో పెట్టుగుంటుంది" దయానిధికి నవ్వొచ్చింది.

"రాజా, నువ్వు వేదాంతం చదువుతున్నావు, తార్కిక శిఖరాలమీద కాని కాపరం చెయ్యవనుకున్నాను—కాని నీకు లోయలతో చాలా పరిచయంవుందే! నువ్వు ఆశ్చర్య పడతావు నా విషయం చెప్తే."

"ఏమిటది?"

"కోమలి నన్ను ప్రేమించింది."

"భాష్!"

"అందుకనే చెప్పనన్నది..."

"లేకుంటే చెప్పు"

"అంటే కోమలికి నాపై వాంఛలేదు; నువ్వనుకున్నట్లు సంతానంపై కూడా కోర్కెలేదు; ఐతే, నేను లేకపోతే యీ ప్రపంచమేలేదు ఆమెకి."

"దీనికి నిదర్శనం ? "

"ఆమె నాన్నాడే అవూళ్ళో నుంచి వెళ్ళిపోయింది." అన్నాడు నిధి

విశ్వాసం, బాధకి బంధించబడిన సంస్కారం ఉన్నాయని, ఒప్పుకోవల్సి వొస్తోంది. మళ్ళీ అడిగాడు "ఐతే యిప్పుడు విచారం ఎందుకు?"

"కారణంలేని దుఃఖం అని మొదటే చెప్పాను. విశ్వాసాన్ని, నమ్మకాన్ని, ఆదర్శాన్ని, చూసి, దాని ప్రపంచం వెక్కిరించినప్పుడు, ఆ ప్రపంచాన్ని చూసి, దుఃఖించి, 'నాకు దీనితో నిమిత్తంలేదు' అని తృప్తిపడటంలో విశేషం ఏముంది...? సంపూర్ణమైన ప్రేమతో హృదయం నిండినప్పుడు సగంసగం మనుషులని, అసంపూర్ణమైన అనుభవాలని చూసిన వ్యక్తి దుఃఖించక చేసేదేముంది?" ఇద్దరూ మౌనంలో పడ్డారు.

అప్పుడు 'రాజా' అన్నాడు— "నీ విచారానికి కారణం నాకు తెలుసు. చెబితే కోపం రావొచ్చు."

"నువ్వు అనుకున్నవి కొంతవరకూ కారణాలు కావొచ్చు. కాని నిజమైన కారణం చెబితే ఎవరూ నమ్మరు. ఈ సంఘంలో ప్రేమకి చోటు లేదు," అన్నాడు నిధి.

"నువ్వు నీ భార్యని ప్రేమించుకుంటే సంఘం వొద్దంటుందా?"

"ప్రేమలేని వివాహం, వివాహంలేని ప్రేమ-వీటిలో మొదటిది వ్యక్తిని బాధిస్తుంది, రెండవది సంఘాన్ని బాధిస్తుంది. నేననుకోడం సంఘం బాధపడినా ప్రమాదంలేదు; వ్యక్తుల సంతోషం ముఖ్యం.

"ఐతే ఇందిరని నువ్వు ప్రేమించలేవా? నీకు నచ్చకపోతే యీ వివాహానికి ఎందుకు వొప్పుకున్నావు?" అని అడిగాడు రాజా.

"నాకు అందరి పద్ధతులూగా, శరీరాన్ని వొకచోటా, మనస్సుని మరోచోటా వుంచటం చేతకాదు, రాజా. చాలామంది యువకుల మాదిరిగా, నేనూ, పెళ్లి సంఘంకోసం, బంధువులకోసం చేసుకుంటున్నానేమో, అని అనుమానం. వివాహం నెగ్గాలంటే, భార్యాభర్తలకి నటనలో కొంత తర్ఫీదు అవసరం. ఆవిధంగా నాకు అర్హతలేదు. ఏకపత్నీవ్రతం, ఇతర స్త్రీలని తల్లుల మాదిరి చూడడం,-యివన్నీ కావాలి. నాకీవాగ్దానాలలో నమ్మకంలేదు. ఏ

మనిషి ఎలావుండాలనే, వ్యక్తిత్వాన్ని భర్తవ్యక్తిత్వంలో అంకితంచేసుకోలేదు. నేను కోర్టుకెక్కనవసరంకూడా అనుకుంటాను. అట్లాగే భార్య పాతివ్రత్యం, కనీసం శారీరకంగానయినా, సహించాలి. ఉత్సాహం, శక్తి, ఆదర్శం, వ్యక్తిత్వంలేని స్త్రీలు పతివ్రతలుగా వుండగలరేమో నాకు తెలీదు. వివాహం ఒకటే పటులస్వర్గం. మన సౌఖ్యం, మనంని మనం మోసగించుకునే శక్తిమీద ఆధారపడుతుంది. నాలో ఆశక్తిలేదు...”ఇంకా చెప్పబోతుండగానే మధ్యలో రాజా అన్నాడు—

“ఇంకా వివాహం అంటే నీకుఅనుభవంలేకుండానే, దీన్నిగురించి వూహించి భయపడుతున్నావు. ఇది చాలా తప్పు. ప్రతివ్యక్తీ తన వివాహం ఆదర్శమైనదిగా వుండాలని కోరతాడు; అల్లా కోరకపోతే ఏ విధంగా వుండదు. నువ్వు జీవించడానికి బదులు, జీవించడాన్ని గురించి ఆలోచిస్తావు. అదే నీ విచారానికి కారణం. కోమలికి శీలం లేదు; నీకు కోమల్ని పెండ్లిచేసుకోవాలని లేదు; వున్నా, తండ్రిని దిక్కరించలేవు; సంఘం అంటే భయం నీకు. జీవితం అంతా వూహించుకుంటూ, బాధపడుతూ గడపాల్సిందే! లే, లే, ఎవరన్నా నవ్వుతారు. పోనీ, వివాహం సంఘం కోసం అనుకున్నవాడవు, ఇందిరలో అన్ని మంచి లక్షణాలను చూసుకోడం దేనికి? ఇందిరకి చాకచక్యం, సంగీతం, డబ్బు, గుణం, గౌరవం—అన్నీ వున్నాయి. నిన్ను సుఖపెడుతుందని నాకు గట్టి నమ్మకం వుంది.....” అంటూ అతన్ని లేవదీసి, నోట్లో సిగరెట్టుపెట్టి, అగ్గిపుల్ల ముట్టించాడు, ‘ఆడపిల్లలా ఏడుస్తున్నాడు. లేకపోతేను’ అంటూ, దయానిధి రుమాలుతో కళ్లు తుడుచుకున్నాడు.

“అవును రాజా—ఆలోచిస్తే అంతా భయంగావుంటుంది. ఒక స్త్రీవ్యక్తితో జీవితం గడపడానికి నిశ్చయించుకోవడం అంటే భయంగా వుండదూ? మన స్వేచ్ఛ పోతుందని భయపడేగా నువ్వు బ్రహ్మచారిగా వుంటున్నది.” అన్నాడు నిధి.

“నాకా భయంలేదు. నా వుద్దేశంలో అసలు స్త్రీకి ప్రేమించడం చేత

డానికి జంకుతున్న నాయికుడిలా, దయానిధి, ఏమీ అర్థంకాక వెఱ్ఱిచూపులు చూస్తున్నాడు. అది పవిత్రమైన సమయం. అతను ప్రత్యేకమైన వ్యక్తికాడు; సాంప్రదాయాలు, సంఘం అతనిద్వారా తమ విధిని నెరవేర్చుకుంటున్నాయి. బ్రాహ్మలు వింతకంఠాలతో, విచిత్రమైన భాషలో ఏవో చదువుతున్నారు: కొందరు సన్నాయి వాయించమంటున్నారు; మరికొందరు వెంటనే నిలిపివెయ్యమంటున్నారు; మహాగంద్రగోళం తర్వాత, వెంటనే భయంకరమైన నిశ్శబ్దం ఆపందిట్లో వినబడుతోంది. గాజులు, నగలు, సిల్కు-చీరల రెపరెపలు, గంధం, అగరొత్తులు, ఇలాయిబుడ్లలో నూనెజ్వాలల మసగచప్పుడు, పాదాలు, చేతులు, ముడుచుకున్న పెదవులు, అక్షతలు, పువ్వులరేఖలు, దూరంగా పాపాయి అర్థంలేని ఏడుపు, యింకాదూరంగా వంట బ్రాహ్మల గోకాయింపు, రుపాయిల చక్కిలిగింతచప్పుడు—అన్ని ధ్వనులు, తెగిపోయిన దృశ్యాలు, అస్పష్టమైన పరిమళాలు—అన్నీ పెద్ద కెరటం, పాము పడగలాలేచి, కొండరాతిపై తలబ్రద్దలు కొట్టుకుని కోటి తునియలైనట్టుగా, వాతావరణం అంతా ఆక్రమించుకున్నాయి. సూర్యచంద్రాదులు, తమ నిజస్థానాలు వొదిలి దగ్గరగావొచ్చినట్లు, కళ్ళుమిరిమిట్లు గొల్పుతున్నాయి.

కళ్యాణం తోసుకొస్తోంది; వెయ్యి పిల్ల కెరటాలని తనలో ఐక్యం చేసుకుని, వొక పెద్ద కెరటంలా, లోతులని దొల్చుకుంటూ వొచ్చే మహోత్తర సముద్రపు నీటిప్రవాహం లాంటిది కళ్యాణం. ఎవ్వరూ ఆపలేని పెద్ద గాలి. ఆపుగోలేని నవ్వు, ఏడుపులాంటిది. అందరూ గడియారాలకేసి చూస్తున్నారు; కొందరివి మెల్లిగా తిరుగుతున్నాయి; కొందరివి చాలావేగంతో తిరిగిపోతున్నాయి; మరికొందరివి, విసుగెట్టి అసలు తిరగడం మానుకున్నాయి. కాలాన్ని నిర్ణయించడం మానవుడికి చేతకాదు కాబోలు; లగ్నం తొమ్మిది గంటల, మూడు నిమిషాలకిట; ఎవరికి తెలుసు? బ్రాహ్మలు తెనుగులో సంస్కృతంలో లెక్కలు కడుతున్నారు; "ఏముందండి—లగ్నం

నిర్ణయించడం మహాసులభం—పెళ్ళికొడుకు ఎప్పుడు పుస్తికడితే అప్పుడు తొమ్మిది గంటల మూడునిమిషాలైందన్నమాట" అన్నాడు త్రివిక్రమదాసు. అందరూ నవ్వారు: ఇందిరకూడా నవ్వుని ఆపుకుంటోంది. పెండ్లి సమయంలో కూడా నవ్వకం చేతగాని దౌర్భాగ్యులు, ఆ పందిట్లో ఎందరున్నారో ఎవరు చెప్పగలరు? మళ్ళా సన్నాయి వాయించమన్నారు, మళ్ళా మంత్రాలు, యిందాకటికంటె వేగంగా; ఇంకా ఎక్కువ ధ్వనులు. పంపకాలు, దృశ్యాలు; విరిగిబడి నవ్వడాలు; తమతమ పెళ్ళిళ్లు జ్ఞాపకం తెచ్చుకుని కంట తడి తుడుచుకునే స్త్రీలు, పురుషులు, ఆనందభాష్పాలు; సంపూర్ణ మానవుణ్ణి తయారుచేసినందుకు సంఘం గర్వపడటం. మీ యిష్ట మొచ్చినట్లు వుండటానికి వీల్లేదు, మేం చెప్పినట్లు నడుచుకోండి,—ఛే!" అంటూ కనుబొమ్మలు ఎగరేసి కళ్లు ఎర్రజెయ్యడం, నూని పోతున్న కాగడాలా—కళ్యాణం తోసుకొచ్చింది. దయానిధి చెయ్యిని ఎవ్వరో లాగారు; అతన్ని గెంటారు; లేచి నుంచోపెట్టారు; కూచోపెట్టారు; గిరగిర తిప్పారు; "కానీ" మన్నారు. సన్నాయి, మంత్రాలు, తాంబూలాలు, అక్షింతలు, బెల్లం, ఘామం, ధ్వని,— 'పెండ్లయింది' అన్నారు పెద్దలు.

జగన్నాథం మంత్రాలు చదివేవాళ్ల పలుకలు ఎల్లా పూగుతున్నాయో చూస్తున్నాడు. రాజభూషణం వొకేదిక్కున దీక్షగా చూడటం దయానిధి చూశాడు. ఆ దిక్కునే అతనుచూడగా, అతనిచూపు, జనంలో నిలబడ్డ, సుశీలమీద పడింది. దగ్గరలోనే గోవిందరావుగారు, వరసమ్మగారుకూడా వున్నారు. ముహూర్తం సమయానికొచ్చారన్న మాట. మెరిసిపోయ్యే రాళ్ళ ముద్దులూ, తళతళ్లాడే పట్టు చీరా, సుశీల కళ్లలోని విచిత్రమైన బాధని విస్ఫుటం చేశాయి.

తరవాత కట్నాల చదివింపు. ఏవో ధ్వనులు; రూపాయిల మోగింపు; ...... "వివాహసందర్భంలో ...దీనిసిస్తా ......నూటపదహార్లు..." '... ... సందర్భంలో.........గోవిందరావుగారు......పాతిక రూపాయిలు

......" 'మనపేరుకూడా యిప్పుడే చెప్పించండి' 'రాజుగారు......' 'కాదంటోయ్ మహాప్రభూ... భూషణం అందరూ......' 'సరే...... గారు, షేవింగ్ అద్దం—' 'స్టేండ్‌తోసహా అని చెప్పవయ్యా' (జగన్నాథం) బిందె' 'వెండిచెంబు' 'వెండి ఆకు,'—పన్నీరు బుడ్డి 'టముకుపెట్టి' 'కాదయ్యా మహానుభావా—తోలుపెట్టె, క్రొంగొత్తచో లెదర్ ఎటాచ్ కేస్— ఫ్రెంచ్‌లో పోర్ట్‌మాంటో. ..." (జగన్నాథం) 'తుంగభద్ర శ్రేష్టిగారు ఏకంగా, వెయ్యినూట పదహార్లు' 'రివిన్యూ-ఇన్‌స్పెక్టర్ రమణయ్య పాతిక రూపాయలు...' (ఉద్యోగంకూడా చెప్పండోయ్ శాస్త్రిగ్లు గారూ) మూడోసర్కిల్ పోలీసుల బృందం మొత్తంగా యాభై. 432 హెడ్డు ప్రత్యేకంగా పది......"...అల్లాసాగి పోతున్నాయి. చదివింపులు.

దయానిధికి నవ్వొచ్చింది. గోవిందరావుగారు పాతిక రూపాయలు చదివించారు పాపం. దానితో అతన్ని వో యింటివాణ్ణి చేశారు; తమకింక ఏవిధమైన ఆర్థిక బాధ్యతా లేదన్నమాట. సంఘాన్ని అందరూ తిడతారు గాని, పాపం సంఘం ఎంతమంచిది. కుటుంబానికి, కాపరానికి, జీవితయాత్రకి కావలసినంత సరంజామా సంఘమే సప్లయి చేస్తుంది—బిందె, చెంబు దగ్గరనుంచి. పాశ్చాత్య దేశాలలో, పెండ్లాన్ని పోషించే శక్తి వొచ్చేంతవరకు వివాహం చేసుకోరు. ఆర్థికంగా యితరులమీద ఆధారపడితే భార్యాభర్తలు చాలాచిక్కుపడతారు. ఇక్కడ అట్లాంటి యిబ్బంది రాకుండా, సంఘం కావలసిందంతా అదనంగా యిచ్చివేస్తుంది. వివాహం జరిగింది. మరి సంఘానికి ఎట్లాంటి బాధ్యతా లేదు! ఇంతకీ వారివారి కర్మ—అల్లానే మరి!

[శనివారం]

వివాహం కాగానే, గోవిందరావుగారు, భార్య సుశీలను దిగవిడచి వెళ్ళిపోయారు. కావలసినవాళ్ళంతా, ముహూర్తం అవగానే వొక్కక్షణం కూడా వుండకూడదుగా మరి! విడిదిలో హాల్లో తన హోల్డాల్ విప్పకొని కొత్తచీర కట్టుకుని తలదువ్వుకుంటోంది సుశీల. పెళ్ళికొడుకుకోసం మళ్లా

కాఫీ వొచ్చింది తొమ్మిదింటికి. నిధి, సుశీలని తన గదిలోకొచ్చి కొంచం కాఫీ పుచ్చుగోమని ఆహ్వానించాడు. సుశీల చక్కావొచ్చి, పెద్ద కెండి సామాన్ల పెట్టెమీద కూర్చుంది.

సుశీల మొహం సంతోషంగాలేదు. ఎనిమిది నెలల క్రితంకంటె యిప్పుడు కొంచం పొడుగైనట్లుంది. మొహం చిక్కింది. నిద్రనుంచి లేచిన దానివలె, చర్మం వింతగా మెరుస్తోంది. కళ్లల్లో ఏదో అసంతృప్తిని దాచుకున్నట్లు పదేపదే చిట్లించి, పెద్దపిల్లలా, చూస్తూకూర్చుంది.

"నేను సాయంత్రంవెడతా" అంది సుశీల. ఏదో అనాలికదా అని.

"ఇక్కడ బాగాలేదా ?"

"ఇంకెందుకు ? "

"నువ్వు మీ వూళ్లో మాత్రం ఏం చేస్తావు ? కాలేజీ లేదుగా" అన్నాడు.

"ఐనా నేనెందుకు ?"

"అసలు పెళ్లికి సరదా అంతా స్త్రీలదే. నువ్వులేకపోతే, నాకు సాయమెవ్వొస్తారు ?'

సుశీల నీరసంగా నవ్వింది.

'అమృతం రాలేదేం ?' అంది.

'ఉత్తరం రాసింది'

'ఏమని ?'

"నువ్వే చదువు." అని, లాల్చీజేబులోంచి తీసి చేతికిచ్చాడు.

వేళ్లతో వుత్తరాన్ని నలుపుతూ కూర్చుందికాని, సుశీల వుత్తరం విప్పి చదవలేదు.

"పెండ్లికూతురు నీకు నచ్చిందా ?" అని అడిగాడు నిధి, సంభాషణ సాగిద్దామని.

"నాకు నచ్చడందేనికి ? నీకు నచ్చకపోతే చేసుకుంటావా ?"

'నీ అభిప్రాయం వినాలని వుంది.'

'బాగా నేవుంది' అంది సుశీల.

'బాగా నే వుందా, బాగా వుందా? రెండింటికి చాలా భేదంవుంది' అన్నాడు, 'నే' మీద బరువుమోపుతూ.

'ఏమో నాకవన్నీ తెలియవు' అన్నది.

'అంటే నచ్చలేదన్నమాట.'

'ఎదిగిన పిల్లే,' అంది. మళ్లా కొంతసేపుండి, తనే అన్నది. 'చదువు కుందా?'

'ఏదో వానాకాలపు చదువు.'

'సంగీతం?'

'పెళ్లిసంగీతం అనుకుంటా?'

'మరి నీ కెట్లానచ్చింది. మరో స్త్రీని మెచ్చుకున్న స్త్రీని అతనింకా చూళ్లేదు.

'సంగీతం, చదువు, ఆస్తి, చక్కదనం—యివన్నీ వుంటేనే నచ్చడం జరిగితే, ఎంతమందికి వివాహాలవుతా యంటావు? అన్నాడు.

నువ్వేదో ప్రత్యేకమైన మనిషివి, అనుకునేటట్లుగా మాట్లాడు తుంటావులే—అందుకన్నాను' అన్నది.

'కాదని యిప్పుడు బుజువైందా?'

"బుజువు చేసుకోవడం నీ పెళ్లాం వొంతు" అన్నది. దాని తాత్పర్యం నిధికి బోధపడలేదు. సుశీల వాక్యాలకి విలువకట్టడం మహా కష్టం. లోపల ఏవేవో తికమకలు, అడ్డంకులు, తొలగించుకుని, 'అర్థం' 'భావం'అనేవి వొక చీకటిలోయగుండా పాకి, కంఠంలో మాటలను తొడుక్కుని అక్కడ గడ్డకట్టి బైటపడతాయి. భావకవిత్వాన్ని విమర్శించడం లాంటిది సుశీల మనస్సు కనుక్కోవడం.

"నేనెట్లాంటిస్త్రీని వివాహంచేసుకుంటే నువ్వు ఆశ్చర్యపడవు?"

అని అడిగాడు నిధి. అంతకంటె భావగర్భితంగా మాట్లాడటానికి నిశ్చయించుకుని. ఆ ప్రశ్నకి సమాధానం అతనికి తెలుసును. సుశీల ఆ సమాధానం చెప్పదని కూడా అతనికి తెలుసు. కాని అతను పొరపడ్డాడు. సుశీల సమాధానం చెప్పింది.

"అమృతం లాంటి స్త్రీని"

అతనికి ఆశ్చర్యం కలిగింది. కాని దాన్ని బైటపెట్టలేదు.

"అమృతంలో ఏమున్నాయనీ; నీకల్లా అనిపించింది! సంగీతంవుందా? చదువుందా? చక్కదనంవుందా?" సుశీల, అతనికి బాధకలిగించవని గ్రహించకపోలేదు. వెంటనే విషయంమార్చివేసింది.

"పోనీ కోమలిలాంటి స్త్రీని" అన్నది. దయానిధికి మరింత ఆశ్చర్యం వేసింది; కాని బైటికి ప్రకటించలేదు.

"పోనీ కోమలిలోమాత్రం ఏమున్నాయని? సంగీతంవుందా? చదువుందా? ఆస్తివుందా?......"

"మూడోది మర్చిపోయావు. చక్కదనంవుందా? అనలేదేం?" అని సుశీల నవ్వింది. కండ్లజోడు తీసి చీరతో తుడిచింది. మళ్లాతనే అన్నది:

"ఇవన్నీ వున్నవాళ్లు లేరని, వాళ్ళపైపగ దీర్చుగోటానికి, అవన్నీ లేనిదాన్ని చేసుకున్నావేమోననిపిస్తోంది."

"అతనికి అర్థంకాలేదు. సుశీల మనస్సు మహారణ్యం. కొమ్మలమధ్య నుంచి పడే సూర్యరశ్మిలో కనిపించేవి ముండ్లపొదలు.

"నాకర్థంకాలేదు సుశీలా" అన్నాడు.

"ఏదో అన్నాను. అర్థాల పట్టింపు లెందుకు?"

"నీ అభిప్రాయాలని సరిదిద్దుదామని" అన్నాడు. ఐనా, స్త్రీకి నిశ్చితమైన అభిప్రాయాలున్నాయా? వున్నా వాటిని పురుషుడు సరిదిద్దు. కాడా! అతనికే నవ్వొచ్చింది.

"ఏమీలేదు—కోమలి, అమృతం లాంటివాళ్లు, వివాహానికి తగరు.

ఇందిర వివాహానికి తగుతుంది. ఇందిర ఎప్పుడూ వుండేది. వాళ్ళు మధ్యమధ్య వస్తూపోతూవుండేవాళ్ళు."

దయానిధికి అర్థంకాకపోయినా, కోపంవచ్చేటందుకు కావల్సినంత కారంవుంది ఆ వాక్యంలో.

"నువ్వు అమృతాన్ని, కోమలితో జతచెయ్యడం నాకిష్టంలేదు సుశీలా. అమృతానికి భర్తవున్నాడు" అన్నాడు.

"నిజంచెబితే కోపంవస్తుంది." అన్నది.

"నువ్వు ఎందుకలా అనుకున్నావో నాకు తెలీదు. అమృతంచాలా మంచి మనిషి" అన్నాడు.

"మంచివాళ్ళల్లోనే చెడిపోవడం జరిగేది" అన్నది సుశీల.

"అమృతానికి ఎవరన్నా ఆపేక్ష; ఎంతో ప్రాణం. మనుషులని ప్రేమించ గల్గడం, చెడ్డతనం ఎల్లాగవుతుంది?"

అమృతం వ్రాసిన వుత్తరం విప్పి, చదవడం మొదలుపెట్టింది సుశీల.

"బావగారికి,

మాట్లాడేటప్పుడు, 'బావా' అని పిలవబుద్దేశినా, ఉత్తరంలో బావ గారు అనకపోతే బాగుండదు. ఎందుకనో బావా. ఈశుభసమయంలో నేను రాలేకపోయినందుకు, ఎంతవిచారించానో, మరెప్పుడేనాకలుసుకున్నప్పుడు చెబుతాను. ఏం? నీకు తెల్సుగా, అత్తగారివొంట్లో బాగాలేదు. వారికి జమాబందీ—తాశీల్దారు యిక్కడే కాంపు. అందుచేత జగ్గుని, ఎల్లాగో వీలు చేసి పంపాను. నాకెన్నో విషయాలడగాలనివుంది. మాట్లాడుకోవాల్సినవిబోలెడున్నాయి. ఎప్పుడో. పెండ్లిబహుమానంగా మావారూ నేనూ కలసి, షేక్ హాండ్ వుంగరం పోష్టులో పంపించాం. ఈ పాటికి అందేవుంటుంది. ఇందిర వేలుకి నువ్వుతొడగాలి."

అదీ వుత్తరం. చివ్వర మరోవాక్యంవుంది.

"ఈ వుత్తరం చదవగానే చించివేస్తావుకదూ! అని

"ఉత్తరం చించివెయ్యమని వ్రాయటం ఎందుకో!" అంది సుశీల ప్రశ్నార్థకంగా చూస్తూ.

"నీలాంటి స్త్రీలు అపార్థాలు తీస్తారేమోనని" అన్నాడు దయానిధి.

సుశీలకి కోపం వచ్చింది. కాని, ఆకోపాన్ని ప్రకటించే అవకాశం లేదు. వెంకటాద్రిగారు తలుపు మెల్లగా తెరిచి లోపలికి తొంగిచూసి, మళ్లా తలుపు దగ్గరగా మూసి వెళ్లిపోయాడు.

దయానిధి, సుశీల ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు. కొంచెం సేపటికి రాజభూషణం లోపలికొచ్చాడు. సుశీలని, అతనికి నిధి పరిచయం చేశాడు. రాజభూషణం, నిధిని మరి మాట్లాడనివ్వకుండా, సంభాషణ తనే స్వాధీనం చేసుకున్నాడు. లెక్చరర్లు, కాలేజీలు, పరీక్షలు, టెక్స్ట్ బుక్స్ —అన్నీ గాలించి పారేశాడు.

అతని నిర్వచనాలని ఏ పుస్తకంలోనో వ్రాసి, అతనికి అమరత చేకూర్చే శిష్యుడు లేకపోయ్యాకని, మధ్యలో వాపోయ్యాడు. సుశీలని కలవర పెట్టిన కొన్ని నిర్వచనాలు:

"ఎందుకు వుపయోగం కాని పుస్తకాలని పాఠ్యగ్రంథాలుగా చెయ్యడంలో మన విశ్వవిద్యాలయం ప్రపంచంలోని యితర విశ్వవిద్యాలయాలకి ఎంతమాత్రం తీసిపోదు."

"కాలేజీలో మగవిద్యార్థులకి అతిశయం జాస్తి. ఆడవిద్యార్థులకి, తమకి అతిశయం జాస్తి, అన్న చైతన్యం కూడా వుంది. అదే భేదం."

"వివాహం కాని స్త్రీకి వివాహం ఐన పురుషుడికీ విశ్వవిద్యాలయం శరణాలయం."

"ఆకర్షణకి హృదయం లేదని, చదువుకొన్న స్త్రీ బహిరంగంగా ఋజువు చేస్తుంది; చదువుకోనిది, అదేపని రహస్యంగా చేస్తుంది

మధ్యలో సుశీలని క్షమించమనడం, యివేవీ ఆమెను వర్తించవంటూ వుండడం, జరుగుతూనే వుంది. అతని భావాలు, విని, ఆమెను మత్తుమందు

జల్లినట్లయింది.

సుశీల ఏమీ మాట్లాడకుండా కూర్చుంది. 'రాజా' సంభాషణా జోరు తగ్గింది. శక్తులన్నీ ఒక్క గుక్కలో వుపయోగించేసి, చివరికి దిగాలా తీసిన వాడిలాగ ఐపొయ్యాడు.

"ఏమండీ, ఇందిరని గురించి మీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగింది సుశీల. ఈ విషయం ముచ్చటించటం, నిధికి యిష్టంలేదు. అంచేత అన్నాడు: "రాజాకి పెళ్ళంటే పడదు, నీకు తెలీదు కాబోలు. వివాహం అనేది, నాగరికత, బజార్లో కొనుక్కొని తెచ్చుకున్న జాడ్యం అంటాడు. అంచేత, ఇందిరని గురించి అతనికి అభిప్రాయాలుండవు."

"ఐతే, వారూ నాలాగే నన్నమాట" అన్నది సుశీల.

'ఐతే మనం యీవిషయంలో ఏకీభవించాం, అంటారా!' అన్నాడు రాజా.

'అవునవును. ఒక విషయాన్ని ఖండించడంలోనూ, ద్వేషించడం లోనూ, మనుష్యులు ఐక్యం అయినట్లు, ప్రేమించడంలో అవరు.— అన్నాడు నిధి.

ఇంతలో వాగర్చుకుంటూ జగన్నాథం లోపలికి చరుక్కు వచ్చాడు.

"ఓ నా మంచితనమా—ఎక్కడికొచ్చినా, యీపూట యీ ప్రేమ న్యూసెన్సు చాలా జాస్తిగా వుందనాలి. రాజాజీ, తమరే వాద్యానికి తీతు లనుకున్నాను. కాని వుత్త తీతులేనే! ఐ నూమ్, ఐ డు నాట్ నో టు సె, వాట్—ఛ,ఛా,ఐ డు నాట్ నో వాట్ టు సె — ప్రైడ్ ప్రై—" అని, జేబురుమాలు పైకితీసి, పొడుగ్గా మెలితిప్పి, ఒక వేలు పళ్ల [illegible], మరోవేళ్ళ, వేళ్లతో కొట్టుతూ, నాగస్వరం వాద్యం అభినయం చేస్తూ, 'దిగు దిగు నాగూ'—దివ్య సుందర నాగూ' అని పాడటం మొదలెట్టాడు.

కొంచెం విపులీకరించమని, ప్రేక్షక బృందం కోరింది.

"ఓ. కె. వెరి సింపుల్—ఐ సా యు స్నేక్...

"ఎక్కడ, ఎక్కడ" అని సుశీల, అటూ ఇటూ చూసింది.

"మరి శాంతించండి—శాంతము లేక సౌఖ్యము లేదు—నన్ను పాడిగింపనీండి—Damn it Continue కి తెనుగేమిటి? పోనివ్వండి—నేను గ్రామసీమని చూశాను; గాంచితి నొక కోష్ఠాను. నేను, నేడు—బాగానడుస్తోంది భాష యీపూట.—"

దయానిధికి అర్థమవుతోన్నట్లుంది. "స్టేషన్ నుంచి వొస్తున్నావా?" అని అడిగాడు.

"దూరదృష్టిరహితులైన, సామాన్య మానవ మాత్రులు మీ రెట్లు గ్రహించితిరి?—ఆశ్చర్య మయ్యెడిన్—ఐనను, యిట్లని మాచెదగాక. ప్రకాశముగా-విన్నను. అక్కడనుంచే. బండిలో దర్శించితిని గ్రామసీముని." అని మళ్లా నాగస్వరం వాద్యం ప్రారంభించాడు జగన్నాథం.

"ఏమి టిదంతా" అని 'రాజా' తెల్లపోతున్నాడు.

"ఏముంది, నాగమణి వొచ్చినట్లుంది, బండి దిగి" అంది సుశీల.

"జేజా, నిశ్చయముగ పలికితిని. సత్యము గనుగొంటిని. అటు చూడుడు......"

జగన్నాథం వాక్యం పూర్తి కాకుండానే, నాగమణి, నవ్వుతూ లోపలికొచ్చింది.

పరిచయాలుచేసుకోటం జరిగింతర్వాత, నాగమణి కొత్తగా చేయించుకున్న నగలకి నామం కట్టడం జరిగింది. వివాహంకాని యీ కొత్త వ్యక్తి రాకతో, 'రాజా'కి వొకవ్యూహాన్ని లేవదీసిన నాయకుడమల్లే, మరింత వుత్సాహంవొచ్చి, మరికొన్ని ఘాటైన నిర్వచనాలు చేశాడు. అక్కడ కూర్మయ్యవుంటె గుండెలు బాదుకొన్ను.

రవ్వల దుద్దులు, చంద్రకాంతం రాళ్ల వుంగరం, ఐస్ క్రీమ్ గాజులు, బొంబాయి ఫామన్ వొడ్డాణం.—వీటికి పిలుపులు కడుతున్నారు.

"ఇవన్నీ ఎందుకు? ఏ అమాయకుడైన మొగాణ్ణో, కళ్లో వేసుగుని,

తన కర్తవ్యాన్ని నెరవేర్చుకోడానికే కదా"—ఆకర్తవ్యం ఏమిటో ఎవరూ అడగకుండానే,—"ఆకర్తవ్యం ఏమిటి? మాతృత్వం. సృష్టిశక్తుల చేతుల్లో పురుషుడు వొక కీలుబొమ్మ— వొక పరికరం. తనకర్తవ్యం నెరవేరగానే, ఆ పురుషుణ్ణి పెంటకుప్పమీదికి గిరాటెడుతుంది స్త్రీ. పాపం ఆదౌర్భాగ్యుడు, భగ్నహృదయుడై, భావగీతాలు, రాసుకుంటాడు; అదిచేతకాక పోతే, ఆస్పత్రిలో చేరతాడు, లేకపోతే కోర్టెక్కుతాడు—ఏదో విధంగా పగ సాధించుకోడం యత్నాలు సల్పుతుంటాడు—ఆ యత్నాలని, నాగరికత అంటున్నాం"

"చాలా గొప్పగావుందండి, రాజాజీ—ఐతే, అదంతా ఏమిటో నాకు తర్వాత విశదంగా మనవిచేద్దురుగాని" అన్నాడు జగన్నాథం. నాగుమణి యింతటి వుద్రేకానికి తనుకారణం ఐనందుకు, గర్వంతో మెరుస్తున కళ్లల్లో నవ్వుని పెదవులమీదికి దింపుకుంది. మళ్లా 'రాజా' అందుకున్నాడు.

"—ఇప్పుడు స్త్రీలు, స్వతంత్రం కావాలని మొరెట్టుగుంటున్నారు. దేనికీ స్వతంత్రం? తమ పని జరిగింతర్వాత పురుషుణ్ణి పెంటకుప్ప మీద పడెయ్యడానికి— అంటాను నేను."

'పెంటకుప్ప' అనే వికృతమైన పదాన్ని రెండుసార్లు వాడారు, నాకు నచ్చలేదు. మరో మంచి మాటని వాడండి. నేను మీ వాదాన్ని ఖండించను. ఫర్ ఎగ్జాంపుల్ కేం్రమకందకం—" అన్నాడు జగన్నాథం.

దీనికి 'రాజా' సమాధానం చెప్పబోతూండగా, బైటసన్నాయి వాద్యం, కలకల వినిపించింది. సుశీల బైటకి వెళ్లింది. 'ఇదె వొచ్చుచుంటిని భక్తాగ్రేసరులారా' అంటూ జగన్నాథం, అతని వెనక 'రాజా' బైటకి వెళ్లారు. నాగుమణి; మళ్ళా, తీసేసిన నగలని, వొక్కొక్కటే అలంకరించుకుంటోంది.

"బాగున్నాయా?"

"చాలా"

"అబ్బో మీరూ వుంగరం పెట్టుకున్నారే. ఎప్పుడూ లేనిది, అత్తగారు పెట్టారా?"

"లేదు అమృతం పంపింది. పెండ్లికూతురుకోసం."

"ఏదీ?"

అతను వుంగరం తీశాడు.

"అబ్బో, చెయ్యీ చెయ్యీ కలుపుకున్న వుంగరమే" అంది నాగుమణి.

"నా వేలు కట్టండి"

నిధి సంశయించాడు; వుంగరం వేలుకి తొడుగుతుండగా, తలుపుసందున లక్ష్మయ్యగారి తల కనబడి, మళ్లా వెనక్కి వెళ్లిపోయి, తలుపులు దగ్గరగా మూసింది.

"బాగుందా"

"ఊ"

"కోమలొచ్చిందా?" అంది నాగుమణి.

"ఎందుకొస్తుంది?"

"మీరు పిలవలేదా?"

"శుభలేఖ పంపాను. మావూళ్లో లేదుగా. ఎక్కడికెళ్లిందో తెలుసా?"

"ఏమో—ఎవడో జమీందారుతో వెళ్లిందటగా."

"మరి కోమలొచ్చిందా అని అడుగుతావెందుకు?" అన్నాడు.

"అంత ప్రేమ నూరిపెట్టిన అమృతంగారు రాలేదేం?"

"ఎవరిమీద అంత ప్రేమ?"

జగన్నాథం లోపలికి తొందరగా వొచ్చి, గట్టిగా ముక్కు మూసుకున్నాడు. బాధపడుతున్న వాడల్లే అభినయం సాగించాడు.

"అబ్బ,—సెంటు వాసన—బైటికి కొడుతోంది. ఈ వూరంతా

నైలవుతోం దంటే నమ్మండి. యీ పూట ఎవరి మొహం చూశామో, మనం,/ఎక్కడ చూసినా, యీ ప్రేమ న్యూసెన్స్, చాలా జాస్తిగా వుంది.
**Oh! tell me, my wingless dove What is this thing called Love**– ఏమండోయ్ యీ పూట ఆంగ్ల కవిత్వం దంచేస్తున్నాం”

లక్ష్మయ్య, వెంకటాద్రిగారు, భోజనాలకి వేళైంది, లెమ్మనమని ఆహ్వానించారు.

ఆపూట వొకే పందిట్లో, ఆడవారికి, మగవారికీ భోజనాలు ఏర్పాటు చేశారు. నాగమణి దంపతుల ప్రక్కనే కూర్చుని భోజనం చేస్తానని తెలియ జేసింది. వాటికి వేరే బంతి యేర్పాటు చేశామన్నారు. నిధి, ఆమె తన ప్రక్కనే కూర్చోవాలని పట్టుపట్టాడు; లేకపోతే తనసలు భోజనం చెయ్య నన్నాడు. త్రివిక్రమదాసు, వగైరా వ్యక్తులు, పోనీ ఫరవాలేదు కూర్చో నివ్వండి,—శుభ సమయంలో యీ పట్టింపు లేమిటి (ఐనా పిల్ల దివ్యంగా, కలకల్లాడుతోవుంది) అన్నారు. ఆడపెళ్లివారిలో, గుసగుసలు కలకలం బయలుదేరింది. ఆఖరికి, మాధవయ్యగారికి కూడా కోపంవచ్చి, వీల్లేదు అన్నారట. దశరథరామయ్యగారు, రామానందం, యీ పట్టు వొదలమని, నిధిని బ్రతిమలాడారు. లాభంలేకపోయింది. తుదకి, రాజాకూడా, “పోనీ —పెండ్లి జరిగిపోయిందిగా, యిప్పుడీ పట్టింపులు బాగుండవు” అన్నాడు. జగన్నాథం వొక్కడూ మాత్రం, నిధి తరఫునే వాదిస్తూ, స్వగతంలో చాలా సేపు మాట్లాడుకుంటున్నాడు.

బ్రాహ్మలు లేచిపోతాం కల్లకాదన్నారు. కొందరు ముసమ్మలు యీ అఘాయిత్యానికి రాగాలుకూడా మొదలెట్టారుట. ఆఖరికి వధూవరులు, జగన్నాథం, సుశీల, నాగమణి, ‘రాజా’ రామానందం, వేరే బంతిలో కూర్చున్నారు. ఆ బంతిలో మూలగా కూర్చున్న నారయ్య సంతోషానికి అంతులేదు. అతను చూపిన వుత్సాహాన్ని, హుసారుని చూసి, తుదకి జగన్నాథం, భయంకూడా పోగొట్టుకున్నాడు.

[ఆదివారం]

సాయంత్రం నాలుగింటికి, మూడు మోటార్లమీద, పెండ్లింగాబృందం 'శాంతి' ఆశ్రమానికి వెళ్ళారు. ఆశ్రమం పక్కనే చిన్న కాలవవుంది. ఆశ్రమంచుట్టూ పూలమొక్కలు, కొబ్బరిచెట్లు, దూరంగా పెద్ద చింతచెట్లు వున్నాయి. కొంచెం దూరంగా, కాలవ సన్నబడుతుంది. అక్కడ తాటికఱ్ఱ కాలవమీద వొంతెనలా, అమర్చివుంటుంది. తాటిచెట్టుకి అవతల, వొంటరిగా సం రెండు గుడిసెలు వున్నాయి. అంతా, చల్లగా, ప్రశాంతంగా వుంది. ముందు అరుగులమీద చాపలేసుకుని దశరథరామయ్యగారు, సూర్యవయ్యగారు, అపురూపానందస్వామి, శిష్యులు కూర్చుని గీతలో కొన్ని విషయాలని చర్చిస్తున్నారు. సుశీల, జగన్నాథం, 'రాజా' కాలవగట్టమ్మట నడిచిపోతున్నారు. ఇందిర, దయానిధి, నాగయ్య ఆశ్రమం అంతా పరీక్షగాచూసి కాలవగట్టుకి చేరుకున్నారు. దూరంగా సుశీల రాతిబండమీద కూర్చుని 'రాజా' కబుర్లు వింటూ, వొక్కొక్కబెడ్డనే, కాలవలో వేస్తోంది. జగన్నాథం తాటికఱ్ఱ వంతెనదాటి అవతలవొడ్డున, మామిడి తోపులో కెడదాం అని ఆహ్వానిస్తున్నాడు. నాగమణి, ఇందిర, జగన్నాథం సహాయంతో అవతలలికి చేరుకున్నారు. నాగయ్య, జగన్నాథాన్ని 'ఈతలాడదాం' రమ్మనగా, అతను చొక్కాతీసేసి, కాలవలోకి 'మనకి కొంచం భయం; ఐననూ యత్నించెద గాక' అంటూ, దూకాడు. అట్టేలోతులేదని, ధైర్యంచిక్కి, ఆకాశాన్ని సంబోధిస్తూ 'సవాల్' చేస్తున్నాడు. వాళ్ళని చూస్తూనవ్వింది, నాగుమణి. సూర్యరశ్మిలో, రవ్వలగుద్దులు మెరిసిపోతున్నాయి. రశ్మి, నీళ్ళలోంచి ప్రతిబింబించి, ఆమె మొహాన్ని వెలుగులో ముంచుతోంది. ఆకాంతి ఆమెకి సైకం కలిగించింది. నీటికదలికలో లయ, వేడిలో మృదుత్వం, ఆమెలోకి ప్రవేశించి కాసేపు, కళ్ళుమూసుకుని, ఎక్కడికో మనస్సుని చేర వేసింది.

మామిడి చెట్టుక్రింద, పచ్చగడ్డిలో దయానిధి కూర్చున్నాడు. ఇందిర ఏం చెయ్యడానికి తోచక, అటూ, యిటూ చూస్తూ నిలబడింది. కొమ్మమీద చెయ్యి

అనిపించింది; పెదాలు కోరిన స్పర్శకలిగించేసి, కాసేపు దులుపుకుంది. చీమ కుట్టినచోట; జబ్బ ఎర్రబడి కుంకుమ జబ్బకి అంటుకున్నట్లయింది. ఇందిర కదలికలో కాంతి, చెట్లనీడల్ని వెలిగించింది. ఆమెపాదాలకింద గడ్డి, మోహంతో వొణికింది. ఆమెను ఆవరించిన గాలి, మరి కదలలేక పోయింది. సౌందర్యంతో గర్వించి, పొడుగ్గా ఎదిగిపోయిన లతలా, ఆమె చెట్లను బంధించింది. పరిపూర్ణతని ప్రకటించుకున్న ప్రకృతి, సంతోషంతో స్తంభించిపోయింది.

“చీమా”? అన్నాడు నిధి, లేచి ఆమెకేసిచూస్తూ.

ఇందిర కళ్ళుపెద్దవిచేసి, ఆశ్చర్యంతో తలపంకించింది. అతను దగ్గరగా వొచ్చాడు. జబ్బకేసి పరీక్షగా చూశాడు.

“కుట్టిందా?”

ఒకడుగు వెనక్కి వేసి, మళ్ళీఆశ్చర్యంతో తలపంకించింది. తన చేతినున్న వుంగరాన్ని బైటకితీశాడు నిధి.

“ఇది చూశావా?” అన్నాడు. వుంగరాన్ని అరచేతిలో వుంచుకుని చూపుతూ.

“ఏది, చెయ్యి” అన్నాడు.

చెయ్యి ముందుకు చాచింది.



ఉంగరం తగిల్చాడు.

“ఎక్కడిదో తెలుసా ?” అన్నాడు.

“ఊహు.”

“అమృతం అని, మా నాన్నగారి తాలూకు బంధువు. నీకిమ్మని పంపింది. బాగుందా ?”

“ఊ” అని కాలవకేసి చూసింది.

“ఏం. వెళ్ళిపోవాలని వుందా ?”

“ఊహు. ఊ”

“ఏమిటి ?”

"ఏమీ లేదు. వాళ్ళంతా అక్కడున్నారు."

"ఉంటే? చూస్తున్నారని భయమా?"

"ఊహు—ఏమో" అని చెక్కిళ్ళు వొంకర్లు తిరిగేటట్లు నవ్వింది.

"నిన్న భోజనాల దగ్గరగొడవకి, మీవాళ్ళందరికీ నామీదకోపం వొచ్చింది కాదు?" అన్నాడు.

"కోపం ఎందుకు?"

"వొచ్చింది. ఔనా?"

"లేదు."

"నీవు రాకపోవొచ్చు. మీ అమ్మా, నాన్నా......"

"ఏమో."

"నీకిల్లా కూర్చోడం కష్టంగావుందా?"

"లేదు......"

"నాకంతే చాలు."

మళ్ళా కాసేపు మౌనం.

"ఎప్పుడూ యిక్కడే వుండిపోతే బాగుంటుంది కదూ?"

"ఊఁ"

"నేనొకటడుగుతాను,—సమాధానం చెప్తావా? మీవాళ్ళునన్ను గురించి ఏమనుకుంటున్నారు."

"ఏమీ లేదు."

"చెప్పవు?"

"నాకేం తెలియదు."

"పోనీలె......"

మళ్ళా మౌనం"

"పోనీ, నీకెలావుంది?" అన్నాడు.

ఇందిర నవ్వునిలుపుకుంది.

"చెప్పవు ?"

"ఏమో"

"పోనీలె"

"నీకు, నాతో మాట్లాడాలని......"

వాక్యం పూర్తికాకుండానే, జగన్నాథం, చెట్టువెనుకనుంచి చక్కా వచ్చాడు.

"సారీ— మంచి రసవత్తర ఘట్టంలో వొచ్చినట్లున్నాం. నిష్క్రమిస్తే శ్రేయస్కరమని తోస్తోంది." వెళ్ళబోతుంటే, అతన్ని దయానిధి ఆపుచేశాడు.

"ఇందిరా రమణా" అని పాడుతూ వాక్కాతో జగన్నాథం, తల తుడుచుకుంటున్నాడు.

"సుశీల రువ్విన రాళ్ళతో కాలవ మెరకేసింది" అన్నాడు జగన్నాథం. సుశీలా నాగమణీకూడా వొచ్చారు. నాగయ్య మామిడికాయలుకోసి, వుప్పు కారం పొట్లంయిప్పి, ముక్కలుసర వేసుకున్నాడు. అందరూతలోముక్క నోట్లోవేసుకొని, 'బాబో పులుపుగొడ్డు' అంటూ నెత్తిమీద కొట్టుకుంటున్నారు. ఇందిరని, ఎట్లావున్నాయి ముక్కలని జగన్నాథం అడిగాడు.

"తియ్యగా వుంది." అంది ఇందిర.

"ఎట్లాగేనా, భర్త స్వహస్తంతో కోసిపెట్టిన ముక్కమరి" అన్నాడు జగన్నాథం. అందరూ నవ్వారు.

సూర్యుడు చింతచెట్టుమాను వెనుక మాయమయ్యాడు. "ఇక్కడ పురుగు పుట్రా వుంటుంది. మనంలోపలికి వెళ్ళేయ్యడం ఉత్తమం అన్నాడు జగన్నాథం. ఇంటర ముందుగా నడిచింది. అందరూ వెనకాలే కదిలారు. 'రాజా' ఎంకిపాటలు పాడుకుంటూ కూచ్చున్నాడు. లేచి— "ఎన్ని అనుకున్నా, వెనకాల స్త్రీ అంటూ లేనిదే, ప్రకృతి, పాటలు, కళలు, ఎందుకూ పనికిరావు. సృష్టికి పునాది స్త్రీ; స్త్రీకి శరణం వివాహం

ఆలోచించగా, వివాహం మంచిదే అనిపిస్తోంది.

“మనం కాదనం—మీరు చెప్పింది ఏదైనప్పటికీ” అంటూ జగన్నాథం కార్లోకి చేరుకున్నాడు. డ్రైవరు, బీడీ పారేసి, హారన్ మోగించాడు. ఆ కఠోరధ్వనితో భంగపడిన శాంతం, మళ్లా తేరుకోలేదు.

# 4

# చప్పుడు చెయ్యని సంకెళ్లు

ఎనిమిది మాసాలు గడిచినై. సంక్రాంతికి రమ్మని మామగారు ఆహ్వానించారుగాని, దయానిధి, చివరిసంవత్సరం పరీక్షలు దగ్గరపడుతున్నై, చదువుకోవాలి, రాలేకపోయినందుకు క్షమించమని వ్రాశాడు. ఒకసారి మాధవయ్యగారు, ఏదో పనిమీద పట్నంవొచ్చి, తీరికలేక అల్లుడుని కలుసుకోకుండానే మరునాడు తిరిగివెళ్ళిపొయ్యారు. అది జరిగిన నెలరోజులకి మాధవయ్యగారు అల్లుడుకి వొందరూపాయిలు మనియార్డరుచేశారు. ఎందుకు చేసినట్లో అతనికి అర్థంకాక, ఆమనియార్డరు తిరగకొట్టాడు. మామగారు, తన తాహతకు తగినట్లు పంపగలననీ, అచ్చట్లు, ముచ్చట్లు కేవలం డబ్బుతోనే లేవనీ, ఐనా యిప్పటి యువకులంతా అదో రకంమనుషులనీ కొంత చిరాకు ప్రకటిస్తూ యింగ్లీషులో పెద్దవుత్తరంవ్రాశాడు. దానికి, నేటియువకులు మాయమర్మం తెలీని వాళ్ళనీ, స్వాతంత్ర్యాన్ని, ముఖ్యంగా ఆర్థిక స్వాతంత్ర్యాన్ని ఎక్కువగా కాంక్షించడంవల్ల, దానిసత్వానికి అలవాటు పడినవాళ్ళకి బాధకలగడం తప్పదనీ జవాబు వ్రాశాడు. ఆ వుత్తరం ధోరణి మాధవయ్యగారికి అర్థంకాలేదు. నవ్వుకుని భార్యకి చదివివినిపించాడు; ఆవిడ 'మా అల్లుడు ఉత్తరాలు చాలా బాగా రాస్తాడని,' యిరుగుపొరుగుతో

చెప్పగుని సంతోషించింది. మాధవయ్యగారు ఆవుత్తరాన్ని, ఏదో సందర్భం లో, స్పెన్సర్ చుట్టలపెట్టి పోలీసు సూపరింటెండెంట్ గారికి బహూకరించి, చదివి వినిపించారుట. ఆయన నవ్వి "ఈ స్వాతంత్ర్యం అనే జబ్బు తొందర్లో వొదిలిపోతుంది, కార్యం చేసెయ్యండి" అని సలహా యిచ్చాడు. నాలుగు నెలల్లో ముహూర్తం స్థిరపరచి, మాధవయ్యగారు, అల్లుడికి తెలియబరిచాడు. 1936 మార్చికి అతని పరీక్షలు పూర్తయ్యాయి; ఏప్రిల్ 13న ముహూర్తం. ఆహ్వానాలు అవీ పంపి, పెద్దగందరగోళం లేకుండా, కార్యం జరిపించమని, నిధి వుత్తరం వ్రాశాడు. ఇది 'ఆడంగుల సరదా సమయం కాబట్టి, వారందరికీ తెలియజెయ్యక తప్పదనీ, యధావిధిగా తంతంతా జరగాల్సిందేననీ మాధవయ్యగారు జవాబు వ్రాశాడు. నిధి, తన బంధువులనీ స్నేహితులనీ ఎవ్వరినీ ఆహ్వానించలేదు. కార్యం అంటే సంకెళ్ళు తగిలించడం అన్న 'రాజా' మాటలు జ్ఞాపకానికొచ్చాయి. రెండు తలుపులూ ఎవరో బైట గొళ్లెంపెడతారు; అదే సంకెళ్ళు చప్పుడు చెయ్యడం అంటే. ఐతే లోపలతలుపు, మొదట ఎవరుగడియ పెడతారు? స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకుని ఖూనిసయ్యేటందుకు ఎవరు ఎక్కువ వుబలాటపడుతున్నారో, వాళ్ళు! సంకెళ్ళు చప్పుడు చెయ్యకూడదు. అని నిశ్చయించుకున్నాడు, నిధి.

ప్లాస్కుతోటీ, సిగరెట్టుటిన్ను, ఎలక్ట్రిక్ దీపం తీసెయ్యడం, ఆవలించడం, పుస్తకంమూయ్యడం,— మార్చిగడచిపోయింది. అప్పుడప్పుడు, ఉత్తరధృవంలో వుండగా చదువుతున్న వుత్తరంలా, 'సీనూ' దగ్గరనుంచో, 'రాజా' దగ్గరనుంచో వొచ్చిన ఉత్తరాలు చదివి నవ్వుకొని మళ్ళాపుస్తకం తిరగెయ్యడం, —ఏప్రిల్ రానేవచ్చింది. మూడోతేదీని, దశరధరామయ్యగారి దగ్గరనుంచి మనియార్డరూ, వుత్తరం వచ్చాయి. ఆవుత్తరంలో ఏడెకరాలు భూమి అమ్మవల్సివచ్చినట్లుంది. ప్రాక్టీస్ ప్రారంభించేనిమిత్తం, రెండువేలు బాంక్ లోవేసి, మిగత సొమ్ముతో చేసినఅప్పులన్నీ తీర్చివేశారుట. ఇంక మూడెకరాల ఆస్తిమాత్రం మిగిలింది, వేసంగికి, వంటవాళ్ళీసుకొని బెంగుళూరు వెళుతున్నా

నసీ, కార్యం అవగానే ఇందిరని బెంగుళూరు తీసుకురమ్మని వ్రాశారు. నాలుగో తేదీన పోస్టులో 'శీనూ' దగ్గరనుండి, వొకపార్సెలు, కవరు వచ్చాయి. ఆ పార్సెలు విప్పితే; పుస్తకంవుంది. అది హేవ్‌లాక్ ఎల్లిస్, వ్రాసిన, "స్టడీస్ ఇన్ ది సైకాలజి ఆఫ్ సెక్స్" రెండో భాగం. ఉత్తరం యిది:

"నువ్వు గాచినా మహాదాగుడు లేనోయ్. వివాహానికికూడా రాలేక పోయాను. ఈ సారేనా వొద్దామనుకుంటే నువ్వు రమ్మనమనేనా వ్రాయలేదుగా. అందుచేత, సమయోచితం అనుకుని వో పుస్తకం పంపుతున్నాను.

"అన్నట్లు చెప్పడం మరిచిపోయ్యాను. నా పెండ్లి సంబంధంకూడా కుదిరేటట్లుగా వుంది. గోవిందరావనీ, వో తాసిల్దార్— ఆయన కూతురు సుశీలని—బాగానే వుంటుందిలే. బాగంటేఎక్కడిది?—కళ్లజోడు తీసేస్తే మనిషి సంసార పక్షమే. చదువుకున్నపిల్ల భాయీ. అందుచేత పరీక్షంటే నా వెనకాల నిలబడితేగాని, మనం నెట్టుకోలేం. నా పెళ్లికి నిన్ను రప్పించే టందుకు, యీ పుస్తకం గాలం లాగ వేశానని అనుకోకుసుమా. శ్రీనివాస రావు, తన ఆరోగ్యం విషయం వ్రాయనందుకు నిధి విచారించాడు. ఐనా పరీక్షాఫలితాలు యింకారాలేదుగా!"

ఐదోతారీఖున రాజభూషణం దగ్గరనుంచి వొచ్చిన వుత్తరంలో యిల్లావుంది:

"మనం ఎన్నిసార్లు కలుసుకుని మాట్లాడుకున్నా, ఒక విషయం నీతో చెప్పడానికి భయపడ్డాను. పైగా నీకు జ్ఞాపకం వుందా, నేనక నీతో 'అదేంకర్మమో, మనరహస్యాలని మన స్నేహితులతో చెప్పకోం" అని అన్నాను. అందుచేత నీదగ్గర దాచేటందుకు వీల్లేదు. ముఖాముఖిని చెప్పేటందుకు ధైర్యం చాలక వుత్తరం వ్రాస్తున్నాను.

ఆ నాడు మనం ఆశ్రమాన్నుంచి యింటికి వొచ్చాక, ఆ రాత్రి వూరేగింపులో, సుశీల నన్ను ప్రేమించినట్లు నాకు అనుమానం కలిగింది.

నాలో ఏం చూసిందో నా కర్థంకాలేదు. ఆశ్రమంలో కాలవగట్టున, సుశీల తో నేను చాలా సేపు ప్రసంగించటం జరిగింది. నన్నా సమయంలో సుశీల కదిపింది; నేనుకరిగిపోయాను. దానికికొంతవరకూ, ఆసమయం, ఆవాతావర ణంకారణం అనుకుంటూ. మన్లా, ఆమెలోనూ, నాలోనూ, సమానంగా ఎవీలేవు. మేమిద్దరం, ఉత్తర దక్షిణధృవాలం. ఇంచుమించు ప్రతివిషయంలోనూ మాకు అభిప్రాయ భేదంతోచింది. వొకవేళ మాఅన్యోన్య ఆకర్షణ కారణం అదేనేమో! మనపుస్తకాల సంస్కారానికీ, జీవితంలో యథార్థాల నెదు ర్కొన్నప్పటి ప్రవర్తనికీ సంబంధంలేదు కాబోలు. నెంక్లినిగూర్చి నా అభిప్రాయం మార్చుకోవల్సి వొచ్చిందంటే నువ్వు నవ్వుతావని తెలుసు.

నీ విషయం సుశీల చాలాసేపు ప్రస్తావించింది. నువ్వు దొంగవంది, వొక్క ముక్కలో. నీ కసలు నీతి లేదంది; నీకు కోమలితో, నాగు మణితో అమృతం అంటుఎవరోఆమెలో సంబంధం వుందిట. నువ్వు అందరినీ ఆకర్షించి, ఆటవొస్తువులుగా వాడుకుని, నవ్వి, మరిచిపోతావుట. సుశీల మాత్రం నీ నాటకం కనుక్కొని, నిన్ను దూరంగా వుంచిందట. అసలా లక్షణం నీ కంఠంలోనే వుందిట. ఇన్నీ చెప్పి, "గట్టిగా పట్టుబడితే అతన్ని వివాహం చేసుకునే దాన్నేమో" అన్నది. ఇవేవీ నిజంకావని నాకు తెల్సు. కాని సుశీల మెప్పుపొందాలన్న అభిలాషవుండబట్టి, నేను వీటిని ఖండించి, తీవ్రంగా వారించలేను. సత్యాన్ని స్వార్థంకోసం త్యాగంచేసినందుకు నేను పశ్చాత్తపడవలసున్నాను. కాని ఏం లాభం! పశ్చాత్తాపం పాపిని ప్రోత్స హిస్తుంది కాబట్టి, నాకు పశ్చాత్తాపంలో నమ్మకంలేదని నీ కెల్లానూ తెలుసు. అక్కడికీ సుశీలతో అన్నాను: "దయానిధి ఎవ్వరినీ నొప్పించలేడు; అందరినీ ప్రేమించి సంతోష పెట్టటం అతనినైజం; నిన్నూ ప్రేమించి సంతోష పెట్టాడేమో! తనకోసం త్యాగంచేసినపురుషుణ్ణి స్త్రీ ఎప్పుడూ క్షమించదు, అం దుకనే నీకతడంటే అంతమంట" అన్నాను. ఎందుకో విచారంతో కన్నుతడిసినై. కళ్ళని తుడుచుకుంది. అప్పుడు నేను భుజంమ్మీద చెయ్యివేసి సమదాయించటం

జరిగింది. సుశీల అయిష్టం చూపలేదు; మౌనం అంగీకారం అనుకున్నా. స్త్రీలు, ప్రేమించడం సంభవం అని ఒప్పుగుంటున్నా. సుశీల నన్ను ప్రేమించడం— అనే మిరకిల్ జరిగింది. మిత్రుడవు కాబట్టి, దాచకుండా మనసులో సంగతులన్నీ చెప్పివేశాను. నేను సుశీలను పెండ్లి చేసుకోవడం మంచిదంటావా? తిరుగు టపాలో జవాబుకోసం నిరీక్షిస్తూ వుంటాను.”

అదీ వుత్తరం. ఈవుత్తరంలోని ముఖ్యమైన విషయాలు దయానిధికి ఆశ్చర్యం కలుగజెయ్యలేదు. అతన్ని బాధపెట్టిన వాక్యం ఒక్కటుంది;— ‘అసలలక్షణం మీ వంశంలో నేవుంది—అంది’ అన్నది. వెనకటివిషయాలు జ్ఞప్తికితెచ్చుగుంటే, యిందులోనూ ఆశ్చర్యం తగ్గింది. రాజభూషణంతో పరిచయం జరిగింతర్వాత సుశీల శ్రీనివాసరావుతో పెండ్లిసంప్రదింపులు జరిపిందన్న విషయం వ్యక్తమైంది. కాబట్టి వొక విషయం తేలిపోయింది—సుశీల, ఎవర్ని పెండ్లిచేసుకుంటుందో తెలియదుకాని, రాజభూషణాన్ని మాత్రం చేసుకోదని, వెంటనే ఉత్తరానికి జవాబు యిల్లా వ్రాశాడు.

—“పెండ్లిని గురించి నీకు సలహా యివ్వసమర్థుణ్ణి కానని నీకూ తెలుసు. కనీసం నాకు అనుభవంకూడా లేదు. నీవుత్తరంలో వొక్క విషయాన్ని నేను సంశయిస్తున్నాను. సుశీల నిన్ను ప్రేమించిందని వ్రాస్తున్నావు. నేననుకోడం, సుశీల అసలు ఏ పురుషుణ్ణీ ప్రేమించలేదు.

సుశీల ప్రేమించేదల్లా, ఎవరో తన్ను ప్రేమిస్తున్నారు అన్న ఆ భావాన్ని. నా అభిప్రాయం తప్పుకావచ్చు, అవకాశం వొచ్చినప్పుడు, నే అభిప్రాయాన్ని మార్చుకోడానికి సిద్ధంగావున్నాను. అంతవరకూ మౌనం వుత్తమం.”

పదకొండో తారీఖున, హాస్టల్ గదిలో, ప్రయాణానికి సన్నాహం చేస్తున్నాడు నిధి. పోస్టు బంట్రోతు వొక వుత్తరం యిచ్చాడు. అది జగన్నాథం వ్రాశినది:

“..........మనం చదువులో పడిపోట్టుకుంటున్నాం. కేవలం ఉత్

రాలవల్ల ప్రయోజనం కనబడటం లేదు. నాకు పట్నం వొచ్చి మీతో గడపాలని వుంటుంది. బట్ వాట్ కెన్ ఐ డు- అంటే-నేనేం చెయ్యగలను? ఈసారి పరీక్ష ఫేలవగలనని ఆశిస్తున్నాను. ఐన పక్షంలో మనవాడి తెలివితేటల్ని పరీక్షించేటందుకు నవాబ్ ప్రభుత్వానికి ఏకోశానా హక్కు లేదని, మరీయ బంధుకోటికి, ఎట్సెటెలకు తెల్లమయ్యి, మన రామన్న చదువుని,- అనగా-అవర్ ఫ్యూచర్ ఎడ్యుకేషన్- మదరాసు మహాపట్నంలోనే జరిపించటుకు నిశ్చయించినగాని, వీతత్సుభముహూర్తమునకు—ఎక్స్ట్రా లేక వస్తారా అవీ నాసంకల్పం.

ఇంక కమింగ్ టు మై సిస్టర్; చాలా ఓకేగా వుంది. కారణం అత్తగారు మంచం దిగకపోవడమే. స్వై అని అడగొచ్చు. అత్తగారికి నిజాని కేపొయ్యేకాలమూ లేదనుకోండి, యూజ్ ది సేయింగ్ గోస్. బిట్వీన్ అవర్ సెల్వ్స్ వంట చెయ్యడం, కోడలిమీద తోసేయ్యవచ్చునని, భ్రమ-హోన్స్, మా అక్కయ్య యింట్లో స్లోగాన్ 'అమృతం వొంట అమృతమే' అని. బట్ ఈ అరేంజిమెంట్ మా అక్కయ్యకిచాలాగా వీలు. ఎంగ కంటే వంటింట్లో ఏం జరుగుతోందో తనిఖీ చెయ్యడానికి, వొళ్లో భార్యామణిమయ్య ఏం రాచకార్యం నడుస్తోందో సోదా చెయ్యడానికి, అవకాశం తక్కువ. శైలిగా నడుస్తోందంటోయి. ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే, మా అక్కయ్య చాలా నాగం వంటింట్లో పడి కొట్టుకుంటోందని, టు యూజ్ ఎ పాప్యులర్ యిడియమ్.

బై ది వై (స్పెల్లింగ్ రైటే ననుకుంటాను) యింతకీ అసలువిషయం, లైక్ ఎ ఫయిన్ ఆర్టిస్ట్ చివరికి వుంచేశాను. (ఓ, యస్, యీ యేడు తప్పకుండా ప్యాసవుతానంది, అని చెప్పేటందుకు విచారించవల్సి వొస్తోంది) మొన్న—, అనగా ఇటీవల, కొంతకాలం క్రిందట—రైల్వేస్టేషన్ ప్లాట్ ఫారంమీన, శ్రీమతి కోమలిని సందర్శించడం జరిగింది. ఆమెను, సెకెండ్ క్లాస్ కంపార్ట్మెంట్లో కూర్చునివుండగా చూడ

టం తచష్టించింది. ఆమె, ఉత్తర హిందూస్థానం, (టు బి మోర్ స్పెసిఫిక్-, గా) వికీ లేనుకోండి, మా కెమిస్ట్రీ మేష్టారన్నట్లు) ఆగ్రా ప్రొసీడ్, అవుతోందట. —ప్రొసీడ్ రెండు 'సి' లా వొకటేనా, తేలక తెలుగులో వ్రాయడం జరిగింది.

ప్రక్కన మరో మీసాలవ్యక్తి వున్నాడు. అతడెవ్వడో తమరే వూహించుకోండి. 'హే', 'హోమ్'—అని కేకేసింది నన్ను. నిధిగారెక్క డున్నారని అడిగింది. ఇంతలో మీసాల రక్కసుడు అవతల కిటికీ దగ్గర నుంచి యువతలకి కళేబరాన్ని జేరేశాడు; వెంటనే ఆంగన మాట తప్పించి "అమృతంగారెక్కడ?" అంది. నేను ఆలలనయొక్క సౌందర్యాన్ని కించిత్ తిలకిస్తుండగానే, ఘూమళకటం కూసి కదిలింది-అది వెనక్కి నడవడం-కదల టంఐతే. "బావగారికి వివాహం అయిందన్నా" నేను. "నాకు తెల్సు" అన్నది. ఘా అని అడిగాను.— ఆ జేలకి. ఆంగ్లంలో ప్రవేశంలేదని యిప్పుడిప్పుడు మదీయబుద్ధికి స్ఫురిస్తోంది......"

ఆ వుత్తరాన్ని చాలాసార్లు నవ్వుకుంటూ చదువుకుని, జాగ్రత్తగా మడిచి మనీపర్సులో వుంచాడు. ప్రక్కగదిలో వుంటున్న, మాథ్యూ, చదువు తున్న పుస్తకాన్ని మూసి, చేతులో వుంచుకుని, నిధిని పేకాడుకుందాం రమ్మని ఆహ్వానించాడు. చేతులో పుస్తకాన్ని బల్లమీద వుంచి బాత్ రూమ్‌కి వెళ్ళొస్తాను, యీలోగా పేకాటకి సిద్ధంకమ్మన్నాడు. ఆ పుస్త కాన్ని తీసి నిధి చదవడం మొదలెట్టాడు. అది షేక్స్‌పియర్ రచించిన 'హామ్‌లెట్'—నాటకం. ఆనర్స్ విద్యార్థుల పాఠ్యగ్రంథం. తలనొప్పిగా వుంది, పేకాటకి వోపికలేదని మాథ్యూనిపంపివేసి, ఆ నాటకం చదవడం మొదలెట్టాడు. చదవడం సాయంత్రానికి ముగిసింది. సామాన్లు కూలివాడి నెత్తిమీద పెట్టి, ఆరాత్రి మెయిల్లో ప్రయాణం అయ్యాడు.

కాకినాడ చేరుకునేటప్పటికి పదకొండయింది. లక్ష్మయ్యగారు మాత్రం స్టేషన్‌దగ్గరకొచ్చి, నిధిని విడిదిగదిలో దింపారు. కార్యానికి ఎవ్వరిని

రమ్మనిమని ఆహ్వానించనందుకు కొంచం విచారించాడు. అతనికేదో భయంగా వుంది. భోజనంచేసి పడుక్కున్నాడు. విదునిమిషాల్లోనే భారతమాత సంకెళ్ళని చప్పుడుచేస్తూ అతని ఏకాంతాన్ని భగ్నం చేసింది.

1935 గవర్నమెంట్ ఆఫ్ ఇండియా యాక్ట్ క్రొత్తగా అమలులోకొచ్చిన రోజులవి. ఆయాక్ట్‌లోనిమంచి చెడ్డలతో ప్రజలకి నిమిత్తం లేకపోయింది. భారతదేశపు స్వాతంత్ర్య పరిణామాలని బ్రిటీష్ పార్లమెంట్ నిర్ణయించడం యెవ్వరికీ రుచించలేదు. వైట్‌హాల్‌నుంచి ఏశుభలేఖ వచ్చినా, హిందూదేశప్రజ దానికి మసిపూసి దగ్గరగావున్న సముద్రంలో గిరవాటెట్టడం జరగాల్సిందే. ఆధ్యాత్మిక చింతలోమునిగివున్నప్రజని, బ్రిటీష్ పార్లమెంట్, చేష్టలతోనో, మాటలతోనో రెచ్చగొడుతూ వుంటుంది. ప్రజలకి జైళ్లల్లో బంధించబడినందుకు విచారంలేదు. తుపాకీ పట్టుకుని బైట పహరాలు చేస్తున్న తెల్లాయన "నాలుగురోజుల్లో నిన్ను విడుదల చేస్తాం — యీవిధంగా" అన్నప్పుడే, యీబానిసలు చెలరేగేది. భారతీయులు బానిసలే; కాని 1935 ఇండియా యాక్టుతో తాము బానిసలం అని గ్రహించుకున్నారు. అదేవారి బాధలకి, అసంతృప్తికి కారణం. "మిమ్మల్ని మీరేపాలించుకోండి. —కానిపైనమావాడొకడుండి, మీరన్నది కాదంటూంటాడు—యిదిటుండి, వీనితభిక్షేళ్లు." అని కూర్మయ్యోటిగాళ్లు యీయాక్టుకి విలువకట్టారు. ఇది మరింత వెక్కిరింపుగా తోచింది. వధూవరులు వాళ్ళవాళ్లకరు కోరుకుని, పురోహితుణ్ణి ఎన్నుకుని వివాహం చేసుగుంటారుట; దాన్ని దొరగారు రద్దుచేసేహక్కువుంచుకున్నారుట. ఆ దొరగారు అనవసరంగా ఆహక్కుని, అధికారాన్ని చెలాయించరని' ప్రభుత్వం హామీ యిచ్చింది. అసలట్లాంటి అధికారమే వుండకూడదన్నారు.

ఆ అధికారం తొలిగించడానికి ఏంచెయ్యాలి? ఏమో, ఎవ్వరికీ తెలీదు. కాని ఏదో చెయ్యాలని మాత్రం అందరికీ కసిగావుంది. తమ అధోగతికి కారణం బ్రిటిష్ ప్రభుత్వం. హోటల్లో పులిస్తారిసులు పారేస్తే,

మిగిలిన సేతుకుల కోసం? నాలుగు కుక్కలు, నలుగురు చినుగుల్లు ధరించిన యువకులు కలిసికోకూడదు కోటం, బ్రిటిష్ ప్రభుత్వం చిత్రించిన కళానుగుణ్యమైన దృశ్యం—అజ్ఞానం, అంధకారం, ఆకలి, నిరుద్యోగం, జాడ్యం, —అన్నిటికీ కారణం అదే. మన ప్రాచీన సాంప్రదాయాలేవీ? మన కళ ఏమయింది? మన శిల్పాలు? మన మేధావులు ఒకప్పుడు మహోన్నైభవం అనుభవించాం అని చరిత్ర చదువుకుని ఎంతకాలం తృప్తిపడటం? అసలు చరిత్ర లేకపోతేనే బాగుండును—వుండటంబట్టే యింతటి అధోగతి పట్టిందికదాన్న పరిజ్ఞానంతో కూడుకున్న విషాదం. ప్రాచీన సంస్కారాన్ని, నాగరికతని, మ్యూజియమ్‌లలో బంధించివేశారు ప్రభుత్వంవారు. టిక్కెట్టుకూడా లేదు; వూరికేచూడొచ్చు. 'లేవండీ, లేవండి' అన్నారు దేశనాయకులు. "ఎక్కడికి" అన్నారు ప్రజ.

ఏమో ఎవళ్లకీ తెలియదు. అందరూలేచి కళ్లునులుపు కున్నారు. ఎక్కడికని వెళ్లడం. పిల్లలుస్కూళ్లకి—మానెయ్యండి. జీతాలుకట్టేవాళ్లు, యిచ్చేవాళ్లులేక అవే మూసుకున్నాయి. కోర్టులు మానెయ్యండి. కాలేజీలు మానండి., కొట్లుమూసెయ్యండి. ఏంచెయ్యాలో చెబుతున్నారు నాయకులు; ఏం చెయ్యాలోచెప్పరు. మళ్ళా ఆవలించి పడుకున్నారు ప్రజ.

మళ్ళా లేవండి అన్నారు ఎవరో. అందరూలేచి మళ్లా ఎర్రబడిన కళ్లని తుడుచుకున్నారు. ఈసారి ఏంచెయ్యాలో చెప్పారు. పన్నులు కట్టకండి. అందరూ వికటంగా నవ్వారు. కట్టేటందుకు మాదగ్గరేముంది? జప్తుచేసుకుపొయ్యారుగా ఎపుడో! బిదేశీబట్టలు తగలెట్టండి; తగలెట్టారు, ఊఁ తర్వాత? బట్టలులేవు; తిండిలేదు; చీకటి అంతాచీకటి, జైలులోని అంధకారానికి అలవాటు పడినవాళ్లే జైటికి వొచ్చింతర్వాత, సూర్యరశ్మికి తట్టుకోలేదు. ఆ అంధకారమే బాగుంది; ఆ ఆకలే మంచిది; పోయి, భజన చేసుకుంటున్నారు. ఎన్నిరోజులు భజనచేసినా, ఏరాముడు, ఏ కృష్ణుడూ అన్నం పెట్టడు.--నీరసంతో నిద్రపోయారు.

ఏదో కొత్త రోగమొచ్చింది, లేండి, లేవండన్నారు నాయకులు. మళ్ళా ప్రజలు లేచి, వేళ్ళతో కళ్ళనివిప్పి పట్టుకుని చూశారు. జనంఎక్కడికో కదిలిపోతున్నారు. ఎక్కడికీ ప్రయాణం? ఆశలులేనీ, ఆకలిలేనీ, ఆలోకానికి పోదాం అన్నారు. ఎక్కడదఆలోకం. ఒక సన్నటి, నల్లటి, పొడుగాటాయన, కత్తిపుచ్చుకుని తొందరగాకదిలిపోతున్నాడు. అందరూ ఆయన వెనకాలబడ్డారు. పిల్లలు, స్త్రీలు, వృద్ధులు,—అందరూ అటే పోతున్నారు. అయ్యో, అటు, సముద్రంలోకి నడిచిపోతున్నారు. ఉప్పు, తిర్దాం. ఉప్పుతింటారా? ఆశలు లేనీ, ఆకలి లేని, ఆలోకం తిరాచేసి సముద్రంకూ—ఇక్కడే బాగుంది; యీ జైళ్ళేబాగున్నాయి. హాయిగా అన్నం పెడతారు. అటుపడితే సముద్రం, యిటొస్తే, అంధకారం. అది ఆకుపచ్చ అంధకారం, యిది నల్లటి అంధకారం.

అంధకారంయొక్క రంగుని నిర్ణయించుకునేందుకు వ్యవధి లేదు; కదిలిపోతోంది విశ్వం. అన్నీ యథావిధిగా సక్రమంగా జరిగిపోతున్నాయి. అన్నీ బొగ్గులు; సముద్రంలో ఆరిపోయి, తడిసిన బొగ్గులు. ఈ బొగ్గులు ఆరిపోవు; లోలోపల నిప్పుకణాలు రగుల్తూనే వున్నాయి—ఒక్కొక్క నిప్పుకణం, సముద్రాన్ని సహితం దహించి పిండబెట్టేస్తుంది.

గవర్నమెంటు ఉద్యోగులు, పాలకుల వుప్పుతింటూ, వారి పతనానికి ప్రార్థనలు రహస్యంగా సాగిస్తున్నారు. ఉదయం లేవగానే పత్రికలు చదువుతారు—యూరప్‌లో మరో రాజ్యం బైలుదేరి, నీళ్ళ కోరలు పీకెయ్యకూడదూ? పాశ్చాత్య ఆకాశంలో యుద్ధమేఘాలు విహారం చెయ్యడం లేదూ? లేదు, అదంతా ఫ్యాక్టరీబొగ్గుతాలూకు మేఘాలే. పోనీకనీసం, ఆఫ్యాక్టరీలు మందుగుండు సామగ్రిని తయారు చేసేవేమో, అనుకుని తృప్తిపడ్డారు.

మళ్ళా, సన్నటి, నల్లటి, పొడుగాటి, కత్తి పుచ్చుకున్న వ్యక్తి, పిలుస్తున్నాడు. పోనీ ఆయన వెనకాల వెళదాం లేవండన్నారు. లేచారు; మళ్ళా అందరూ ఆయన వెంటబడ్డారు. ఈసారి, ఎక్కడికని అడగటం

మూసేశారు. ఎక్కడికో ఎవరికెక్కవాలి? మొత్తంమీద కదిలిపోవటం- ఆయన పాదాలకింద యిసుక రేణువులై యీ ప్రజ, వొక్కసారే లేచి, గంతులేసి, నలుదిక్కులా వ్యాపించింది. నిప్పు కణాలు ప్రజ్వరిల్లాయి. సముద్రపు కెరటాలు ఎవరికెందుకనేంగుకూ ఉప్పు కూడా లేకుండా, నీరసించి వెనక్కి వెళ్లిపోతున్నాయి. అది ఆకలిచేస్తున్న మహాయజ్ఞం, అది దాహం చేస్తున్న తీర్థయాత్ర; అది ఆశ సలుపుతున్న స్వప్నగానం.

ఎక్కడికో, ఎందుకో,—ఎవరికీ తెలీదు; ఎవ్వరూ అడగరు. మరి వెనక్కి చూడ్డంలేదు. ఆ సన్నటి పొడుగాటాయన వెనకాలే వెళ్లిపోవాలి. ఏ కొద్దిమందో, ముందు నడిచే జనాభాని, లెక్కబెడుతూ, వొక నోటు బుక్కులో ఎక్కించుకుంటూ, నడిపోయారు. అబ్బో, ఏం జనం? ఎంత మందినని లెక్కపెట్టటం. ఊరికే లెక్కపెడితే చాలదు, వాళ్లనిఆపుచెయ్యండి అన్నారు ప్రభుత్వంవారు. ఐదుగురికంటె ఎక్కువమంది వుంటే కొట్టండన్నారు. పట్టుకుని జైళ్లలో పెట్టండన్నారు, అవసరమైతే, కాల్చి చంపండన్నారు. అగ్నినే కాల్చమంటున్నామన్న ఆశ్చర్యం వాళ్ళకీ కలగక పోలేదు.

నిప్పులో కట్టెపెడితే కట్టె కాలిపోతుంది; మంట మరింత పెద్దదవుతుంది. ప్రభుత్వంవారు, అనేకులని కొట్టి, యీ మంటని పెద్దది చేసేందుకో అన్నట్లు, కట్టెలని తన వుద్యోగుల కిచ్చి, వెళ్లి యీ ప్రయాణాన్ని ఆపుచెయ్యమని ఆజ్ఞాపించారు. కాకినాడ మునిసిపల్ లిమిట్సులో ఎక్కడ సభ జరిగినా సరే, యీ కట్టెలవర్షం, ఆ మంటని చల్లార్చేటందుకు కురిపిస్తామని చాటించారు,

ఎవ్వరూ నిద్రపోవడానికి సమయంకాదది. ఆకలి దప్పులచే బాధ పడుతున్న యీ భారతీయులకి, నిద్రాదేవి ఏనాడో విడాకులిచ్చింది. ముగ్గురు వ్యక్తులు గదిలో ప్రవేశించి, నిధిని నిద్రనుంచి లేపారు. కుటుంబరావు కమ్యూనిస్టు; సుందరం సోషలిస్టు; అహోబలరావు అనార్కిస్టు.

వీళ్లు ఎవర్నీ నిద్రపోనీరు, వీళ్ళకి నిద్రాహారాలు అక్కర్లేదు. ఇతరులకి వుండకూడదు. అదే వారి జీవిత పరమావధి. స్నేహితుల మాట కాదనలేకపోయాడు దయానిధి. వాళ్ల ఆవేశాన్ని అతను అర్థం చేసుకున్నాడు కాబట్టి, అరికట్ట లేకపోయాడు. ఈ యాక్టు డాక్టర్లకి చేసిన అన్యాయాన్ని గురించి అతన్ని బహిరంగసభలో వుపన్యసించమన్నారు. నేను డాక్టర్ని కానన్నాడు దయానిధి. నువ్వు, నేనూ అందరం బానిసలం అన్నారు. "మీరేంచేస్తున్నారు?" అన్న ప్రశ్నకి వొక్కటే సమాధానం; "బానిసత్వం."

ఆ రాత్రి అతని కార్యం అన్న సంగతి ఆ ముగ్గురు వ్యక్తులకే తెలిసి కూడా, అతన్ని బలవంతం చెయ్యసాగారు. ఊరికే వచ్చి వింటాను, కాని ప్రసంగించనన్నాడు. పోనీ అదేనా చెయ్యి,— అని అతన్ని సభలోకి లాక్కుపోయ్యారు.

సాయంత్రం లుగైంది. రోడ్డుప్రక్కన మునిసిపాలిటీవారి హద్దుని తెలియపరుస్తూ, వొకబోర్డువుంది. కాని జనం దాన్ని ధిక్కరించి, అన్ని పక్కలా కూర్చున్నారు. ఎక్కడ చూచినా మనుషులే. ఈ దేశంలో యింతమంది జనంవున్నారా! అనిపిస్తుంది; ఏవో కేకలేస్తున్నారు. ఒకాయన లేచి మాట్లాడుతున్నాడు. అదేమిటో ఎవ్వరూ వినిపించుకోకపోయినా, ప్రతివాక్యానికీ కరతాళధ్వనులు, పెద్ద గంద్రగోళం. స్వరాజ్యం— స్వేచ్ఛ, తను వునికిని గుర్తించమని చేసే చప్పుడు. మధ్యలోవొకాయన నిలబడి ఏదోఅన్నాడు. ఆయన్ని గోలచేసి కూర్చోబెట్టి, బైటికి యీడ్చుకు పోయ్యారు. మరొకాయనలేచి, ఉపన్యాసం సాగించాడు. దయానిధి, ఆ వుద్రేకంలో కొట్టుకు పోయ్యాడు. "శరీరం పొంగింది. చర్మం నిపకుని వెంట్రుకలు నిలబడి, గుండెలు దడదడ కొట్టుకుంటూ, రక్తం వేడెక్కి వేగంగా ప్రవహిస్తూ, అతన్ని నరాలకుప్పగా మార్చివేశాయి. అతనిక మనిషి కాదు వొక శక్తి; సముద్రాన్ని దహించివేసే మరో నిప్పుకణం.

అప్రయత్నంగా, కళ్ళమ్మట, ఆకలి కన్నీరుగా వేడిగా జారుతోంది! స్వేచ్ఛ" అతన్ని ఆవహించి, తనలో కలిపేసుకుంది.—ఏదో శక్తి అతన్ని ముందుకు తోసుకుపోయింది.— వెళ్ళిలేచినిలబడి, మాట్లాడడం మొదలెట్టాడు. అది భాషా? అవి భావాలా? దానికి తర్కంతో నిమిత్తంవుందా? పగిలిన హృదయం, పగలని హృదయంతో మొరెట్టుగోడం.

సముద్రం, నేలతో వర్షంద్వారానూ, ఆకాశం భూమితో తుపాను ద్వారానూ ఏడవడంలాంటిది. బురదలో పురుగు చంద్రుడితో కనుసైగ సల్పడంలాంటిది. సృష్టి చెప గుంటున్న స్వాగతం అది.

స్వాతంత్ర్యం జన్మ హక్కన్నాడు నిధి. మానవుడికి స్వాతంత్ర్యం ఆకలి దప్పులకంటెకూడా ఎక్కువ ముఖ్యం అన్నాడు. దాస్యానికి అలవాటుపడిన యీ జనానికి తిరుగుబాటు చెయ్యడం చేతకాదు. ఏవొక్కడో తమ నిజ దుస్థితిని తెలుసుకొనేటంతటి తెలివితేటలుచూపడం మొదలు పెడితే, బ్రిటీష్ ప్రభువులు అతన్ని కొనేస్తారు. పెద్దపెద్ద పదవులిస్తారు. బిరుదులిస్తారు. దేనికో సభ్యుడుగా దూరదేశాలు పంపించివేస్తారు. వీటికి అతీతుడైనప్పుడు ఆ వ్యక్తి దేశనాయకుడవుతున్నాడు. అప్పుడు అతడిని ప్రభుత్వం బంధిస్తుంది. పొట్టకూటికై అమ్ముడుపోయిన యీ భారతీయ వుద్యోగులపైననే, యీ బానిసత్వాన్ని నిలబెట్టే భారంపడేశారు. భారతమాతని రూపాయి కమ్మేశాం. మనకి పావలామిగిల్చి ముప్పావలా వాళ్ళే తీసుగుపోతున్నారు.—అన్నాడు విధి వుపన్యాసంలో.

ఒక్కసారి సభ నిశబ్దం అయింది. పై అధికారి కాళ్ళక్రింద యిసుక రేణువులా బ్రతుకుతున్న వుద్యోగి, వర్షానికెదురు చూస్తున్న కర్షకుడు, పరీక్షలో ప్యాస్ కాలేని విద్యార్థి, ఐదునెల్లకివొకసారేనా జీతంపుచ్చుగోని వుపాధ్యాయుడు నిరుద్యోగి, పెండ్లాంపెట్టే బాధలనుంచి పారిపోయి వొచ్చిన భర్త—అందరికీ యీ బహిరంగ సభలు, రంగస్థలాలులాంటివి. ఒక్కసారి తమప్రత్యేకమైన యిబ్బందులు, అశాంతి, ఆకలి—అన్నీ మరిచి

పోయి, యిక్కడ మానవులుగా మారతారు— స్వేచ్ఛగా గాలిపీలుస్తారు.

డాక్టర్ల విషయం చూడండి—ఇండియన్ మెడికల్ సర్వీసులో విభేదాలు గమనించండి. తలకాయలు దొరలే. కాళ్లు చేతులు వాళ్లే; మనం? మనం వాళ్ళ పాదాలకింద యిసుక రేణువులం. ఒక రేణువు పెద్దసైజుది; మరొకటి చిన్నది; అంతే తేడా. ఇండియన్ మెడికల్ సర్వీస్—పెద్దబిరుదు; ఒ. బి. ఇ.—మరో బిరుదు. ఒ. బి. ఇ. అంటే, ఒబిడియన్సు టు బ్రిటిష్ ఎంపైర్ —అని......

జనంలో కలకలం బైలుదేరింది. బైటఎవరో వొచ్చి ఏదో అన్నాడు. ఒక్కసారిగా జనంతా అటునుంచి కదిలారు. ఆ గంద్రగోళంలో మునిసిపల్ లిమిట్సుదాటి లోపలకి పడ్డారు. దూరంగా, యీలలు, గుర్రాలడెక్కల చప్పుడు-దుమ్ము లేవడం. జనం అంతా, దగ్గరగా జరిగారు—ఒక్క వ్యక్తిగా. వ్యక్తిత్వాలు పోగొట్టుకుని, ఒక పెద్ద మనిషిగా మారిపోయారు. జనం చెల్లాచెదరయి పోడానికి నాలుగు నిముషాల వ్యవధిచ్చారు— మళ్లా యీలలు. జనం అంతా ఒక్కసారిగా అటూ యిటూ వూగిసలాడుమన్నారు

దయానిధి తన వుపన్యాసం మానలేదు.— ఒక్క రావుబహదూర్ బిరుదుకోసం, మానవత్వాన్ని, స్వాతంత్ర్యాన్ని, సంసారాన్ని ఆత్మల్ని అమ్ముకున్న యీ వ్యక్తుల చెప్ప చేతుల్లో బ్రతకడంకంటె మరణమే మేలన్నాడు.

మళ్ళీ యీలలు, జనం చింపరవందరగా పరుగెట్టటం. కేకలు, కఱ్ఱల వర్షం—మంటని చల్లార్చేందుకు ప్రభువులు కనిపెట్టిన, యంత్రాల వర్షం. మూడు నిముషాలు, స్వాతంత్ర్యానికి, బానిసత్వానికి, మూగ పోరాటం జరిగింది. కొందరు పడిపోయ్యారు. కొందరు గాయపడ్డారు. గాయపడినవాడిలా, సూర్యుడు పశ్చిమ ఆకాశంలోకి కుంటు కుంటూ దిగుతున్నాడు. పడిపోయిన వ్యక్తుల్ని కార్లల్లో లాక్కుపోయ్యారు.— యిసుక బస్తాల మాదిరి.

హాస్పిటల్‌లో మంచం మీద పడుకున్న దయానిధి, అసలు గవర్న

మెంటే యిట్లా గాయపడినవాళ్ళకోసమే యీ దేశంలో హాస్పిటల్స్ నిర్మిం చారని, వుపన్యాసంలో చెప్పలేక పోయ్యానే అని విచారిస్తున్నాడు. ఎడం చెయ్యి మోచేతికి, ఎడమ కన్నుపైన నుదురుదగ్గరా, రెండు గాయాలు తగి లాయి. అద్దంలో చూసుకుని నవ్వుకున్నాడు. ఇదే కాబోలు, దేశంకోసం త్యాగం చెయ్యడమంటే.

బైట బండి నిలిచిన చప్పుడు, బండిలోంచి ఎవరో దిగిన చప్పుడైంది.

అమృతం లోపలికొచ్చి, స్టూల్ దగ్గరగా లాక్కుని కూర్చుంది, దూరంగా. ఆమె భర్త పినతల్లికొడుకు, శంకరం, నిలబడి వున్నాడు.

"నా జగ్గు చెప్పాడు.—సరే, వెళ్లికికూడారాలేదు, పోనీచూద్దామని శంకరాన్ని తీసుకొచ్చాను. మావారూ రావాల్సిందే కాని తాసీల్దారు అక్కడే క్యాంపేశాడు. నువ్వెళ్లిరా అని నన్నుపంపారు. ఈ కష్టేమిటి. ఈ వాలకం ఏమిటిబావా—అంతాఖిన్నాను...ఔరా, కాలం ఎల్లాగైపోయింది ..."అంటూ అమృతం ముక్కుమీద వేలేసుకుంది. ఏడాదిలోగా అమృతం బాగా ఎదిగినట్లు కనపడుతుంది. బంగపండు రంగుచీరా, జబ్బలవంటి పెట్టు కొన్న ఎర్రపువ్వుల ఖద్దరురవికా, కొంతగా రేగిపోయిన జడా కొంత పరి పూర్ణతని ఆపాదించాయి. ముఖం కొంచం వాడింది; కాని అది అందంగా వాడిపోవడం.

అమృతాన్ని చూడగానే దయానిధి కొండంతయ్యాడు. గాయాలన్నీ మానినట్లయింది; రక్తం వేగంగా ప్రవహిస్తోంది కాని, అందులో వేడి లేనట్లనిపించింది. శీతలంగావుంది. ఎందుకో భారతమాతని చూచినట్లనిపించి, అతనికి నవ్వొచ్చింది.

"బావా నీకో తాయిలం తెసుకొచ్చాను. ఏమిటో చెప్పుకో," అంది, వయ్యారంగా నవ్వుతూ. మచ్చరంగు ముఖంలో, పళ్ళవరస వొంటె నక్షత్రంలా మెరిసింది. విశాలమైన చెక్కిళ్లు, సృష్టినంతా, వొక్క చూపులో ఆవరించుకునే కళ్లు,—వీటిల్లో దేనికేశి చూడటం; ఏమాటని వినడం? ప్రతి

మాటనీ, హృదయంలో తడిపి గుజ్జులాచేసి పడేస్తుంది. ఆ వ్యక్తిత్వం భావంలోవుందా, మనిషి ఆకర్షణలో వుందా,—నిధి నిర్ణయించలేక పోయ్యాడు. అతన్నెప్పుడూ, అమృతం యీవిధంగా ఆకర్షించలేదు. బహుశ దీనికి కారణం, అతని ప్రస్తుతస్థితేమో! యుద్ధంలో గాయపడ్డ సైనికులకి, ఫ్లారెన్స నైటేంజిల్, దేవకన్యలా అగుపడటంలో ఆశ్చర్యం ఏముంది,? స్థలం, కాలం, వీటి ఆసరా చూసుకుని బ్రతుకుతుంది ఆకర్షణ అదేం ఖర్మమో!

"జగన్నాథం రాలేదేం?"

"వాడికి పేపర్లు ఔటయ్యాయని, మళ్ళా పరీక్ష పెట్టారుట, సికిం ద్రాబాదు వెళ్లాడు. ఏం తాయిలమో చెప్పకోలేక పోయ్యావు: ఇంతేనా బావా" అంది అమృతం.

"పూతరేకులా?"

"కాదు"

"అరిశెలా?"

"ఎత్తె."

"నువ్వే చెప్ప—చెప్పడం దేనికి? యిల్లా యివ్వరాదూ?"

"ఇంగిరని తీసుకొచ్చా" అంది.

నిధి ఆశ్చర్యంతో కళ్లుపెద్దవిచేసి, లేచి కూర్చోబోయి, 'అమ్మ' అనుకుని మళ్ళా పక్కమీద వాలాడు.

"రైలు దిగగానే, బాబుగారింటికే తిన్నగా వెళ్లాను. మేం కూర్చుని కబుర్లుచెప్పుకుంటున్న పది నిమిషాలకే వాళ్ల పోలీసు వొచ్చి, లాఠీఛార్జీ జరిగిందనీ, నీకు దెబ్బలు తగిలి ఆస్పత్రిలో వున్నావనీ చెప్పాడు. పోనీ, అల్లుడున్నాడనేనా చూసుకోవద్దు, బాబుగారు మాత్రం" అని నిట్టూర్చింది.

"అట్లా చూసుకుంటూ కూర్చుంటే ఉద్యోగంచేసినట్లే. క్యాంపు చేసిన తాసీల్దారుని వొదిలిపెట్టి, మీ ఆయన నీతో షికార్లుగాస్తే, యీపాటికి దేశానికి, స్వరాజ్యం రానే వొచ్చును. ఉద్యోగం అంటే అమ్ముడుపోవడం.

విధి నెరవేర్చడంలో, తమ్ముడు, అల్లుడు, బావా, అంటూ చూడ్డానికివీల్లేదు. అల్లా చూస్తూ కూర్చున్న వాళ్లని, మొన్నాడే పీకేస్తారు......

"నువ్వు చెప్పింది నిజమేననుకుంటూ బావా—నేనూ చూస్తాగా, జమాబందీ రోజుల్లో, మావారికి నిద్రాహారాలే వుండవు......"

"ఉత్తప్పుడేవుండవు నిద్ర,—ఇంక జమాబందీ వొస్తే చెప్పాలా..." అన్నాడు నిధి.

"పో బావా— అన్నీ గొంతెమ కబుర్లు. దెబ్బలుతినికూడ, మానవు— ఏం? ఏం చెప్పాను.? సరే. పోలీసొచ్చి, ఆస్పత్రిలో వున్నావన్నాడు. బాబుగారేరని అడిగాను.—తెలీదన్నాడు. అయ్యో, దెబ్బలు తగిలాయా అని, మాధవయ్యగారి భార్యనా, కొంచం ఆదుర్దా పడ్డాద్దూ! నాకుమాత్రం ఖంగారెత్తింది. స్వామి, చెప్పొద్దూ. ఇందిరని కూడా రమ్మన్నాను. వాళ్లమ్మ మొహం నాలుగుసార్లు చూసి, ఆఖరికి తనూ వస్తానంది. వెంటనే బైలుదేరి వొచ్చేశాం......"

"ఎక్కడుందీ?"

"పిలవనా? ఇందిరా......" అంటూ, గుమ్మంవేపు చూస్తూ, రెండు సార్లు కేకేసింది.

బైటనుంచి జవాబులేదు; ఇందిర రాలేదు.

"శంకరం,—చూడు, ఇందిరని లోపలికి రమ్మను—తీసుకురా... ......" అంది శంకరంతో. శంకరం, రెండు నిముషాలు, అన్నివేపులా పరకాయించి, ఎక్కడా లేదంటూ వొచ్చాడు.

"ఇదేం చిత్రం బావా—నాతో కూడా రమ్మంటే, నేను తరవాతొస్తాలెండి, మీరు కళ్లి మాట్లాడుతూండండని, అక్కడే నిలబడిపోయింది తను. ఇంతలో ఏమైపోయిందబ్బా. అంతా గారడీలాగుంది......"

"ఓవేళ. ఎరుగున్నవాళ్లెవరన్నా వుంటే, అవతల వార్డులో కెళ్లిందేమో......".

"ఉండు, నేనే చూస్తా బావా....." అంటూ అమృతం లేచి వెళ్లింది.

దయానిధికి నుభవం అంతా కలలో మాదిరిగా వుంది. మామగారికి తను సభలో వుపన్యసిస్తున్నట్లు తెలుసా? తెలిసేయిట్లా చేశాడా? ఆయన కేది ముఖ్యం? కూతురు సౌఖ్యమా? రావుబహద్దూరా? ఈ ప్రశ్నలకి సమాధానంపై నిధి తన భవిష్యత్తు ఆధారపడిందని తెలుసుకున్నాడు. కంటి మీదికి, మెల్లగా రక్తపునుక్కు జారింది. మరి గత్యంతరంలేక కన్నీటి బిందువుతో కలిసిపోయింది.

ఐదు నిమిషాలలో అమృతం తిరిగివచ్చింది. మొహంలో ఎంతో ఆతృత కనిపిస్తున్నా, కళ్ళు నవ్వుతో మెరుస్తోన్నాయి.

"ఎక్కడా కనపళ్ళేదు బావా—ఇంతలో అక్కడ, ఆస్పత్రి కురాడొకడు, కనిపించి, ఎవరో, వారి తాలూకు వాళ్ళవొచ్చి, ఆమెను కార్లో ఎక్కించుకుని తీసుకు పొయ్యారండి అన్నాడు—చాలా చిత్రంగా వుంది. ఎవరంటావ్ ?" అంది.

"తెలుస్తునేవుందిగా— పోలీసుల్ని పంపి, వాళ్ళ నాన్న కూతుర్ని యింటికి పిల్చుకొని రండి, అని పంపివుంటాడు. ఇట్లాంటి అల్లుడితో సంపర్కం మరి ఆయన ఉద్యోగానికి నష్టంగా—"

"ఎట్లా"

"నీకు తెలీదు కాబోలు. గవర్నమెంటువుద్యోగి, భార్య, పిల్లలు, దగ్గర బంధువులు.— "ఎవరేనా సరే రాజకీయాలలో పాల్గొన్నారంటే వారే సంజాయిషీ చెప్పాల్సివుంటుంది. ఈ వుద్యోగులందరూ, పొట్టకూటి కోసం, వారు చేసే పనులన్ని మహాపాపాలని తెలిసే, రహస్యంగా, దేవుణ్ణి ప్రార్థించి; పూజలూ పునస్కారాలూ చేసికుని' పాపపరిహారం పొందుతారు.

"అట్లాంటి మనుషులుంటారని నే అనుకోను, బావా." అంది అమృతం.

"నేనూ ఎప్పుడూ అనుకోలేను. ఇప్పుడు అనుభవం ఐందిగా—" అన్నాడు. ఇద్దరూ మౌనంలో పడ్డారు. చీకటి పడింది. వింతవింత రసాయనాల వాసనలు ఆవరిస్తున్నాయి. శంకరం పక్కల్లో చెయ్యాకం వాలించి పరువుచుట్టు స్తంభానికి ఆనించి, దానిమీద జార్లపడ్డాడు. కారియర్‌తో అన్నం, ఫ్లాస్కులో పాలు, తీసుకురమ్మని, అమృతం శంకరాన్ని పంపింది. ఏవో మాట్లాడాలనుకుని, అమృతం వాక్యాలని కంఠంలో సిద్ధం చేసుకుంటుందికాని, బైటికి అనలేకపోయింది. దయానిధి కళ్ళుమూసుకుని ఆలోచనలో పడ్డాడు. కుటుంబరావు; సుందరం, అక్కడికొచ్చి, మళ్ళా కబుర్లు మొదలెట్టారు.

"మాధవయ్యగారింటికివెళ్ళి గడ్డెటిరానా?" అన్నాడు కుటుంబరావు.

"ఎందుగడ్డిగనకనైతే, నేవెళ్ళి నిప్పుపుల్ల పెట్టొస్తా" అన్నాడు సుందరం.

"నావిషయమై మీరేమీ ఆదుర్దాపడి కోతిపన్లు చెయ్యకండి. ఒక విధంగా నాకిట్లా జరిగినందుకు, కొంతసంతోషంగానూ. కొంత గర్వంగానూ వుంది. బాధపడటంలో స్వార్థత్యాగంవుంది. అందుకే మనిషి బాధని భరించగల్గుతున్నాడనుకుంటా—"

"బాధలో వైరాగ్యం వుంటే, అందులోకొంతభాగం మీ మామగారికి సమర్పించడం నీవిధి కాబట్టి, ఆయనకూడా బాధపడేమార్గం ఆలోచించు" అన్నాడు కుటుంబరావు కొంచం హేళనగా.

"మాశావో లేకో తమాషా—కొన్ని అరెస్టులు జరిగాయి. అరెస్టు కావాల్సినవాళ్ళ జాబితాలో నిధి పేరులేదు. ఇదిమామగారు అల్లుడిపై దయచూపడంకాదంటావా?" అన్నాడు సుందరం

"మనం యిక్కడే ముసుగులో గుద్దులాటెందుకు? వెళ్ళి నాలుగు విషయాలు ముఖాముఖీన అడిగేస్తే మంచిదనిపిస్తోంది." అన్నాడు

కుటుంబరావు.

ఇందిర తన్ని చూడ్డానికి, రావడం, చూడనీకుండా, మాధవయ్యగారి తాలూకు మనుషులొచ్చి ఆమెని తీసుకెళ్ళిపోవడం — యివన్నీ నిధిస్నేహితులిద్దరికీ చెప్పాడు. సుందరం మొహం మండిపోయింది. పోనీ ఆ పిల్లకేనా జ్ఞానముండొద్దా! వూళ్ళో నలుగురూ గడ్డెట్టరూ! అంటూ, ఏవో అనడం సాగించాడు.

"నాకు ఎవర్నీ అడిగి తెల్సుకోవల్సిన సంగతులు కనిపించడంలేదు. ఎల్లాంటి సందేహాలు లేవు — అంతా మబ్బులేని ఆకాశంలాగా, తెల్లనై పోయింది. ఎదో బరువు తగ్గినట్లుగావుంది. ఈ నిర్మలమైన ప్రశాంత హృదయ మహారణ్యంలో, చెట్లకింద సరస్సులావుంది. అందులో ఎందుకు రాళ్ళు విసురుతారు?" అన్నాడు నిధి కళ్ళుకొంచం మూసుకొని.

"అబ్బాయీ, సరస్సులో కప్పలు, చేపలు కదుల్తుంటాయి — ఎల్లాగా నీ మనస్సు అలలతో కొట్టుకోడం మానదు." అన్నాడు, సుందరం, వుపమానాన్ని అందుకుని పూర్తిచేస్తూ. మాధవయ్యగార్ని కలుసుకుని మళ్ళా వొస్తామంటూ వాళ్ళిద్దరూ వెళ్ళిపొయ్యారు. డాక్టరు, నర్సువొచ్చి పరీక్షచేసి, కావల్సినవి చూసి వెళ్ళి పొయ్యారు. అమృతం స్క్రీన్ వెనకాల కెళ్ళి, మరో చీర కట్టుగుని, తలదువ్వుకుని, జడని చుట్టగా చుట్టుకుని, వొచ్చి, బల్ల మీదకూర్చుంది.

"పోనీ నేవెళ్ళి, ఇందిరని చూసొస్తా బావా." అంది, నిశ్చయంచేసుకొన్నదానికిమల్లే.

"ఇందిరని చూశావుగా." అన్నాడు.

"ఆ చూడ్డంవేరు. నీకెట్లా వుందోనని ఆదుర్దా పడుతుంటుంది. అత్తగారితో మాట్లాడి...

"ఏం మాట్లున్నాయి?"

"ఏమిటి బావా అల్లాగంటావు. — శోభనానికి మరో ముహూర్తం

పెదకారో,—ఏమిటో కథ—నాలుగూ మాట్లాడొచ్చుగా." అంది.

"మామార్గాలు విడిపోయ్యాయి అమృతం! వళ్లా కలుస్తాయను కోను." అన్నాడు, నిధి నిమ్మళంగా లేచి మంచంమీదకూర్చుని.

"అశుభం మాట్లేమిటి బావా—నువ్వనేది నాకర్థం కావడంలా..."

"తల్లిదండ్రుల చెప చేతుల్లో పెరిగి, వ్యక్తిత్వంలేని అమాయకురాలు ఇందిర. వాళ్ళ క్షేమంకోసం తన సౌఖ్యాన్ని త్యాగం చేసుకుంటుంది.— అంతేకాదు, మా విడిపోటానికి యింకా లోతులున్నాయి అమృతం! వాటి పరిమాణం అందరికీ అర్థమాతుం దనుకోను."

"అంటే?".

"ఆదర్శాలలో ప్రధాన శత్రుత్వం వుంది. వారికి, డబ్బు, ఉద్యోగం హోదాతో వచ్చేసంఘంలో గౌరవం, బిరుదులు,—ప్రపంచంలో పైకి రావడం;— ఇల్లు, భూములు, పెద్ద పెన్షన్‌తో రిటైర్ కావడం, బ్యాంక్ లో ఎక్కౌంటు—యివి కావాలి వారికి—"

"యివి ఎవరికి అక్కరలేదు ? అందరూ వీట్నేగా ఆశించేది" అంది అమృతం.

"కొంతవరకూ, అందరూ వీట్ని ఆశిస్తారు. నేను కాదన్ను. ఆశించ వల్సిందేకూడా. కాని, యివి పొందడం కోసం, ఆత్మవిశ్వాసాన్ని. న్యాయ విచక్షణల్ని, సత్యాన్ని కొందరు వొదులుకోలేరు. మన ప్రభుత్వం, అన్యా యంగా ప్రజల్ని, పీడించి, బానిసలుగాచేసిన చరిత్ర తెలిసిన యువకు డెవడూ, యీ దురంతరపు చర్యలో పాల్గొనడు. సత్యాగ్రహం ద్వారా ప్రజాసేవచేసి, అనామకుడుగా, బీదవాడుగా జీవితంసాగిస్తాడు. అవసరమైతే మరణిస్తాడు. అంతేకాని అన్యాయానికి దాసోహం చెయ్యలేరు. మావి రెండు మార్గాలు. మాధవయ్యగారిది దక్షిణమార్గం; నాది వుత్తరమార్గం. మేం ఎప్పుడూ కలుసుగోం......"

"నువ్వు చిత్రంగా మాట్లాడతావు బావా— మావారప్పుడూ

యిట్లాంటివి చెప్పరేం. ఇదంతా వింటుంటే ఏదో భయంగావుంది..."

"అందులో ఆశ్చర్యంలేదు. వేలకివేలు ఆస్తులుతగలేసి, భూములమ్ము కుని, చదువుకొని, డిగ్రీపొంది, తాలూకా గుమాస్తాగా చేరడం తప్పదు నేటి యువకులికి; తల్లిదండ్రులు అదేప్రతిఫలంగా కోరుతున్నారు. సంఘం ఆమోదిస్తోంది. భార్య ఆఫీసనే జైలుకి పంపించే కాపలామనిషి. మళ్ళా రాత్రికి యిల్లుఅనే-మరో జైలులో మంచం కోళ్ళకి కట్టిపడేసి, తను కాపలావుంటుంది. ఆ జీతం వాళ్ళకోసం, భార్యా రవికలు, రిబ్బన్లకోసం, యీ దౌర్భాగ్యుడు వలబైవేళ్ళు, కూలిపనిచేసి, నీచంగా బ్రతికి, తన కొడుక్కి, సామ్యుయెల్ హూోర్ దగ్గరనుంచి రికమెండేషన్ తెప్పించి, కోర్టుఅమీనాగా జేరుస్తాడు. —తరవాత మరణిస్తాడు. సౌందర్యం, సత్యం, స్వేచ్ఛ, ప్రేమ, మోహగానం ఆధ్యాత్మిక ఆనందం,—మానవుడు కోరదగిన ఏవొక్క-దానివునికీ స్వప్నంలో కూడా గమనించకుండా, మట్టిలో బ్రదుకుతాడు......"

"ఇందిర అట్లాంటి మనిషనుకోను" అంది అమృతం.

నేను యింతవరకూ మొగాడి జీవితం వర్ణించాను, ఇంక మన సంఘంలో స్త్రీమాట చెప్పాలా? నువ్వు అనుభవిస్తూనే వున్నావుగా..."

"నాకేం బావా?" అంది అమృతం ఆశ్చర్యంతో. "మన నిజస్వరూపం మనం చూసుగోలేం. ఇతరులు చెబితే సహించలేం. మనలని మనం మోసగించుకుంటూ, ఆత్మవంచనకి లోబడి, రోజులుగడపే నటులం మనం అందరం. నీ అత్తగారి అంపకాలకోతలూ, భర్త మౌర్ఖ్యం వోకరుమోసగించుకోటం, కమ్మారమ్మాయితో స్నేహం, సహనం—ఇంకా చెప్పాలా?"

"ఇట్లాంటివి సన్నికుటుంబాలలోనూ వుంటాయి. ఇందులో విశేషం ఏముంది బావా? సంసారం గుట్టుగా చేసుకోడం తప్పా?"

"తప్పుకాదు; కాని, నీతికాదు. అందరూ ఎట్లాచేస్తే అట్లాచెయ్యడం నీతికాదు. ఇతరుల మెప్పు పొందడం కోసంకాకుండా, నీకునిజమని, మంచిదని, మనస్ఫూర్తిగా తోచిన విషయాలని ఆచరణలో పెట్టడం నీతి. నీప్రవర్తనకి

బాధ్యురాలవు నువ్వే—అంతేకాని, నీ భర్త, అత్తగారు, కుటుంబం, సంఘం, బాధ్యులు కాకూడదు. నీచేష్టలకు నువ్వెంత వరకు బాధ్యురాలవో ఒక్కసారి ప్రశ్నించుకో” అన్నాడు నిధి నవ్వుతూ.

అమృతం చాలాసేపు ఆలోచించి అన్నది: “ఏమో, బావా, యివన్నీ వూహించుకుంటేనే బాధపడటం జరుగుతుంది. అందరూ యిట్లాంటివి ఆనుకుంటూ కూర్చుంటే వొక్కరోజు బ్రతకగలరా?”

ఊహించుకోకుండా, వీక్షణాని కాతీతం జీవించడం జగన్నాథం పద్ధతి. అక్కయ్యకి కూడా ఆ పద్ధతే నచ్చుడం నిధికి ఆశ్చర్యం కలిగించింది. మళ్లా కళ్లుమూసుకున్నాడు. జీవించడమా? జీవితాన్ని గురించి ఆలోచించడమా? ఏది మంచి పద్ధతి? అదీ సమస్య. అసలు 'యిది మంచిది' అని నిర్ణయించేటందుకు తగిన ఆధారాలేవి? ఒకమనిషి సుఖపడటమా? కష్టాలుపడ్డా చివరకు ఏదో ఘనకార్యం చెయ్యగలగడమా?

“నువ్వు దిగులుగావుంటే ఎట్లాగోవుంటుంది, బావా” అన్నది అమృతం, కొంత నవ్వుతెచ్చి పెట్టుకుంటూ.

“అప్పుడప్పుడు నీకిట్లాగే వుండదూ?”

“ఉంటుందనుకో—కాని వొంటిగావున్నప్పుడే—”

“గుంపులో మధ్యనున్నవాడు, వొంటిగా సంచరిస్తాడు నీ వుద్దేశం? అసలిట్లా పది మందిలోనూ వున్నవాళ్లకే, తాము ఎంత వొంటరిగా వుంటున్నారో, తమకీ, యితరులకీ మధ్య ఎన్ని సముద్రాలు వున్నాయో, భయంకరంగా కనుపించి, మరీ బాధపడతారు, తెలుసా— అమృతం”! అన్నాడు నిధి.

“ఇతరుల సావాసం గిట్టక, ఎప్పుడూ వొంటిగా వుండాలనే వాళ్లలో ఏదో లోపం వుంటుందనుకుంటా.” అమృతం ఆమాట అనేసినందుకు నాలిక కొరుక్కుంది; కాని, మాటలని వెనక్కి లాక్కోలేదు.

“ఇతరులతో కలిసి వుండాలంటే, మన వ్యక్తిత్వాలని, చాలావరకూ

వొదులుకునీ, మనకి అసహజమైన కొత్తలక్షణాలని ఎరువు తెచ్చుకునీ, నటించాలి—నువ్వు గ్రహించావా? భర్తని భరించాలంటే, భార్య ఎంత త్యాగం చెయ్యాలి! అల్లాగే భర్తానూ. నిజస్వరూపాలని దాచుగుని ఎంతో అభినయం చేస్తేనే, సంసారం నిలబడి, సంఘ జీవనం సాధ్యమవుతోంది..."

"అల్లా వుండడం మంచిదేగా......అల్లా వుండగా వుండగా, దానికి అలవాటుపడిపోతాం. అందులో చెడులేదు, కష్టమూలేదు—మరి నీ కెందుకు అల్లావుండడం గిట్టదు?" అని అడిగింది. అమృతం అమాయకంగా కనబడ్డా, అదంతా స్థిరపడిన మనస్తత్వాన్నించి జనించిందనీ, ఆమన స్తత్వం, తర్కబద్ధమైన అలవాట్లతో అమర్చబడ్డ వ్యక్తిత్వంమీద ఆధారపడిందనీ, నిధి గ్రహించుకున్నాడు.

వ్యర్థప్రసంగం చేస్తున్నట్లు గ్రహించుకున్న వాళ్లమాదిరి, యిద్దరూ వొకర్ని చూసి వొకరు నవ్వుకుంటూ, మళ్లా నిశ్శబ్దంలో పడ్డారు. స్వల్పవిషయాలలో అభిప్రాయభేదాలున్నా, ప్రధానాంశంలో ఏకీభావంగల యిద్దరి, వ్యక్తుల సంభాషణ మాదిరి, వారి ప్రసంగం, పైలుదేరిన చోటకి చేరుకునిరి నిల్చిపోయింది.

ఇంతలో శంకరం టిఫిన్ కారీర్‌తో పట్టావొచ్చాడు. అమృతం, భోజనం ఐంతర్వాత, చెయ్యికడుక్కుని, మాధవయ్యగారింటికి వెళ్లడానికి సిద్ధపడింది. నిధి వొద్దన్నాడు. మళ్ళీ ఘర్షణ ప్రారంభమైంది. అప్పుడే ఒకాయన గదిలోకొచ్చి, నిధికి వొక పుత్తరం యిచ్చి, దూరంగావెళ్లి నిలబడ్డాడు. నిధి ఆవుత్తరం చదువుకుని, "ఇక మీరు వెళ్లొచ్చు"నన్నాడు. ఆ వొచ్చినాయన వెళ్లిపోయ్యాడు.

అమృతం ఆవుత్తరం తీసుకుని, చూసింది. తన కేమీ అర్థంకాలేదు; అది ఇంగ్లీషులో వుంది. ఏమనుందో నిధిని చెప్పమంది. అతనులేచి బ్రెడ్ తినడం మొదలెట్టాడు.

"రాకరాక వొచ్చినందుకు,నీకు మంచి మర్యాద జరిగింది. అవునా?"

అన్నాడు.

"మర్యాద పరాయివాళ్లకుగాని నాకెందుకు బావా—" అంది అమృతం.

"మర్యాద జరగనప్పుడు నొచ్చుకునేది, కావల్సినవాళ్లే."

"అది వొక మోస్తరుగా కావల్సినవాళ్లు."

"నీకు నామీద అంత అభిమానం వున్నందుకు,—నేను ప్రతిఫలం ఏమీయివ్వలేక పోతున్నానమృతం......"

"నే కోరే ప్రతిఫలం నువ్వు సంతోషంగా వుండటమే" అన్నది.

"అందరూ వొక వ్యక్తి సంతోషంకోసం ఎందుకు పాటు బడాలో నాకు తెలీడం లేదు. ఎవరి సంతోషం వారుచూసుగుంటే చాలదూ?"

"తమకి సంతోషం లేనివాళ్లు, యితరులని సంతోషపెట్టైనా తృప్తిపడగూడదూ?"

అమృతం మాటలని తూకంలోవేసి విలువకట్టడం సాగించాడు నిధి. అమృతానికి తన జీవితంలో సంతోషం లేదుకాబోలు. ఎందుకు లేదో? ఆమె కనబరిచే తృప్తి అంతానటనే? అమృతం దేన్నో అన్వేషిస్తోన్నట్లు కనబడుతుంది. దేన్నో అడిగితే? అతనికి ధైర్యం చాల్లేదు.

"ఆ వుత్తరం ఏమిటో చెప్పవు, బావా?"

"మాధవయ్యగారు వ్రాశింది. చాలా అరెస్టులు జరిగాయట. నేను అరెస్టుకాకుండా, ఆయన ఏర్పాటు చేశాడుట. నన్ను తక్షణం ఎక్కడికేనా వెళ్ళమన్నాడు. మిగతా విషయాలు తరవాత చూసుకుందాం, అన్నాడు.

ఈ ఉత్తరం ఇన్స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్కి పంపిస్తాను" అన్నాడు నిధి నిదానంగా, కాఫీ గ్లాస్ నేలమీద పెడుతూ.

"అట్లాచేస్తే ఆయన వుద్యోగానికి నష్టంకాదు, బావా—"

"అట్లా అవాలనే."

"వద్దుస్మా."

"అవును అమృతం. మాధవయ్యగారు, దేశానికి వుపకారం చెయ్యలేక పోయ్యాడు. తనకీ, అన్యాయం చేసుకున్నాడు. ఆయన విధి ఆయన నెరవేరుస్తూ, నన్ను అరెస్టుచేసి వున్నట్లయితే సంతోషిద్దును నేను. నాకు నిజంగా జైల్లో కొంతకాలం గడపాలనుంది—"

"బాగానేవుంది. ఆయన వుద్యోగానికి భంగం కలిగితే, మనకేమొస్తుంది?"

"న్యాయాన్ని సాధించడం జరుగుతుంది. చూశావా అల్లుణ్ణి వొదిలిపించేశాడని చెప్పుకునే అపకీర్తికన్నా వుద్యోగంపోవడం పెద్ద అపచారమా?"

"నీ ఘోరంతి నిజంగా ఆ వుత్తరం పోలీసు అధికారులకిచ్చేటట్లుగా వుంది. అట్లా చెయ్యకున్నా."

"నీ కెందుకు అమృతం వారిమీద అంతజాలి?" అని అడిగాడు. ఎల్లానూ యిస్తాడని తెలిసి, యివ్వొద్దుఅంటూ తన మంచితనాన్ని ప్రకటించుకోడమా అది? లేకపోతే ఏదో ఘనకార్యం చేస్తున్నానని, సంస్కర్త స్వాతిశయమా?

"ఏంలేదు బావా—అనేక రకాల మనుషులుంటారు. వాళ్ళందర్నీ బాగుచేసినంత మాత్రాన, న్యాయం జరుగుతుందా? ఎందరో మన్ని మోసగిస్తారు. చివరికి మోసపోతారు. కోమలి విషయం చూడు..." అంది అమృతం.

"కోమలి ఎవర్నీ మోసంచెయ్యలేదు. కోమలికి బాగా ప్రవర్తించడం అంటే ఏమిటో కూడా తెలీదు.

"బావా నిన్నోవిషయం ఎప్పటినుంచో అడగాలనుంది—ఏమీ అనుకోనంటే అడుగుతాను.—"

"తప్పకుండా అడుగు—పైగా నువ్వడిగేదేమిటో నాకు తెలుసు..."

అమృతం ఆశ్చర్యం ప్రకటించింది.

"ఐతే ప్రశ్నలేకుండా సమాధానంచెప్పు" అన్నది.

"నీదగ్గర నాకు రహస్యంలేదు అమృతం. ప్రతివాడూ తన నిజ స్వరూపం ఎవరో వకరిముందు బైటపెడతాడు. నేను నీముందు బైటపెట్టక తప్పిందికాదు......"

"ఓయబ్బో, యీమాటల కేంలే. మొగాళ్ళరహస్యాలు ఆడాళ్ళతో ఎందుకు చెబుతారు ? నాకు తెలీదేమిటి అమాత్రం" అంది. కాని, అతనికేసి రెప్పవాల్చకుండా వింతగాచూసి, మళ్ళా మొహం తిప్పేసి, గోడమీద పురుగుల్ని వేటాడుతున్న బల్లికేసి చూస్తోంది.

"కాదు అమృతం. చెప్పకపోడానికి కారణం, చెప్పింది అవతలవాడు నమ్మడేమోనన్నభయం. చెప్పినవిషయాన్ని, విమర్శించకుండా, సానుభూతితో అర్థంచేసుకోగల సంస్కారం వున్నవాడు దొరికేవరకూ, మనలో సత్యం మరుగువడి వుండాల్సిందే. కొంతమందికి, అట్లాంటి వ్యక్తులు అసలెప్పుడు జీవితంలో కొరకనే దొరకరు. వాళ్లే విషాదకరమైన వ్యక్తులు. వాళ్ళు చివరికి ఐతే మహాయోగులేనా అవుతారు, లేకపోతే రౌడీలేనా అవుతారు. తన ప్రవర్తనని, సరైనదని ఋజువుచేసుకుని, సమాధాన పడటంకోసం, మానవుడు చేసేయత్నమే, తన నిజస్వరూపం." అమృతానికి బాగా అర్థమైనట్టులేదు. కొన్ని విషయాలు, యిట్టే బోధపడతాయి; వాటికి మాటలు, ధ్వనులు, నిర్వచనాలు ఏవీ అక్కర్లేదు. మరికొన్ని పరిశీలించి,తర్కించిన కొద్దీ, యింకా దూరమైపోయి అస్పష్టలేని, మేఘంలా విడిపోయి, ఆకాశమంతా ఆవరిస్తాయి. అమృతం వెనక్కి జంకింది; చూపుతో, నాడి కదలికతో చర్మం తాకిడితో, చుఱ్ఱుమని కాలిపొయ్యే హృదయం, నోరువిప్పగానే మూగదై పోయింది.

"అసలు విషయం తప్పించేశావు, బావా...నీకు కోపమంటే— ఎందుకంత,—యిది—".

"యిదంతే?"

"ఏమో బాబూ, నాకు తెలీదు."

తలకాయ గిర్రునతిప్పి, సిగ్గుని నవ్వులోకి మార్చింది అమృతం. అవుట్లా ఆ నవ్వు పైకిలేచిపోయి "దొంగ బావ," అన్న వాక్యంలో పేలిపోయింది. రంగురంగులనక్షత్రాలు, ఆమెకళ్ళముందు కదిలాయి. ఇందాకట్నుంచీ అల్లు కున్న నిశ్చలత్వం వొక్కసారి విడిపోయింది. తినేటందుకు పురుగులేక బల్లి వెనక్కి వెళ్ళిపోయింది. శంకరం; వొచ్చే ఆవులింతని ఆపుగుంటూ చిటికెలు వేస్తున్నాడు.

అమృతం, లేని వొళ్ళు విరుచుగుని, అటూ యిటూ పచార్లుచేసి, మళ్ళా అతని మంచం దగ్గరగా వొచ్చి,—

"సమాధానం నాకు తెల్సు బావా" అన్నది.

"నీకు తెలీదు, అమృతం. అసలు ప్రశ్న ఏమిటో కూడా నీకు తెలీదు" అన్నాడు.

"నాకు తెలుసు" అంది అమృతం.

"పోనీ నీ ప్రశ్న ఏమిటి? నాకు కోమలితో సంబంధం వుందా అని. లేదని నీకు తెలుసు. ఐనా వుందని, నాకు కొంత బాధ కలిగించాలని. నిజాన్ని నిజం అని ఋజువుచెయ్యడం నాచేతకాదు" అన్నాడు నిధి.

అమృతం వొక్కసారి మోహం విచారంగా చేసుగుంది. స్త్రీత్వం లోని అసహాయిత కళ్ళల్లో ప్రదర్శించింది.

"అదికాదు, బావా కోమల్ని గురించి నీకెంతటి అభిమానంవుందో తెలుసుకోవాలని—అన్నాకాని, నిన్ను బాధపెట్టాలని కాదు. ఐతే యీ విషయం నీతో మాట్లాడద్లే. నేనేమన్నా తప్పుగా అంటే క్షమించు..."

స్త్రీ యీ ధోరణిలో మాట్లాడినప్పుడు, తెరవెనక జరుగుతున్న నాటకంలో పాత్రగా మారుతుంది. మనం చూడొచ్చు, వినొచ్చు, తెలుసు కోవొచ్చు, కాని అర్థం చేసుకోలేం.

"ఇల్లాంటప్పుడు, మీ అమ్మగారుంటే యెంత ధైర్యంగావుండును!" అన్నది అమృతం, మరోవిషయం ఎత్తుతూ. అమృతం, అనుభవంవల్ల తెలుసుకుని, ఆలోచించి ప్రయోగించిన అస్త్రం అది. మళ్ళా సంభాషణ, ప్రస్తుత కర్తవ్యాన్ని గురించి ప్రారంభమైంది. నిధిని తనతో వాళ్ళవూరు రమ్మంది అమృతం.

"మీ ఆయన ఏమన్నా అనుకుంటాడేమో" అన్నాడు.

"పో,—ఏంమాటలుబావా— అంది.

"నేను మానాన్నదగ్గరికి, బెంగుళూరు వెడుతున్నాను. నువ్వు తెల్లారగట్ల బండికి మావూరెళ్ళు" అన్నాడు. నిధికి మాధవరావుగా రేర్పాటుచేసిన బసలో అమృతం, శంకరం పడుకోటానికి ఏర్పాటైంది. బండి తెల్లవారగట్ల ఐదున్నరకి. స్టేషన్‌కి వెళ్ళేటప్పుడు, అక్కడికొచ్చి, చెప్పివెడతానని, శంకరం, అమృతం, బండిమీద గదికివెళ్లారు.

నాలుగింటికి, అమృతం, హాస్పిటల్‌కి వొచ్చింది. నిధి నిద్రలో వున్నాడు. రాత్రిబాగా నిద్రపట్టిందని, వార్డు బోయ్ అన్నాడు. అమృతం మెల్లిగా అతని మంచందగ్గర కొచ్చి, మాధవయ్యగారు వ్రాసిన వుత్తరం కోసం వెదకటం మొదలెట్టింది. అతని దిండుకింద, ఆవుత్తరం దొరికింది. దాన్ని తీసుకుని దాచింది. తరవాత అతన్ని లేపి, "వెళ్ళొస్తా బావా, నువ్వు తప్పకుండా మావూరు రావాలిస్మా. మామయ్యని కూడా తీసుకురా. ఉంకో పదిరోజుల్లో జగ్గుగాడుకూడా వొస్తాడు. ఏం?" అంది.

నిధి లేచి, కళ్లు తుడుచుకుని ఆవలించి, అల్లాగే అంటూ మళ్ళా వాలాడు. బైట బండివాడు టైమైంది లెగండమ్మా అని అరుస్తున్నాడు. వెళ్ళొస్తా బావా జ్ఞాపకం వుంటాంకదూ— ఓ వుత్తరంముక్క రాస్తూండు. —తమ్ముణ్ణి, స్టేషన్‌కి పంపుతా..."

"తప్పకుండా వొస్తా. ఐతే, ఏవేళ నే రాలేననుకో—నేను ఎప్పుడు రమ్మంటే అప్పుడు రాగలవా నువ్వు?" అన్నాడు. అమృతం,

అటూ యిటూ చూసి, శంకరంతో, 'పద ఎక్కవోయ్ బండి' అంటూ— "ఛ" అంది ధైర్యంగా. నమ్మమన్నట్లుగా నవ్వి, బండెక్కి వెళ్ళింది అమృతం. భారతమాత సంకెళ్లు చప్పుడు చేసినట్లు, గాజులు చప్పుడు బైట నుంచి వినబడింది.

నిధి, పక్క సర్దుకుంటూ, దిండ్లకింద చూశాడు. మామగారు వ్రాసిన ఉత్తరంలేదు. అతనికి నవ్వొచ్చింది. చిత్రమైనమనిషి అమృతం అనుకున్నాడు.

—o—

# 5

# సౌందర్య రాహిత్యం

దయానిధి ఏలూరులో ప్రాక్టీస్ పెట్టాడు. మిగిలిన మూడెకరాల భూమిఅమ్మి, దశరథరామయ్యగారు కొంతడబ్బు కొడుక్కిచ్చి, మిగతడబ్బుతో నారయ్యని తీసుకుని దక్షిణదేశ యాత్రకి బైలుదేరారు. ఆడబ్బుతో దయానిధి ప్రాక్టీస్‌కి కావల్సిన సరంజామంతా తెచ్చుకున్నాడు. ఇల్లుకొంచం పెద్దదే. డాబా. మధ్య పెద్దహాలు, వెనక రెండుగదులు, వరండాలోంచి పైకి మెట్లు, వెనకాల విశాలమైన దొడ్డి, దాన్నిండా పూలమొక్కలు, ఆ పెరటిచెట్ల చుట్టూ గోడ,—బొత్తిగా నడివీధిలో కాకుండా, కాలవకి కొంచెం దూరంలో వుంటుంది. రెండు గదులలోనూ, కుడివైపు దాంట్లో మందుల బీరువాలు, కుర్చీలు, బల్లలు అమర్చబడివున్నాయి. ఎడమవైపు దాంట్లో పుస్తకాల బీరువా; గుండ్రటి బల్ల, సోఫా, పడకుర్చీ వుంటాయి. రామదాసుని కాంపౌండర్‌గా పెట్టుకున్నాడు. భోజనం హోటల్‌నుంచి కారియర్‌లో తెప్పించుకుంటాడు.

తన జీవితం అసంపూర్ణంగా వుందని దయానిధికి తెలుసు. మాధవయ్యగారి వద్దనుంచి వుత్తరం రాలేదు. ఇతను ఇందిర సంగతి కనుక్కుంటూ

వ్రాసిన వుత్తరాలకీ జవాబులేదు. ఇందిర, యితన్ని అక్కడ కొచ్చి, తనని తీసుకరమ్మని కబురంపింది. వొకసారి వుత్తరం వ్రాసింది. మామగారి దగ్గరకెళ్ళి, ఘర్షణపడి, పెద్దగొడవ చెయ్యటానికి యితనికి తగినంత ధైర్యమూ లేదు, యిష్టమూ లేదు. పెళ్ళాం కాపరానికి రాదేం? అని చాలామంది అతన్ని అడుగుతూనే వున్నారు. పుట్టింటి కెళ్ళిందనీ, చదువుకుంటుందనీ, జబ్బుగా వుందనీ,—ఏదో అబద్ధపు సమాధానాలు యితను చెబుతూనే వున్నాడు. జనం రకరకాలుగా చెప్పుకోడం సాగించారు. లండనెడతానని, మామగార్ని వొక్కసారి పదివేలు అడిగాడనీ, ఆయన యివ్వలేనందున, భార్యని వొదిలేసి, వాళ్ళతో సంబంధం వొదులుకున్నాడనీ, కొందరనుకున్నారు, మరి కొందరు, ఇతనికి మరో స్త్రీతో పెళ్ళి కాక పూర్వంనుంచీ సంబంధంవుందని అభిప్రాయపడ్డారు. వారి అభిప్రాయాలని ఋజువుపరిచే నిదర్శనాలకోసం వెదుకుతున్నారు కాని, ఫలితం లేకపోయింది. రికామీగావున్న కొందరు వ్యక్తులు యిందులో నిజమేమిటో తెలుసుకోడానికి పరిశోధనలుచేస్తున్నారు. అందర్లాగే కాకుండా, ఎవరేనా, వింతగా జీవిస్తుంటే, సంఘం క్షమించదు. అందరూ పెళ్ళాం బిడ్డలతో కాపరంచేస్తుండాలి. సన్యాసం పుచ్చుకుంటే అది వేరేసంగతి. మనుషుల ప్రవర్తనకి బహిర్గత చిహ్నాలు చూపమని శాశిస్తుంది. పరీక్ష ప్యాసైతే సర్టిఫికేటు, పట్టా పుచ్చుకుంటేబోర్డు, పెళ్ళాం వుంటే మెళ్ళోపుస్తి, సన్యాసంపుచ్చుకుంటే, కాషాయవస్త్రం, గుండు, పోనీ గడ్డం,—యివన్నీ చూపాలి.

ఒకరోజున నిధి, క్లబ్బులో ప్రకాశరావుని కలుసుకున్నాడు. ప్రకాశరావు తండ్రికీ దశరథరామయ్యగారికీ పరిచయం వుండేది. ప్రకాశరావు 'లా' పూర్తిచేశాడు. కాని ఇంకా ప్రాక్టీస్ పెట్టలేదు. అతనికింకా వివాహం కాలేదు. అవీ ఇవీ మాట్లాడుకున్న తర్వాత ప్రకాశరావు, శ్యామల విషయం చెప్పాడు.

శ్యామల, ప్రకాశరావు చెల్లెలు; వయస్సు 22, అత్రాప హాజీసిను

దగ్గర. శ్యామల భర్తకి బొంబాయిలో ఫ్యాక్టరీలో పని. బొంబాయిలో నాలుగేళ్ళు కాపరంచేసింది. ఆమె తండ్రి, అన్నగారు, వొక్కసారి తీసుకొచ్చి, చూపించమని, ఎన్నిసార్లు వ్రాసినా, అతను, శెలవదొరకలేదనో, తనకి వొంట్లో బాగాలేదనో, ఏదోసాకుచెబుతూ, నాలుగేళ్ళమధ్యలో, వొక్కసారికూడా భార్యని పుట్టింటికి తీసుకురాలేదు. ఎప్పుడేనా ప్రకాశరావు బొంబాయివెళ్ళి చెల్లెల్ని చూసి వొస్తూంటాడు. ఈ మధ్య తండ్రికి జబ్బుచేసి, కూతుర్ని చూడాలనుందంటే, యితను వెళ్ళి, శ్యామల్ని తీసుకొచ్చాడు. వొచ్చిన మొన్నాడే శ్యామల ప్రవర్తన వింతగావుంది.

మనిషి అసలే సన్నం; పైగా అన్నంతినడం మానేసింది. ఆకలి లేదంటుంది; అందరూ బలవంతం చేస్తేకాస్తతిని డోక్కుంటుంది. కొన్ని చిత్రమైన పనులు చేస్తుంది. బొగ్గుల్ని చూస్తే శ్యామలకి భయం. ఐనా నీళ్ళ దగ్గరేకూచ్చుని, బొగ్గులుకాల్తుంటే తదేక దీక్షతో చూస్తూకూచుంటుంది. మధ్యలో పొయ్యిలో నీళ్ళోసి, మంటఆర్పేసి, బొగ్గుల్ని పొడుంచేసి, కాటుకగా పెట్టుకునో, పౌడర్‌లా మొహానికి రాసుకునో, లేకపోతే ఆ పొడుం నీళ్ళల్లో కలిపేసుకోడమో చేస్తుంది. అదేమిటే అని అడిగితే, మంచి పొయ్యానంటుంది. వంటింట్లో సత్యనారాయణస్వామి బొమ్మదగ్గర కూర్చుని దానికేసి చూస్తూ, కొంతపట్టేసి, నీళ్ళల్లో కలిపి, ఆ బొమ్మకి పట్టిస్తుంది. అదీ ధోరణి. నూజివీడులో, వైద్యులు, గాలన్నారు. భూతమన్నారు, మళ్ళా మనిషి శుభ్రంగా, తెలివిగా మాట్లాడుతుంది. ప్రకాశరావుకి వైద్యులు చెప్పిన విషయాలలో నమ్మకంలేదు. ఏ మద్రాసో తీసుకెళ్ళి, డాక్టర్లకి చూపించాలని వుంటున్నాడు,

"బొంబాయి నుంచీ, తనకాపరం ఎలావుంటున్నదీ, స్వంతవిషయం ఎప్పుడేనా వుత్తరాలలో వ్రాసేదా?" అని అడిగాడు నిధి.

"మొత్తంనాకు యీనాలుగేళ్లలో, ఆరువుత్తరాలు వ్రాసింది. తను బాగానే వున్నానని వ్రాసేదికాని......?"

"భర్తవిషయం......?"

"అంతా బాగానే వున్నామని వ్రాసేది."

"నువ్వు బొంబాయి వెళ్లి చూసేవాడవుకదా, నీ కేమన్నా విచిత్రంగా తోచేదా?"

"అంటే?"

"బావగారు నీకు నచ్చేవాడా?"

"నా అనుమానం, అప్పుడప్పుడు అతను తాగుతాడని. శ్యామల నడిగాను. అది, నవ్వి—కాదు, అవన్నీ ఖాళీసీసాలు, స్పిరిట్, నూని, యివి పోసుకు నేందుకు కొనుక్కున్నామనేది."

"అతని ఆరోగ్యం?"

"దుక్కలాగుండేవాడు."

"మీ శ్యామలకి పిల్లలా?"

"లేరు."

"కడుపొచ్చి పోయిందా?"

"నే నడగలేదు."

శ్యామల్ని చూడాలని వుందన్నాడు నిధి. వాళ్లిద్దర్నీ ప్రొద్దున్న తనింటికి రమ్మని ఆహ్వానించాడు.

"నేనేమీ మందిచ్చి, జబ్బుకుదురుస్తాననుకోవొద్దు. ఊరికే ఫ్రెండ్లీ విజిట్—శ్యామల్ని చూడాలని కుతూహలంగా వుంది." అన్నాడు.

ప్రకాశరావు పేకాట బల్లదగ్గరకీ దయానిధి కారమ్‌బల్లదగ్గరకీ కదిలారు.

ప్రొద్దున్నే ప్రకాశరావు, శ్యామల్ని తీసుకొచ్చాడు. నిధి ఆమెని చూడగానే ఆశ్చర్యపడినా, పైకి ఆశ్చర్యాన్ని ప్రకటించలేదు. పెండ్లి సంబంధాలు చూస్తూ తను చూసిన పిల్లల్లో శ్యామల వొకర్తి. ఈసంగతి ప్రకాశరావుకి తెలీదు; శ్యామల గుర్తుపట్టినట్టులేదు. శ్యామల కొంచంనలుపు; అంత

ఎత్తరికాదు; చర్మాన్ని ఎముకలమీద సాగదీసినట్లు సన్నగా వుంటుంది. అందమైనవే పళ్ళువరస. మాట్లాడినప్పుడు చూడముచ్చటగా వుంటుంది కాని మాట్లాడదు. గదిలోకి రాగానే, బల్లముందు కూర్చుని, యింటికప్పు, గోడలని చూడటం మొదలెట్టింది. బల్లమీదవున్న సిరాబుడ్డి తీసుకుని, కొంచం సిరా చీరమీద పోసుకుంది. ఆమె కట్టుకున్నది పసుపుపచ్చ పువ్వులద్దిన నల్ల అద్దకంచీర; గుజరాతీ ఫక్కీలోకట్టి, నెత్తిమీద వేసుకున్న ముసుగుని తీసేసింది. జడముందుకు వేసుకునియిప్పింది. సిరాజడకిపూసుకుంది. "చాలా మంచి వాసన" అన్నది, సిరావాసన చూస్తూ.

నిధి ఆమెని పరీక్షచేసి, ప్రకాశరావుని పక్కగదిలో కూర్చోబెట్టి, మళ్ళాయివతలి కొచ్చాడు.

"బొంబాయి బాగుంటుందా?" అని అడిగాడు.

"బాగంటే?"

"అందంగా వుంటుందా!"

శ్యామల వికలంగా నవ్వి, జడ తన మెడచుట్టూ బిగించుకుంది.

శ్యామలలేచి అన్ని మూలలా పచార్లుచేసి, వాసన చూసింది.

"మీ ఇంటికి అద్దెంత?"

"మనిషికి రూపాయి"



"అంటే!"

"నలభై మందున్నాం"

"నలభై అన్నమాట" అన్నాడు.

"భోజనాని కెంతవుతుంది?" అని అడిగాడు మళ్ళా.

"గుడ్డాని కెంతవుతుంది?" అని ప్రశ్నించింది.

"సరె, మీ ఆయన పన్లో కెన్నింటికి కెడతాడు?"

"ఇంట్లో ఆదివారం గంట" అంది.

"పోనీ రోజూ ఎన్నింటికి ఇంటికొస్తాడు?"

దీనికి శ్యామల సమాధానం చెప్పలేదు. 'చాలా చక్కగా వుంది' అంటూ బైట అరుగు మీదకి నడిచి పచార్లు చేస్తోంది. నిధి దొడ్లో గాలేస్తుంది రమ్మని, పూలమొక్కల దగ్గరకి తీసుకెళ్లాడు. వాటికేసి వింతగా చూసింది. ఒక పువ్వుని కోసి వాసన చూసి, "ఛీ పాడువాసన" అని నలిపి పారేసి, కింద మట్టిని అరిచేతుల్లో రుద్దుకుని, మొహం అంతా తుడుచుకుంది. ఆకాశం కేసి చూసి ఆలోచించి, చివరకి నేలమీద పడుకుంది.

"నువ్వు రోజుల్లా ఎట్లా గడిపేదానివి బొంబాయిలో" అని అడిగాడు.

శ్యామల నవ్వింది కాని సమాధానం చెప్పలేదు.

"శ్యామలా, నువ్వు కట్టుకున్న చీర ఎంతో బాగుంది. నువ్వు కొనుక్కున్నావా, మీ ఆయన కొన్నాడా?" అని అడిగాడు.

శ్యామల చీరకేసి గర్వంగా చూసుకుని, పమిటకొంగు పేసేసి, గడ్డి మీద పరిచి మొహం అందులో దాచుకుంది. పల్చబడి, గుండెలకతుక్కు పోయిన రొమ్ములు, కంఠం నరాలు సాలిగూడులా కొదుల్తూ, భయంకరంగా వుంది శ్యామల.

"మీ ఆయన మంచివాడేనా? ఎట్లావుంటాడు, చెప్పవ్?" అన్నాడు.

"ఓ ఫ్యాక్టరీ గొట్టంలాగుంటాడు", మళ్లీ నవ్వింది. "మీరు తెలీదు. బొగ్గు వాసన, తారుజిగురు—పోట్లాడితే మరల మోత, నవ్వితే నిషాళం అంటే నలుపు........"అని యింకా చెప్పబోతోంది.

అతను ఆమె దగ్గరగావెళ్లి, మెల్లిగా అడిగాడు.

"నీకు నిద్ర బాగా పడుతుందా?" అని.

"నే నసలు మేలుకోను."

"కలలు తరుచువొస్తూంటాయా?"

"బొంబాయికల" అంది తను మెల్లిగా.

"ఓ కలచెప్పవు?"

"బొంబాయిరండి చెప్తాను."

"ఎట్లారాను? మీ గదిలో నలభై మంది కాపరం వున్నారన్నావు. మరి నాకు చోటేది వొస్తే?"

"నా బుజాలమీద" అంది నిశ్చితంగా నవ్వుతూ.

ఇంతలో ప్రకాశరావు కొడ్డివేసుకొచ్చాడు. అతన్ని చూసి, శ్యామల "బాబో, బొంబాయి మనిషి" అంటూ, గబగబా లోపలికి పరుగెత్తింది.

నిధి మెల్లిగానడిచి మెట్లమీద కూర్చున్నాడు. ప్రకాశరావు అతనికేసి ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఏమిటంటావు?"

"నాకేమీ తెలీడం లేదు. ఐనా, నాకో అనుమానం కలిగింది. నాదగ్గఱ శ్యామలని రెండు వారాలుంచగలవా?"

"ఏం:"

"ఉంచితే నా అనుమానం తీరిపోదమో, ఋజువు కావటమో జరుగుతుంది"

"టి. బి. యా?"

"కాదు, కాదు."

"చెప్పకూడదు?"

"నేనిప్పుడు చెప్పను. నువ్వు నవ్వుతావు; పైగా నమ్మవు. అంచేత ముందు నే నిర్ధారణ చేసుగుని, నీకు తెలియపరుస్తా. అదృష్టంవుంటే, ఆమె మామూలు మనిషికూడా కాగల్దు. లేకపోతే నష్టం ఏమీ ఉండదు" అన్నాడు నిధి.

"మాయింటికొచ్చి, మందు యివ్వడానికి వీలవుతుందా?"

"కాదు. ఇక్కడే వుండాలి?"

"ఉంచుతాను. ఎవ్వరితో చెప్పను, ఏమిటో కథ నాకు చెప్ప కూడదూ?" అన్నాడు ప్రకాశరావు.

"చెప్తాను. ఎవళ్ళతో అనకు. సౌందర్య రాహిత్యం అనే జబ్బుతో

బాధపడుతోంది శ్యామల" అన్నాడు. ఇద్దరూ లోపలికెళ్ళారు.

ప్రకాశరావు, శ్యామల్ని, పదిరోజులపాటు నిధి ఇంట్లో వుంచే టందుకు అంగీకరించాడు; దొడ్డివైపున వున్న వరండాలో సగం వొదిలేసి, వొకస్క్రీన్ ఏర్పాటుచేసి, ఆవరండా, దానవతలున్న గదీ, శ్యామలకోసం ఏర్పాటుచేశాడు. గదంతా మార్చివేశాడు. నిధి గోడలకి సగం భాగం ఆకాశ రంగు వేయించాడు. కింది భాగానికి పసుపు పచ్చరంగు కాగితం చుట్టూఅంటిం చాడు. నాలుగువైపులా నాలుగు చిత్రపటాలున్నాయి. మూలల్ని ఎత్తుబల్లలు అమర్చి, వాటిమీద పూలతొట్టులు, ఫొటోగ్రాఫ్‌లు వుంచాడు. నేలంతా మబ్బురంగు తివాచీ పరిచాడు.మూలగా, కిటికీపక్కన మంచం.— కిటికీ లోంచి, చెట్లు, ఆకాశం కనిపిస్తుంటాయి. కూర్చునేందుకు వరండాలో కుర్చీలు, మధ్యన గుండ్రటిబల్ల, చిన్నపుస్తకాలు షెల్ఫు,— వీటిమధ్య శ్యామల ఏకాంతంగా కాలం గడపటం. వేళకిభోజనం రామదాసు వరండాలో పెడుతుంటాడు. కుట్లు, అల్లికలు,— వీటికి కావల్సిన సరంజాం గదిలోవుంచారు. డ్రాయింగు కాగితాలు, రంగులపెట్టి, కుంచెలు ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తో కలిపిన మట్టి, మైనం వొకముద్దగాచేసి వొకమూల బల్లమీద వున్నాయి. శ్యామల ఏంచేస్తుందో అప్పుడప్పుడు, నిధి వొచ్చి చూసి, కాసేపు మాట్లాడి పోతుండేవాడు. మొదటిరోజున, దొడ్లో మట్టి తీసుకొచ్చి, శ్యామల మంచంమ్మీద చల్లింది. "పోనీ మంచం, దొడ్లో వేయించనా?" అన్నాడు నిధి.

శ్యామల మాట్లాడకుండా, మంచంకిందదూరి, వొతి నేలమీద పడుకుని తలగడదిండు, గుండెలమీద వుంచుకుంది.

"ఇక్కడ బాగుందా?"

"అంటే?"

"నీమనస్సు హాయిగా, నిశ్చింతంగా..." మాట్లాడలేదు.

"మీ ఆయన్ని రమ్మని వ్రాయనా? ఇద్దరు హాయిగా యిక్కడే

వుందురుకాని." అన్నాడు.

"బాబోయ్" అని కళ్ళు గట్టిగా మూసుకుంది.

"ఏం?"

"వినండి, వినండి" అంది.

నిధి విన్నాడు. మిన్నకూత. ఆశబ్దాలకి బెదిరి పోతోంది శ్యామల.

"శ్యామలా, నీకు పాటలొచ్చునా?"

"ఓ"

"ఐతే పాడు."

"మట్టిమశానములో మసలే వోరామయ్యా..."

"ఓ ఫస్టుగావుంది. గ్రామ్‌ఫోన్ తెప్పించనా?" నారాయణరావు గారింటికి కబురంపి, నిధి గ్రామ్‌ఫోన్, తెప్పించి, గదిలో పెట్టాడు. మొదట్లో శ్యామల ప్లేటునిమాసి భయపడింది. నిధి ప్లేట్లుమీద సౌండ్‌బాక్స్ పెట్టింతర్వాత, తెల్లటి గుడ్డతో మొత్తంగా కప్పాడు. బెంగుళూర్ నాగ రత్నం, వనజాక్షి, రాచప్ప, ఖాదర్ బాచ, బాలగంధర్వ, రామనాథ శాస్త్రి,— వీళ్ళ రికార్డ్లలో, శ్యామలకి, వనజాక్షి పాటలు నచ్చాయి. అవే అస్తమానం, పెట్టుకునేది. ముఖ్యంగా, రికార్డు చివర మై నేమ్ యీజ్ మిస్ వనజాక్షి" అన్న వాక్యం, శ్యామలకి చాలాయిష్టం. తనూ చివర, మై నేమ్ యీజ్ మిస్ శ్యామల అంటూ కూర్చునేది.

"నువ్వు మిస్‌వి కాదు. 'మిస్' అనేది పెండ్లికాని వాళ్ళకే." అన్నాడు నిధి.

"ఆమాత్రం తెలుసునులే వెళ్ళవయ్యా, మిస్టర్ నిధి" అంది శ్యామల. మళ్ళా తనే అడిగింది.

"మిస్ నిధి ఎక్కడ?"

"అంటే?"

"యువర్ వైఫ్."

నిధికి సమాధానం ఏం చెప్పాలో తెలీడం లేదు

"బొంబాయి వెళ్ళింది."

"బొంబాయ్! మరి తిరిగిరాదు."

"ఏం?"

"అది స్వర్గలోకం. వెళ్ళినవాళ్ళు వెనక్కి రారు."

మూడోనాడు, శ్యామల, రామచిలక కావాలంది. నిధి మనుష్యుల్ని పంపి, వోచిలకని పట్టించి, పంజరంలో వుంచి, గదిలో పెట్టాడు.

ఒకటిచాల్దు యింకా కావాలంది శ్యామల. మరో రెండు చిన్ని చిలకల్ని కూడా తెప్పించి, వేరే పంజరాల్లో పెట్టించాడు. అన్నీ వొక పంజరంలోనే వుండాలంది. అన్నింటినీ వొక పంజరంలోనే వుంచాడు. అవి మొదట్లో పొడుచుకునేవి; తరవాత గత్యంతరం లేక, అల్లాగే వుండి పొయ్యేవి.

"ఒక్క పంజరంలో నలభై చిలకలు కావాలి" అన్నది శ్యామల. నిధికి అప్పటికి అర్థమైంది. ప్రయత్నం చేస్తున్నాను, నెల్లి మెల్లగా వొస్తా యనిచెప్పి, శ్యామల్ని వూరుకోబెట్టాడు. శ్యామల ఆ పంజరంతో ఆడు కునేది. పంజరం నిండామట్టిపోసేది; సున్నం మెత్తేది. సిరాపోసేది. పుల్లలతో చిలకల్ని పొడుస్తూ ఆనందించేది.

ఐదో నాడు, పిచ్చపిచ్చగా రంగులతో బొమ్మలు గియ్యడం మొద లెట్టింది. ఫ్యాక్టరీ గొట్టాలు, మరలు;—అవీ ఆమె గీసిన బొమ్మలు. చుట్లు, అల్లికలు సాగించింది. 'యిబొంబా' అని అక్షరాలని కుట్టింది. ఆ గుడ్డని పంజరం మీద కప్పింది. సాయంత్రం ఏడైంది. కిటికీలోంచి చంద్రుడుకేసి చూస్తూ కూర్చుంది. నిధి లోపలి కొచ్చాడు.

"చందమామ బాగుందా?"

"చంద్రుడిలో ఫ్యాక్టరీవుండం లేదోయ్—అదిగో నల్లగా గొట్టం. బాగరాదేం?"

"వెనకవుండేది. ఈమధ్యనపాడైపోయి,నిల్చిపోయింది" అన్నాడునిధి.

"ఐతే, శ్యామలా, చిలకల్ని అల్లాపాడుస్తున్నావుకదా,—అవి చచ్చిపోవు?"

"చావాలనే పొడవటం — మీ కంతమాత్రం తెలీదు!"

"ఎందుకు నీకంతసి?"

"అవిచస్తే, నాకానందం."

"పోనీ, వాటీని వొదిలేద్దాం."

"అమ్మో, అవిలేకపోతే కాలక్షేపంకాదు"

"కాలక్షేపానికిబోలెడున్నాయి.పుస్తకాలుచూశావా?'కన్యాశుల్కం —'చిలకమర్తివారి గణపతి.' 'కర్పూర మంజరి.'— బొమ్మలు, కుట్లు, గ్రామఫోన్, చంద్రుడు. పూలు, నక్షత్రాలు....

"మీరు చాలా మంచివారు."

"నేనేం మంచి. పాపం, నీకెంత కష్టంగావుంటో యిక్కడుండటం! జైల్లోవున్నట్లు వుందికాదు? ఆ చిలుకలు, నువ్వూ, వొకేరకంగా బాధపడుతున్నారు,—ఔనా. పోనీ, మీ అన్నయ్య దగ్గరికి వెళ్ళిపోతావా?"

"నాకిక్కడే బాగుంది."

"బాగుంటే ఏమిటి?"

"ఏమో."

"అవుతే శ్యామలా, నేనెవరో జ్ఞాపకం వున్నానా?"

"ఓ. నన్ను చూడ్డానికివొచ్చారు, వెనక నేను మీకు నచ్చలేదు, అందుకని నన్ను చేసుకోలేదు. మీపెళ్లాన్ని చూపించండి, ఏవూళ్లోన్నివుంది?"

"వాళ్లవూళ్లోవుంది, రమ్మని వ్రాయనా?" "ఓ."

"మీ ఆయన్ని కూడా రమ్మని వ్రాయనా? పాపం నీకోసం బెంగపెట్టుకున్నాడుట."

"నిజంగా?"

"అవును."

"పోనీ రమ్మనండి."

"పొద్దవుతోంది, భోజనానికిలే."

"మీరు నాతో కూర్చుని తినండి."

ఇద్దరూ, వరండాలో కూర్చుని భోజనం చేశారు. భోజనంచేసి యివతలికి రాగానే, గుమ్మంలో, రోజ్ నిలబడివుంది. స్కూల్లో ఆమెవుద్యోగం తీసేశారట. నిధి ఆమెని తనదగ్గర, కాంపౌండర్‌గా వుండ మన్నాడు; అభ్యంతరం లేకపోతే. రోజ్ వొప్పుగుంది. శ్యామలకి తోడుగా కూడా వుంటుందను కున్నాడు.

ముందుగదిలో కెళ్లి కూర్చోగానే, రోజ్ వోవుత్తరం యిచ్చింది. తను కోమల్ని ఎక్కడ, ఎల్లాకలుసు కున్నదీ చెప్పింది. ఆవుత్తరం యిది:

"మిమ్మల్ని చూడాలని వుంది, ఎందర్నో అడుగుతాను. నేను యిది వరకు కోమల్ని కాను, జమిందారు చదువు చెప్పిస్తున్నాడు. మీఅమృతం గారూ వారూ బాగావున్నారా? మీభార్యా గార్ని వొస్తేచూపిస్తారా? నేను అక్కడ కొస్తే నాతోమాట్లాడతారా? నాకు రాత్రుళ్లు నిద్రపట్టదు. నిద్దట్లో అస్తమానం మీరేకనబడతారు. అట్లా ఎందుకుంటుంది? నేను మీకు జ్ఞాపకం వస్తానా? ఇంకేంరాకోస్తాను.

నేనిప్పుడు చిక్కులో వున్నాను. జమీందారు ఏవూరో చెప్పకుండా వెళ్లాడు. నెలదాటింది. మీరు కొంచెం డబ్బు పంపిస్తారా? నన్ను రమ్మంటారా. ఏమిచెయ్యను, చూసివొచ్చేస్తాను. లేకపోతేజ్వరం వొస్తుంది."

"డబ్బు పంపమని నీతోచెప్పిందా?"

"మనియార్డర్ చెయ్యమంది."

"ఏమిటి చిక్కు?"

"నాతోచెప్పలేదు."

"మందు లకా?"

"నాకు తెలవదండి."

మొన్నాడు నిధి, రెండొందలు మనియార్డరు పంపించాడు. కోమల్ని రమ్మని రాసేటందుకు సాహసించలేక పొయ్యాడు. ఐనా ఆరాత్రి కూర్చుని కోమల్ని గురించి తన కెట్లాంటి అభిప్రాయం వున్నదీ విపులీకరించేందుకు, వొక పెద్దవుత్తరం వ్రాశాడు. ప్రొద్దున్నే అవుత్తరం చదువుకున్నాడు అందులో రాసిన సత్యాలని సంశయిస్తున్నాడు. తనకి నిజంగా కావల్సింది, కోమలి శరీరం. అది పవిత్రమైన శరీరం కాదన్న సత్యాన్ని సహించలేడు. అది అతని వాంఛకి అడ్డుగా తోచడంలేదు. ఆకలేసి నప్పుడు, ఏమీదొరక్క పోతే గడ్డి తింటాడు మనిషి. అందంకోసం, ఆకల్ని ఎవడు చంపుకుంటాడు? కోమలి అందం, శరీరానికి పవిత్రతనికూడా ఆపాదిస్తుంది. అదిమాయ. భ్రమ. ఆభ్రమని వాంఛించటం తప్పు. ఈలోకాన్ని పట్టుకొని ప్రాకులాడేవాళ్లకి ఆభ్రమ యదార్థం. పరలోక చింతాపరులకి, యీ యదార్థం, భ్రమ. ఉత్తరాన్ని చించి వేశాడు నిధి.

శ్యామల గదిలో, గ్రామఫోన్‌తో కలిసి తనూ పాడుతోంది. గదిలో కొచ్చాడు. చిలకలు గొడవ చేస్తున్నాయి. శ్యామల గీచిన బొమ్మలు, మంచంకింద వున్నాయి. సగం అల్లిన దుస్తులున్నాయి. ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తో పొడుగాటి గొట్టాలని తయారుచేసింది. పేకముక్కలతో మేడకట్టింది. ఆగదిలో ప్రతీవొస్తువూ శ్యామల నిజస్వరూపాన్ని చాటేస్తోంది.

"నువ్వు బాగాపాడుతావు శ్యామలా, సంగీతం చెప్పించుకోరాదు?"

గర్వంగా నవ్వింది శ్యామల.

"నేర్చుకుంటా."

"నీకిక్కడ బాగుందా?"

"అంటే?"

"ఇక్కడే వుండాలనుందా, వెళ్లిపోవాలనుందా?"

"నాకు యీగదిలో బాగాలేదు. నూతిపళ్లిందగ్గర వోగది కట్టించు."

మధ్యాహ్నం, తాటియాకు, కఱ్ఱలు తెప్పించి, దొడ్లో చెట్ల మధ్య వో చిన్ని పందిరి వేయించి, మంచం, కుర్చీలు, అక్కడికి పట్టించాడు. శ్యామల ఆ నీడల్లో గడుపుతోంది. కింద గడ్డిలో పడుకుంటుంది. పువ్వుల రేకులని పొడుం చేసి వొళ్లంతా పోసుగుంటుంది. చేతులతో తనే నీళ్లు తోడుకుని వొళ్లు తడుపుకుంటుంది.

శ్యామల ఆహారానికి చాలా ఖర్చవుతోంది; ద్రాక్ష, దానిమ్మ, మామిడి, అరటి, సపోటా, అనాస—రకరకాల పళ్లు, పాలు, ఎన్నో కావాలి శ్యామలకి. విపరీతమైన ఆకలి తెలియపరుస్తోంది. పల్చటి తెల్లచీర కట్టుగుని, వెన్నెట్లో నూతి పళ్లెం మీద కూర్చుని పిచ్చిపాటలు పాడుతుంది. అక్కడికి నిధి వొచ్చాడు.

"ఇప్పుడు బాగుందా?"

"ఓ. కాని, ఆ నూతులో వుండాలని వుంది."

"చల్లగా వుండాలన్న మాట. రాత్రి మంచుపడి, జలుబు చేస్తుంది. మంచం గదిలో వేయిస్తా."

"గదిలో చిలకల గోల"

"వొదిలేద్దాం."

"అమ్మో. అవి అందులోనే చావాలి."

"ఎందుకంత కసి?"

పెద్దగాథ చెప్పింది. మధ్యలో వొక్కొక్క ద్రాక్షపండే నోట్లో వేసుగుంటూ, తన వెనకటి కథ చెప్పడం సాగించింది. శ్యామలకి,—బొంబాయి పట్నం, అక్కడి మనుషులు, రొద, గందరగోళం, మిల్లులు, — యివంటే భయం. భర్త యీమె ప్రకృతికోర్కె కోరింది యివ్వలేక పోయాడు. దానికి కారణం ఆ వాతావరణం అని, శ్యామల భ్రాంతి. ఐదో నెలలో గర్భం పోయింది. ఏవో బాధలు; చెప్పుకోలేను; చెబితే భర్తకి అర్థం కాదు. శ్యామలకి జీవితం పై

మమకారం ఎక్కువ, జీవితాన్ని హింసించాలి. ఎట్లా? తన్ను తనే హింసించు కుంటుంది.

భోజనాలు కాగానే, నిధి, ముందు గదిలోకి వెళ్ళి పోయ్యాడు. సైకోథెరపీ మీద, డాక్టర్ పోన్‌సన్‌బీ బొంబాయిలో యిచ్చిన లెక్చర్లు విన్నాడు. ఆవ్యాసాలు తీసిచదవడం మొదలెట్టాడు. శ్యామలతో వొచ్చిన తిరకాసు కొంతవరకూ అతనికి అర్థమైనట్లు తోచింది. గడియారం తొమ్మిది కొట్టింది. కాంపౌండింగ్‌రూమ్ తలుపులు వేసిన చప్పుడైంది. రామదాసు వెడుతున్నాడు. రోజ్ తనపక్కచుట్టు సర్దు కుంటోంది. శ్యామల గది నిశ్శబ్దంగావుంది. బైట ఎద్దుబండి నిలిచిన చప్పుడైంది. గది తలుపు ఎవరో తట్టారు.

వెళ్లి తలుపు తీశాడు, వెంకటాద్రిగారు.

'ఇందిర వొచ్చింది.'

'లోపలికి రమ్మనండి.'

ఇందిర లోపలికొచ్చి, హాల్లో బల్లమీద కూర్చుంది.

'సామాన్లు లోపల పెట్టించండి.' అన్నాడు నిధి.

'సామాన్లేమీ లేవు.' అన్నాడు వెంకటాద్రిగారు.

'భోజనాలు చేశారా?'

'నేను రాత్రుళ్లు భోజనం చెయ్యను. అమ్మాయి ఫల్లుతింద.'అన్నాడు.

రోజ్‌ని కారియర్, ఫ్లాస్కు యిచ్చి పంపించాడు నిధి. వెంకటాద్రి గారు ఫలహారం చేశాడు.

"ఇల్లు బాగానే వుంది. అద్దెకేనా?"

"ఆ."

"ఏమయ్యా, పెద్దముండావాణ్ణి, నామాటవిని, ఓసారి మామగారిదగ్గర కెళ్ళి, ఏదోరాజీపడి, ఇందిరని తెచ్చుకుని నిక్షేపంగా కాపరంచెయ్యరాదు?"

"రాజీ పడేటందుకు. అసలు దెబ్బలాటే లేదుగా."

"మరి నువ్వెందుకు వెళ్ళవు?"

"వారు నన్ను రమ్మన లేదు."

"ఒకళ్లు రమ్మనేదేమిటి? నీ పెళ్లాన్ని నువ్వు తెచ్చుకోక?"

"వారు పంపందే?"

"ఏ మొచ్చింది?"

'అది వార్నే అడగండి. వారుపంపితేనే యిల్లా తీసుకొచ్చారా మీరు?'

"నాదగ్గర ఉంటోంది ఇందిర. తీసుకెళ్ళు బాబయ్యా అంది. బయలుదేరాను."

"చూశారా మరి, అన్నీ తెలిసే, అల్లా శెలవిస్తారేం మీరు?"

"ఏదో తెలివి తక్కువవాడు, మీమామగారు. నువ్వైనా సర్దుకు పోవద్దు, చదువుకున్న వాడవ్?"

"ఏం చెయ్యమంటారు?"

"కాంగ్రెస్ మెంబరవటగా నువ్వు. ఆ కాంగ్రెస్ లోంచి తప్పుకో రాదు? అందులో కూడా గుద్దా, లాఠీ దెబ్బలు, జైలేగా?"

"దానికీ, ఇందిర కాపరానికీ సంబంధం ఏమిటో నాకు తెలీదు. అంతకంటె, మామగారే కాంగ్రెస్ మెంబరుగా చేరిపోతే తీరిపోతుందిగా."

"బాగానే వున్నాయ్ పట్టింపులు." అంటూ ఆయన సణిగాడు. ఇంతలో రోజ్ కారియరు, ఫ్లాస్కు తీసుకొచ్చింది.

కప్పులో పాలు పోసి యిచ్చాడు. ఆయన పుచ్చుకోనన్నాడు.

"నేనింకా ఆస్థితికి రాలేను, బాబు, మీరుభయులు పుచ్చుకోండి."

ఇందిర రెండుపళ్ళు తిని, పాలు తాగింది.

"మేం తెల్లారగట్ట ఐదు గంటల బండికి వెళ్లాలి. నువ్వుగూడా మాతోవస్తే, నీమామగారు సంతోషిస్తారు.—ఏదో మాట్లాడుకోవచ్చు." అన్నాడు వెంకటాద్రిగారు.

"ఐతే మీరు వారు పంపితే రాయబారిగా వచ్చారా, లేక మీరు

తమాషా చూద్దామనొచ్చారా?" అన్నాడు నిధి.

"పెండ్లిచేసుగుని, భార్యను విడిచిపెట్టి, ఒంటరిగా వుండడంలో తమాషా ఏముంది బాబూ? అన్నాడాయన కొంచెం హేళనగా.

"ఇంతకీ మీ తప్పు ఏమీ లేదంటారు?"

"వెనకటివి తెలుసుక్కుని ఏం లాభం? ముందు గతి చూసుకోవాలి. మొగాడెల్లా పడితే అల్లాగే వుండగలడు,—ఇందిర విషయం ఆలోచించు."

"అల్లా అనడంలో మీ అభిప్రాయం ఏమిటో తెలుసుకోవచ్చా."

"వేరే చెప్పాలా—అందరికీ తెలుస్తూనేవుంది."

"మీరు పెద్దలు, నిజానిజాలు తెలుసుకోకుండా, మాటలనడం భావ్యంకాదు."

"నేను నోరు కట్టేసుకుంటే ఆగుతుందా! లోకం లేదూ?"

"ఊరుకో బాబయ్యా,-నువ్వు పడుకో, మళ్లా ఆయాసం వొస్తుంది." అంటూ ఇందిర వెంకటాద్రిగార్ని మందలించి, బల్లమీద పక్క అమర్చింది. ఆయన దగ్గు ఆపుగుంటూ వెళ్ళి పడుకున్నాడు.

"మరి నువ్వో?"

"ఈ గదిలో మంచం వుంది లెండి." అన్నాడు నిధి. ఇందిర ఆవులించి, గదిలోకి నడిచి మంచంమీద కూర్చుంది. గదిగుమ్మం అవతల, దయానిధి, మడతమంచం వాల్చుగుని, దానిమీద బొంతను పరిచి గదిలో పడక కుర్చీమీద కూర్చుని, దీపం పెద్దదిచేసి, చదవడం సాగించాడు.

"మీరే యీమంచంమీద పడుకోండి—నేనక్కడ పడుకుంటా" అంటూ ఇందిర లేచింది.

"ఫరవాలేదు, నువ్వు పడుకో. మళ్ళా ప్రొద్దున్నే లేవాలి." అన్నాడు.

ఇందిర తన మంచం మీది, పరుపు, దుప్పటి, మడత మంచం మీదికి చేరేస్తూ—"మీరు మాతో రారా?"

"దేనికోసం రాను?"

"అవును లెండి మీ రేంసుకొస్తారు!"

పక్కగదిలో చిలుకలు శబ్దంచేశాయి, నిధి పుస్తకంమూసి, దీపం కొంచెం తగ్గించాడు. ఇంతలో శ్యామల వొచ్చి గదిగుమ్మం ముందు నిలబడి, కళ్ళుపెద్దవి చేసి, కదంకా పరకాయించి—

"ఇంకా పడుకోలేదు? నాగదిలో దీపం ఆరిపోయింది, భయమేస్తోంది." — అంటూ లోపలికొచ్చి, బల్లమీద దీపం పెద్దదిచేసి, "గదిలో కెడదాంరండి" అని, పక్కకి తిరిగి ఇందిరనిచూసి 'బాబో' అని కేకేసి వులిక్కిపడి దీపంమళ్లా పెద్దదిచేసి, గబగబా అవతలకి నడిచి పోయింది. నిధి బెడ్‌రూమ్ దీపంవెలిగించి పెద్దలాంతరు తీసుకుని, ఆమెని చెయ్యిపట్టుకుని ఆమెగదిలోకి తీసికెళ్ళి, పడుకోపెట్టి, మళ్ళా తన గదిలోకొచ్చాడు. ఇందిర బల్లపక్కన కిటికీ దగ్గర నిలబడి వుంది.

"ఇంకా పడుకోలేదేం?" అన్నాడు.

"నిద్రరావడంలేదు. మీరు పడుకోండి." అంది.

"నువ్వేం చేస్తావు మరి?"

"ఇల్లాగే చూస్తూ కూర్చుంటాను." అంది.

రెండు నిమిషాలు నిశ్శబ్దం. వెంకటాద్రిగారు, గుర్రుపడుతున్నట్లు చప్పుడుమాత్రం వినిపిస్తోంది. ఇందిర గుమ్మంలోకి వెళ్ళి రెండు తలుపులూ దగ్గరగా మూసి, మళ్ళావొచ్చి,

"ఐతే నన్ను మీరు ఎప్పుడూ తీసుకురారా?" అని అడిగింది.

"..............."

"యీవుంగరం మీరు పెట్టిందే, ఆనాడు కాలవగట్టున తోటలో— అన్నీ మరచి పొయ్యారా?"

"నేనేం దుష్యంతుణ్ణికాదు." అన్నాడు. ఇందిర బలహీనంగా నవ్వింది.

"తీవునులెండి,—మీకు నేనెందుకు యింక"

"అంటే."?

"మీకొక్క—వల్సినవాళ్ళు మీదగ్గరే వున్నారు"

"నువ్వనేది ఏమిటి? మీబాబయ్య రైల్లో ట్రైనింగ్ చేశాడా యిల్లా అనమని?"

"మా బాబయ్య జోలెందుకు లెండి. నాకు దేవుడు కళ్ళిచ్చాడు."

నిధి నవ్వాడు.

"ఆవిడ నాపేషెంటు, చిత్రమైన కథ. అంతేనా నీ అనుమానం? ఇంకా ఏమన్నా వుందా?"

"డాక్టర్ని చీకటి గదిలోకి రమ్మనే పేషంటు. మరో పాత పేషంటు కూడా వొస్తోందిగా..."

"నాకు కోపం రావాలనా, లేక నవ్వింగాలనా?"

"డాక్టరుదగ్గర డబ్బుపుచ్చుకునే పేషంటు,"

"ఈ బల్లమీద వుత్తరం చదివావా?" అన్నాడు.

"ఏం తప్పా?"

"తప్పే."

"ఈ వుత్తరం చదివితేనే తెలియనక్కరలేదు. పెళ్ళిలోనే చెప్పగున్నారు, ఖింతగా..."

"నోరు మూసుగుని పడుకుంటావా?"

"ఎమిటో చెప్పగున్నారు, నాగుమణి, సుశీలా అంటూ, నేనువమ్మలేదు. మీ అమ్మగారూ యింతేటుగా."

నిధి అతలకి వెళ్ళిపోయి, వీధులో అరుగుకింద నెట్లుమీద కూర్చున్నాడు. దూరంగా ముస్లిమ్ కుర్రాడు 'ఏదీ గతినాకు' పాడుకుంటూ పోతున్నాడు. నిధికి విచారం వేసింది. తనమీద జాలేసింది. బ్రతికినప శే

కాకుండా, మరణించిన తర్వాతకూడా, ఆడవాళ్ళు పురుషుణ్ణి వీడిపించడం ఎందుకో అనుకున్నాడు. ఏడవటం ఆడవాళ్ళ వంతు; బాధపడటం మొగాడివంతు.

కాసేపు మెట్లమీదే పడుకున్నాడు. కాసేపు లోపలికెళ్ళి, మడత మంచంమీద పడుకున్నాడు, కాసేపు కుర్చీలో కూర్చున్నాడు. కాసేపు రోడ్డుమీదికి వెళ్ళి, వంతెన మీద కూర్చున్నాడు. ఎట్లాగో నాలుగైంది. వెంకటాద్రిగారు లేచి, దంతధావనం మొదలెట్టాడు. జట్కాబండి వొచ్చింది ఇందిర మెట్లమీద నిలబడింది.

"మాతో రండి."

"మీ నాన్న చేతకూడా మాటలనిపిస్తావా?"

"క్షమించండి. ఎప్పుడూ అనను."

"అనడంలో బాధలేదు నాకు; అసలునువ్వువాటినినమ్మి అనుకోడంలో వుంది."

"ఇంక అనుకోను. వస్తారా?"

"ఏ మొహంతో."

వెంకటాద్రిగారు, బండి ఎక్కమని తొందరచేస్తున్నాడు. శ్యామల కూడా, లేచి వాకిట్లో నిలబడి చూస్తోంది. ఇందిర ఆమెకేసి పరకాయించి చూసింది.

"నేనిక్కడే వుంటాను; బాబయ్యా, నువ్వు వెళ్ళకూడదు?" అంది ఇందిర.

"మీనాన్న నాపీక్కి వురేడతాడు. ఎక్కు కావాలంటే తరవాత వొద్దువుకాని."

ఇందిర బండెక్కింది. బండి కదిలింది.

దయానిధి గదిలో కూర్చుని కళ్ళు మూసుగున్నాడు. ఎనిమిదింటికి రామదాసు లేసాడు. స్నానంచేసి, కాఫీ తాగి వాకిట్లోకి రాగానే శ్యామల

అతన్ని తనగదిలోకి ఆహ్వానించింది. రాత్రి తను చూసిన దృశ్యం జ్ఞాపకంచేసి ఆవిడ ఎవరో, ఎందుకొచ్చిందో అన్నీ చెప్పమంది. నిధి అన్నింటికీ సమాధానం చెప్పాడు. శ్యామల వ్యాధి కుదురుతోందనీ, అతని చికిత్స పనిచేస్తోందనీ, అనిపించినా, ఆమెను మామూలు మనిషిగా చెయ్యగలనన్న ధైర్యం అతనికి చిక్కడం లేదు. అతని జీవితమే సరిగ్గాలేదు; అతనికి తెలియని లోటుపాట్లు అతనిలో ఎన్ని వున్నాయోనన్న భయంవల్ల అతను ఏపనీ దీక్షతో నిర్వహించలేక పోతున్నాడేమో అతని మనస్సుని కుదుటపర్చుకోవడం చేతకావడంలేదు. ఇతరులని బాగుచేసే అధికారం, డిగ్రీద్వారా అతనికి వుంది; కాని నైతికంగా అట్లాంటి అర్హతలేదేమో!

"తెల్లవార్లూ చిలకలు దెబ్బలాడుకున్నాయ్-నాకు నిద్రపట్టలేదు." అంది శ్యామల.

"కలిసివున్నా, అవీ మనలాగే, విడివిడిగా వుంటాయి." అన్నాడు.

"ఈ సంఘం పాడుపడిపోయిన దేవాలయం లాంటిది. మనమందరమూ అందులో స్తంభాలం; ఎప్పుడూ కలుసుకోవు. చిలకలు పంజరంలోనూ, మనం స్వార్థం అనే కోటలోనూ బంధించబడ్డాం——"

శ్యామల ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసి, నుదురు చిట్లించింది. దయా నిధికి తను యిల్లా ఎందుకు మాట్లాడాడో అర్థంకాలేదు. విగ్గరగా ఆలోచించడం కాబోలు. ఆలోచించడంకూడా కాదు; నిజంగా అనుభవిస్తున్న బాధని ప్రకటించడానికి, బుద్ధిచేసే యత్నం ఆ మాటలు.

శ్యామల తన బొమ్మలని చూడమంది. చేతిగాజులు చూపించింది; వాటిని పూలుతో జంటలుగా కట్టి కదిలించింది.

"మీ కళ్ళు వాచాయి; మొహం బరువెక్కింది. పాపం తెల్లవార్లూ నిద్రపోలేదనుకుంటా" అంటూ శ్యామల, అతన్ని వోదార్చడం మొదలెట్టింది. పేషెంటు లక్షణాలు తనకే వొచ్చేటట్లున్నాయనుకుని నిధి లేచాడు.

"కూర్చోండి——మీరివాళ అదోలా మాట్లాడుతున్నారు."

"వొచ్చినప్పడుకంటె యిప్పుడు నీ వొంట్లో బాగుంటోందా?"

"ఓ—నాకేం తెగులు—?"

"బొంబాయి వెడతావా?"

"వెళ్ళను."

"ఏం?"

"ఏమో—" శ్యామల దిగులుగా కుర్చీలో కూర్చుని ఎందుకో ఏడ్పు మొదలెట్టింది. అతనికి అర్థంకాలేదు. బుజంమ్మీద చెయ్యివేశాడు. కళ్ళమ్మట కారే నీటిని తుడుస్తున్నాడు. ఏదో చప్పుడైతే పక్కకి తిరిగి చూశాడు. గుమ్మంలో ప్రకాశరావు నిలబడివున్నాడు.

నిధిని ప్రకాశరావు ముందు గదిలోకి తీసుకెళ్ళాడు.

"శ్యామల్ని తీసుకెడతున్నాను."

"చాలా భాగం నయమైంది. ఇంకో రెండు వారాలుంచకూడదు?"

"క్షమించాలి. ఆజబ్బు యిక్కడ కుదరదని తోస్తోంది."

"మీకు మార్పు కనబడటం లేదు?"

"ఏం మార్పో,—నాకేమీ నచ్చడంలేదు."

"అంటే—మీలోపల ఏదో వున్నట్లుంది. చెప్పివేస్తే సంతోషిస్తా." అన్నాడు నిధి. ప్రకాశరావు, గోడలకేసి మొహం తిప్పి, నవ్వడం మొదలెట్టాడు.

"నాకు చెప్పడం యిష్టంలేదు. ఊళ్ళో పదిమందీ అనుకున్నది నేను నమ్మకపోయినా, వాళ్ళు అనుకోడం నాకిష్టంలేదు" అన్నాడు ప్రకాశరావు నిధికి కోపం వొచ్చింది.

"ఇదిగో ప్రకాశరావు, నువ్వు చదువుకున్న వాడవు. శ్యామల జబ్బుని గురించి నీకంతా చెప్పాను. వొప్పకున్నావు. శ్యామలలో కొంత మార్పు కూడా వొచ్చినట్లుంది శ్యామల కిప్పడిప్పుడు సౌందర్యం అర్థమౌతోంది. గోల్పోయిన బాంధవ్యం మళ్ళీ నెలకొల్పు కుంటోంది. బాధ

పడుతున్న చైతన్యం చూపత్తోంది. శుకకి సానుభూతికూడా చూపగల్గు
త్తోంది. మనుషుల శానిటీకి సానుభూతి నిదర్శనం. ఆ సానుభూతి ఎట్లాంటిదో
నీకు చెప్పాలంటే నా స్వీయచరిత్ర చెప్పాలి. అది చాలా కష్టం......"

"చెప్పటం దేనికి, కొంతవరకూ తెలుస్తూనే వుంది."

"మీరంటున్న దేమిటి?"

"మీతో నాకువాదం ఎందుకు, —శ్యామల్ని తీసుకు వెడతాను."

"తక్షణం తీసుకువెళ్లండి."

"నేనూ పెద్దగా కేకవెయ్యగల్ను. ఐనా బ్రహ్మవారి దగ్గర అట్టే పెట్టడం, నాదేతప్పు." అన్నాడు ప్రకాశరావు. అతన్ని లెంప కాయ కొట్టడానికి నిధి చెయ్యి లేవబోయింది. ఆచేతిని తీసి, డ్రాయర్లోపెట్టి, ఎడంచేత్తో మూశాడు. ప్రకాశరావు గబగబా గదిలోకెళ్ళి, శ్యామల్ని చెయ్యి పట్టుకుని బైటికి యీడ్చుకొచ్చాడు.

"నేను రాను, రాను" అంటూ శ్యామల చెయ్యి విదిలించుకుని దొడ్లోకి పరుగెత్తి, కాసేపు మట్టిలో దొర్లి ఒళ్లంతా బురద చేసుకుంటోంది. ప్రకాశరావు వెంటపడి ఆమెని మళ్ళా పట్టుకుని బైటకి తీసుకొచ్చాడు. అతని తాలూకు మనుషులు బండి తీసుకొచ్చారు.

"నేను రాను. రాను—" అని శ్యామల గింజుకుంది.

"ఎందుకొస్తావు? అన్నీ యిక్కడ ఏర్పాటుగా వున్నాయి." అని ప్రకాశరావు ఆమెని బైటకు తీసుకెళ్ళేడు. నిధి, పళ్లుపటపట కొరుకుతూ అతనికేసి కోపంగా చూశాడు; కాని అసహాయుడు. శ్యామల వెనక్కి తిరిగి "నా పంజరం" అంది.

"నీక్కావల్సింది, పంజరమా, చిలకా?" అని అడిగాడు నిధి. శ్యామల కాసేపు ఆలోచించి అటూఇటూ చూసి, "పంజరం" అన్నది.

వెంటనే నిధి పంజరాన్ని తీసుకొచ్చి, తలుపు తెరిచాడు. రెండుచిలకలు బైటికి ఎగిరి పొయ్యాయి. మూడోది కుంటుతోంది; ఎగరలేక, అక్కడే

గంతులేస్తోంది. ఖాళీ పంజరం శ్యామలకిచ్చాడు నిధి. దాన్ని గట్టిగా పట్టు
గుని శ్యామల బండెక్కింది. బండి కదిలింది. మనసు తిరుగుతోంది.
బండిలోనుంచి రోడ్డుమీదకి ఎవరో పంజరాన్ని గిరవాటేశారు.

# 6

## స్వయం సంస్కారం

రెండు మాసాలు గడిచినై. నిధి వేసుకొన్న పట్టుబడుతున్నా, ప్రొటెస్ట్ నీరసించింది. శ్యామల కోసం అతను నాలుగైదు రోజులు ఖర్చు చేశాడు. అందులో కానీ కూడా ప్రకాశరావు యివ్వలేదు. అతను మళ్ళా యితనిదగ్గరకు రాలేదు. ఎప్పుడేనా క్లబ్బులో పేకాట బల్లదగ్గర కనబడి నప్పుడు మొహంపక్కకి తిప్పేసుకుంటాడు. వెనక ప్రకాశరావు అన్న మాటలను నిధి మరిచి పోలేకపోతున్నాడు. వాటి నిజాలు కొంతవరకూ క్లబ్బు దగ్గర ఋజువవుతున్నాయి. ఇతను రాగానే, అంతవరకు హుషార్‌గా మాట్లాడుకున్న వ్యక్తులు వెంటనే జోరుతగ్గించి, మెల్లగా మాట్లాడడం మొదలెడతారు. వాళ్లు అంతవరకూ తన విషయమే మాట్లాడుకుంటున్నా రనీ, యితన్ని చూడగానే, విషయం మార్చేస్తున్నారనీ యితని అనుమానం.

వారు చెప్పుకునే రహస్యాలేమిటో తెలుసుకోలేకపోతే అతనికి పిచ్చెక్కేటట్లుగా వుంది. సంఘం ఏమనుకుంటున్నదీ నాకక్కర్లేదనుకునే వ్యక్తి సహితం దాచుకున్న రహస్యాన్ని ఛేదించే యత్నం చేస్తాడో. ఒకవ్యక్తి బాధపడుతుంటే సంఘానికి సరదా కాబోలు. సంఘంవేసిన దారు రోడ్డుమ్మట నడవక పొవగించి వేరేకాలిమార్గం చేసుకుని నడిచేవ్యక్తి

సంఘానికంత వినోదం కలిగించినప్పుడు, ఆవ్యక్తికి సంఘం తన కృతజ్ఞత, తెలియపరుస్తూ, ఆయనకొక రాతి శిల్పం చెక్కించి నడిరోడ్డులో ప్రదర్శించొద్దా? అతన్ని గురించి అనుకుంటున్నారన్న భావంలో కొంత గర్వం లేకపోలేదు. మంచో, చెడో ఏదో చెయ్యడంలో వోటమిలేదు. ఏమీ చెయ్యక పోడంలో వుంది వోటమి. సంఘం ఏమీ చెయ్యదు. ఆఫీసు కెడుతుంది, భోజనం చేస్తుంది, పేకాడుతుంది, పిల్లల్ని కంటుంది, ఎవడో ఏదో చేస్తుంటే వింతగా చూసి, అది చెడేనని నిర్ణయించి, ఆ చెడుగులో ఆనందం పొంది తృప్తిపడుతుంది.

ఐతే సంఘం తనలో దేన్ని చూసి సంతోషిస్తోంది. మంచినా, చెడుగునా? అసలు అతనిలో మంచి ఏముంది? డబ్బు, హోదా, కుటుంబం, వృత్తిలో ప్రావీణ్యం, ఖ్యాతి,—వీటిలో ఏంవున్నాయి అతనికి? పోనీ చెడుగునా? చెడుగంటే ఏమిటి? డబ్బు, హోదా, కుటుంబం వృత్తిలో ప్రావీణ్యం, ఖ్యాతి—యివి లేకపోవడమే చెడుగా? ఇవి లేకపోవడానికి కారణం అతనిలో ఏదో వుండాలని సంఘం తెలుసుకుంది. అదే చెడుగు. అది ఏమిటో, ఎట్లాంటిదో తెలుసుకోవాలి. ఎట్లా? సంఘం చెప్పదు. సంఘం ధ్వనులు చేస్తుంది కాని, అర్థమయ్యే భాషమాట్లాడదు. సంఘం తీర్పుచెప్పదు; వూరకే వాదిస్తూ కూర్చుంటుంది. ఆ వ్యక్తిని మధ్య నిలబెట్టి, అతని చుట్టూ అలుముకొని, సంఘం చూస్తూ కూర్చుంటుంది.

నిధికి క్లబ్బులోవున్న స్నేహితులు కూడా, అదోలా మాట్లాడడం మొదలెట్టారు. శ్యామలను గురించి హేళన చెయ్యడం సాగించారు, శ్యామల వ్యాధిని గురించి అతని అభిప్రాయాలని వెక్కిరించారు. అప్పుడప్పుడు, 'బ్యాటిస్ట్ స్పెషలిస్ట్' అనేవారు. ఒకసారి సంగమేశ్వరరావు, డాక్టర్ బ్యాటిస్టల్ అని పిలిచాడు కూడాను. ఆ పిలుపుకి నిధి వెనక్కి తిరిగాడు. అతని పేరు అదికాదు; ఐతే తను ఎందుకు పలకాలి? కొన్నివారాలు, స్నేహితులు ఇందిరవిషయం ముచ్చటించేవారు. ఒకసారి నిధి, క్లబ్బుకుర్రాణ్ణి,

స్వయం స[illegible]

చదువుకోడానికి ఇండియా అనేపత్రిక తెచ్చిపెట్టమన్నాడు. [illegible], కాని, దానిమీద 'ఇండియా' అనే మాటలో, ఎవరో 'ఐ' అనే అక్షరం పక్కనే సిరాతో 'ఆర్' అనే అక్షరం వ్రాశారు. ఒకసారి తను వెళ్లి, భార్యను తీసుకొద్దా మనుకున్నాడు కూడాను. సంఘం (క్లబ్బు ద్వారా) వేసే బాణాల పరంపరా? లేక మాధవయ్యగారి ఆదర్శాల విషవాయువులా? వీటి ఎదుర్కోటం సులభం? బాణాల పరంపరనే ఎదుర్కోటం సులభంగా తోచింది. బాణాలు ఏ వొకవ్యక్తీ వెయ్యడు. అవి అన్ని వైపుల నుంచీ తగుల్తాయి. కొట్టినవాడిని కనుక్కోలేం, ఎదురు తిరిగేటంకదు. కాని మాధవయ్యగారు వొక మనిషి. ఆయన ఆదర్శాల ప్రవాదులు అతనికి తెలుసు. అవి ఎంతవరకూ వ్యాపించాయో కూడా అతనికి తెలుసు — వాటి బారినుండి అతను తప్పించుకోవచ్చు, పైగా, సంఘం ఎక్కడుంది? ఏలూరు టౌన్‌హాల్ సంఘమా? అనంత విశ్వంలో యీ ప్రపంచం ఎంతటిది? ఢిల్లీలో వొకయిసుక కణం యీ భూగోళం అయితే, కొలంబోలో మరో యిసుకకణం మరోగోళం అవుతుంది. అంతటి అల్పమైన యీగోళంలో ఏలూరు టౌన్‌హాలెంత? భూగోళశాస్త్రం యీవిధంగా యిచ్చే తృప్తి క్షణికం. ఏలూరు టౌన్‌హాలు చాలా చిన్నదే. కాని ఎక్కడికెళ్లినా అది తన వెనకాలే వొచ్చే నీడలాంటిది. సంఘంలో వుండదల్చుకున్న వారు, సంఘాన్ని తప్పించుకు తిరగలేరు. పోనీ క్లబ్బుకి వెళ్లడం మానేస్తే? తన పేషంట్లు సంఘంలోవాళ్ళే; వాళ్లు రావడం మానుకున్నారు. ఏలూరునుంచి వెళ్లిపోయి, మరోచోట ప్రాక్టీస్ పెడితే? తనని ఎరుగున్నవాళ్లు, ఆంధ్ర దేశమంతటా వున్నారు. అతను చేసిన ద్రోహం ఏమిటి? అతను ఎరుగున్న వారినందరినీ చంపడమేనా గత్యంతరం? ఈ ఆలోచనలని త్రొక్కిపెట్టేసుకుని హాస్పిటల్‌కి వొచ్చేశాడు నిధి. జీతాలిచ్చి యిద్దరి కాంపౌండర్లని భరించే స్థితిలోలేదు నిధి. ఒకర్ని మానిపించాలి. ఎవర్ని? రామదాసు ముంగి జేరాడు; తెలివైనవాడు, రోజ్ స్త్రీ; బీదది. తనవిషయం తెలిసున్నది.

టౌన్‌హాల్ మళ్లా తేనెపట్టులా చెలరేగుతుంది.

రోజ్ జీతం లేకపోయినా, తిండీ, బట్టా యిస్తే వుంటానంది. జీతం లేకపోతే వుండలేనని రామదాసు తనే మానేశాడు.

ఆ మొన్నాడు, దయానిధి టెన్నిస్ ఆడి, సోడా తాగి కూర్చున్నాడు. ఈసారి కూడా టెన్నిస్‌లో కృష్ణమూర్తే గెలిచాడు. కృష్ణమూర్తి లక్నో విశ్వ విద్యాలయంలో ఎం. ఎ. ఎల్. ఎల్. బి. డిగ్రీ పొందాడు; క్రీడావంతుడు; కులాసా పురుషుడు; క్లబ్బు స్నేహితులందరూ అతన్ని వేళాకోళం చేస్తుంటారు. అతనికి కోపంరాదు; నవ్వేసి మళ్లా కొంటెగా మాట్లాడటం సాగిస్తాడు. అతను ఏవూళ్లో ప్రాక్టీస్ పెడతాడో అన్నది, అందరికీ వొక సమస్య అయిపోయింది. టెన్నిస్ సెట్ గెల్చిన సంతోషంలో, అతనే సమాధానం చెప్పేశాడు. "నేను పూనాలో ప్రాక్టీస్ పెడుతున్నానండి" అని తెలియ చేశాడు.

"ఏం కథ? మొన్న ఆదివారం మద్రాసులో నన్నావ్?" అని అడిగారు.

"ఏముందండీ, ఆ మాత్రం వూహించలేరూ?"

ఊహించలేమన్నారు.

"పూనాలో అందమైన స్త్రీలున్నారు" అన్నాడు. అంతా విరగబడి నవ్వారు.

"అందమైన స్త్రీలు బొంబాయి, మద్రాసు పట్నాలలో మాత్రం లేరా అని వాదించొచ్చు. ఉండొచ్చు; వున్నారు కూడా, వుండగానే సరికాదు, అందుబాటులో వుండాలి." అని వుపన్యాసం ధోరణిలో సాగించాడు.

ఆవిషయం విస్తరించి, విపులీకరించమన్నారు.

"పూనాలో గిరల్సు, ఫార్వర్డ్—సైకిల్ మీద వెడుతుంటారు. మధ్యలో తొందరగా నడుస్తున్న యంగ్ మేన్ కనబడితే, సైకిల్ నిలిపి,

వెనకాల ఆ యంగ్ మాన్‌ని ఎక్కించుగుని పోతుంటారు.

హైలీ డెవలప్డ్ సివిక్ సెన్సు వుంది. డాక్టర్ నిధి బోటిగాళ్ళకి, పూనాలో ఫస్టురేటు ఆపర్చునిటీస్ వున్నాయి. ఇక్కడ ఫెసిలిటీస్ చాలా లిమిటెడ్.”

పేకాట బృందం చప్పట్లు కొట్టారు. నిధి, చిరాకుతో కుర్చీలో కదిలి, బలవంతంగా నవ్వాడు. నిధిలేచి దూరంగా బల్లదగ్గర కెళ్ళి పత్రికలు తిరగేస్తున్నాడు. కృష్ణమూర్తి చేబులోంచి దువ్వెన తీసి, సోడా నీళ్ళు నెత్తిన జల్లుకుని, జుట్టు వెనక్కి దువ్వి, అటూ యిటూ పచార్లు చేసి, ఓ గులాబి పువ్వుని కోసుకొచ్చి వాసన చూస్తూ నిధి దగ్గరకొచ్చి,—డాక్టర్, స్మెల్ ది రోజ్, రోజ్ చాలా అందమైనపువ్వు సుమాండీ” అంటూ, ఆగులాబీని అతని కిచ్చాడు. నిధికి కోపం వొచ్చింది. ఇంతలో కాంపౌండర్ గా వుంటున్న రోజ్‌ని నేత్రాకోళం చేసి నట్లనిపించింది. “రోజ్ బాగానే వుంటుంది, కాని ముళ్లుంటాయి” అన్నాడు నిధి.

“దానందం ముళ్లే. ముళ్లుగుచ్చు కోకుండా, కొయ్యడంలోవుంది అసలందం” అన్నాడు కృష్ణమూర్తి.

“ఐతే డాక్టర్‌జీ, లేడీ శ్యామల ఎట్లాప్రోగ్రెస్ అవుతోంది?” అని అడిగాడు.

“శ్యామన్ని నేను ట్రీట్ చెయ్యడం లేదు” అన్నాడు నిధి

“అదేమిటండీ, మీ ట్రీట్‌మెంట్ గురించి విన్నాను. నాకు నచ్చింది. మనవాళ్లు ఫూల్సండి. శ్యామల కేసుగురించి నాకు వినాలని వుంది” అన్నాడు కృష్ణమూర్తి.

“నా డయాగ్నొసిస్ సరియైన దేనని నాకు తెలుసు. కాని యితరులకీ, డాక్టర్లకీ దాని నిజానిజాలని ఋజువు చెయ్యలేను. ఇదే వొచ్చిన చిక్కు. చాలా కేసులు పరిశోధించి, సర్వేచేసి, తరవాత, ఓ పేపర్ వ్రాయొచ్చు.

అప్పుడే శ్యామల కేస్ మీద వో పేపర్ వ్రాయడం మొదలెట్టాకూడా. ఆకలి, దాహం, సెక్సు, —వీట్లకిమల్లే, సౌందర్యంకూడా వొకఆకలేననుకుంటాను. ఐ. ఎ. రిచార్డ్స్, వాట్ సన్, డాక్టర్ హాన్ సన్ బీ, ఆగ్ డెన్ యిది నిజమనడానికి ఆధారాలున్నాయని నిర్ధారణ చేశారు. మీకు విసుగెట్టకపోతే, వాళ్ళు చెప్పిన వుదాహరణలని చెబుతాను......"

"తప్పకుండా— చెప్పండి—వుండండి, మరో సిగరెట్ ముట్టించ నివ్వండి..."

"ఉండివుండి వొక్కసారిగా, కోపంరావడానికి కారణం? ఆకస్మికంగా చిరాకొచ్చి, భార్యతో తగవు రావడం, పిల్లల్ని కొట్టడం — దీనికి కారణం ఏమిటి? ఇల్లు చిందరవందరగా వుండటం, తలుపులు గడియ పడకపోడం, రాక పోడం, గోడమీద పటం వొంకరగా వేళ్లాడటం—కాద, ఇది. భర్తపొడు గాటి గోళ్ళు పెంచుకున్నాడని విడాకులిచ్చిన అమెరికన్ స్త్రీని గురించి విన్నారా? పతివ్రతగా వుంటున్న స్త్రీ వొక్కసారిగా చాంచల్యం కనబరచ డానికి కారణం, కొంతవరకూ, భర్త ఏరోజుకు ఆరోజు గడ్డం చేసుకోక పోవడమే అంటే ఎవరేనా నమ్ముతారా? ఇవన్నీ అల్పమైన విషయాలే. ఇంతకంటే పెద్దవికూడా వున్నాయి. మూఢ నమ్మకంతో మగ్గిపోయిన వాతావరణం, మనస్సుని విభజన చేస్తుంది. ఆచారం దాస్యాన్నీ, వ్యక్తిత్వం స్వాతంత్ర్యాన్నీ పురి గొల్పుతాయి. అత్తమామ, బంధువులు, యిరుగు పొరుగు, దేవుడూ దయ్యం.—యివి ఆచారాన్ని సూచిస్తాయి. ఇంగ్లీషు చదువున్న భర్తసంపర్కం, పట్నాలలో నాగరికత, యివి వ్యక్తి త్వాన్ని సూచిస్తాయి. ఈ రెండింటికీ రాత్రి, పగలూ, యుద్ధం జరుగు తుంటుంది.

వ్యక్తిత్వం వోడిపోతే, వ్యాధి సంక్రమిస్తుంది. మనదేశంలో నూటికి తొంభైమంది స్త్రీలకి, ప్రకృతితో సంబధం వుంది. చెట్లు, నేల, ఆకాశం, చెఱువులు, అనాదినుంచీ వొస్తున్న సాంప్రదాయం, వీటితో చెలిమి చేసిన

వారిలో నూటికి పదిమందికి, భర్తలతో బస్తీలకి ఎగడగానే, ఆ సంబంధం పోయింది. చెట్లు, చంద్రుడు, ఆకాశం, చెరువులు, సాంప్రదాయం,— వీటికి బదులు, తారు, పొగ, నీళ్ళురానికుళాయి రోడ్డు,— వీటితో చెలిమి చేసుకోవడం చేతకాక, మగలు పోగొట్టుకుంటారు. అట్లాగే, సెక్సుజీవితంలో విభజనలుండాయి. భర్తని దైవంగా పూజించటం నేర్చుకున్న స్త్రీ, భర్త తనని వేశ్యగా వుండమని వేధించుటకు తింటే, ఏంచేస్తుంది? సంపూర్ణ జీవితం, స్వేచ్ఛా ప్రకటన భర్తకోరతాడు- రాత్రి. పగలుమళ్లీసాంప్రదాయం, దాపరికం, గుట్టు, నటన; ఈరెంటికీ పొసగదు. మానసిక వ్యాధి రాక తప్పదు. ఈ దేశంలో నూటికి తొంభైస్త్రీల జబ్బులు, మానసిక జబ్బులే.—"

"బాగా సేవుంది. ఐతేవీనికి మందేమిటో?"

"రాత్రికి, పగటికీ మధ్యవుండే లోయని మరుగుపరచడం."

"అంటే?"

"ఈ వ్యాధి కేవలం డాక్టర్లవల్ల నయంకాదు."

"ప్రతి డాక్టరూ, మానసిక శాస్త్రంలో ప్రావీణ్యం పొందినా ఎక్కువ వుపయోగపడరు. సంఘం తనకేది కావాలో నిర్ణయించుకోవాలి. సాంప్రదాయం నేర్పిన అసంపూర్ణజీవనమా? వ్యక్తిత్వం, ఆధునిక విజ్ఞానం ప్రబోధించిన స్వేచ్ఛా జీవనమా? అల్పమైన ఆదర్శాలను ఆచరణలో పెట్టుకోడమా? అనాచరణీయమైన వున్నత ఆదర్శాలకి నోటితో కృతజ్ఞత వెలిబుచ్చుతూ రహస్యంగా చెడిపోడమా? ఎవరికివారే నిర్ణయించుకోవాలి. ప్రస్తుతం మనదేశం, పగలుమంచిగావుండి రాత్రిచెడిపోతోంది. పగలుకూడా చెడిపోవడం 'నవీనత్వం' అనిపించుకుంటోంది. రాత్రికూడా బాగుండటం పూర్వాచార పరాయణత్వం అవుతోంది. అనుభవంలో బుజువైనప్పుడు చెడ్డతనాన్నే మంచితనంగా సమర్థించుకుని, అందరికీ అందుబాటులో వుండే ఆదర్శాలని ప్రచారంచేసి, పగలూ, రాత్రీ వొకేలా ప్రవర్తించడం మంచిదని నా అభిప్రాయం.—"

"మంచి ఆదర్శం అంటే ఏమిటండీ?"

"ఒక రకం ప్రవర్తన, నీతా కర్తతా అని అడగకూడదు. అది అను చరణీయమా, పరిపూర్ణ జీవనానికి తోడ్పడుతుందా, మొత్తంమీద నాలా మందికి సంతోషాన్ని, ఆరోగ్యాన్ని, యిస్తుందా, అని ప్రశ్నించాలి." అన్నాడు నిధి.

"ఈ ప్రశ్నలకి అవునన్న సమాధానం వొస్తే, దాన్నే నీతి అంటు న్నారు. అంచేత మీరు చెప్పినవాటికి, అందరూ అనుకునే 'నీతి'కి భేదం ఏముందండీ?" అని అడిగాడు కృష్ణమూర్తి.

"భేదం చాలావుంది. నేను మన సంఘం ఆమోదిస్తున్న నీతని ప్రతి పాదించినవారు. విచిత్రమైన, గతించిపోయిన వాతావరణంలో వున్నారు. ఈ నీతి, మత సిద్ధాంతాలపైనా, సంఘంతో నిమిత్తంవొకులున్న కొద్ది మంది ఋషుల వేదాంత మతమైనా ఆధారపడివుంది. ఇది తప్పు అనే సాహసం నాకులేదు. ఇది మనకు సరిపడదనీ అనగలను. దానికి కారణం యీ నీతి, మనం ఆచరణలో పెట్టలేకపోవడమే. పైగా యీ నీతి మనకి మోక్షం యివ్వడానికి వుద్దేశింపబడింది కాని, యీ లోకంలో సంతోషాన్ని యివ్వడానికి వుద్దేశింపబడిందికాదు. మోక్షం యిస్తుందో లేదో, ఎవ్వరూ చెప్పలేరు. ఎందుకంటే ఋజువు చేసినవారులేరు."

"ఐతే యిష్టంవచ్చినట్లు తిరిగి సంతోషంగా వుండటం మీ నీతి అన్నమాట" అన్నాడు కృష్ణమూర్తి.

"నా అభిప్రాయాలని చులకన చెయ్యడం చాలా సులభం. కాని వాటని ఆచరణలో పెట్టడానికి ఎంతో ధైర్యమూ, శక్తి సామర్థ్యాలూ వుండాలి. ఎంతో విజ్ఞానం, సంస్కారం కావాలి. ఇవన్నీ పొందే అవకాశాలు, లేక, మనసంఘంలో మనుషులు బద్ధించి వున్నవాటితోనే తృప్తిపడి, మోక్షం పేరుచెప్పుకుని, యీ ప్రపంచాన్ని, జీవితాన్ని, వొక జాడ్యంగా వొక పీడకలలాగా భావించి, ఎల్లాగో రోజులు గడుపుతున్నారు. అందు

చేతే మన సంఘం అభివృద్ధి చెందటం లేదు. మనం ఆధ్యాత్మిక విలువల పేరూ, వేదాంతం పేరూ, దైవం పేరూ, మతం పేరు చెప్పాగుంటూ, మను షులమాట మరిచి పోతున్నాం—".

"నిధిగారూ మళ్ళా వేదాంతంలోకి కొట్టుకు పోతున్నారు" అన్నాడు కృష్ణమూర్తి.

"వేదాంతం అంటే, మన వుద్దేశం, ఎవరో జీవితంలో నిమిత్తంలేని పండితుల పుస్తకం అని. నిజానికి వేదాంతం అనేది, 'మనం నిత్యం జీవితంలో బ్రతకడం ఎల్లా' అన్న ప్రశ్నకి అందరికీ అన్వయించే సమాధానమే. నా యిల్లు నే చక్కబెట్టుకోడం స్వార్థం. అందరిళ్ళూ నా యింటిలాగే చక్క బెడతాను, అనడం రాజకీయ వేత్తలపని. అదే వేదాంతం కూడాను......" అన్నాడు నిధి.

కృష్ణమూర్తి, థాంక్స్, అంటూ లేచివెళ్ళి, పేకాట బల్లదగ్గర చేరి పోకర్ ఆటలో మునిగి పొయ్యాడు.

నాలుగు మాసాలు గడిచినై. దయానిధి రెండెకరాల భూమి అమ్మే శాడు. ఇంటి ఖర్చు తగ్గించాడు. తోటమాలి పని మానుకున్నాడు. ఊళ్ళోకి సైకిల్ మీదే వెడుతున్నాడు. నెలకి వొందకూడా రావటంలేదు. డబ్బిచ్చుకోలేని రోగులని డిస్పెన్సరీలో పెట్టుకుని వుచితంగా మందులిస్తు న్నాడు. డబ్బంతా ఖర్చయిపోతోంది. చాలడంలేదు. మెడికల్ జర్నల్ తెప్పించడం మానుకున్నాడు. ఇప్పుడు తనేదైనా వ్యాసం రాస్తేనే పోకాలు వొస్తుంది. నాలుగు నెలలు తండ్రి డబ్బు పంపించేవాడు. సైనూరులో పక్ష వాతం వొచ్చి, అకస్మాత్తుగా తండ్రి మరణించాడు. ఆ మిగిలిన ఎకరం అమ్మేసేసి, అన్నగారూ తనూ కలిసి, అంత్యక్రియలు జరిపారు. నారయ్య మళ్ళా నిధిదగ్గర చేరాడు.

నవంబర్లో కలెక్టరుగారి అధ్యక్షాన క్లబ్బు వార్షికోత్సవం జరిపారు. ఆసందర్భంలో షేక్స్పియర్ రచించిన 'హామ్లెట్' నాటకాన్నుంచి

కొన్ని దృశ్యాలు ప్రదర్శించారు. హామ్‌లెట్ పినతండ్రి భూమిక కృష్ణమూర్తి, హామ్‌లెట్ భూమిక నిధి ధరించారు. క్లబ్బు జనానికి ఆ నాటకం ఆడటం యిష్టంలేదన్నారు, విషాదాంత నాటకం ఆడవల్సిన సందర్భం కాదది, కన్యాశుల్కంలో కొన్ని దృశ్యాలు, సారంగధర ఆడదామన్నారు. నిధి, హామ్‌లెట్‌కి తనే పెట్టుబడి పెడతానన్నాడు. ఆఖరికి, కన్యాశుల్కంలోంచి కొన్నీ, హామ్‌లెట్ లోంచి కొన్నీ దృశ్యాలు, ప్రదర్శించారు. హామ్‌లెట్ రక్తి కట్టలేదు. ఏవో కరిద్దరు కాలేజీ విద్యార్థులకో తప్ప, అందులో కవిత్వం ఎవళ్ళకీ అర్థంకాలేదు. హత్య చేయబడిన హామ్‌లెట్ తండ్రి దయ్యంగా వొచ్చి కొడుకుతో మొరపెట్టుగున్న దృశ్యం బాగుంది. కాని, ఒఫీలియాతో హామ్‌లెట్ సంభాషించే ఘట్టంలో, నిధి 'నావకాష్టు' చేశాడన్నారు.

హామ్‌లెట్ ఆ ఘట్టాలలో, 'వున్మాదం' నటించాడనీ, నిజంగా చైతన్యం వున్నవాడేనని, ఆ భూమిక ధరించే పాశ్చాత్య నటుల నమ్మకం. ఈ నాటకం కోసం, నిధ హామ్‌లెట్ గురించిన విమర్శలెన్నో చదవడం జరిగింది. ఒఫీలియాతో ప్రేమసంభాష పలికినప్పుడు, హామ్‌లెట్‌కి నిజంగా మతిపోయిందనీ, ఆ 'వున్మాదం' నటనకాదనీ, నిధి వాదం. క్లబ్బు జనానికి యీ వాదంతో నిమిత్తం లేకపోయింది. దయానిధి, హామ్‌లెట్ భూమిక ధరించడం, సబబుగానేవుందని, "యిప్పుడు మాకర్థమౌతోంది" అనీ గుసగుసలు ప్రారంభించారు.

1937 ఏప్రిల్ మాసంవొచ్చింది. దయానిధి ఎంతో కష్టంమీద డిస్పెన్సరీకి అద్దె యివ్వగలుగుతున్నాడు. మంచు పుచ్చుగుంటున్న కొద్దిమంది పేషంట్లలో సగంమ్మంది అతనికేమీ ఫీజివ్వరు. వాళ్ళదగ్గరెట్లా, వొసూలు చెయ్యాలో అతనికి తెలీదు. ఇంట్లో ఏదో శుభకార్యం చెయ్యాలి. అతనేం చెయ్యగలడు? అతనికి పిల్లలు లేరు, దగ్గర భార్యలేదు. గృహప్రవేశానికి యిల్లుకట్టే తాహతులేదు. తన పుట్టినరోజు చేసుగుంటే! జనం నవ్వుతారని భయం. ఆరోగులలో మిగతా సగం, ఫీజు యిచ్చేరకమేకాని, ఏంలాభం,

యిచ్చుకోలేరు. కుర్చీలు, బీరువాలు, మంచాలు వేలం వేద్దామని తోచింది. లేకపోతే అప్పుచెయ్యాలి. షేపుంట్ల దగ్గర బాకులపడటం అతనికిష్టంలేదు. కృష్ణమూర్తి జ్ఞాపకం వొచ్చాడు. ఈమధ్య వూళ్ళోలేడు. ఏబొంబాయో, పూనాయో వెళ్ళి నాలుగురోజుల క్రితం వొచ్చాడుట. కృష్ణమూర్తి డబ్బు గలవాడు. అతనికి పరిచితుడే, వాళ్ళింటికి వెడదామనుకుంటున్నాడు. ఉదయం తొమ్మిదైంది. పోనీ సాయంత్రం అడిగితే. ఇప్పుడు నిధి క్లబ్బులో మెంబర్ కాడు. ఎల్లా అడగాలో, ఎల్లా మాట్లాడాలో, రిహార్సు చేసుకుంటుండగా, కృష్ణమూర్తే చక్కా వొచ్చాడు. ఇద్దరూ ముందుగదిలో వో అరగంట కూర్చున్నారు. తరవాత కృష్ణమూర్తి వెళ్ళిపొయ్యాడు. కృష్ణమూర్తి అతని పేషంటు. కృష్ణమూర్తి రక్తం సీసాలో తీసుకుని, గిండీ పంపించాడు నిధి. పదిరోజుల్లో రిపోర్టు వొచ్చింది. 'ప్లస్' గుర్తువేసి వుంది. ఆగుర్తు బదులు, మైనస్‌గుర్తు వొచ్చేవరకూ, వారానికో ఇన్‌జెక్షన్ చొప్పున, కనీసం ఆరు మాసాలేనా ఇన్‌జెక్షన్లు పుచ్చుగుంటే కాని, పూర్తిగా జబ్బు నివారణౌతుం దనుకో కూడదని చెప్పాడు. అంతవరకూ అతను పెండ్లిమాట తలపెట్టకూడ దన్నాడు. కృష్ణమూర్తి సరేనని, వారం వారం వొస్తూ ఇన్‌జెక్షన్లు పుచ్చు గుంటున్నాడు.

కృష్ణమూర్తి వైఖరిలో మార్పురానందుకు నిధి ఆశ్చర్యపడ్డాడు. అప్పు డప్పుడు రోజ్‌ని కృష్ణమూర్తి వేళాకోళం చేస్తుండటం అతను సహించలేడు. స్వతహా మనిషి ధోరణే అంత. అనుభవంవల్ల మానవుడు జ్ఞానం పొందితే, ఏలూరులో రోడ్లన్నీ, వేమవలగా అవును. అతనికి మానవ ప్రకృతి అర్థం కావడం లేదు. యదార్థం తెలుసుకోలేకపోతాడు. తెలుసుగుంటే, తట్టుకోలేం. అందుచేత మతం, దేవుడూ, దయ్యం పురాణం, వేదాంతంతో మన్నిమనం మోసగించుకోడం అవసరం. అతనికి నవ్వొచ్చింది. కృష్ణమూర్తి మంచివాడు. తన్ను తాను మోసగించుకోవచ్చు. కాని, యితరులని మాత్రం మోసగించడు. అతన్ని గురించిన యదార్థం మరుగుపరిచే యత్నం చెయ్యడు. కృష్ణమూర్తిలో

'పాపం' చేసిన చైతన్యంలేదు. కాని నిజంగా అతను పాపం చేశాడా? కొందరు దొరికిపోతారు; కొందరు దొరకరు; అంతే తేడా. దొరికిపోకుండా వుండడమే సంఘం అవలంబిస్తున్న నైతికదృష్టి; కృష్ణమూర్తిలో పశ్చాత్తాపం లేదు. ఎందుకుండాలి? టైఫాయిడ్ జ్వరాన్నుంచి తేరుకున్న రోగి పశ్చాత్తాపపడుతున్నాడా? అన్ని జబ్బులూ చెడుగే. చెడుగుని రూపుమాపటం డాక్టర్ల విధి. ఇది మంచి జబ్బు, యిది చెడ్డజబ్బు, అని విలువలు కట్టడం అజ్ఞానం. సంఘం యిట్లాంటి విలువలు కట్టడంవల్లే, ధైర్యం లేనివాళ్లు ఆత్మహత్యకి లోబడుతున్నారు. అది చెడుగు. కృష్ణమూర్తిని చూసి జాలిపడి, 'ప్రేమించడం' మొదలెట్టాడు. కృష్ణమూర్తి ఆనందాన్నీ, హాస్యదృష్టినీ, వుత్సాహాన్నీ, యీ జబ్బులేమీ చెయ్యలేకపోయాయి. మానవుడి ఆత్మబలం అట్లాంటిది. భారాన్ని మొయ్యగల భుజబలం వున్నవారి భుజాలపైనే భారం పడటం, సంతోషించవల్సిన విషయం.

రెండు నెలలు గడిచాయి. ఆనాడు ఆదివారం. కృష్ణమూర్తి ఇన్ జెక్షన్‌కి రాలేదు. సోమవారం చూశాడు; రాలేదు. ఇట్లా మధ్య మధ్య మానిచెయ్యడం ప్రమాదమని ఎన్నిసార్లు చెప్పాడు. ఎందుకు రాకడంలేదో? వాకబు చేశాడు. కృష్ణమూర్తి వూళ్లో లేడు ఏవూరెళ్లాడు?

పోస్టు బంట్రోతు వుత్తరాలిచ్చాడు. ఒకే పెళ్లికాలానికి రెండు శుభలేఖ లొచ్చాయి. ఒకటి కృష్ణమూర్తి, తన పెండ్లికి రమ్మని పంపిన ఆహ్వానము. పెండ్లికూతురు, గోవిందరావుగారి కుమార్తె, సుశీల. రెండోది, గోవిందరావు మామయ్య పంపిన శుభలేఖ. పెండ్లికొడుకు కృష్ణమూర్తి. వివాహంపదకొండు రోజులుంది. దయానిధికి ఆశ్చర్యం వేసింది. కొద్ది ఆవేశం వొచ్చింది. వెంటనే గోవిందరావు మామయ్యకి వుత్తరం వ్రాశాడు. పెండ్లికొడుకుకి సుఖవ్యాధులున్నాయనీ, ప్రస్తుతం తన ట్రీట్‌మెంటనీ, వ్యాధి తీవ్రత తగ్గలేదనీ, తగ్గటందుకు, ఆరుమాసాలైనా పడుతుందనీ, అట్లాంటివానికి సుశీలనిచ్చి వివాహం చెయ్యడం గొప్ప అపచారమనీ, కాబట్టి, ఏదోవిధంగా

యీ పెండ్లి ఆపెయ్య వలసిందనీ,—ఆ వుత్తరంలో సారాంశం. మళ్ళీ ఏదో జ్ఞాపకం వొచ్చి, చివర మరో రెండువాక్యాలు చేర్చాడు. "సుశీల వివాహం నిశ్చయం కావడం, వివాహం జరగకపోవడం యిది మొదటిసారి కాదని అందరూ ఎరుగున్నదే. సుశీల నాకు చుట్టం; అంచేత సుశీల బాధ్యత నాకూ కొంతవరకు వుంది. డాక్టరుగా సంఘం పట్లకూడా నాకు బాధ్యత వుంది. ఈవివాహం వల్ల ముందు వారికి పుట్టబొయ్యే సంతానంపై మీరు శాస్త్ర కనికరించి, తగినచెర్య తీసుకుంటారని నమ్ముతున్నాను."

కృష్ణమూర్తికికూడా వ్రాయాలనుకున్నాడు; కాని దానివల్ల ప్రయోజనం లేదని, విరమించాడు. సుశీలకి వో వుత్తరం వ్రాశి పంపేశాడు.

రెండు రోజుల్లో గోవిందరావుగారి దగ్గరనుంచి జవాబొచ్చింది. కృష్ణమూర్తి చదువుకున్న వాడనీ, ప్రయోజకుడనీ, సుశీల అన్నివిధాలా ఇష్టపడిందనీ, యవ్వనంలో వొడుదుడుకులు వాటంతట అవే సర్దుకుంటాయనీ, డాక్టర్‌గా నిధిలో అంత నమ్మకంలేదనీ, తన యిల్లు ముందు తాను చక్కబెట్టుకోవడం వుత్తమంబని ఆ వుత్తరంలోసారాంశం. చివరమరో రెండు వాక్యాలున్నాయి."మీ కుటుంబం చరిత్ర, నీ పెండ్లికిఎట్లాంటిఅంతరాయం కలిగించిందో, ఆరోజుల్లో నువ్వు ఎంత నొచ్చుగున్నావో స్మరించుకో. నువ్వు అన్నీ చూసుగుని వివాహం చేసుగుని, భార్యద్వారా అనుభవిస్తున్న దేమిటి? బావుకుంటున్న దేమిటి? నీకింకా లోకజ్ఞానం లేదు. ఇట్లాంటి వ్రాతలు, యిట్లాంటి ప్రచారం ముందెప్పుడూ, ఎవరిదగ్గరా చెయ్యకు."

దయానిధి, దీనికి మళ్ళీ జవాబు వ్రాశాడు: అందులో కొన్ని వాక్యాలు: "నేను అన్ని బాధలూ పడివున్నాను గనకనే; యితరుల సౌఖ్యం కోసం యింత ప్రాకులాడటం. నాకు లోకజ్ఞానం లేక పోవొచ్చు. కాని లోకజ్ఞానం కల మీబోటి పెద్దలుకూడా, యిట్లాంటి దుస్థితిని ఆమోదించడం నాకెంతో దిగులుగావుంది. తండ్రి, కూతురుకి పెండ్లిచేసి, అత్తవారింటికి పంపటంతో మీపూచీ వొదిలిపోతుంది. తరవాత వారి జీవితాలు ఏమైతే

మీకెందుకు? ఈస్వార్థ పరత్వం లోకజ్ఞానమైతే, నాకిట్లాంటి జ్ఞానం లేక పోయినందుకు విచారంలేదు. ఈ పెండ్లి మాన్పించే యత్నం విరమిస్తానని మాత్రం అనుకోవద్దు. కృష్ణమూర్తికే వ్రాస్తున్నాను."

అన్నాడు కాని, ఎందుకో కృష్ణమూర్తికి వ్రాసే ధైర్యం అతనికి లేకపోయింది. కాకినాడ డిస్ట్రిక్టు మెడికల్ ఆఫీసర్‌కినో వుత్తరం వ్రాశాడు. యీ విషయాలన్నీ తెలియపరుస్తూ. దీనికి మెడికల్ ఆఫీసర్ యీవిధంగా సమాధానం వ్రాశాడు.

"మీరు చెప్పిన విషయాలతో నేను ఏకీభవిస్తున్నాను. ఈ వివాహం జరగడం—అందులో మీరు కార్యంకూడా యిప్పుడే జరుపుతారంటు న్నారు—చాలా విచారకరమైన విషయం. ఐనా నేను చెయ్యగలిగింది ఏమీ లేదు. డిస్ట్రిక్టు ఆఫీసర్ దగ్గరనుంచి, హెల్త్ సర్టిఫికేట్ వుంటేనే కాని, వివాహం చట్టబద్ధంకాకూడదని యేదేనా శాసనం వుంటేతప్ప, మనం యిందులో ప్రోక్యం కలగచేసుకోడం హాస్యాస్పదం. ఒకవేళ అట్లాంటి శాస నాన్ని ప్రభుత్వం ముందుముందు అమలు జరిపినప్పటికీ, వుభయపక్షాల వారూ, మెడికల్ ఆఫీసర్‌కి లంచంపోసి, దొంగసర్టిఫికేట్ పొందే అవకా శం వుండనే వుంటుంది. ఈ పరిస్థితులలో కార్యం యిప్పుడే జరపకుండా, మీరే వారితో మాట్లాడి, ఏకో చెయ్యడం మంచిది. నేనేమీ చెయ్యలేను."

దయానిధి గోవిందరావుగారికి, కనీసం కార్యంమాత్రం యిప్పుడు జరపకుండా చూడవల్సిందని మరోవుత్తరం వ్రాశాడు. దానికి ఆయన జవాబు వ్రాశాడు: వివాహంతప్ప, కార్యంజరిపే ఏర్పాటు యిప్పుడు కాని అసలెప్పుడుకాని లేదనీ, కొన్ని కారణాలవల్ల యీ వివాహం యిప్పుడు జరిపి తీరాల్సిందేనని వ్రాశాడు. ఆ కారణంఏమిటో కనుక్కుందామని సంకల్పించాడు నిధి. నారయ్యని కాకినాడ పంపించాడు. నారయ్య రెండు రోజులుండి. తిరిగివొచ్చాడు. అతనికేమీ ఆచూకీ దొరకలేదు. ఇంక వివాహం రెండు రోజులుంది.

అమృతం శాస్త్రి, తనూ అమృతం సుశీలపెళ్లికి వెడుతున్నామనీ, తనూ వొస్తాడని ఆశిస్తున్నామనీ నిధికి వుత్తరం వ్రాశాడు. వివాహం యింక రెండు రోజుల్లోవుంది. పోనీ తనూవెళ్లి, కృష్ణమూర్తితో మాట్లాడితే. ఏమని మాట్లాడటం? తను మామగారితో ఏం మాట్లాడగలిగాడు? నీయిల్లు నువ్వు చక్కబెట్టుకోమన్న గోవిందరావు మామయ్య మాటలు సూదుల్లా గుచ్చుకున్నాయి. ఆ రోజు గడిచిపోయింది. ఆ మొన్నాడు వుదయం, పెండ్లికి వెడదామని సంకల్పించాడు. హోల్డాల్ తీసుకుని స్టేషన్ కొచ్చాడు. బండి ప్లాట్ ఫారమ్మీద సిద్ధంగావుంది. పదినిముషాల టైముంది. కాళ్లు దడదడలాడుతున్నాయి; వొళ్లంతా చల్లబడింది. జ్వరంతగిలింది. బల్లమీద కూర్చుండి పోయ్యాడు. నుదురు వేడెక్కిపోయింది. శ్వాస బరువుగా వొస్తోంది. గార్డు విజిల్, రైలుకూత, రైలు కదలడం జరిగింది. ఒచ్చిన జట్కా బండిలోనే యెక్కి యింటికి వెళ్ళిపోయాడు.

రెండు నెలలు గడిచినై. క్లబ్బులో కృష్ణమూర్తి టెన్నిస్ ఆడుతున్నాడు. హల్లో డాక్టర్,—మీ వాళ్లంతా వెడ్డింగ్ కి మీరొస్తారని చాలా అనుకున్నారు. నేను కూడా డిజ్ అప్పాయింట్ అయ్యాను. బహుశా పేషంట్లతో మీరు తీరుబడిలేక పోయిందేమో" అన్నాడు కృష్ణమూర్తి.

"లేదు లేదు—నాకొంచం వొంట్లో సుస్తీ చేసింది."

"డాక్టర్ ఈజ్ వోన్ పేషంటు—" నిధి నవ్వాడు; కృష్ణమూర్తిలో ఏవిధమైన మార్పులేదు.

జబ్బు విషయం అడుగుదామనిపించింది; కార్యం మాట అడగాలనిపించింది. అనవలసిన వాక్యాలను ఆలోచించుకుంటుండగానే, కృష్ణమూర్తి మళ్ళా అంటున్నాడు.

"ఐనా మీరు వొచ్చినా, మీరు ఎన్ జాయ్ చెయ్యలేరేమో లెండి—మీ పెండ్లి విషయం, అవన్నీ జ్ఞాపకం రావచ్చు." అన్నాడు. నిధి ఆలోచన పరిపరి విధాల పోయింది. అల్లా అనడంలో కృష్ణమూర్తి వుద్దేశం

ఏమిటో కంఠం సవరించుకుని నిధి మాట్లాడబోయ్యాడు.

"ఐతే చూడండి, మీరు,—మీరు—" "ఫరవాలేదు లేవయ్యా, యిప్పుడు జబ్బుతో ఇంకేమీలేదు. మీదగ్గర వున్నప్పుడే యిద్దరుగాని" అన్నాడు. కృష్ణమూర్తి—కాసేపాగి—"పైగా నేను మీకు ఫీజు యివ్వాలిగా. ఇప్పుడు మనం బంధువులం కూడాను. ముందుముందు మీరే నా ఫేమిలీ ఫిజిషన్" అంటూ కృష్ణమూర్తి పేకాట బృందంలో కలిసి పోయ్యాడు. హోప్లెస్ స్కౌండ్రెల్ అనుకున్నాడు నిధి. నిదానించి చూస్తే కృష్ణమూర్తి చేసిన తప్పేమిటి? అతని జబ్బు నిర్మూలించి వుండగూడదూ? వివాహం చేసుకున్నాడు; కార్యంలో తగిన జాగ్రత్త తీసుకున్నాడేమో! చదువుకున్నవాడు, ఆమాత్రం ఆలోచించుకోడు? కాని యీప్రశ్నలకు సమాధానం ఎవరు చెబుతారు? అమృతం చెప్పగలదు. అమృతానికి వుత్తరం రాయాలనిపించింది. వ్రాశాడు. అమృతం భర్తని సంబోధిస్తూ "నేనుఆనాడు జబ్బుచేసి, సుశీల వివాహానికి రాలేకపోయ్యాను. మీరూ అమృతం, కులాసాగా గడిపారని తలుస్తా. మీరెవరేనా, పెండ్లివిశేషాలు వ్రాస్తారేమో అనుకున్నాను. జగన్నాధం ఆపెండ్లికి ఎందుకు రాలేదో వ్రాశారు కారు. అతను వెళ్ళివుంటే, అన్ని సంగతులూ వ్రాయును. ఇప్పుడేనా, మీరు పెళ్లి వివరాలన్నీ రాస్తే సంతోషిస్తాను." అని వ్రాశాడు. ఈ వుత్తరం అతనికి తృప్తి నివ్వలేదు. లేఖలో జీవంలేదు, చచ్చిపోయిన కలంతో వ్రాశిన వుత్తరం లాగు. దాన్ని చించివేసి, యీసారి అమృతాన్ని సంబోధిస్తూ మరో వుత్తరం వ్రాశాడు.

"—నువ్వూ, నీభర్తా, కులాసాగా వుంటున్నారని తలుస్తా. నన్ను జ్ఞాపకం వుంచుకుని, వివాహానికి అహ్వానిస్తూ వ్రాశిన వుత్తరానికి చాలా కృతజ్ఞుణ్ని. సుశీలపెండ్లి ముచ్చటలు నీనోటంట వినాలనివుంది. రహస్యాన్ని తిన్నగా శోధించి, సత్యాన్ని విప్పిచెప్పే శక్తి నీకేవుంది..." ఈవుత్తరం అతను పూర్తి చెయ్యలేక పొయ్యాడు. నాలుగైదుసార్లు చదువుకున్నాడు.

వుద్రేకానికి సరిపడ్డ పరిస్థితులు బాహ్య ప్రపంచంలో లేవు. పడేబాధకీ, చూస్తూన్న వాతావరణానికీ మధ్యవున్న లోయనైవొంతైన వెయ్యేక పోయాడు. హేమ్‌లెట్ తన వుద్రేకంతో బాధపడినట్లు, షేక్స్‌పియర్ హేమ్‌లెట్ నాటకంతో బాధపడ్డాడు.

సారస్వతంలో ప్రదర్శించడానికి వీలుకాని కథావొస్తువుని షేక్స్‌పియర్ యీ నాటకంలో తీసుకున్నాడు. షేక్స్‌పియర్ ఆబాధని హేమ్‌లెట్ ద్వారా ప్రదర్శించలేక పొయ్యాడు. అంచేత యీ నాటకం తగులడింది."

ఈ సమస్యని పరిష్కరించే వుద్దేశ్యంతో నేనూ యీ వ్యాసంలో కొన్ని సూచనలు చేస్తున్నాను. ముందు, హేమ్‌లెట్ సమస్య ఏమిటో కొంచం పరిశీలిద్దాం.

హేమ్‌లెట్ తండ్రి, మరణానంతరం, హేమ్‌లెట్ తల్లి గెర్ట్రూడ్, భర్తసోదరుణ్ణి, . వివాహమాడుతుంది. రాజ్యాపరిపాలన కూడా వారిదే. ఆస్థానంలో మంత్రికొమార్తె ఒఫీలియాని హేమ్‌లెట్ ప్రేమిస్తాడు. ఇట్లా వుండగా వో నాడు హేమ్‌లెట్ తండ్రి, దయ్యంగా కుమారుడికి దర్శనం యిచ్చి, తను, తన సోదరునిచే హత్య గావింపబడినాననీ, తల్లికూడ యిందులో బాధ్యురాలనీ, వారిమీద పగసాధింపవలెననీ, కుమారుణ్ణిశాసించి, అంతర్ధానమౌతాడు! ఆనాటినుండి హేమ్‌లెట్ మనస్సు మారిపోతుంది. తల్లి వ్యభిచరించిన విషయం తెలియగానే, 'స్త్రీ' మీద అతనికున్న గౌరవం పోతుంది. ఒఫీలియాకూడా, యిట్లాంటి కులటేమోనని భ్రమిస్తాడు. ఆమె అతన్ని పరిశీలించడానికి, అతని గుట్టు బైటకి లాగడానికి తండ్రిచే నియమింప బడిన గూఢచారిణిగా పరిగణించి, ఆమెని తూలనాడి సంపర్కం మాను కుంటాడు. రాత్రి పగలు, బాబయ్యనీ, తల్లినీ, యేవిధంగా సంహారిస్తే కసి తీరుతుందో, ఆలోచనసాగిస్తూ, పరాకుప్రసంగం చేస్తూ, పిచ్చివాడిలా ప్రవర్తిస్తాడు. గూఢచారుడుగా వుంటున్న మంత్రిని హత్యచేస్తాడు. రాజుకీ, భార్యకీ, అతనిది ప్రమాదకరమైన 'పిచ్చి' అని భయపడి, దాని నిజానిజాలు

తెలుసుకోడానికి యత్నిస్తారు. హామ్లెట్ రాజ్యంలో వుంటే వారికి ముప్పు వాటిల్లుతుందని, అతన్ని దూరదేశానికి పంపుతారు. అతనీపన్నాగం తెలుసుకుని, తిరిగివొచ్చి, రాజయోధులను హత్య చేస్తాడు. చివరికి, పగసాధిస్తాడు; ఒఫీలియా ఆత్మహత్య చేసుకుంటుంది. తనూ, తల్లీ, రాజూ, అందరూ మరణిస్తారు.

ఇందులోసమస్య యిది; హామ్లెట్, తన చర్యలకి యేవగించుకుని తన తల్లినీ. ఆమె భర్తని చంపడానికి నిశ్చయించుకుని కూడా, ఆపని ఎందుకు చెయ్యడు? స్వగతాలతో, అమాయకులని చంపుతూ ఎందుకు వృధా కాలయాపన చేస్తాడు? ఇవీ ప్రశ్న. దీనికి విమర్శకులు రకరకాల సమాధానాలిచ్చారు. వీటన్నింటినీ మూడురకాలుగా విభజించవొచ్చు.

1. షేక్స్పియర్, వొక పాత నాటకాన్ని ఆధారంగా చేసుకుని యీ నాటకం వ్రాశాడు; అందులో పగతీర్చుకోవడం తప్ప వేరేకధ పట్టు లేదు. కాబట్టి, ఆ 'పట్టు', 'బిగి', ఆపాదించటం కోసం, యీ స్వగతాలు, 'ఉన్మాదం' 'తంతు' యిరికించాడు,—అని.

2. హామ్లెట్ ఆదర్శజీవి. తన ఆదర్శాలని ప్రపంచానికి కూడా ఆపాదించాడు. తన తల్లిచేష్టలు, ఆ ఆదర్శాలని భగ్నం చేసినై. "వాళ్లు వుంటేనేం, చస్తేనేం?" అనుకుని నిస్పృహచెంది, కార్యదీక్షనుంచి విరమించి, వేదాంతి అయ్యాడు—అని.

మూడోది—నాటకకర్త హామ్లెట్ యిరుక్కున్న వ్యూహాన్ని చూసి జాలిపడి, సానుభూతి ప్రకటించడంవల్ల, యీ 'ఆలస్యం' జరిగింది— అని.

నేను, యిందులో మూడోదానితో ఏకీభవిస్తున్నాను. ఇది కొంతవరకూ ఎలియట్ చెప్పిన మాటకి దగ్గరగాకూడావుంది. హామ్లెట్, తల్లిని, అందరు పురుషులలాగే, 'మాతృదేవత'లా వూహించి, గౌరవించి, ప్రేమించాడు. కాని, ఆమె భర్త చనిపోగానే మళ్ళా వివాహం చేసుకుంటుంది. ఈ కృత్యంతో హామ్లెట్ తల్లిని పూజించలేకపొయ్యాడు. తరవాత,

భర్త జీవించి వుండగానే, భర్తసోదరుడితో వ్యభిచరించిందన్న సంగతి తెలియగానే, ఆమెని 'గౌరవించడం' మానేశాడు. స్త్రీని 'చాంచల్యమా'! అని సంబోధించాడు. చంపడానికి నిశ్చయించుకున్నాడు. ఆమె బ్రతికివుంటే తనలాంటి కూతుళ్లని కంటుందని భయపడి, 'చంపస్తం!' 'మంచిపనే' అనుకున్నాడు. కాని ప్రేమించకుండా వుండలేకపోయ్యాడు. తల్లిలోనిచెడుగుకి అతీతం అయ్యే ప్రేమ అతనిది. "పోనీ సుఖపడనీ, అనుభవించనీ, యీ నాలుగు రోజులేగా, తరవాత ఎల్లాగా చంపుతానుగా,—పోనీ పాపం, ఆనందించనీ" అని హామ్లెట్ అనుకుని, 'ప్రేమకి' తన దాస్యం వొదులు కోలేక, కాలయాపన చేశాడు. ఆ ఔదార్యం; ఆ అతీతమైన ప్రేమ, హామ్లెట్ లోని వుత్తమలక్షణాలు—చివరికి, 'పాపాన్ని' 'చెడుగుని' చూసి, భరించి, సహించి. అనుభవించి, అతీతమయ్యే ప్రేమ అతనిది. పాపం లేదు, పుణ్యంలేదు, చెడుగులేదు, మంచిలేదు—ఇవి ఐహిక విలువలు, ఆధ్యాత్మిక విలువలుకావు. సంఘంయొక్క ప్రాపకం, ప్రాబల్యంమీద ఆధారపడే అశాశ్వతమైన విలువలు. కష్టసుఖాలు రెంటినీ సమంగా అనుభవించిన వ్యక్తికి తీర్పుచేసే అవసరం వుండదు; వుండనక్కరలేదు.

ఐతే యీ సూచనలు సమర్థించేటందుకు, నాటకంలో ఆధారాలు ఎక్కువగాలేవు. వీటి ఆధారాలు షేక్స్పియర్ జీవిత రహస్యంలో దాగి వున్నాయి. షేక్స్పియర్ తల్లిచర్య షేక్స్పియర్ని బాధించి వుండొచ్చు. తనకి జరిగిన అన్యాయాన్ని, పదిమందికీ ఎరుకపరిచి, వారిని అపవాదునుండి రక్షించడం, మహాపురుషుడి లక్షణం. వ్యక్తిగతమైన విలువలే, ప్రపంచానికి అన్వయించే సూత్రాలుగా మారుతాయి. షేక్స్పియర్, చెడ్డదైన తన తల్లిని ప్రేమించగలిగాడు. కాని యీ ప్రేమనీ, ఆమెలోని "చెడ్డ"తనాన్నీ సమన్వయం చెయ్యలేక పోయాడు. శిఖరం ఎక్కి కిందికిచూశాడు,— అఘాతం వుంది; తల తిప్పేశాడు. ఈ అఘాతంపైనుంచి అవతలి శిఖరంమీదికి దూకడం ఎల్లా? అదీ అతనిసమస్య. చివరికి - తెగించి దూకేశాడు; కాని

దూకేముందు, ఆవతల శిఖరంమీదికి చేరుకోలేనని అతనికి తెలుసు; ఐనా దూకడం అతని విధి; అతని ప్రకృతి. చెడుగుపై దాళ్ళు చెయ్యలేడు; దూకి అతీతుడు కావాలి; అఘాతంలో తనూ, తల్లీ తన పాత్రలూ అంతాపడి నశించిపోయారు.

చెడ్డవ్యక్తులే రక్తికట్టే పాత్రలన్నాడు, జాన్ బైలి. వాటిని నంగం పైకి వొదిలి, ప్రేక్షకులను ప్రేమించమన్నాడు. ఎందుకు? 'చెడ్డతనం' సాధనంగా చేసుకుని ఆ పాత్రలు 'ఆనందాన్ని' సాధించారు ఆనందాన్ని సాధించడం, శాంతిని పొందడం, అవసరంగాని, అది పొందేటందుకు సాధనా లేవైనా ప్రమాదంలేదు. "ఏవిధంగానైనా, సంతోషాన్ని సాధించిన మనుషులను షేక్స్పియర్ ప్రశంసిస్తాడు." అంటాడు సర్ వాల్టర్ రాలె. సంతోషం పొందేయత్నంలో వాడు మరణిస్తే, విషాదకరమైన పాత్రలై మన సానుభూతిని కోరతారు; గెలిస్తే, హాస్యాస్పదంగా మారతారు. వారు పొందదల్చుకున్న ఆనందం అల్పమైందికాదు. ప్రాణాన్ని బలిగా కోరుతుంది వారి ఆశయం. వారి మృత్యువు, ఇంజనీర్లు అశ్రద్ధగా కట్టిన వొంతెన పడిపోవటం లాంటిదికాదు; భూకంపంలో కూలిపోయిన వొంతెన లాంటిది. మొదటిదాన్ని విమర్శిస్తాం. రెండోదాన్ని చూసి జడుసుకుని ముగ్ధులవుతాం."

ఈ వ్యాసాన్ని ఎట్లా ముగించాలో తెలియక దయానిధి డ్రాయర్లో పెట్టేశాడు? వారంగడిచింది.

సాయంత్రం నాలుగైంది. దయానిధి క్లబ్బుకెళ్ళాడు. ఈమధ్య పత్రికలు సరిగ్గాచూడక, దేశంలో ఏం జరుగుతుందో అతనికి బాగా తెలీడం లేదు. వెళ్ళి పత్రికలు చూడడం మొదలెట్టాడు. కాని అతని మనస్సు స్థిరంగావుండక, పదేపదే, వ్యాసం మీదికి వెడుతోంది. దాన్ని మాడరన్ రివ్యూకో, త్రివేణికో పంపాలనుకున్నాడు. అతనికి సారస్వతంలో ప్రవేశం లేదు. విమర్శకుడిగా పైకిరావాలని కూడా అతని సంకల్పం కాదు. అది వ్రాయడంలో అతనిబాధ తీరిపోయింది. ఏకో బరువుతగ్గినటనిపించింది. అతని

విమర్శన చదువుకున్న సాహిత్యప్రియులు నవ్వుకారేమోకూడా అనిపించింది. సారస్వతంయొక్క వుద్దేశం జీవిత సమస్యకి సమాధానం యివ్వడమా? తలిదండ్రుల పాపాలు పిల్లలని వెంటాడినప్పుడు, ఏంచేస్తారు? 'ఏం చెయ్యాలి?' అన్నదానికి షేక్స్పియర్ సమాధానం యివ్వలేక పొయ్యాడు. వారిని క్షమించి, ప్రేమించమన్నాడా? నీతి లేదనడం లేదు. ప్రాచీనశక్తులు, ప్రకృతి, మానవత్వం—వీటికి నీతితో నిమిత్తంలేదు. ఈ గోళంపై మానవుడి బ్రతుకు క్షణికం; అశాశ్వతం. నీతిపేరట, కఠినశిక్ష, కన్నీరు, జుట్టుపీక్కోవడం ఎందుకో. మహాసముద్రం పొంగిపొరలి, నీతిని, ఆదినెలకొల్పిన సంస్థలని ముంచివేస్తుంది. ప్రకృతిజ్వాలలో మానవులకట్టడాలు తగులబడతాయి. కాలిపోగా మిగిలిన జీవంలేని ముక్కలనుంచి నిరసించిన నల్లపొగ ఆకాశం కమ్ముతుంది.

"ఎట్లా జీవించడం?" అన్నదానికి సారస్వతం సమాధానం యివ్వాలంటే అతని విమర్శకి విలువవుంది.

ఇతరులజోలి తనకెందుకు ? తన జీవితానికి తాను సమాధానపడ్డాడు. అతని సమస్య విశద పడింది. విశదపడిన వొస్తువు, యిక మరి బాధించదు. అందులో భయంపోయింది. ఏకాంతంలో అతను తెలుసుకున్న వెలుగు అతన్ని రక్షిస్తుంది. తనూ, తనలాటివాళ్ళు చేసిన పాపాలనూ భరించే భారం షేక్స్పియర్ మీద వెయ్యడం ఎంత తప్పు? నీనీడ, నీవ్యక్తిత్వం, నీచెడుగు, నీపాపాలు, నువ్వు జీవించి వుండగానే నశింపైపోవడం, ఎంత ఆశ్చర్యం, ఎంత ఆనందం?

పత్రికలో వార్త యీ ఆలోచనల్ని అరికట్టింది. రాయలసీమలో, కలరా, ప్లేగు చెలరేగి, అనేకమంది, మరణిస్తున్నారు. అక్కడ సహాయం చెయ్యడానికివొచ్చిన డాక్టర్ల సంఖ్య తక్కువ. ఎందరోడాక్టర్లువొచ్చి, తోడ్పడితేగాని, లాభంలేదు. ఆరోగ్యశాఖవారు చేస్తున్నపనికి, డాక్టర్లు కూడా సహాయపడాలని, నాయకులు విజ్ఞప్తి చేస్తున్నారు ప్రజలకిమందులు, బట్టలు,డబ్బు

కావాలి. అనంతపురం, కర్నూలు జిల్లాల్లో పరిస్థితులు తీవ్రంగావున్నాయి. నిధికి యిది చదవగానే, అక్కడికి వెళ్ళిపోవాలనిపించింది. వెళ్ళి అక్కడే ఏకాంతంగా వుండిపోవాలి. మరి తిరిగి రాకూడదు. ఈవూళ్ళు, యీ తాలూకాలు, ఎన్నో జ్ఞాపకం చేస్తాయి. ఇక్కడ మనుషులతో కుళ్ళు, కుట్ర, కుతంత్రం- వీళ్ళనుంచి పారిపోవాలి.

సోడాలకుర్రాడొచ్చి, 'వో కలర్' తీసుకోండన్నాడు.

"నాకు కాతాలేదుగా.—నేను మెంబర్ని కాను" అన్నాడు నిధి.

"కాకపోతే ఏం లెండి—ఫరవాలేదు తీసుకోండి" అన్నాడు కుర్రాడు. వాడి కళ్ళల్లో ఎంతో దయ, ఎంతో ఆదరణ. వాడి జీవితం ఎంత మంచిది. హాయిగా ఆటలన్నీ చూస్తాడు, సోడాలు తాగుతాడు; చీకూ చింతా లేదు. కాని అల్లా ఎంతకాలం వుంటాడు? యవ్వనం వొస్తుంది; ఏపిల్లనో పెళ్ళిచేస్తారు; వాడు ఏపిల్ల వెంబడో పడతాడు. తగాదాలు, దెబ్బలాట్లు; తాగుడు; పెండ్లాన్ని కొడతాడు; పెండ్లాం వాణ్ణి విడిచిపోతుంది; వాడూ నిధిలాగే ఐపోతాడు. పురుషుడి యవ్వన ప్రకోపాన్ని, ఆనందాన్ని హరింపజేసేందుకు ఏ స్త్రీయో సిద్ధంగావుంటుంది. వాడు మూలగడం; ఆమె కూచుని వినడం; ఆమె మూలగడం, వాడు వినడం; ఇంతేవాడి జీవితం?

పేకాట బృందం యితన్ని చూడలేదు. కబుర్లు సాగించారు. ఈసారి కృష్ణమూర్తిని గురించి.

"ఇవాళ రాలేదేం డాన్‌జవాన్?"

"పొళ్ళొ కొచ్చాడు."

"ఐతే భాయీ, అతని వైఫ్ ఆత్మహత్య చేసుకుందటగా" మూడు తలకాయలు ఆ కంఠం దగ్గరగా జరిగాయి.

"ఏం లేదు; ఇదివరకే ఆమెకి మగాడితో సంబంధం వుందిట; మూడో నెలని తెలుసుకున్నారుట—మన కృష్ణమూర్తికి తండ్రిగా వుండే భాగ్యం కలిగింది. మనవాడు నాటకం కనుక్కున్నాడు— ఏం జరిగిందో మనకి

తెలీదు. ఆత్మహత్య చేసుకుంది. నీళ్ళాడి చనిపోయిందని గప్‌చుప్ చేశారు."

"ఐతే ఆ శాస్త్రపుణ్యం కట్టుకున్న ధన్యుండెవండోకో!"

"బ్యూటీ స్పెషలిస్ట్—"

"మేం నమ్మం మాకు నిదర్శనం కావాలి-"

"వివాహం ఆపుచేయించమని, పత్రాలు రాసి బెదిరించాడు—"

దయానిధి యీ సంభాషణలలో కొంత వినగలిగాడు. సోడా కుర్రాడు

'కలర్' కొట్టి యిచ్చాడు.

"నేను డబ్బులివ్వలేను." అన్నాడు నిధి.

"ఫరవాలేదులెండి— తరవాత చూసుగోవచ్చు— ఇక్కడ తాగే

వాళ్ళంతా డబ్బులిస్తే, మా అయ్య స్టేషన్ కాడ హోటలెట్టును..." అంటూ

కుర్రాడు నవ్వుతున్నాడు.

"ఐతే-నీకు నామీద యింతదయ దేనికిరా?" కుర్రాడు మాట్లాడలేదు

"మీరు మంచోరండి—"

"నేనేం చేశాను?"

"మా పిన్నికి మందిచ్చి బ్రతికించారండి.— రాత్రికి భలే ఆటాడు

తున్నారండి—సినిమా— పంజాబ్ మెయిల్." నిధి జేబులోంచి అర్ధ

రూపాయ తీసిచ్చాడు—

"చల్, మెయిల్‌కి చల్.—మేరే హాలా బేహాలా" అని పాడు

కుంటూ కుర్రాడు లోపలికి వెళ్లాడు.

పేకాట బృందం మళ్లా సాగించింది.—

"అబ్బాయ్— నే నోటి చెబుతానువిను. ఇవన్నీ వంశపారంపర్యా

వొచ్చే లక్షణాలనుకో. నిధిగారి తల్లిపెద్ద గాథలే—"

"ఏమిటండోయ్—శాంబులు విసురుతున్నారు"

"ఇట్లాంటివి దాగుతాయా బాబూ—ఆవిడ కథానాయకురాలే—

సలంకకనే యీనకి సంబంధాలు కూడా రాలేదుట..."

"ఐతే భార్య ఏమైనట్లు?"

"ఇష్టంకి చెడిందిగా—"

"ఎందుకో—"

"సాత్త్విక పురుషుడు." గుసగుసలు.

"విపులీకరించండి."

"కృష్ణమూర్తి పెళ్ళాం ఎవరనీ?"

"కానీవయ్యా —"

"అసలు పెళ్ళికిపూర్వమే, లేచొచ్చిన దాని కూతుర్ని తగులుకున్నాడు.—తల్లిప్రోత్సాహం వుండేది.—"

"చిత్రం"

"తల్లి రహస్యాలు కొడుకు దాస్తాడుగామరి!"

"ఐ. సి."

నిధికి ఆ కుర్చీపైత్తి, వాళ్లమీద గిరవాటెయ్యాలనిపించింది. రెండుచేతులతో కుర్చీకాళ్ళని గట్టిగా పట్టుకున్నాడు. ఆ మాట్లాడుతున్నది గుమాస్తా సోమయ్య. వొందరూపాయల కాగితం పైకితీసి చూపించి మళ్ళా జేబులో పెట్టేశాడు. కోటువిప్పి కుర్చీకి తగిలించి, బైటకివెళ్లి వొచ్చి మళ్లా ఆట్లో పడ్డాడు. ఇంతలో టెన్నిస్ ఆటగాళ్లువొచ్చి బల్లల్ని వెనక్కిలాగమన్నారు. కుర్రాడు, బల్లల్ని వరండాలోకి యీడ్చాడు. మళ్ళా ఆటసాగించారు. సోమయ్య కోటు గోడని తగిల్చాడు. నిధికి రాయలసీమ వెళ్ళేటందుకు యిప్పుడు వొందరూపాయలు కావాలి. సోమయ్యకోట్లోంచి ఆ కాగితం తీసేస్తే సోమయ్యకి మంచి శాస్తి జరుగుతుంది. వరండాలోకి నడిచివెళ్ళాడు. కుర్రాడు చిమ్నీలు తుడిచి దీపాలు వెలిగిస్తున్నాడు. కోటు కీనీడలోవుంది. పర్సుంగాగయ్యడం అతిసులభం. సోమయ్య కోటు వెతుక్కుంటూ లేచాడు. పేకాటలో నోటు మార్చేఅవసరం వొచ్చింది. "నాకోటేదిరా."

"ఇదిగో మీ కోటు— యిదేనా?" అన్నాడు నిధి.

"అవును—హాళ్లో—మీరిక్కడే వున్నారే—ఎంతసేపైంది వొచ్చి—రండి ఆడుకుందాం." అని ఆహ్వానించాడు.—

"ఆర్ట్రంపర్ — ఏడవరు— నోటుమార్చ నక్కుర్లేదులే, రా, మనవాడు పంపకం చేస్తున్నాడు."

"ఇంకానేం—మన జేస్తు మనకేదక్కుడు—" అంటూ సోమయ్య పర్సు తనే తీసుకున్నాడనుకుంటాడు. అట్లా అనుకోడమే తనకి కావల్సింది. తను వాగిన వాగుడుకి యిదిశాస్తి అనిగ్రహించుకుంటాడు. కాని ఊరుకుంటాడా? ఋజువు, పోలీసులు, కోర్టు, విచారణ—అదో రకమైన జీవనం. ఏరకం జీవనమైతేనేం నైతికవిలువలతో సంఘానికి నిమిత్తం లేనప్పుడు?

కాని సోమయ్య అల్పుడు, సోమయ్య వ్యక్తిత్వంలేని మనిషి—సంఘంలో వొక రేణువు. సాంప్రదాయం కాళ్ళకింద బురద. గులుపుతే వొద్దల్లు, మనం దెబ్బలాడాల్సింది ఆదర్శాలతో, విలువలతో— వ్యక్తులతో కాదు! వ్యక్తులు సిద్ధంగావున్న నియమాలని ఆచరణలో పెడతారు. దాన్ని ఖండించి, ధిక్కరించే శక్తివారికి వుండదు; ధిక్కరించే వాడికి సంఘంలో శాంతివుండదు. నూరురూపాయలు సోమయ్య ఖరీదు బ్రతికివుండగా—చనిపోయినతర్వాత, కళేబరంలోని సామాను బజార్లో అమ్మితే, రూపాయి రెండణాల గంధకం, సున్నం.

నిధికి నవ్వొచ్చింది. సోమయ్యని క్షమించి, బైటకి వెళ్ళిపోయ్యాడు, మనిషి బ్రతుకు సరిగ్గా లేకపోతే యిట్లాంటి పనులు చేయిస్తుంది కాబోలు ననుకున్నాడు. వొందరూపాయల కోసం ఆత్మని అమ్ముకోవాలా? అట్లా ఎందరో అమ్ముకుంటున్నారు; కొందరు వొంద కోసం; కొందరు వెయ్యి కోసం. కాని వాళ్ని చోరులనడంలేదు. వాళ్ని రావ్‌సాహెబ్, రావు బహదూర్ బిరుదులిచ్చి గౌరవిస్తున్నాం. ఆపనే, పేదవాడు చేస్తే, దొంగంటున్నాం. భారతదేశంలో ఆత్మవిలువ, రూపాయి అణా పైసల్లో నిర్ణయించవొచ్చు!

ఉండి వుండి, ఆకాశాన మేఘాలల్లుకున్నాయి. రోడ్డుమీద దుమ్ము మొహాన పడుతోంది. నక్కి-వున్న వర్షం చక్కిలిగింతలు పెట్టినట్లుగా, గాలిలో చలి మెదుల్తోంది. దుకాణాలల్లో దీపాలు ఆరిపోకుండా, ఏదో అడ్డంపెట్టుకుని అవస్థపడుతున్నారు, కొట్టువాళ్ళు. కాలవలో దీపాలరంగులు కొట్టుకుపోతున్నాయి. నిధి, యింటికి చేరుకుందామని తొందరగా నడుస్తున్నాడు. ఇంటికెళ్ళి తనురాసిన వ్యాసం మళ్ళా చదువుకోవాలి. అందులో ఏవో తప్పులున్నట్లనిపించింది. సవరించాలి. ఈ వ్యాసం ప్రచురిస్తే, క్లబ్బు సభ్యులు చదువుకుని ఏమనుకుంటారో వూహిస్తే భయమేస్తుంది. వారి అనుమానాలు దృఢపడుతున్నాయి. క్రొత్తనిదర్శనం దొరుకుతుంది. అతన్ని పరిశోధించేటందుకు ఆ వ్యాసం తోడ్పడుతుంది. తన ప్రత్యేకమైన బాధని వెళ్ళబోసు కోడంతప్ప, ఆ వ్యాసంలో వుపయోగపడే విలువలేమున్నాయి, ఉపశాంతకు అతను అదివ్రాయడం? చెడిపోయిన స్త్రీని క్షమించమని సంఘాన్ని కోరడమా? పాపాన్ని శిక్షించక ప్రేమించమనా అందులో సందేశం? బాగున్నవారులేరు; పట్టుబడని వారే బాగున్నవారు; వీరు, దొరికి పోయిన వారిని విలువకట్టి శిక్షించే అర్హతలేదనా! ఏదో బలహీనమైన సమయంలో వాంఛకి లొంగిపోతే యింత ప్రమాదం జరుగుతుందని తెలుసుకున్న స్త్రీ అట్లా చెయ్యలేదని తెలియపరచడమా? ఐనా స్త్రీనిమాత్రం ఎందుకు దూషించాలో? పురుషుడిని నిందించరేమో!

వ్యాసాన్ని ప్రచురించే ధైర్యం అతనికిలేదు. నిజం చెప్పినంతమాత్రాన అది వుత్తమ సారస్వతం అనిపించుకోదు. అందమైన అబద్ధాలాడాలి. వ్యక్తిగతమైన కష్టసుఖాలకి, సకల మానవులకూ వర్తించేటట్లు, చిహ్నప్రధానంగా చిత్రించాలి. షేక్స్పియర్ అట్లాచేశాడు. తను, యీ వ్యాసంలో అట్లా చెయ్యలేక పోయాడు. బ్రతికివుండగా నిజంచెప్పే సాహసం అతనికి లేదని నిశ్చయించుకున్నాడు. నిజంచెప్పకపోతే అతను బ్రతుకలేడు. తనకితనే, విషాదాంత నాయకుడులా కనిపిస్తున్నాడు. విషాదాంతనాయకుడికి, "అన్నో,

యిదో,— ఏదోవొకటి చెయ్యి" అన్న సమస్యని పరిష్కరించే పరిస్థితు లెదుర్కొంటాయి. ఏదో వొకటి నిర్ణయించటమే అసాధ్యం; అదే విషాదాంతంలోని సారం.

నిధికి ఆగాలి, దుమ్ము, మెరిసే చీకటి, అతని ఏకాంతం, భయం కలగచేశాయి. ప్రపంచం విశ్వంలో ముందుకి సాగిపోతూ, అతన్ని దిగవిడచి నట్లనిపించింది. అతనికి ప్రపంచంతో నిమిత్తం లేదు; ఐనా ప్రపంచానికి అతనితో నిమిత్తందేనికో! అతన్ని పరుగెత్తుకు రమ్మని యాగీచేస్తుంది. రాలేక పోతే, కుంటాడనో, గుడ్డివాడనో పేర్లుపెడుతుంది. అతని హృదయంలో నిశీథలాంటి, అనంతంలాంటి ఏకాంతం కేంద్రీకరించింది. దాన్నిచూసి జడుసుకున్నాడు. ఎక్కడికి పారిపోతాడు.?

తిరాచేసి యింటికే చేరుకున్నాడు. పక్క వారింట్లో గడియారం ఎనిమిది గంటలు కొట్టింది. మెట్లెక్కి, వరండాలో కొచ్చాడు. గుమ్మం అవతల బల్లమీద కూర్చుని పూలదండ కడుతోంది అమృతం.

"ఏంబావా—నీకోసం నారయ్యని పంపాను, కనపళ్లేదూ —?" అమృతం పూలని పళ్లెంలో వుంచి, దీపాన్ని పైకెత్తి, వూది, పెద్దదిచేసింది. ఆ వెలుగులో ఆమె మొహం నిండుగా కనపడింది. జెడనివిప్పేసి వెంట్రుకల్ని నిలువునా మెలిత్రిప్పి, మెడమీదికి జారుగా వొరిగే చుట్టగాచుట్టింది. సూర్యోదయాలని దీక్షగాచూచే పవిత్రమైన నేత్రాలలా, కళ్ళు స్వచ్ఛంగా మెరుస్తున్నాయి. పాపిడి యిరుప్రక్కలా ఎత్తుగాలేచిన జుట్టునీడ నుదిటిమీద మెత్తగాపడింది. పెదవులు కలసినచోట, అర్ధచంద్రుడిలా లేచిన బుగ్గల 'నీలైన' నీడలు పడుతున్నాయి. అంతటి ఠీవి, గర్వంవెనక, కెరటం వెనక అస్తమిస్తున్న సూర్యుడిలా దాగిన హాస్యదృష్టి, కారుణ్యాన్ని కాంక్షించిన ఆ కళ్లనిశ్చలత్వం, కనపడని స్థిరత్వం పొందిన ఆ అవయవాల కదలికలో ఆదుర్దా— యిదివరలో ఎప్పుడూ అమృతంలో అతను చూడలేదు.

"ఏం బావా, అల్లా తెల్లబోయిచూస్తావు?" లేచి పళ్లాన్ని దూరంగా

సెట్టి, బల్లతుడిచింది.

"నిన్ను ఆనవాలు పట్టలేదు అమృతం." అంటూ అతను బల్లమీద కూర్చున్నాడు.

"ఏం? అంతలావుగా ఐపోయాననుకున్నా—మావారు 'పాతికలావున్నా వంటుంటారు. అంటే నన్ను పూర్తిగా మరిచిపొయ్యావన్నమాట—కానా?"

"మరిచి పోవడం కాదు.—నువ్విక్కడ వుంటావని వూహించలేక పొయ్యాను—అంచేత కొంచెం ఆశ్చర్యంవేసింది."

నిధి లోపలికెళ్ళి కుర్చీతెచ్చి బైటవేసి, తనుకూర్చున్నాడు. అమృతం బల్లమీద కూర్చుని, పూలని ముడిమీద అలంకరించుకుంటోంది.

"ఇప్పుడుచెప్పు—ఎప్పుడురావటం—ఎక్కడ నుంచీ, ఎందుకూ—"

పూలనిసర్దుతూ, పిన్నుని పళ్ళమధ్య బిగించి మాట్లాడుతోంది అమృతం.

"ఉండుమరీ—యీజుట్టు లొంగదు—" విచ్చలవిడిగాఎదిగిపోయిన ఆ జుట్టుని అమృతం నాలుగు పిన్నులతో లొంగదీసింది. కొన్ని వెంట్రుకలు మెడమీదా, చెవులమీదా, చెక్కిళ్ళమీదా పడి, వొడ్డునపడేసిన చేపపిల్లలా కొట్టుకుంటున్నాయి—

"అబ్బ ఎంతగాలి—వర్షంవొస్తుందా—నువ్వు చాలా చిక్కిపోయావుబావా—" అంది అమృతం జాలిగా.

"ఏదో వూరికే అంటున్నావు"

"లేదుబావా— చూడు కణతలు పల్చగా ఎల్లా కొట్టుకొంటున్నాయో — కళ్ళులోపలికి పోయాయి." అతన్ని ఎగాదిగా పరీక్షగా చూసింది.

"మనం పెద్దవాళ్ళం ఐపోతున్నాంకదూ—"

"కాలం ఆగుతుందామరి." గాలికి తట్టుకో లేనట్లుగా అమృతం, పమిటి చెంగునివొళ్ళోకి లాగి, సిరిసెత్తినికప్పుకుని, కుడిచెవి మీదికి లాగి కళ్లు, బుగ్గలు, చిట్లించి నవ్వుతోంది.

"అన్నాయ్ లాడ్డించనా? — ఏమండోయ్, వొచ్చారే, మీకోసం

బజారంతా వెదిగానే—లేవండి, నీళ్ళు కాగాయి, స్నానం చేస్తురుగాని —" అన్నాడు శంకరం, లోపల్నించి వొచ్చి.

"నారాయణేడి శంకరం?" అంది అమృతం.

"అల్లా కాలవొడ్డుకెళ్ళాడు"

"బావా, నేను, శంకరం, పాలికాపు నారాయణా, అల్లా తెనాలి వెళ్ళివొస్తున్నాం. మావాళ్ళ తాలూకు వొకరికి పెళ్ళిసంబంధం వొచ్చింది. పిల్లని చూసివొస్తున్నా, మా అత్తగారు యిదివరకే చూశారు. మా వారు తీరికలేక రాలేదు. శిస్తుపోసూలు చెయ్యాలని మాపాలికాపునికూడా మాతో పంపారు,—పన్లుజరిగినై—దోవలో నేకదా, ఓసారి నిన్ను చూసిపోదాం, అని వాళ్ళనికూడా దింపాను. ఏదీ శంకరం, పెండ్లికూతురు ఠెల్లావుంది,—చెప్పు." అని యాకరవు పెట్టింది అమృతం.

శంకరం పెండ్లికూతుర్ని వర్ణించాడు. అమృతం నవ్వుతోంది. తన కర్థం కాకండా నిధి కూడా నవ్వడం ప్రారంభించాడు.

"దబ్బుని స్నానంచెయ్యి బావా,—భోజనంచేద్దాం. బట్టలంతా దుమ్మే—లే, లే." అని తను లేచింది. దయానిధి వెళ్ళిస్నానం చేసి వొచ్చాడు. జుట్టుపాపిడ లేకుండా వెనక్కి దువ్వి, బనీను తొడుక్కుని, పైన తువ్వాలు కప్పుగుని సిద్ధమయ్యాడు. పాలికాపునారాయణకి మంచంలో వొడ్డించారు. రోజ్ హోటల్లో భోజనంచేసి, ముందుగదిలో పక్కవేసుకుంది. నిధి, అమృతం, శంకరం, భోజనాలుచేశారు. శంకరం, స్నేహితుడితో సినిమాకి వెళ్ళి, స్నేహితుడింట్లో పడుకుని వుదయం వొస్తానని బయలుదేరాడు.

"వర్షం వొచ్చేటట్లుగావుంది. ఈ చలిలో సినిమా ఏం చూస్తారూ—ఆ స్నేహితుణ్ణి తీసుకొచ్చి, యిక్కడే పడుకోరాదూ—? అన్నాడు నిధి.

"టీ తాగితే ఏచలీవుండదు. ఔనా శంకరం" అంది అమృతం. ఫరవాలేదులెండి, అంటూ ఏకోరాణిగి శంకరం ప్రయాణమయ్యాడు. నారయ్యా, పాలికాపూ కూడా సినిమాకి తయారైయ్యారు. హాల్లో డిస్పె

న్నింగ్ గదిముందు, పాలికాపుకి బల్లమీద పక్క ఏర్పాటు చేశారు. నారయ్య, నిధికోసం మంచం గదిముందు హాల్లోనే వేశాడు. తన చాపచుట్ట మండు వాలో వేసుకున్నాడు. ఈ పన్లుచేసి, వాళ్ళుముగ్గురూ వెళ్ళిపోయ్యారు.

అమృతం తమలపాకులకి సున్నంరాస్తూ మండువాలోకి నడిచి దొడ్డి వైపు చూస్తోంది.

ఇక్కడ ఎంతో హాయిగావుంది బావా—అచ్చంగా మావూళ్ళో దొడ్డి యిల్లాగే వుంటుంది. ఇద్దరూ దొడ్లోకి నూతిపళ్ళెం మీదికి నడిచారు. మేఘాలు చంద్రుణ్ణి విడిచి దూరంగా పరుగులెత్తాయి. ఆకాశం కాసేపు నిర్మలంగా వుంది. నక్షత్రాలు స్వేచ్ఛగా మెరుస్తున్నాయి. ఉండి వుండి పల్చటి తెల్లమేఘసంపార చంద్రుడిమీద పెండ్లికూతురు మొదటిరాత్రి సిగ్గు ముసుగులా కప్పి, కవ్వించి, తీసేసి తొలిగి పోతోంది. గాలిలో చలి, పదును పెట్టిన కత్తిలా శరీరాన్ని మత్తెపెడులోంది. చెట్లల్లో ఆకులు సంగీతం కోసం గొంతులు సవరించుకుంటున్నాయి. చలిని ధిక్కరించినట్లు ఎక్కడో పక్షులుబాధలో ఆనందాన్ని రెపరెప ప్రకటిస్తున్నాయి. తపోభంగయత్నాన్ని జయించిన ఋషిలా, ప్రకృతి జపంచేస్తోంది.

"ఏం బావా మాట్లాడవంలేదు. కోపం వొచ్చిందా?" అంది అమృతం. నూతివోరమీద చేతులానించి నీళ్ళలోకిచూస్తూ.

"నాకు కోపంవొస్తే ప్రపంచానికి నష్టంలేదు. పైగా నీమీద కోపం దేనికి?"

"ఊరికే అన్నాను. ఐతేబావా, సుశీల నాకో వుత్తరం రాశింది తెలుసా?"

"తెలీదు."

"అది చాలా చిత్రమైన వుత్తరం. అందులో లేనకష్టైనా ప్రమాదం జరిగితే, నువ్వేబాధ్యుడవుట..."

"ఎందుకో"?

"తనకి జీవితంలో సౌఖ్యం లేకపోవడానికి నువ్వు కారణంట. నా కేమీ అర్థంకాలేదు. నేను జవాబు రాయలేదనుకో— అబ్బ చలిగావుంది." అంటూ కొంగువొంటిచుట్టూ గట్టిగా బిగించుకుంది. పసుపుపచ్చ రంగుపై ఆకుపచ్చ పువ్వుల ఖద్దరుచీర, జబ్బల్ని పట్టుకున్న అంగుళం వెడల్పు జరీగల నల్లరంగు ఖద్దరు రవిక—దానిపై కుట్టిన తెల్లపూలు, వెన్నెలలో వింతగా కనబడుతున్నాయి.

"ఐతే బావా, నేనోవిషయం అడుగుతాను, ఏమీ అనుకోవుకదా?"

"అడుగు అమృతం—నేను స్వేచ్ఛగా మాట్లాడేటంతటు తగినంత చనువు నాకింకెవ్వరి దగ్గరాలేదు. నిన్నుగురించిన అన్నివిషయాలూ నాతో చెప్పకోలేక పోవచ్చు,—నీదగ్గర నుంచి దాచేవిషయాలు నాకేమీ లేవు, ఈ విషయం నీకు తెలుసుకూడాను."

"నువ్వు ఎంతో దిగులుగా, వింతగా, మాట్లాడుతున్నావు. నా కెల్లాగోవుంది బావా."

"ప్రతివారిముందూ ఎంతకాలం నటించగలం అమృతం? ఎప్పుడో ఒకప్పుడు, ఎవరిదగ్గరో వొకరిదగ్గర మన నిజస్వరూపాలు బైటపెట్టక తప్పదు. రహస్యాలని బాధలేకుండా చెప్పకుంటే విమర్శించకుండా విని అర్థంచేసుకొని సానుభూతిచూపే వ్యక్తులు కనపడే వరకూ, స్నేహితుల కోసం అన్వేషించక మానం. సత్యాన్ని, సౌందర్యాన్ని,—అన్వేషించడం అంటే, నిజంగా యిదే అర్థం—"

"ఏమిటో బావా, మొగాళ్ళ రహస్యాలు ఆడాళ్ళతో ఎందుకు చెబుతారు? ప్రతి మొగాడూ ఆడదానిముందర కొంతదాస్తాడు..."

"ఐతే నేను నీతో చెప్పేవిషయాలని నువ్వు నమ్మకలే వన్నమాట."

నువ్వు కొన్ని నిజంచెబుతావు. కొన్ని అసలే చెప్పకపోవొచ్చు. స్త్రీతో చెప్పకూడనివి ఎన్నోవుండొచ్చు."

"నేను నిన్నెప్పుడూ స్త్రీగా పరిగణించలేదు అమృతం. కన్నీరు

కౌరిస్తే తడిసి నీరైపోయిన స్వప్నకాంతలాంటి దానవు..."

అమృతం నిశ్శబ్దంగానవ్వింది. అప్రయత్నంగా చెట్టుకొమ్మని కదిపి, ఆకుల్ని వేళ్ళతో విరుస్తోంది. కీచురాయి కదిలింది.

"ఇబ్బ చలిగావుంది— జబ్బుచేస్తుంది. లోపలి కెడదాం బావా— నాకు వెన్నెట్లో నువ్వు సరిగ్గా కనపడటంలేదు" అంటూ అమృతం మండువాలోకి చేరుకుంది. ఇద్దరూ హాల్లోకొచ్చారు. పాతసంగతులు స్మరించుకుంటున్నారు. జగన్నాథం, పట్నంలో కాలేజీలో చదువుతున్నాడుట. నాగమణి పెళ్ళిచేసుకుందిట; భర్తకి నాయుడుపేటలో వుద్యోగంట. తరువాత సుశీల విషయం మాట్లాడుకున్నారు.

"నాకో అనుమానంవుంది బావా—సుశీలకి నీమీదవుండేదని." అంది అమృతం తనపాదాలకేసిచూస్తూ. నిధికి యీమాటలు వింటే నవ్వొచ్చింది.

"మీద వుండటం ఏమిటి అమృతం—ప్రేమించింది అనొచ్చుగా!"

"ఏమో అబ్బా,—ఎట్లా అనాలోనాకు తెలీదు." అందిమూతి వొంకరచేసి.

"ఫరవాలేదులే— సిగ్గుపడేటందుకు మనం చిన్నవాళ్ళంకాము. సుశీల నన్నేకాదు, ఎవర్ని ప్రేమించలేదు!"

"అసలు ప్రేమించడం అంటే ఏమిటిబావా?"

"ఏమో నాకు తెలియదు. కాపరం చేస్తున్నదానవు నీ కెక్కువ అనుభవం వుండాలి—"

"నాకేంవుంటుంది పల్లెటూరి మొద్దుని. ఏనీబోటిగాళ్ళో చెబుతుంటే వినడమే—"

"చాలామంది జీవితంలో 'ప్రేమ' అనుభవించకుండానే జరిగిపోతుంది, కలలోనూ, పుస్తకాలలోనూ, కళలోనూ ప్రేమని తెలుసుకుని తృప్తిపడాల్సిందే—"

"నువ్వా అంతేనా ఏమిటి బావా?" అంది అమృతం కళ్ళకొనలనుంచి చూస్తూ.

"ప్రేమని ఆశించడం పురుషుడివొంతూ- దాన్ని యివ్వడం స్త్రీ వొంతూ-"

మధ్యలో అమృతం అందుకుని-

"ఐతే బావా, సుశీల విషంతాగి చచ్చిపోయిందంటారు, నిజమేనా?"

"నిజం కావొచ్చు, భర్త శంకించి వుండొచ్చు. గన్క ఈ పరాభవం భరించలేక చేసి వొండొచ్చు.-"

"ఇందులో నువ్వుచేసిన అపచారం ఏముందీ?"

"ఏమీ లేదు. తనస్వార్థాన్ని స్తుతించలేదు-" అమృతం ఆవులించి, కళ్ళని తుడుచుకొని గదిలోకెళ్ళి మంచంమీద కూర్చుంది. పక్కంతా సర్ది తలగడాని వొళ్ళో వేసుగుని, కాళ్ళువూగిస లాడిస్తూ, కొంచం గట్టిగా అడిగింది.

"బావా—నువ్వు మీఆవిడతో కాపరం పెట్టవాఏమిటి?"

దయానిధి గదిలోకొచ్చి, కుర్చీవాల్చి కూర్చున్నాడు.

"ప్రేమించిన వాళ్ళు పెళ్ళిచేసుకోలేరు; పెళ్ళిచేసుకున్న వాళ్ళు ప్రేమించలేరు—అదీ యీదేశంలో యువకుల చరిత్ర."

"నీవన్నీ చిత్రమైన భావాలు బావా" అమృతం వికృతంగా వొళ్లు విరుచుకుని పక్కమీదికి వొరిగింది.

"అబ్బ పిన్నులు గుచ్చుకుంటున్నై బాబూ—" అని, లేచి,పిన్నులను దిండుకింద పెట్టింది.

"నీకు నిద్రొస్తోంది-నేవెళ్ళి పడుకుంటా—" అని నిధి లేవ బోయ్యాడు.

"కూచో బావా—ఇల్లా కూర్చుని మనం కబుర్లు చెప్పుకోడం ఎన్నాళ్లకో. నేనువొస్తాను, మనం మీ మామగారిదగ్గిరకెళ్లి, ఇందిరని తీసు కొద్దాం?"

అతనేమీ మాట్లాడలేదు.

"బావా, కోమలెక్కడుంది—?"

"ఏమో—"

"ఓస్, ఏం తెలియనట్టు మహా. నాదగ్గర ఎందుకు దాస్తావ్"

"కోమలికోసం నీదగ్గరచేసిన బాస ఎల్లా తీర్చాలా అని ఆలోచించ వలసి నప్పుడే కోమలి జ్ఞాపకం వొస్తుంది. ఆ రోజుల్లో బాహ్య ప్రపంచంలోని ప్రేమకోసం తహతహ లాడాను"

"ఇప్పుడూ?"

"ఇప్పుడూ, నాలోని ప్రేమతో సమాధాన పడుతున్నాను."

"నాకేమీ అర్థంకాలేదు."

"నేవెళ్ళిపడుకుంటా" అని నిధిలేచివెళ్ళి, గుమ్మంముందు మడత మంచంపై పడుకున్నాడు. కాసేపు నిశ్శబ్దం. అమృతం పెట్టెతీసిన చప్పుడైంది. బట్టమడతలోంచి కర్పూరంవుండల పరిమళం వేసింది. సబ్బు బిళ్లల పెట్టిలో రూపాయల గలగల వినబడింది. అమృతం గదిలో ఏం చేస్తోందో! గది తలుపులు వేసుకోమంటే? గాజుల చప్పుడు, దిండ్లని సర్దిన శబ్దం, నిలిపేసిన ఆవులింత—మళ్ళా నిశ్శబ్దం.

"నిద్రపట్టిందా బావా" అని అడిగింది లోపల్నుంచి.

"ఊఁ" అన్నాడు. కాని అది అబద్ధం అని అతనికి తెలుసు.

"అబద్ధం." అంది. నిధికి భయమేసింది. ఈ ఆడాళ్ళు అన్నివిషయాలూ ఎల్లాతెలుసుకుంటారో చిత్రం అనుకున్నాడు.

"అంటే పడుతో పడుతో వుంది." అన్నాడు.

"మా జగ్గు అడిగినట్లు ఆ అవస్థ ఎట్లాంటిదో వర్ణించు బావా" అంది.

"ఓ. కళ్లు మూతలుపడడం—కుడి కన్ను తెరవడం; ఎడమది ముయ్యడం; కుడిచెయ్యి తలకిందతీసి, ఎడమచెయ్యి పెట్టడం; వెల్లకిల్ల పడుకోడం; తరవాత బోర్లకిల పడుకుని, దిండులో మొహం గుచ్చుగోటం"—అమృతం నిలిపి నిలిపి, మసీదులో మృదంగం మోగిస్తే ప్రతిధ్వనించినట్లుగా

నవ్వుతోంది.

మళ్ళా నిశ్శబ్దం. పక్క డాబా యింట్లోంచి, గడియారం పదకొండు కొట్టింది. పది క్షణాలలో ఆ నిశ్శబ్దం భగ్నమైంది. ఆకాశంలో బంగారపు కత్తులని ఎవరో విరిచి పారేసి నట్లుగా మెరుపులు—గాలికి వొక్కసారిగా కిటికీ తలుపులు కొట్టుకున్నాయి. నేలమీది ఆకులులేచి లోపలపడు తున్నాయి. దీపం నృత్యం చేస్తోంది. భయంకరంగా పిడుగులు దిక్కు తేల్చ కుండా మారు మ్రోగుతున్నాయి. గదిలో గోడని కేలండర్ కాగితాలు చప్పుడుచేసి కిందపడ్డాయి. గోడనున్న నిధి తల్లి ఫోటోగ్రాఫ్, కిందపడి పగిలింది. అమృతంలేచి, గాజుముక్కల్ని పోగుచేసిన చప్పుడవుతోంది. దీపం ఆరిపోయింది.

“నాకు భయమేస్తోంది బావా” అంది.

అతనులేచి అగ్గిపెట్టె కోసం గదిలోకొచ్చి, బల్లమీద తడుములాడు తున్నాడు. మెరుపుల వెలుగులో కనపడుతుందని నిదానంగా చూస్తు న్నాడు. కిటికీ తలుపులు మూసుకున్నాయి. అంతా చీకటి, బైటగోల. అమృతం దీపంమీద చెయ్యిపెట్టి, “అబ్బ కాలింది” అని గొణిగింది. నిధి చెయ్యి ఆమెభుజంమీద పడింది. ఆ చేతికి తన మెడని ఆనించి బిగించింది. చెయ్యితీసేశాడు. వెళ్ళి కిటికీ తలుపుతీశాడు. అగ్గిపెట్టి, మంచం పక్కన అలమార్లో వుంది. దాన్నితీసి దీపం ముట్టించాడు. తలుపులు కొట్టుకోకుండా, రాళ్లు పెట్టాడు. వెళ్ళి గదిలో మంచం మీద కూర్చున్నాడు.

“నీకు భయంగా లేదు బావా?” అన్నది అమృతం. నిధి లేచాడు. అమృతం మంచం మీద కూర్చుని, దిండుని వొళ్ళోవేసుకుని కాళ్లు వూగిస లాడిస్తోంది. బోర్డర్ లేని పసుపు పచ్చరంగు పల్చటిపట్టు చీరకట్టుకుంది. దానిమీద వొత్తుగా, తెలుపుజేసిన, సిల్కు జాకెట్టు వేసుకుంది.

“కష్టపు చీరలో నిద్రపట్టదు. సిల్కుచీర చల్లగుంది. ఎల్లా బావా? బాగుందా నీకు...”

అతనికేసి జాలిగా చూసింది.

"అమృతం..."

"ఎందుకు బావా?"

"యిల్లా ఎందుకొచ్చావు?"

"ఏం?"

"ప్రపంచానికి లేని ఆపేక్ష నీ కెందుకు?"

"అదేమిటి బావా—ప్రపంచానికి ఆపేక్ష ఎందుకుంటుంది; ఎవళ్లో వాళ్లకిద్దరికి తప్ప—"

అమృతం కళ్లు బరువుగా మెరుస్తున్నాయి. కళ్లకింద నల్లనీడలు వెన్నెట్లో మెరిసిన మంచిగంధం ప్రమానులా తీర్చుకున్నాయి. విస్ఫారుకుని, ప్రేమతో పవిత్రమైంది మొహం.

"అమృతం..."

అతనికి ఏమనాలో తెలీడంలేదు. వాక్యాలూ, మాటలు అన్నీ మాయ మయ్యాయి.

"ఏం బావా?"

ఉప్పెనలా గాలి గదంతా కమ్మేసింది. కడసారి నృత్యం ముగించి దీపం మూర్ఛపోయింది. అమృతం చేతులు అతని బుజంమీద పడ్డాయి; సముద్రంలో కొట్టుకుపోయే వ్యక్తికి, రబ్బరుబంతి దొరికినట్లుగా. ఏదో శక్తి అతన్ని కిందికి నెట్టేస్తోంది. అతను మంచంపైన కాళ్ళమీద కూలబడి పొయ్యాడు. అంతా చీకటి. అతని కళ్లు అమృతం వొళ్ళో మెరుచుకున్నాయి. అతని నుదిటిని చలిమంటలా కాల్చింది అమృతం కడుపు. కనురెప్పల్ని, ఆమె వక్షాలు మెత్తగా కోసేస్తున్నాయి. ఆమె రెండు చేతులూ అతన్ని ఎక్కడికో తీసుకుపోతున్నాయి. భరింపరాని సౌందర్యపు వెలుగుతో అతనికి స్పృహ తప్పింది. అమృతం జుట్టుముడి వూడింది. జడంతా అతన్ని కప్పేసింది—నిశీథిలా కన్నీటి చుక్కలచే చీరతడిసి, అమృతం తొడలు చలితో

పోడుస్తున్నాయి. ఆకాశం తనవొక్కడి మీద నిశ్చింతగా వర్షిస్తోన్నట్టు, అతని మెడ వెనక భాగం మీద, కన్నీరు వునికివున్న ఇంద్రధనస్సులా ఆవరించింది. "బావా" అంది ముక్కలై లయకోసం తడుముతున్న కంఠంతో. భూమి తిరిగిపోతోంది. స్థలం, సమయం, గతులు లేవు. విశ్వమే కదలి పోతున్నట్టుంది. ఎక్కడికో, యింకా, యింకా దగ్గరగా, కలిసి, వొకరై, అన్ని రహస్యాలనీ ఛేదించి, అన్ని లోతుల్నీ శోధించి, అన్ని శిఖరాలనీ సాధించి, వొంటి జీవంగా కొట్టుకుని, విశ్వరహస్యానికి ప్రాణం పోశారు. ఆలోచనా, విమర్శనా, తర్కం చైతన్యం—అన్నీ ఉద్రేకాల ప్రవాహంలో కెరటంపై నురుగలా కొట్టుకుపోతున్నాయి. దేనికోసమో, రెండు ప్రాణులు సృష్టిశక్తులను కేంద్రీకరించి వెనుగు లాడుతున్నాయి.—ఎక్కడో అది యదార్థమై వుంటుంది. రక్తంపట్టుతప్పి నిప్పద్రావకంలా పార్లి శరీరాన్ని కడిగి పవిత్రం చేస్తోంది. సర్వేంద్రియాలూ విడిపోయి జీవకణాలుగా శరీరాల్ని మార్చేశాయి. శరీరం అనుభవంతో ఆర్పైపోయింది.

* * *

ఆక్షణం సృష్టి నిల్చిపోంది. ప్రాణం స్థిమితపడింది. నిప్పులో కాలిన మల్లెపూల పరిమళం, అమృతం శ్వాసలో చుట్టేసింది. మెత్తటి బలంతో తడిసిముద్దయి, ఆనందంతో ఎఱ్ఱగా అలిసిపోయి, సూర్యకిరణాని వేడికి కరిగిన మంచుకణమై, అమృతం పక్కమీద వాలిపోయింది. ఆ శరీరం అది. ఎవ్వరూ 'యిదినాది' అనలేరు. సృష్టి అనాదినుంచీ వుంచిపోయి నిద్రనించి లేచి మరచిపోయిన శరీరం అది.

దయానిధి మంచంమీదనుంచి నేలమీద కూలిపోయ్యాడు.

అమృతం చేతికింద దిండు, కిందికి జారింది. గానిమీద తల ఆనించి కళ్ళుమూశాడు. ఓపికలేకుండా కురుస్తున్న వర్షం నిలిచిపోయింది. చప్పబడి, నీరసించి ప్రకృతి విశ్రమించింది. విషాదంగా వెన్నెల కిటికీలోంచి చూస్తోంది. పక్కడాబాలో గడియారం వొంటిగంట కొట్టింది. నిధి లేచివెళ్ళి,

గదిగుమ్మం ముందు మంచంమీద పడుకున్నాడు. నారయ్య, నారాయణ సినిమానుంచి రావడం, పక్కచుట్టలు చుట్టుకుని, పడుకోడం చప్పుడైంది.

దయానిధికి నిద్రపట్టలేదు. లేచి నిలబడ్డాడు. కాళ్ళు నేలమీద ఆనడంలేదు. మరో శరీరంలోకి ప్రాకబట్టినట్టయింది. అమృతం శరీరం పరిమళం తనని ఆవరించింది. ఉత్సాహంతో మొహం తుడుచుకున్నాడు. గదిలోకెళ్ళి అగ్గిపుల్ల గీసి, దీపం ముట్టించాడు. దగ్గరగా చేరేడు. అతనికి భయమేసింది, సిగ్గేసింది. అదే ఆ మొహం. మరో లోకంలోకెళ్ళి, అద్దంలో నీడచూసుకున్నట్లుంది. అలసి కృశించిన మొహంలో ఏదో క్రొత్త వికాసం, వెలుగు, ప్రతిభ కనిపిస్తోంది. ఈ కళ్ళతో మళ్ళా ప్రపంచాన్ని చూడడమా! స్వప్నంలో తెరుచుకుని చూడటం నేర్చుకున్న నేత్రాలతో యీ బాహ్యప్రపంచాన్ని చూడటమా!

దీపం తీసుకుని మంచం దగ్గర కళ్ళు పైకెత్తి, అమృతంకేసి చూశాడు. సిగ్గేసింది. ఆమెకేసి చూడలేక పోయాడు. అది నిద్రాదేవతే నిద్రపోవడం లాగుంది. దీపం దాచేశాడు. బైట రోడ్డుమీదికి వొచ్చేసి ఆకాశంకేసిచూస్తూ పాంచానమీద కూర్చున్నాడు. బనీనులోపల మెడవెనక ఏదో పట్టుకున్నట్లయింది. తడిమి బైటకి తీశాడు. ఒక్కటే పొడుగాటి వెంట్రుక. అమృతం జడలోది. అతనికి భయమేసింది. తనకే తనువింత మనిషి లాగున్నాడు. అతని పూర్వపు భావాలు, ఆదర్శాలు, అభిప్రాయాలు—వాటికీ; తన నిజతత్వానికీ ఎంతటిభేదం వుందో తెలుసుకుంటే అతనికి భయమేస్తోంది. అతని తత్వం అతనికే తెలీక పోడం ఆశ్చర్యం. తను ఆ వాతావరణంలో వుండలేడు. అదంతా మైలపడిపోతుంది. సూర్యోదయం కాగానే అమృతాన్ని ఎల్లా చూడగలడు. అమృతం తన నిజస్వరూపాన్ని తనకి చూపించి, హాయిగా నిద్రపోయింది. ఈ కళ్ళతో యీ వ్యక్తులన్నీ, యీ దృశ్యాన్నీ చూడలేడు. చంద్రుడే చిత్రంగా కదులుతున్నాడు. పక్కింటి గడియారం రెండుకొట్టింది. లోపలికొచ్చి మెట్లమీద కూర్చున్నాడు. సుశీల చావుకి కారణమైన తను,

# 8

## రాళ్ళసీమ

దయానిధి కర్నూలొచ్చి రెండు వారాలయింది. గవర్నమెంట్ హాస్పిటల్ పక్కనే షెడ్‌లో వుంటూ, సైకిల్ ఎరువుచ్చుగుని, మెడిసిన్ బాగ్ తగిలించుకొని, మైళ్ళు మైళ్ళు ప్రయాణం చేస్తూ ప్రమాదవ్యాధులకు గురిగైన రోగులకు చేతనైన చికిత్స చేస్తూండేవాడు. అప్పుడప్పుడు తోటి డాక్టర్లతోనూ, హెల్త్ ఇనస్పెక్టర్లతోనూ కలిసి భోజనంచేస్తూ, రాత్రికి మళ్ళా కర్నూలు చేరుకునేవాడు. అవసరమైన, శవాలని బైటకితీసుకుపోయి తగల బెట్టేందుకు సాయపడేవాడు. హోటల్ ప్రొప్రయిటర్ కొన్ని రోజులు తన హోటల్లోవుంచుకొని, వుచితంగా భోజనం పెడుతుండేవాడు. కొన్ని దినాలు వీలులేక రాత్రిళ్ళు వెళ్ళిన చోటే వుండిపోయేవాడు.

ఆవూళ్ళు చిత్రంగావుంటాయి. మైళ్ళు మైళ్ళు చెట్లేవుండవు. కొంత సేపు యిసిక నేల; కొంతదూరం, రకరకాల రాళ్ళు. అంతా రాళ్లమయం. కాసేపు గట్టి నేలమీద తివాసి పరిచినట్లు చిత్రమైన గడ్డి; తమాషా మొక్కలు. ఆయిళ్లు మరీచిత్రంగా వుంటాయి. మూడు రాతి బండలు, మూడుగోడలు; పైన మరోరాయి. అదేయిల్లు. కొన్ని రాళ్లల్లో దొలిచిన

గుహలు. కప్పగావేసిన రాతిలో కన్నంవుంటుంది. అందులోనుండి సూర్య రశ్మి సోకితే తప్ప వెలుతురు లేదు. కాలవ, పిల్లకాలవ, చెలువు, నుయ్యి, ఏమీ కనబడవు.

ఆవులు, గేదలు, గొర్రెలు, ఆకొండ గుహలలో సత్యాన్ని అన్వేషించే వేదాంతులులా సంచారం చేస్తాయి. ఏరాతి ప్రక్కనుంచో గాడిద దర్శనం యిచ్చి, భయపడి పారిపోతుంది. ఎక్కడో నల్లకుక్క కుంటుకుంటూ కదిలి పోతుంది. వాటి యాత్రకి ముగింపులేదు. ఉండి వుండి, అన్ని ఆకులూ వూడి పోయి, మొండికొమ్మల చెట్టు, కొమ్మల్ని చాచి అస్థిపంజరం ప్రదర్శిస్తుంది. ఆచెట్లకి ఆకులే వుండవేమో! ఆకాశంలో గద్దలు యీప్రకృతి సంపదకి గస్తీ తిరుగుతుంటాయి. కాకులు, నల్లగోరువంకలు తరుముకుంటూ ఎగురు తాయి. వెళ్లగా వెళ్లగా ఎక్కడో వొకనుయ్యివుంటుంది. దానికివరలుండవు; అది మనుషుల కక్కర్లేదు. చచ్చిపోయిన మనుషులే దానికి కావాలేమో! అవతల ప్రపంచంలో వాళ్లు అందులోనీళ్లు సులభంగా తోడుకోవచ్చు. ఆస్థలంలో సూర్యుడు తీక్షణంగా ప్రకాశించలేడు. ఆరాళ్ల వెనక సూర్యాస్త మయం చూస్తే, ఏడవాలని పిస్తుంది.

ఎక్కడా మనుషులే కనబడరు. అదివూరు. నాలుగిళ్లు.—పదిగొర్రెలు—మూడావులు—రెండుకోళ్ళు—వొక ముసలిది ఎండలో కూర్చుని ఏదో చేస్తుంటుంది. నల్లటి చీర—వొంటికి చాలదు; సంచుల్లా వేళ్ళాడే చేతులు—తెల్లబడగా మిగిలిన జుట్టు, మూసుకుపోయిన కళ్ళు విప్పకొన్న పెదవులు, వొంగిన నడుం—ఆ నెకూడా మనిషిసంతతే. ముసలివాడు, రాళ్ళుకొడు తున్నాడు; కట్టెలు కొడుతున్నాడు. మోకాళ్ళపైకి పంచి; నల్లటి మొల తాడు; కుమ్మరంగు పాగా. అక్కడ వార్ధక్యమే కాని యవ్వనంలేదు. ఆమనుషులకి, యవ్వనదశే వున్నట్లు తోచదు. రాళ్ళల్లో ఆడుకుంటూ ఆల్చి ప్పల్ని ఏరుకుంటున్న కుర్రాళ్ళుకూడా ముసిలినవ్వులు నవ్వుతారు. వాళ్ళ మొహాలలో సంతోషం, చైతన్యం, యవ్వనం, ఉత్సాహం ఏమీలేవు.

క్షామదేవత సంతానం, ఆకలిదప్పులు, 'నన్ను చూడండి' అంటూ వారి స్వరూపాలు దాల్చి పుట్టి వస్తున్నాయి, ఆ ప్రదేశంలో. ఆస్థలాలతో మనుష్యులకి నిమిత్తం లేదు, దైవానికే తప్ప. అక్కడుండే మనుష్యులుకూడా, ఆస్థలంలోనివారే. వారికి వేరే పని, వ్యక్తిత్వంలేదు. అన్నీ రాళ్ళు, రాళ్ళు; వారు కదిలే రాళ్ళు. నిజంగా ఇది రాయలసీమ కాదు; ఎవరో అన్నట్లు రాళ్ళసీమే!

నిన్న, అనంతాచార్యులుగారితో మొదట మునిమాపుగుల్లో పరిచయం కలిగింది. ఆయన పెద్దకూతురు లక్ష్మీదేవికి జబ్బుచేసిందంటే చూడ్డానికి వొచ్చాడు. ప్లేగ్ అని తెలియగానే ఆమె మామగారు, భర్త వేరేచోటికి వెళ్ళిపోయారు. తండ్రి వొచ్చిన రెండుగంటలకే లక్ష్మీదేవి నాలుగు సంవత్సరాలు వయస్సుగల కూతురు యీ ఘోరవ్యాధికి గురియై చనిపోయింది. రాత్రి ఎనిమిదింటికి నిధి, అనంతాచారిగారు, ఆపిల్లని పూడ్చి వొచ్చారు. రాత్రంతా తల్లిని పోదార్చటంలో గడిచింది. రాత్రికిరాత్రే, యిద్దరుకూలీలను తీసుకువెళ్ళి, నిధి, రెండుమైళ్ళ దూరంలో వొక పాకగుడిసె వేయించి, తెల్లవారేదాకా ముగ్గురూ అక్కడే గడిపారు. తరువాత నాలుగు రోజులకి లక్ష్మీదేవి భర్తవొచ్చి ఆమెని కర్నూలు తీసుకువెళ్ళాడు.

అనంతాచార్లుగారిది, అనంతపురం జిల్లాలో వజ్రకరూర్కి ఆరు మైళ్ళ దూరంలో వున్న న్యాయంపల్లి * అనే గ్రామం. కాంగ్రెస్లో చేరి ఎంతో సేవచేసి చుట్టుపక్కల పేరు, పలుకుబడి గలవాడు. ఇటీవల సంచారం తగ్గించి, స్వంతపనులు, వ్యవసాయం చూసుకుంటున్నాడు. రాత్రుళ్ళు పురాణ కాలక్షేపంచేస్తూ, నిశ్చింతగా గడుపుతాడు. ఆయనది చాలపెద్ద కుటుంబం. ఆయనా, భార్యా, నలుగురు ఆడపిల్లలు, ముగ్గురు మొగపిల్లలు; ఇద్దరు ఆడపిల్లలకి పెళ్ళిళ్ళుచేశాడు. కాత్యాయని, రాధ, పెళ్లికున్నారు. రాధ ఆఖరిది, చిన్నపిల్ల. కాత్యాయినికి పదిహేనో ఏడో

* న్యాయంపల్లి, ఊహించిన గ్రామం.

స్తుంది. పెద్దపిల్లవాడు రాసుపుడు, ఇంజనీరింగు చదువుతున్నాడు; కడం యిద్దరూ హైస్కూల్లో చదువుతున్నారు. హితపరుడు కాకపోయినా, ఆయన కుటుంబం, గుంపెతనంగా, లోటులేకుండా ఎల్లా గడిచిపోతుందో చాలా మందికి తెలుసు. ప్రజాసేవకుడనీ, పండితుడనీ, తాలూకాలో పెద్దమనుషులందరూ, ఆయనకేసో యింత ఘట్టిచెబుతుంటారు. ఆయన అన్నగారు, బళ్ళారిలో ప్లీడరు. కాని వారిద్దరికి సంబంధాలు లేవు. అనంతచారిగారు జైల్లోవున్న రోజుల్లోనే, చుట్టుపక్కల స్నేహితులు ఆదుకున్నారు. కాని అన్నగారేమీ సహాయపడినట్లులేదు. ఐనా, అన్నగారింట్లో ఏకార్యంవొచ్చినా, ఎవరికి జబ్బుచేసినా, యీయనవెళ్ళి తగినంత సాయంచేసి, వొస్తూంటాడు. ఆయన భార్య రాజమ్మగారికిదంతా నచ్చకపోయినా, యీ విషయం తేల్చకుండా, భర్తకి చాలా అనుకూలంగా వుంటూ, సంసారం గౌరవంగా దిద్దుకుంటుంది. ఆవిడకి యిల్లేప్రపంచం.

అనంతాచార్లగారు, నిధిని తనతో వొచ్చెయ్యమన్నాడు. ఆజిల్లాలో డాక్టర్ల అవసరం ఎంతో వుందనీ, తన భుక్తికి ఏమీ లోటు జరగదనీ, తన శ్రేయస్సు కోరేవాళ్ళు స్వంత స్థలంలో ఎవరూ లేనందున, అతను యిక్కడే వుండటం మంచిదనీ నచ్చజెప్పి, నిధిని వొప్పించారు. అనంతాచార్లగారు కర్నూలువెళ్ళి పెద్దకూతుర్ని తీసుకొని, నిధితోకలిసి వారం రోజుల్లో న్యాయంపల్లి వొచ్చేశారు. అప్పటికప్పుడే ఆ తాలూకాలోకూడా, కలరా ప్రాకింది. అనంతాచారిగారు, నిధికి వో సైకిల్ సంపాదించిపెట్టారు. దానికి బాగ్ తగుల్చుకుని మళ్ళా పల్లెపల్లెకి తిరిగి పనిచెయ్యడం సాగించాడు. ఒక్కొక్క సమయంలో రాత్రుళ్ళు భోజనంలేకుండానే, ఏ పాడుబడిన గుడిలోనో, షెడ్డుల్లోనో గడపడం జరిగేది. గుడికి దూరంగానే దేవుడి సమక్షాన, ఎన్ని శవాలని తగలబెట్టాడో!

ఇరవైరోజుల్లో పరిస్థితులు బాగుపడ్డాయి. నిధికి తిరగడం తప్పింది. అనంతాచారి గారింట్లో ముందు గదిచ్చారు. ఇల్లు అంత పెద్దది కాదు.

దొడ్డిమాత్రం చాలా పెద్దది. ఇంటివెనకాల అంతా బైలే. ముందుగదిలో వొకపురాతనపు ఈజీచైరూ, పుస్తకాలబీరువా వున్నాయి. గది చిందర వందరగా వుంటుంది. బీరువాలో పురాణ గ్రంథాలు—రామాయణం, భాగవతం, భగవద్గీత, భట్టివిక్రమార్కుని కథలు. కాంగ్రెస్ కార్యక్రమానికి సంబంధించిన గ్రంథాలువున్నాయి. ఉదయం యింత కాఫీ తాగటం, సైకిల్ మీద వజ్రకరూరో, చుట్టుప్రక్కల పల్లెకో వెళ్ళి పేషెంట్లని చూడటం, మధ్యాహ్నం భోజనం, నిద్ర, సాయంత్రం మళ్ళా పనిమీద వెళ్ళటం, రాత్రి పురాణ కాలక్షేపం, లేకపోతే రామాయణాన్ని పఠించటం —యిదీ అతని దినచర్య.

ఒకరోజున దొడ్లోస్నానానికని, వంటింట్లోంచి వెళ్ళబోతున్నాడు నిధి. అనంతాచార్లుగారి రెండోకుర్రాడు, శేషు అట్లా వెళ్ళకూడదని చెప్పి, వేరేగదిలోంచి దొడ్లోకి తీసుకెళ్ళాడు. భోజనంకూడా యితనికి యివతల గదిలోనే పెడుతున్నారు. ఇతను అనంతాచార్లుగారితో వాదించటం, ఆయన భార్యరాజమ్మని కూక లెయ్యడం జరిగింది. ఇతన్ని వంటింట్లోంచి వెళ్ళ నిస్తున్నారు కాని భోజనంమాత్రం వేరేనే పెడుతున్నారు. ఇంతలో రెండో అమ్మాయి మాధవి పురుటికొచ్చింది. మాధవి భర్త సికింద్రాబాద్‌లో పుగాకు పరిశోధనాలయంలో పని. ఆ అమ్మాయి నెత్తిమీద ముసుగేసుకుంటుంది. ముసుమల్ జోళ్ళతో కాని యింట్లోనడువదు. ఒకటిరెండు రోజులు, తల్లీ, ఆమె ఘర్షణ పడ్డారు. జోళ్ళు తీసేసింది. కాని ముసుగు తియ్యలేదు. రాజమ్మగారు నచ్చజెపితే, కొంతవరకు అంగీకరించి, 'వూ' అనే రకం కాని, మొండి పట్టుదల మనిషికాదు. పూర్తిగా వొప్పుగోకుండా, సగం సగం అంగీకరిస్తుంది. మాధవితోకూడా, కొడుకు 'గోపు' బంట్రోతు రెహమాను, ఆడబడుచు ఆండాళమ్మకూడా వున్నారు. ఎవరికో ఏదో జబ్బుచేస్తూనే వుండేది. నిధి, వారికి మందులిస్తూనే వుంటాడు. బళ్ళారివెళ్ళి, వొంద రూపాయల మందులు తీసుకొస్తానని, వారంరోజులు బళ్లారివెళ్లి వొచ్చాడు.

నిధి. క్రితం రాత్రే మాధవి ప్రసవించి ఆడపిల్లని కంది. పురిటిమంచం ముందు గదిలో ఏర్పాటుచేశారు. అనంతాచార్లుగారితో చెప్పి, దొడ్లో, దూరంగా —అంటే ఫర్లాంగు దూరంలో — మొండిచెట్టుకింద రాళ్ళు పరిపించి, నాలుగు కర్రలు నాలుగుమూలలా పాతించి, తాటాకూ వూరిగడ్డి వెయ్యించి, చిన్న కుటీరం లాంటిది నిధి ఏర్పాటు చేయించుకున్నాడు. ఆ కుటీరానికి 'శాంతి' అని పేరు పెట్టుకుని, తన పుస్తకాలు, బేగ్, వ్రాతబల్ల, కుర్చీ, రెండు పొడుగాటి నేలమట్టం బల్లలపైన పక్కా, అందులో వేయించుకున్నాడు. అందులో వొంటిగా వుంటూ, భోజనానికి, కబుర్లకీ అనంతాచారిగారింటికెడుతూ కాలం వెళ్ళబుచ్చుతుండేవాడు.

ఒకరాత్రి భోజనంచేసి దొడ్లో చెయ్యి కడుక్కుంటూంటే రాజమ్మ గారికి తేలుకుట్టింది. ఆ చెంబు గిరవాటేట్టి 'బాబోయి మండ్రగబ్బ'ని కేకేసి వంటింట్లో పడుకుని ఏడవడం సాగించింది.

మూడేళ్ళు కాసే కుర్రాడు పిలవగానే నిధి తన లాంతరు తగ్గు తీసుకు చక్కావచ్చాడు. ఈలోగా అనంతాచారిగారి గ్గుండంతా దీపం తీసుకుని వెదికి, అసలు తేలే లేదు, ఏ గండుచీమో, దానికింత గొడవేమిటని భార్యని కేకలేస్తున్నాడు. రాజమ్మగారు, మొగుణ్ణి కసురుకుని భోరుని ఏడవడం సాగించింది. ఆ ముచ్చట్లూ ఆఖరు చూస్తాడు రంగడు, కాత్యాయని, రాధ మూగి చూస్తున్నారు. హాల్లో నిధి నుంచుని, 'లోపలికి రమ్మంటారా?' అని అడిగాడు. రాజమ్మగారు, తెరిపిచేసుకుని, నవ్వి 'దబ్బుని మందే నాయనా, మండ్రగబ్బే' అన్నది. నిధి వంటింట్లోకెళ్ళి నెప్పి కనపడకుండా ఇంజక్షనిచ్చాడు. ఈలోగా హనుమంతప్ప, మంత్రగాణ్ణి తీసుకొచ్చాడు. వాడు మంత్రంవేశాడు. రాజమ్మ తెల్లారగట్ట నాలుగింటి దాకా బాధపడుతూ మూలుగుతూనే వుంది. అందరూ మెల్లిమెల్లిగా పక్కలమీద వొరిగారు. అనంతాచార్లుగారు, మందువాలో ముసుగుతన్ని పడుకున్నారు. పిల్లలంతా పడుకున్నారు. నిధి మాత్రం, ఆవిడ పక్కనే పత్రిక చదువుతూ, వోదారుస్తూ

తెల్లవార్లూ జాగారం చేశాడు. మూడింటికి రహమాన్, తన పెళ్లికుటుం బాన్ని, రోడ్డు పక్కన బండకింద సాయంత్రం చూశానన్నాడు. నిధి అతనితో యీవిషయం ఎవ్వరితోనూ చెప్పొద్దని, రహమాన్‌తో కలిసివెళ్లి, వాళ్ళపెద్ద చూడుతున్న తేలుని తీసుకొచ్చి, దొడ్లో రాజమ్మగారు చెయ్యి కడుక్కున్న చోటున పడేయించి, నాలుగింటికి దీపంతో దొడ్డంతా వెదికి తేలుని పట్టుకున్నట్లు అభినయించి, ఆతేలుని చంపి, రాజమ్మగారికి చూపించాడు. అది మండ్రగబ్బ కాకపోయినా, ఆజాతిదే అని ఆవిడతో చెప్పాడు. దాన్ని చూసిం తర్వాత, ఆవిడ బాధంతా తగ్గి, మూలగడం మానేసి, నిధిని మెచ్చుగుని, భర్తని కాసేపు పడిగి నిద్రపోయింది. ఐదుగంటలవుతోంది. నిధి దొడ్లో గేదని పాలు పితకడానికెళ్ళాడు. అదిసరిగ్గా నిలబడటంలేదు. ఇంతలో 'నెప్పి తగ్గిందా అమ్మా' అంటూ కాత్యాయని లేచింది. అమ్మ మాట్లాడలేదు. దొడ్లో నిధి గేదతో పడుతున్న అవస్థచూసి, దొడ్లోకొచ్చి, గేదెని పలుపుతో పట్టుకుని నిలబెట్టింది, అతను పాలు పితికాడు. గబగబా వంటింట్లోకి పరుగెట్టి, కాత్యాయని కుంపటి ముట్టించి, పాలుకాచి, కాఫీ తయారుచేసింది. నిధి రాజమ్మగార్ని లేపాడు. ఆవిడ మొహం కడుక్కుని, 'మానాయనే—ఎంత మంచి కాఫీ' అని నిధిని మెచ్చుగుంటూ, మళ్ళా నిద్రపోయింది. ఇది జరిగిం తర్వాత ఇంట్లో అందరి వైఖరి మారింది. అందరూ నిధిని ఎంతో ఆప్యాయంగా, వారింట్లో వాడిలా చూడటం మొదలెట్టారు.

నిధి, తన పెళ్ళివిషయం రాజమ్మగారితో చెప్పక తప్పింది కాదు. ఆవిడ జాలిపడింది. తనువెళ్ళి తీసుకొస్తానంది. వాళ్ళింట్లోనే కాపరం పెట్టొచ్చునంది. ఇతను నవ్వివూరుకున్నాడు. అప్పుడప్పుడు నిధి, అనంతాచార్లు గారితో కలిసి గ్రామ పర్యటనం చేశేవాడు. ఆచార్లుగారు, సభలలో ప్రసంగించేవాడు, రాత్రిళ్లు పురాణ కాలక్షేపం చేశేవాడు. కొన్ని సభలలో నిధి కూడా వుపన్యసించేవాడు. వీరిని ఎంతోమంది గౌరవించేవారు. చాలా

మంది స్నేహితులయ్యారు. కొంతకాలం, వజ్రకరూర్‌లో వుచిత చికిత్సా లయం పెట్టించడానికి డబ్బు పోగు చెయ్యడంలో జరిగిపోయింది. రాజకీయ రంగంలో ప్రవేశించిన రాజభూషణం, ఆంధ్రరాష్ట్రం విషయం రాయల సీమలలో ప్రచారం చేసే జట్టుతో వొచ్చాడు. నిధి ఎక్కడున్నదీ తెలుసుకుని, అక్కడికి వొచ్చాడు, రాజభూషణం. ఉదయం తొమ్మిదిగంటలైంది. అనంతాచార్లుగారు ఏదో వూరెళ్ళాడు. అతనితో రాజమ్మగారే మాట్లాడింది. దూరంగావున్న పాకలో వుంటాడు అక్కడికి వెళ్ళండంది.

పాకలో నిధి, కాళ్ళు స్తంభానికి ఆనించి పడకకుర్చీలో కూర్చు న్నాడు. పక్కన బల్లమీద కూర్చుని కాత్యాయని మందుగ్లాసులు, అదీ సర్దుతోంది. పక్కన రంగడు, గోవిందు తున్నాడు. రాజభూషణం రాగానే కాత్యాయని వెళ్ళిపోయింది. అనంతచార్లుగారి కుటుంబం అందరి లోకీ బొత్తిగా ఎవరితోనూ మాట్లాడనిపిల్ల, కాత్యాయని. ఇంట్లో ఎప్పుడూ ఏదో పని చేస్తూనే వుంది గాని, చురుకుగా, సలాకీగావుండదు. పెళ్ళి కాలేదని తెంగనివాళ్ళమ్మ అంటే రెండు రోజులు ఎవ్వరికి కనబడకుండా, ఏడుస్తు కూర్చుంది. రాజమ్మగారిని మొగుడుకూకలేశాడు. నలుగు రాడపిల్లల లోకీ, కాత్యాయని చక్కందనీ; మంచి మొగుడువొచ్చి, వాళ్ళయత్నం లేకుండానే పెండ్లిచేసుకు పోతాడనీ, రాజమ్మగారి ధైర్యంమీద అనంతా చార్యులుగారు, వివాహ యత్నాలు గట్టిగా చెయ్యడంలేదు. కాత్యాయని లక్ష్మీదేవంత ఎఱుపుకాదు, రాధంత నలుపూకాదు, మధ్యరకంచాయ. తల్లి తండ్రులలోని, ఆకారాలని మినహాయించి, అందమైన లక్షణాలు కాత్యా యనిలోవున్నాయి, రాజమ్మగారి నల్లగా మెరిసే పెద్దజుట్టూ, విశాలమైనగుండ్రని బుగ్గలూ, అనంతాచారిగారి 'నిమీలిత' నేత్రాలూ, ఎఱ్ఱటి చిన్నినోరూ,— అన్నీవచ్చాయి. కాత్యాయినికి పైపన్ను, నోటి చివరిది, వూడింది. మాట్లాడి నప్పుడు అదికనపడదు, నవ్వినప్పుడు, కనిపిస్తుంది. కాని కాత్యాయని ఎప్పుడోకాని నవ్వదు. "ఈలోకంలో ఎందుకు పుట్టాంరా బాబూ" అను

కొన్నిష్టు దీనంగా వుంటుంది. తండ్రి సంస్కృతం చెప్పాడు. లక్ష్మీదేవమ్మ పోరితే, వొక మేష్టర్ని పెట్టి హిందీ చెప్పించాడు. ఇప్పుడు వీలున్నప్పుడల్లా నిధి ఆమెకి ఇంగ్లీషు నేర్పుతున్నాడు. కాత్యాయనికి పాఠం చెప్పడం చాలాకష్టం. ప్రశ్నకి సమాధానం చెప్పదు. తెలిసిందా? అని అడిగితే తల వూపుతుంది.

ఇంట్లోనుంచి కప్పులో కాఫీ తీసుకొచ్చి బల్లమీద పెట్టింది. రంగణ్ణి కేకేసి చెవులో ఏదో చెప్పింది. రంగడువొచ్చి రాజభూషణాన్ని "ఏమండీ మీరు సజ్జరొట్టె తింటారా?" అని అడిగాడు.

"మరి గత్యంతరంలేదు, గుజ్జాల తిండికప్ప—ఏదోవొకటి—" అంటూ నవ్వాడు రాజభూషణం. అక్కడున్న వారెవ్వరూ యింకులోని వ్యార్థ్యాన్ని గుర్తించినట్టులేదు. కాత్యాయని యింట్లోకెళ్ళి, రెండు సజ్జరొట్టెలు తీసుకొచ్చి, మళ్ళా వెళ్ళిపోయింది.

"ఐతే, భాయీ, యీపిల్లోత్తమ మూంగదా ఏమిటి ఖర్మ" అని అడిగాడు రాజభూషణం.

"కాదు, కాదు సిగ్గు."

"సో, అవివాహిత అన్నమాట. ఇలానే ఇక్కడ నీకన్ని ఏర్పాట్లు జాగున్నాయి కనుకనే. నాగరికతని వొదిలేసి ఆశ్రమవాసంలో వున్నావు."

"నువ్విలా అనడం నాకిష్టంలేదు రాజా! ఇక్కడ మాత్రం నాగరికత లేదా? వీరుమాత్రం మనుషులుకారా?"

"ఇక్కడ వుండి, వీళ్ళవుప్పు తింటున్నావు కాబట్టి, నువ్విల్లా వెనకేసుకుని రావడం సమంజసమే—కాని, యిది నాగరికత అనుకోవడం ఆత్మవంచన. వీళ్లకి వో సంస్కారమూ, వో భాషా, వో కళలా—వెనక కృష్ణదేవరాయల టైమ్‌లో గొప్పగా బ్రతికామన్న డాబులు తప్ప, వీళ్ళునిజంగా అడివి మనుషులే. నువ్విల్లా వుండగలుగుతున్నావో ఆశ్చర్యమే" అన్నాడు రాజా.

"ఇప్పుడేగా, కావ్యాన్ని చూసి తిలోత్తమ అన్నావు. ఇంతలో అడివిమనిషై పోయిందా" అన్నాడు నిధి నవ్వుతూ—

"అడివిలో అడివి పుష్పం పొంగొచ్చుగా—"

"నీకు రాయలసీమ పై అల్లాంటి అభిప్రాయం వున్నప్పుడు, ఇక్కడ ప్రచారం చెయ్యడం ఎందుకు?"

"ఏదో పందిమందితోనూ కలిసి వొచ్చాను. కాని, నాకు నిజంగా నమ్మకంలేదు. మేం సర్కారు వాళ్ళతో కలవం మొర్రో అంటున్నారు కాని నా అభిప్రాయం, వాళ్లు కలవకుండా వేరేవుంటేనే మంచిది. మనతో కలిస్తే వాళ్ళని మనతో సమానంగా చెయ్యాలంటే, మూడు పుష్కరాలేనా పడుతుంది.—"

"పోనీ, వాళ్లని నీతో సమానంగా చేసింతర్వాతనే, ఆంధ్రరాష్ట్రం కావాలను. చిన్నితమ్ముడు చదువుకోలేదు కాబట్టి, ఆస్తిలో వాడికి వాటా వొద్దనా నీవాదన!"

"ఆంధ్ర రాష్ట్రం వొస్తేగాని యీ ఆశయాలు నెరవేరవు—అనేగా యీగంద్రగోళం అంటాను." అన్నాడు రాజా.

"ఈ ఆశయాలు నెరవేరకపోతే రాష్ట్రం రాదు; రాష్ట్రం రాక పోతే యీఆశయాలు నెరవేరవు — ఎలాగో? ముందు రాష్ట్రం రావాలని నీవాదం; ముందు యీ ఆశయం కొనసాగాలని నాసంకల్పం."

"ఐతే దీనికి నువ్వుచేసే కృషి ఏమిటో తెలుసుకోవొచ్చా? ప్రక్కన ఇన్‌స్పిరేషన్ వుంది గాబట్టి, నువ్వు కృషిచేస్తే చెయ్యనూ వొచ్చు." అని రాజభూషణం బిగ్గరగా నవ్వాడు.

"తమ 'పనియిది' అనుకోకుండా, నిశ్శబ్దంగా పనిచేసే వాళ్లవల్లే, ప్రపంచం అసలు కదులుతోంది.—దానిమాట అల్లావుంచి నువు కావ్యాన్ని వుద్దేశించి అలాహేళని చెయ్యడం నాకిష్టంలేదు—"

"హేళనకాదు, నేను నిజంగా అంటున్నాను. ఇన్‌స్పిరేషన్ లేక

పోతే నువ్వు పనిచెయ్యలేవు—ఉంటే చెప్పడుకాకుండా, నువ్వన్నట్లు నిశ్శబ్దంగా' చేశేస్తావు— సుశీల విషయంలో నువ్వుచేసిన కృషి..."

"ఫూల్ —నోరముయ్—" అంటూనిధి స్తంభాని కాసించిన కాళ్ళ నుదించి, బలహీనంగా లేచి నుంచున్నాడు.

"ఏం కొడతావా ఏమిటి —?" అంటూ రాజా వొకడుగు వెనక్కి వేశాడు.

"ఈ ధోరణిలో మాట్లాడితే తప్పకుండా కొడతాను—"

"అవును. నిజం చెబితే ఎవరు సహిస్తారు? కాని స్నేహితుణ్ణి కాబట్టి చెబుతున్నాను. నిన్ను గురించిన యథార్థం నువ్వు తెలుసుకోడం అవసర మేనా—నీకు వివాహం జరిగిందన్న సంగతి యిక్కడి వాళ్ళకు తెలుసా?"

"తెలుసు"

"సుశీల, నాగమణి, కోమలి— అమృతం—ఇందిర, యిప్పుడు కాత్యాయని—"

"గెట్ ఔట్ పో, వెళ్ళిపో—"

"వెళ్ళిపోతాను. సత్యాన్ని నువ్వు దాచలేవు—"

"పో—"

"సత్యం ప్రపంచానికి నోరిప్పి చాటుతుంది. ప్రపంచం నమ్మకపోతే, తనే నీపీక పిసుకుతుంది." అంటూ, రాజా, తొందరగా నడిచి వెళ్ళి పోయ్యాడు. నిధి, నీరసంతో మూలుగుతూ కుర్చీలో వాలిపొయ్యాడు.

మలేరియా వ్యాధినించి, కొంచం తేరుకుంటున్న మనిషిని, యీ ఘట్టం కదిపేసింది. తల పగిలిపోతుంది. అద్దంలో తన మొహం చూసు కున్నాడు. దటంగా గడ్డం పెరిగివుంది; చేసుకోడానికి ఓపికలేదు. తోక చుక్కలా రాజభూషణం తన కొత్తప్రపంచంలో కొచ్చి నిశ్చలత్వాన్ని నాశనంచేశాడు. ఏవేవో, జ్ఞాపకాలు. మొదడు అనేది లేకుండా వుంటే బాగుండును లేకపోతే, మొదడు నెత్తిమీద వొక డిప్పలాగ వుండి వుంటే

దాన్ని బైటకిలాగివుఫ్‌మని వూది, దుమ్ముకొట్టు తుడిచి, బాగుచేసి, మళ్ళా తగిలించవొచ్చు కదా! వర్తమానం తప్ప, భావికాలం, భవిష్యత్తు వుండ కూడదు మనిషికి. ఆ రెండూ వర్తమానాన్ని నిరంతరం హత్యచేస్తాంటాయి. భావికాలం తీర్పు చెబుతుంది; భవిష్యత్తు శిక్షిస్తుంది. ఆ రెంటిని గురించి, చింతించి, కృశించి, శల్యమై, మనిషి వర్తమానంలో ఆత్మహత్య చేసు కుంటాడు.

అల్లా గంటలు గంటలు పడుకొని, కళ్లు తెరిచాడు. ఆకులు, గడ్డి గాలికిలేచి అతని మొహాన పడుతున్నాయి. మేఘాలు గొర్రెల మందలా పడమటి ఆకాశంలో సూర్యుణ్ణి మేస్తున్నాయి. గడ్డి బయలులాంటి రశ్మి, కరిగిపోతోంది. కొండలపై మొండి బండలు కదుల్తున్నట్లున్నాయి. భూమి తపస్సుకి మెచ్చుకుని ఆకాశం సంతసించి వర్షిస్తోంది. రాళ్లమధ్యపడే చినుకులు, మామూలు వర్షమే. బంగారపు తునకలుకావు; మధువుకాదు; క్షీరంకాదు కాపరిలా సూర్యుడు, కిరణాల కఱ్ఱలని మేఘాలమధ్య ఝూడి స్తున్నాడు. పక్కకి తిరిగి చూశాడు. కాత్యాయని, ఆవీ యివీ సర్దుతోంది.

"అబ్బో, పెద్దచినుకులు." అంది, ప్రకృతిని సంబోధిస్తూ.

"వానలో తడవొద్దు, నువ్వుయింటికి వెళ్లు," అన్నాడు నిధి.

"చలి—జబ్బుచేస్తుంది. లోపలికి రండి" అంది.

"ఫరవాలేదు—హాయిగావుంది ప్రాణం."

"శాలువా తీసుకు రానా?"

"వద్దు"

కాత్యాయని, శువ్వాలు నెత్తిన కప్పుకుని గబగబా లోపలికెళ్ళింది. రంగడు ఫ్లాస్కు తీసుకొచ్చి గ్లాసులో కాఫీ పోసి యిచ్చాడు.

"అమ్మ రమ్మంటోంది"

"ఫరవాలేదు. యిక్కడ బాగుందనిచెప్పు"

వర్షం రాళ్లమధ్య యిసికలో చారలు చేసుకొని, చిన్నికాలవలా

పాకమట్టూ పాకుతోంది.

"నాకో పడవచేసి పెట్టవూ?" అన్నాడు రంగడు.

పత్రిక కాగితం చించి, రెండు పెద్దపడవలు చేశాడు నిధి. రంగడు వాటిని నీళ్ళల్లో వొదిలాడు. అవి కొంతదూరం జారి బెడ్డలమధ్య యిరుక్కున్నాయి. వర్షం నిలిచి పోయింది. మేఘాలు వేగంగా విడిపోయాయి. నీళ్లలో స్నానానికి దిగి, చలికి తట్టుకోలేక చేతులుచిక్కి కదిలించినట్లు, సూర్యుడి కిరణాలు దూరంగా వ్యాపిస్తున్నాయి. కాత్యాయిని యింట్లోంచి వొచ్చి వో కవరు అతనికిచ్చింది. చించి చదివాడు. అది జగన్నాథం వ్రాసింది. అందులో వొకటే విశేషముంది. అమృతానికి ఆరో మాసంట.

దయానిధిలేచి తొందరగా పడమటి వైపుకు నడవడం మొదలెట్టాడు. సూర్యాస్తమయానికి యింకా రెండుగంటలు పడుతుంది. వర్షం వెలవగానే తలంటు పోసుకున్నట్లు, సూర్యుడు పవిత్రంగా ప్రకాశిస్తున్నాడు. ఆ కాంతిలో శరీరాన్ని తడిపి, ఎండబెడితే, పాపంతొలిగిపోయి పవిత్రం అవుతుంది. శరీరం స్వర్గాంగుపైన, కాలిబాట సన్నగిలి రాళ్లల్లో అంతర్ధానమైంది. గుట్టల నీడలు చల్లగా నిశ్చలంగా పడుతున్నాయి. ఇసుక కాళ్లకింద చలితో వొణికిపోతోంది. పిచ్చిమొక్కలన్నీ సంతోషంతో సొమ్మసిలి పోయాయి. పక్షులు జాతినీతిని తిరస్కరించి సూర్యునివైపు జంటలుగా లేచి పోతున్నాయి. వేడికోసం తపిస్తూ, రాళ్లు కూడా పడమటి దిక్కుకు దగ్గరగా జరుగుతున్నట్లున్నాయి. గిలిగింతలతో విడిపోయి, యిసుక మాయమైంది—కాళ్లకింద రాళ్లు నవ్వాయి; గడ్డి నిద్రలోశ్వాసలా కదుల్తుంది; గుట్టలు, రాళ్లు, పక్షులు, పురుగులు—అన్నీ సూర్యుడికేసి ప్రయాణం.

గంట నడిచాడు. కాళ్లు తేలిపోతున్నాయి; గుండెలు బరువెక్కాయి. సగం ఆరిన నల్లరాయిమీద కూర్చున్నాడు. దూరంనుంచి పసుపుపచ్చగా కనిపించింది. దగ్గర నుంచి చూస్తే అది నల్లరాయే. ఊరుని, జిల్లాని, రాష్ట్రాన్ని, దేశాన్ని వొదిలి పారిపోవచ్చు; కాని తన శరీరంలోంచి ఎల్లా పారిపోగలడు?

జగన్నాధం వ్రాసినవుత్తరం మళ్ళా చదువు కున్నాడు. ఆరో మాసంట కారణం అత నేనని అతనిభయం. అమృతం ఏం చేస్తుంది! అమృతం భర్త అమృతాన్ని శంకిస్తాడా? భర్తవిడిచి పెడితే అమృతం ఏమవుతుంది? రాజభూషణం ఏమంటాడు? సత్యం తనమాట ఎవరూ వినకపోతే, తనే అతని పీక నులుముతుంది—అన్నాడు. తనపీకతనే నులుముకున్నట్లు జరిగింది. అతను ఏలూరునుంచి వొచ్చి ఐదుమాసాలేగా అయింది. అమృతానికి యిప్పుడు ఆరోమాసంట. సరిగ్గా ఎన్నోమాసమో ఎవరు నిర్ణయించగలరు? అమృతం అబద్ధం ఆడిందేమో, సత్యం ఎట్లా తెలుస్తుంది. అమృతానికి తన ద్వారా సంతానం కలగకపోతే, ఏమీ ప్రమాదంలేదు; సత్యం తన నోట్లోనే గుడ్డలు కుక్కుకుని చస్తుంది. అంతేనా నీతి? మంచితనం అంటే పట్టుబడని చెడ్డ తనమేనా?

తనుచేసిన పని మంచిదో చెడ్డదో నిర్ణయించుకోడం ఎంతకష్టం. ఆ కార్యానికి ఫలితం చూపి ప్రకృతే విలువ కడుతోంది; సంఘం దాన్ని ఆధారంచేసుకుని నిర్ధారణచేస్తుంది. ఐతే తన అభిప్రాయం ఏమిటి? ఆ పరిస్థితులలో, ఆవ్యక్తులు, అట్లా చెయ్యకతప్పదు. ఏ యిద్దరు వ్యక్తులేనా, ఆపరిస్థితులలో అట్లాచేసి తీరుతారు 'అహం' 'వ్యక్తిత్వం' 'స్వార్థం' 'నేను' అనే చైతన్యం'—అన్నిటినీ నాశనం చేసే మహత్తర అనుభవం. దానికి అతీతం ఐన వ్యక్తులు, దేవతలో, మహాఋషులో కావొచ్చు. కాని మానవులుకాలేరు. 'మానవత్వం' మంచిదే. అదొక్కటే మంచేమోకూడా! దానిఫలితంతో నిమిత్తం ఎందుకు? కాని సంఘానికి ఫలితాలు కావాలి. చిహ్నాలు, బహిర్గత చిహ్నాలు, కావాలి. మానవత్వం వున్నవాడు, ఆ కృత్యాన్ని సమర్థించ గలడు; అదిలేనివాడి విమర్శకి విలువేలేదు. ఆ విధంగా అది 'మంచే' అని నిర్ణయించు కున్నాడు. సానుభూతి, ప్రేమ నిర్మలమైన ఆనందం—యివి మహోజ్వలమైన విలువలు. వీటిని ఆ అనుభవం యివ్వగలిగింది యిద్దరి వ్యక్తులకు. ఈ విలువలని మానవులందరూ సాధించగలిగినప్పుడు, ప్రపంచం స్వర్గ

తుల్యం. మానవత్వం లేని మనుషుల క్షేమంకోసం సంఘం ప్రతిపాదించిన 'వివాహం' మొదలైన సంస్థలపై తిరుగుబాటుచేసి, తమ మానవత్వాన్ని ప్రకటించినప్పుడు, సాధించలేనివారు, సాధించినవారిపై తీర్పుచెప్పి, శిక్ష విధించడం, సమంజసమే. శిక్షార్హులసంఖ్య అతిస్వల్పం. యుగానికి యిద్దరో ముగ్గురో; దేశానికి యిద్దరో ముగ్గురో. తనుచేసిన పని తనకి నచ్చాలి; మంచి దని స్థిరపరచుకోవాలి; అదిముఖ్యంగాని, యితరులు కళ్ళద్వారాచూసి విలువకట్టి, వొక కార్యాన్ని ఖండించడం, నైతిక పిరికితనం. దుర్నీతిపరుడు తన్ను తాను విమర్శిస్తాడు.

కాని యీ ఆలోచనలు నిధికి శాంతిని యివ్వడంలేదు. ఇవన్నీ తన ప్రవర్తనని సమర్థించడం కోసం, తార్కికజ్ఞానాన్ని, భాషని, భావాలని వ్యభిచరింప చెయ్యడంలా తోస్తోంది. "చెడిపోవడం ఆధునికులు తెలుసు కున్నారనుకోవడం పొరపాటు. అది అనాదినుంచి వుంటున్నదే; కాని దాన్ని సమర్థించి, వీలైతే బహిరంగంగా చెప్పుకోవడం, ఆధునికం; నేటి నాగరికత" అన్న రాధాకృష్ణన్ వాక్యాలు స్మరణకొచ్చాయి. బుద్ధిచిత్ర మైంది. మనం మంచిదనుకున్నా సమర్థించేటందుకు, ఎన్నో కారణాలు వెదికి పెడుతుంది. మనప్రవర్తనకి మనవుద్రేకాలుకారణం. వుద్రేకాలు శరీరాన్నుంచి జనిస్తాయి; ఇంతకీమంచిచెడ్డల నిర్ణయంకూడా శరీరమేచేసేస్తుంది. బుద్ధి, మరో ప్రపంచం గోవునయించిన సూర్యుడిలా వృథాగా చూస్తూ గూర్చుంటుంది.

తనలోంచి తాను పారిపోలేడు తను, తన శరీరంలోనే హాయిగా కాపరం వుండాలంటే మంచిగాలి, వెలుతురు, చోటు వుండాలి. ఇవి లేకపోతే శరీరంతో వుండలేడు. ఇవిలేనివాడి, కిటికీలు మూతలుపడతాయి; మెదడుబూజుపడుతుంది. స్వప్నంలో బంధించబడిన అడవిమృగాలైనా వాంఛలు గర్జిస్తాయి; విషసర్పాలు విషంకక్కుతాయి. ఎంతకాలం యిల్లా వుండటం. మరణమే శరణ్యం.

నువ్వు నీశరీరంతో వాదించలేవు. వేదాంతం తర్కం, నీతి—వీటితో

సంఘాన్ని మెప్పించలేవు. ప్రపంచాన్ని నీవెంపుకు తిప్పుకోలేవు; నువ్వు ప్రపంచం వేపు తిరగలేవు. నీమరణమే శరణ్యం "అప్రయత్నంగా అతని కళ్ళ మ్మట నీళ్ళుకారుతున్నాయి. ఎన్నో జ్ఞాపకాల కారుణ్యాన్ని భరించలేని నేత్రాలు, కన్నీటిని వొదిలేశాయి. భవిష్యత్తులేని భావికాలం దాచలేక పోయిన కన్నీరు ప్రతి బిందువూ నల్లరాతిమీద పడివిడిపోతోంది. అఖ్భుతం హృదయం ఆబిందువులతో భగ్నమైపోతోంది, మృత్యువుకూడా అంత మొందించలేని బాధ.

దూరంగా కాత్యాయని, రంగడు, గొల్ల బాయప్ప తనకేసి రావడం చూశాడు. సూర్యరశ్మికి ఎఱ్ఱగా మెరసిపోతున్న ఎఱ్ఱచీరలో కాత్యాయని, కిరణంలాగుంది. కాలి బొటనవ్రేలితో నేలని గీస్తూ కూర్చున్నాడు నిధి. ఏదో గట్టిగా తగిలింది. బొటనవ్రేలితో యిసికని లోతుగా కెలకడం మొద లెట్టాడు. ఏదో ఎఱ్ఱగా కనిపించింది. రంగడు రానేవొచ్చాడు. గుట్టప్రక్కన మొగ్గలేస్తున్నాడు.

"నాన్న మిమ్మల్ని యింటికిరమ్మన్నాడు." అన్నది కాత్యాయని.

"నాకోసం యింతదూరం నడిచి వచ్చావా?" కాత్యాయని ఏమీ మాట్లాడలేదు.

"అదేమిటి?" అంటూ అతని పాదాలకింద మట్టిని ప్రక్కకితోసి ఎఱ్ఱగా కనిపిస్తున్న రాయిని పెల్లగించడం మొదలెట్టింది. కొంచం ఆకుపచ్చ రేఖలున్న ఎఱ్ఱటి రాయి; చుట్టూ పెద్దరాయి; శ్రమపడి యిద్దరూదాన్ని పైకితీశారు. సూర్యుడుకిందికి జారిపోయాడు; కడసారి కిరణాలు, రాతివెలు గుని, కాత్యాయని గడ్డంకింద మెరిపించాయి. చిన్న రక్తం గడ్డకట్టిన. గాయంలా, కాత్యాయని గడ్డం ఎఱ్ఱగా తళుక్కుమంది. సూర్యుడు వేట విరమించి అంబులను, పొదిలో దోపుకున్నట్టు, కిరణాలు మాయమయ్యాయి

"ఏమిటిదీ___?" వింతగా చూసింది కాత్యాయని రాయికేసిచూస్తూ.

"కాత్యాయని" అన్నాడు నిధి. ఆ బలహీనమైన నవ్వును ప్రకృతి

తప్ప ఎవ్వరూ గమనించలేదు. రాళ్ళసీమ కూడానవ్వగలదు అనుకుంటూ, నిధి, యింటికిమరలాడు రాయిని తీసుకుని. కాత్యాయని, రంగడు, భాయప్ప, వెనకాల బైలుదేరారు.

# 9

## కాత్యాయని సంతతి

ఎనిమిదిమాసాలు గడిచినై. ఎనిమిది మాసాలలో న్యాయంపల్లి, న్యాయపురంగా మారింది. బొంబాయినుంచి వజ్రాల వర్తకుడు హీరలాల్ వొచ్చి, 'కాత్యాయనికి' విలువకట్టాడు 'కాత్యాయని' లేత ఎఱుపురంగుల వజ్రం బాగా పండిపోయిన పెద్ద ఎఱ్ఱ టొమాటో పండులా గుంటుంది. లోపల ఆకుపచ్చ తీగెలు మెరుస్తాయి. సంధ్యాసమయంలో, పాచినీళ్లలో కనుపించే ఎఱ్ఱ మేఘంలో నీడలాంటి కాంతిగలది. బెల్జియమ్ దొర లియాన్ బ్లామర్ట్ దాన్ని కోసి పదునట్టి, వజ్రంగా తయారుచేశాడు; ముప్పైతొమ్మిది కారట్ల బరువుకట్టాడు. న్యాయపురంలో 'కాత్యాయని' తొమ్మిది రోజులుంది. దాన్ని చూడ్డానికి ఎందరో జనం వొచ్చి పోతుండేవారు. ఆ జనం కోసం దుకాణాలు లేచాయి. మోటార్లమీదా, బండ్లమీదా తీర్థ ప్రజలా, వొచ్చిపోతున్నారు. ఇదివరకు ఆచుట్టు ప్రక్కల దొరికిన వజ్రాలను గురించి కథలు చెప్పుకున్నారు; అక్కడి పత్రికలు ప్రాచీన వజ్రాల చరిత్రల్ని ప్రచురించాయి. తరవాత హీరాలాల్ 'కాత్యాయని' కొనుక్కుని, తనతో బొంబాయి తీసుకుపొయ్యాడు. దానివెలలో మూడోవొంతు దయానిధి గవర్నమెంటుకి యిచ్చివేశాడు. అక్కడ వజ్రాల గని తవ్వించాలనీ, దానికి

కావల్సిన సహాయం చెయ్యాలనీ, ప్రభుత్వానికి విన్నపం చేశాడు. ఆ జిల్లాలలో ధనికులు కొందరు ధనసహాయం చెయ్యడానికి అంగీకరించారు. బొంబాయినుంచి ఇంజనీర్లువొచ్చి, ఆస్థలాన్ని పరిశోధించి, వజ్రాలులభ్యమయ్యే ఆవరణ ప్రణాళిక తయారుచేశారు. మూడుమాసాలలో గనికి కావల్సిన పరికరాలు పైదేశాలనుంచి వొచ్చాయి. చుట్టుప్రక్కల బీదజనానికి పని దొరికింది. నాలుగొందలమంది కూలి పనిచేస్తున్నారు. వాళ్ళకి కొంచం దూరంలో గుడిసెలు కట్టడం జరిగింది. మెకానిక్కులు, ఇంజనీర్లు వొయిరవైమందిఅక్కడే పనికి కుదిరారు. అన్నిపనులూ అనంతాచారిగారే స్వయంగా చూసుకుంటున్నారు. ఆయన యింటికి డాబావేశారు; చుట్టూ గోడ పెట్టారు. ఇదివరకు నిధికోసం ఏర్పాటుచేసిన 'శాంతి' పేరుగల పాక దగ్గరలోనే, నిధికోసం వొక భవనం నిర్మాణం అయింది. ఆధునిక కట్టడపు పద్ధతులలో ప్రావీణ్యం పొందిన నిర్మాతలు దాన్ని సిద్ధంచేశారు. చుట్టూ చెట్లమొక్కలు పాతారు. ముందు, మధ్యగా వొక ఫౌంటెన్ కట్టారు కాని, అందులోంచి నీరురాదు. పెద్దలోతైన నూతులు త్రవ్వి, రిజర్వాయిర్లు సిద్ధం చేస్తేకాని, నీటివసతి లేదన్నారు. చెరువు త్రవ్వకం ప్రారంభమైంది. ఈలోగా మైసూరు నుంచి శిల్పి ఛాయప్ప, వొచ్చి, నిధి తల్లిది, రాతి విగ్రహం వొకటి తయారుచేసి, ఫౌంటెన్ మధ్యలో ప్రతిష్ఠించాడు. అక్కడి కట్టడాలలో చూడదగింది, ఆశిల్పం వొక్కటే నన్నారు. నిశ్చింతగా రోజులు గడిచి పోతున్నాయి. రాయలసీమలో రాళ్ళుతప్ప మనుషులు లేరనుకున్న నిధి, తన అభిప్రాయం మార్చుకోవలసి వొచ్చింది. ఎండలో రాళ్ళల్లో పనిచేస్తున్న ఆ మనుషుల్ని చూస్తుంటే నిధికి ఎంతో ఆనందంగా వుండేది. నల్లగా కండలు తిరిగి, ఎండలో చెమట్లు కారుస్తూ, నీళ్ళల్లో ముంచిన నల్లరాళ్ళల్లా మెరిసే శరీరాలతో—ఆ మనుషులు నిజంగా మనుషులేనా? అసలు 'మానవత్వం' ఎందులోవుంది? ప్రాణికదలికలోనా? బండపనిలోనా? కదలకుండా మెదలకుండా, విశ్వాన్ని తిలకించడంలోనా? మానవుడి భాష

లోనా? సృష్టిలోనా? అతనికి తెలిసిందికాదు, తెలుసుకునేందుకు అతనికి వ్యవధిలేదు. నిరర్థకమైన ఆలోచనలతో కలం, జీవితం వృథా చెయ్యకుండా వుండడమే మానవత్వమేమో అనుకుంటుండగా, రాజమ్మగారు, అట్టహాసంగా గోడుగేసుకుని, కూలీలని గదమాయించటం దృశ్యంచూశాడు. వెనకాలే అనంతాచార్లుగారొచ్చి, భార్యని కూకలేశారు. ఎందుకో ఏం లాభం, ఆవిడ దర్జాగావుండి, అందరిమీదా అధికారం చెలాయిద్దాం అనుకుంటూ వుంటుంది, —ఇంతలో భర్త చక్కావొచ్చి, పరాచికాలాడో, కాస్తకోపంగా మందలించో, ఆవిణ్ణి చిన్నబుచ్చుతాడు. నిధికి నవ్వొచ్చింది. వాళ్ళవి ఎంతటి నిర్మలమైన మనస్సులు. ఆరేసిన తెల్లబట్ట లాంటివి వాళ్ళ మెదడు. అనుకున్నదానికి అన్నదానికీ ఆలోచనకీ, మాటకీ, చేతకీ బట్టమీద తడికివున్నంతటి సంపూర్ణమైన అన్వయంవుంది. మే స్త్రీ మాయప్పచెట్టి నవ్వు మీ హాలవెనక మరుగు పడింది. ఆ మనుషులుకూడా నవ్వగలరనుకున్న తర్వాత నిధి మనస్సు మరింత నిశ్చింతగా తయారైంది.

గని తాలూకు పనులన్నీ ఆచారిగారే చూస్తున్నారు. నిధి తను స్వయంగా చేసుకోవల్సిన పనులు బోలెడున్నాయి. అక్కడ వొక పెద్ద డిస్పెన్సరీ, రోగులకోసం గదులూ, కట్టడం పని అతనిది. నలుగురు నర్సులని, నలుగురు కంపౌండర్లనీ నియమించాడు. అక్కడకి కష్టపడి రాగలిగిన రోగులకి వుచితంగా చికిత్సఏర్పాటుంది. రాజమ్మగారి సలహామీద, అక్కడ వొక బడికూడా పెట్టించాడు. ఓనమాల దగ్గరనుంచీ నేర్చుకునేటందుకు యిష్టపడ్డ నిరక్షరాస్యులున్నారు. ముగ్గురు మాష్టర్లు నియమించబడ్డారు. ఆచారిగారి రెండోవాడు, శేషుకూడా రాత్రిళ్ళప్పుడు మేష్టరే. అనంతాచారిగారి పురాణ కాలక్షేపం వుండనే వుంది.

అందరిలోకీ తీరిక లేకుండా వున్నది నారయ్య. ఆ నాడే అమృతంగారి వూరునుంచి తిరిగి వొచ్చాడు.

"ఇవి మీరు భద్రంగా యిమ్మన్నారండి" అని తీసుకొచ్చిన చెకుర

గడలు, తేనె పానకం, భద్రంగా మూల గదిలో వుంచాడు. నిధి, నారయ్య ద్వారా అమృతానికి యివ్వవల్సిన మూడొందలూ పంపేశాడు

"డబ్బు తీసుకుందా?" అని అడిగాడు.

"ఎందుకు తీసుకోరండి— డబ్బుచేదా? ఆవిడ మొగుడు తీసుకున్నాడండి—"

"కాంతారావు, అతని పేరు, మొగుడనకూడదు, నారయ్యా. భర్త"

"మొత్తానికి మొగుడే కదంటండీ—"

"ఏమన్నాడు?"

"తీసుకుని, 'సరేలే' అన్నాడండి?"

"అమృతం ఏమీ అనలేదా?"

"ఏమంటుందండి. ఆవిడ మంచంమీదనుంచి దిగరండి—రేపోమాపో పురుడు కామోల్ను. శానాసేపు నన్ను గుర్తుపట్టలేదండి — యీ బట్టలూ వేషం చూసి కామందనుకున్నారండి —" అంటూ నారయ్య బోసిగా నవ్వి, తన తెల్లటి బట్టలకేసి గర్వంగా చూసుకున్నాడు.

"ఈపంచి ఆరిచ్చిందేనండి. ఇదిగోనండి వుత్తరం." అని నారయ్య, వుత్తరం యిచ్చాడు. నిధికి బోలెడు సందేహాలొచ్చాయి. అవి, నారయ్యని అడగాలో, అడగ కూడదో తెలిసిందికాదు. ఆవుత్తరం అమృతం ఎవ్వరూ చూడనప్పుడు రాసి, యిచ్చిందా, తన విషయం మాట్లాడేటప్పుడు, యింకా ఎవరేనా వున్నారా మొదలైనవి.

"ఏం నారయ్యా, అక్కడనుంచి ఎప్పుడు బైలుదేరావు?"

"తెల్లారగట్ల."

"ఉత్తరంకూడా అప్పుడే యిచ్చిందా?"

"క్రితం రాత్రేనండి."

"ఎప్పుడు రాసిందో?"

"నాకేం తెలుసుద్దండి?"

"ఇంకా ఏమన్నారు?"

"ఏమీ అనలేదండి — ఇక్కడ వూసులు చెప్పమన్నారండి. ఎందుకో, ఆవిడా, మొగుడూవూ తెగనవ్వాలండి—"

"ఎందుకో?"

"ఏటో నాకు మాచెడ్డతట్టుగా లేసుకొచ్చిందండీ"

"చాలా హుషారుగా వున్నారంటూ"

"ఉశార్రేనండి— ఓ, మీగళ్లు, జున్నులు, ఎన్న వూసలు, ఆరి కేంటండి,—"

"నాతో ఏమన్నా చెప్పమందా?"

"ఆరేమీ చెప్పలేదుగానండి, అత్తగారు కాంగ్రెసు, వొకముసిరామె, మిమ్మల్ని ఆళ్లవూరికి రమ్మన్నారండి. అద్దుగదిగో,—దూడ, ఇంట్లో తిరగబడతావుంది—" అంటూ నారయ్య కట్టుతీసుకుని వీధిలో కెళ్ళాడు. దయానిధి, మేడమీది గదిలో కెళ్ళి, బల్లదగ్గర కూర్చుని, ఉత్తరం చదవడం మొదలెట్టాడు. ఉత్తరం చదవబోతున్నానుగదా అన్న ఆలోచన ఎంతో సంతోషం యిచ్చింది. బల్లమీద అతనితల్లిఫోటోగ్రాపు ఎదురుగుండా, కనిపిస్తోంది. దాన్ని కనపడకుండా, అవతలకు తిప్పివేశాడు.

"నారయ్య అన్నీ చెప్పాడు. నువ్వింత వాడవైనందుకు, మా అందరికీ ఆనందంగావున్నది. ఏదోఅఘాయిత్యపడ వనుకున్నాను—రూపాయణాపైసలుతో సహా, నీకు లెక్కలుబాగానే జ్ఞాపకం వుంటాయే, డబ్బుతిప్పి పంపించివేశావు,— యిహనింతటితో మాజోలి అక్కర్లేదనా? ఎప్పుడైనా మావూరు రాగలవా రెండునెలలు పొయ్యాక — ? ఐనా నువ్వెందుకొస్తావులే, మాజోటి బీదలింట్లకి ? ఎప్పుడో మేమే వొస్తాము, — జగన్నాథం పరీక్ష పాసయ్యాడు—పై చదువు చదవనంటున్నాడు, వారం రోజుల్లో రావాలి. ఎప్పుడేనా వుత్తరం ముక్క వ్రాస్తూవుండు."

అదీ వుత్తరం. అతను వూహించుకున్న అమృతం ఆవుత్తరంలో ఎక్కడా

లేదు. అతనికి తెలిసిన అమృతంకూడా అందులోలేదు. డబ్బుపంప కుండా వుంటే బాగుండునేమో. ఆడబ్బువిషయం, భర్తకి తెలీనివ్వకుండా వుంచాలనుకుందేమో, రెండునెలలుగడిచాక రమ్మంది ఎందుకో? అలాగా. పిల్లాడు పుడతాడు కాబోలు. పిల్లాడనిఎవరు చెప్పగలరు, పిల్లకాకూడదు? 'మేము' "మాకు" అంటుంది కాని, "నేను" అనదేం? తనకీ లేనిపోని సంశయాలు కాని, యీవుత్తరం ఏకాంతగా వున్నప్పుడు రాసిందికాదేమో. అవును, తప్పకుండా అదే కారణం. ఎల్లాగైనా స్త్రీలు చాలా తెలివైనవాళ్లు. ఎదురుకుండా చూశాడు. తల్లిఫొటోగ్రాఫు తనకేసి చూస్తోంది—ఎవరు కదిపారు చెప్మా! ప్రక్కకి తిరిగాడు,—కాత్యాయని.

"నువ్వేనా దీన్ని కదిపింది?"

ఔనన్నట్లుగా తలపంకించి, నవ్వడానికి యత్నించిందికాత్యాయని.

"ఎవరో వొచ్చారు" అన్నది — ప్రపంచానికి కొత్త సందేశం చెప్పినట్లుగా.

"ఎవరు?"

"ఏమో."

కాసేపు నిదానించి—

"యువర్ వైఫ్" అంది ఇంగ్లీషులో. తనమాటకి తనకే నవ్వొచ్చింది. ప్రయత్నం లేకుండానే శబ్దచేస్తూనవ్వింది. ఊడిపోయిన పన్ను రానేలేదు. నిధి లేచాడు. ఆమె గబగబా కిందకి పరుగెత్తుకు పోయింది. అతను లేచి మెట్లుదిగుతున్నాడు తొందరగా. చివరి మెట్టుమీద కూర్చునివుంది కోమలి.

అతన్నిచూసి మెట్లమీదనిలబడి, నమస్కారం చేసింది. అతనుఅల్లాగే నిలబడిపోయి మాట్లాడలేకపోయ్యాడు. కోమలిలో అతను చూసినమార్పు ప్రపంచంలోని అనుభవాని కొక కొలతబద్ద. గతాన్ని శరీరం అంతటా ముసుగులా కప్పకుంది. ఛాయతగ్గింది. మనిషి ఎత్తుగా, లావుగా అయిపోయింది. ముడినిబట్టి, ఒడపాడుగ్గా లేదని చెప్పవొచ్చు. నడుం వెడల్పునుబట్టి ఆధునిక

నాగరికత వైశాల్యం తెలుసుకోవొచ్చు. సహజమైన ప్రకృతిలోని చెట్లను కొట్టించేసి, మొక్కలు, గడ్డి, పీకించేసి, ఎవరో శాఖ్ఖానాలు నిర్మించినట్లుగా వుంది. సరస్సులు, నూనెకందకాలు, పుష్పాలు, పనివాండ్ర టీ కప్పులు, ముళ్లు, కార్మికుల సమ్మెలు, కొండలు, మిల్లు యజమానుల దురంతాలు, మేఘాలు, ఫాక్టరీల పొగ, పక్షులు, తుమ్మెదలు, కీటకాలు, ఏమయ్యాయో, రొద, వాసన—? మిణుగురుల ఎలక్ట్రిక్ దీపాలు ఈ మార్పు పరిమాణానికి కోమలి బహిర్గత చిహ్నం. ఆమె చూపులో ఆనాటి చాంచల్యం యీనాడు లేదు. ప్రపంచాన్ని చూసివిసిగిపోయిన, నిశ్చలత్వంతో కళ్ళు మెరుస్తున్నాయి. కనురెప్పలు, దృష్టి యితరుల కంట పడకుండా, జైలుకడ్డీలుగా కాపాగావే[illegible]న్నాయి. అత్తరు తయారుకోసం, ఏనాడో రసాన్ని, అందాన్ని పిండి, పారేశిన గులాబిపుష్పం, ఆనోరు.

"ఇల్లారా" అని సంజ్ఞ చేశాడు, అతను మెట్లపైకి నడుస్తూ.

కోమలి నవ్వింది—సూర్యోదయంలో వెలవెలపోతున్న నక్షత్రాల లాంటి పళ్లని ప్రదర్శిస్తూ, మేడమీద గదిలోకొచ్చి, గుమ్మం మీద కూర్చుంది. "ఇల్లా, యిల్లా" అని వో సోఫాకేసి చూపించాడు. గదంతా నివ్వెరపడి చూస్తోంది.

"స్నానంచేసేవరకూ కనపడకుండా వుండాలనుకున్నా" అన్నది.

"ఏం?"

"రైలుపొగ నిద్రలేదు; ఒళ్ళంతా ఎల్లాగో —అసహ్యంగావుంది—"

"నీళ్ళు పెట్టించనా—?" అంటూ లేచి వెళ్ళాడు. ఈలోగా, కాత్యాయని, కాఫీకప్పు, ఫలహారం తీసుకొచ్చింది. కోమలి ఆమెకేసి పరీక్షగా చూసింది.

"నీపేరు చెప్పనా?" అంది; కాత్యాయని నీరసంగా నవ్వింది. ఇంతలో విధి వొచ్చాడు.

"ఇందిర అనుకుంటున్నావేమిటి?"

"——"

"కాత్యాయని. అనంతాచార్లుఅని, యీవూరే. వారి మూడోఅమ్మాయి.

"చెప్పమ్మా, నీపేరేమిటి?" అంది కాత్యాయన్ని వుద్దేశించి.

"కాత్యాయనీ దేవి—"

"అబ్బో,—తమాషాపేరే.—నా పేరు అడగవేం?

కాత్యాయని అమాయకత్వాన్ని నవ్వులో దాచేసింది.

"అబ్బో, ఎంత సిగ్గో! పెళ్ళయే దాకానే యిదంతా" అంది కోమలి, మనస్ఫూర్తిగా నవ్వుతూ. స్నానానికని, కాత్యాయని కోమల్ని కిందకి తీసుకువెళ్ళింది. కోమలి బెడ్డింగ్, లెదర్‌బాక్స్, నారయ్య పైకితీసుకొచ్చి, గదిలో పెట్టాడు. అందులో వో సోఫా, మంచం, రెండు కుర్చీలు వేశాడు.

"ఎవరండి ఆ వొచ్చింది.?" అని అడిగాడు.

"మాళ్ళేమా నువ్వు?" అన్నాడు నిధి.

"ఆడామేనంట. నే సూళ్ళా."

"చూస్తావుగా."

అని నిధిబైటకి వెళ్ళిపొయ్యాడు. కోమల్నిగురించి, అనంతాచార్లు గారితో చెప్పాలని సంకల్పం. ఏం చెప్పాలో, ఎల్లా చెప్పాలో ఆలోచించాలి. నిజంగా ఏం చెప్పాలో అతనికి తెలీదంలేదు. అసలు కోమలి ఎవరు? అన్న ప్రశ్నకి యదార్థమైన సమాధానం లేదు. సంఘంలో తమ స్థానాన్ని బట్టి, కోమల్నిచూస్తే, అందరికీ తలోవిధంగా తోస్తుంది. కోమల్ని వో గాజు బీగువాలో నిలబెట్టి, కింద "నేనెవర్ని?" అని రాసినకాగితం అంటించి, చూసినవాళ్ని నిర్ణయించమంటే ఏం జరుగుతుంది. జ్యోతిష్కుడు చూస్తాడు "ఈమె చాలా కష్టాలుపడింది; నాలుగు పెద్ద గండాలు తప్పాయి. ఈజాతకురాలికి ముందుముందు మంచి రోజులొస్తాయి. భర్తవల్ల ఎన్నో చిక్కులు అనుభవించినా, స్నేహితుల సహాయంవల్ల అన్నీ సర్దుకుంటాయి. ఈ జాతకురాలికి సంతాన యోగంలేదు."

కోమలి, అతనికి జాతకురాలైంది.

జీవశాస్త్రజ్ఞుడు చూసి, ఈ ప్రాణి యితర ప్రాణులను సృష్టించలేక పోయింది. సహజమైన మాతృత్వాన్ని తృణీకరించింది, కాబట్టి, యీ రకం స్త్రీకి సంఘంలో తావులేదు. సృష్టికోసం ప్రకృతి తనకిచ్చిన సౌందర్యాన్ని, స్వార్థకోసం వుపయోగించుకుంది. ఈ జీవికి ఆయుధం శీలం కాదు, శీలం అనే ఆయుధం, స్త్రీలకి పురుషులే సమర్పించారు. వారికి స్వతహా లేదు; దాన్ని కొందరు బాగా గుట్టుగా వాడుకోటం నేర్చుకుంటారు. ఈజీవికి యీ అసహజమైన ఆయుధంతో నిమిత్తం లేకపోయింది; ప్రకృతిఈమెకుసౌందర్యం యిచ్చింది. మెదడూ యిచ్చింది; దానివల్లే యీజీవి నిరుపయోగమైంది. నేర్చుకోవల్సిన పాఠం;—తెలివైన స్త్రీలకు సౌందర్యం కూడా వుండటం సంఘ పురోగమనానికి అనర్థం."

ఒక వైద్యుడు చూసి: "ఈరోగి, తన ఆరోగ్యం విషయం ఆలోచించుకోలేదు. శరీరం మొత్తంగా అంతా మళ్ళీ మరమ్మత్తుచెయ్యాలి. బ్లడ్ టెస్టులు చెయ్యాలి; మైనర్ ఆపరేషన్ చేస్తేగాని, పిల్లలవిషయం చెప్పలేం. వైటమిన్ బి. డి. ఎ. (కాంప్లెక్స్) అన్నీ తక్కువే. **Obesity is symptomatic of disturbed metabolism - Regular meals only once in the day** గాంధీగారి మందే; మరి గత్యంతరం లేదు. **X Ray** రిపోర్టురావాలి; **jungled nerves** ఆల్ట్రా వైలెట్ థెరపీ అవసరం యీ రోగికి."

ఇద్దరు సంఘసంస్కర్తలు చూసి ఏమనుకుంటారు?—ఒకడు "సంఘంలో న్యాయంగా నీతిగా సంసారం చేసుకుని సుఖపడే అవకాశం వుండి కూడా, యీ వ్యక్తి, యీవృత్తి చేసుకుని, చివరికి యీ స్థితికొచ్చింది. సంసార సౌఖ్యానికీ, సంఘ జీవనానికి, యీ వృత్తి ఎట్లాంటి అంతరాయమో మరో నిదర్శనం యీమెలోవుంది."

మరివొకడు, "పోదూ, మహా చెప్పావ్ శ్రీరంగ నీతులు, అసలు

వివాహం అనేదే చట్టబద్ధమైన వ్యభిచారం. అసలిది లేకపోతే, 'వివాహం' అనబడే సంస్థే నిలబడదు. సంసారంలోంచి శెలవు తీసుకోకపోతే, ఎవడు బ్రతక గలడు? బ్రతకగలిగినా, దానికేం విలువవుంటుంది? కార్యనిర్వహణకు పూనుకోని మంచితనం వృధా. ఎంతోమంది యువకుల దుర్భర జీవితాల లోకి యీమె కాంతికోణాలని ప్రసరింప చేసింది. అవి స్మరించుకొని జీవిస్తున్న పురుషులు ఎందరోవున్నారు ఆంధ్రదేశంలో. నిజానికి మనం యీవిడ రాతి విగ్రహం చెక్కించి, పార్కులో పెట్టాలి——"

ఒక కవి—; "ఆనాడు చీకట్లను ఛేదించిన యీ నేత్రాలు, యీనాడు, సంఘ చీకట్లో అంధత్వం పొందాయా? సౌందర్యం, యవ్వనాన్ని శాశ్వతంగా వుంచుకుంటే నేను గొంతెత్తి పాడను; పచ్చమబ్బులో మసగగా మెదిలిన మెరుపు కాంతుల ఎత్తునీడలు కదిలిన యీ నేత్రద్వయం, కన్నీటిని తేనె బిందువులుగా వర్షించి, మధుర స్వప్నంలో శిలగాస్థిరత్వం పొందిననాడు, ఎలుగెత్తి పాడనులే, నేను. అడ్డు పెట్టరులే, యీ కన్నీటి ధారకి..."

ఇంకా ఎందరెందరో?—

"స్త్రీకి, పురుషుడితోపాటు సమాన హక్కు లుండాలి; వుంటాయి; ప్రజాస్వామ్యంలో యీమెకికూడా రాజ్యాంగ విధానం నడిపేభారం వుంటుంది. జీవించేటందుకు యీమెకు హక్కులున్నాయి. భావం, వాక్కు, ఆర్థిక స్వాతంత్ర్యం—మీవోటు నాకిప్పించండి—"

"నే కోరినప్పుడు మీరు ఇన్సూర్ చేసివుంటే ఎంత బాగుండును! **Destitute woman's Policy.** యీపాటికి **Mature** అవునా!—"

"ఈ ముద్దాయి..."

"కొందరు ప్రేక్షకులు—"

"చదువరి అభిప్రాయం ఏమిటో"

**Libido, ఇంకాస్థిరత్వం పొందలేదు Repressions are rendered impotent unless they achieve finality through the unconscious - In this case the balance between the unconscious and conscious plans of activity - moral and physical - has been disturbed to the detriment of general phychosis.**

ఇట్లాంటి కోమలి తనకేమౌతుందని చెప్పగలడు! బాల్య స్నేహం అనొచ్చు. ఇంతకీ అవతల వ్యక్తుల వైఖరినిబట్టి, సమయానుకూలంగా ఏదో సమాధానం యివ్వొచ్చు అనుకుని దయానిధి తన బంగళాకి తిరిగి వొచ్చేశాడు. స్నానంచేసి కొత్తచీర కట్టుకున్న కోమల్ని గదిలో చూశాడు. ఎడంపక్క పాపిడికి దిగువగా నుదుటిమీద మచ్చను చూశాడు; యిది వరకులేనిది, ఇదివరకటి కోమల్ని యీమె ముందు ఊహించుకోలేక పోతున్నాడు. ఆనాటిది విప్పబోయే టందుకు వికాసం వొదిలేసిన మొగ్గ, యీనాడది వొయ్యారంగా వొంగిపోయిన పుష్పం. ఎక్కడి పురుగులు, పక్షులు, పుష్పాన్ని ఆస్వాదించిన గుర్తు నుదుటిమీద మచ్చ. ఈ వుపమానాన్ని మనస్సులోనించి నెట్టివేశాడు.

"ఎక్కడనుంచి రావటం?"

"నన్నా—"పరధ్యాన్నంగా మాట్లాడుతోంది కోమలి.—"నేనా? అడివిలోంచి."



"అంటే?"

"ఇప్పడు నామనస్సు నిశ్చింతగా వుంది ఇక్కడ హాయిగా వుంది ఏమీ అడగకండి-"

"పోనీ ఏ వూళ్ళో అడివి?"

"వల్లకాట్లో అడివి—ఏట్లో అడివి—"

"ఏట్లో చేపలున్నాయా?"

"అబ్బో—చేపలు మాట మీకింకా జ్ఞాపకం వుందే—నేను చాలా

మారిపోయి, అసహ్యంగా ఐపొయ్యాను కదూ" అంది అద్దంలో చూసుకుంటూ.

"మీరు ఏమీ అసలే మారలేదు—"

"నేనిక్కడున్నానని నీకెట్లా తెలుసు?" అని అడిగాడు.

"అబ్బో, ఆమాత్రం తెలుసుకోలేక పోతానా ఏమిటి? పేపర్లో పడింది— అక్కడంతా చెప్పుకుంటుమే—మీరు గొప్పవోరయ్యారుగా —'

"అందుకని దబ్బుని తెలిసిందంటావ్?"

"చూశారా,—ఇంకా చిన్నప్పటి మాట్లు పోనివ్వకున్నారు కాదు. మీరు ఎప్పుడు, ఎక్కడ ఎల్లావుండేదీ అంతా నాకు వయనమే. ఉత్తరాలు వ్రాశానా? ఇంకా మీరే మర్చిపొయ్యారు నన్ను. అవున్లెండి, నే నెందుకు జ్ఞాపకంవుంటాను. ఉత్తరానికి జవాబువ్రాశారా? ఎప్పటి కప్పుడు వొద్దామని వుండేది. కాని, ఏమంటారో అని భయం.—"

"నీ కెందుకు అంత దయ నామీద?"

"ఎందుకో? చిత్రం రాత్రంతా మిమ్మల్ని గురించి ఆలోచించేదాన్ని. నిద్రపట్టదు. ఊ కలలు. ఒక్కసారొచ్చి కనబడిపోయారుకారు, చూశావా, అనుకునేదాన్ని......"

"నాకు నువ్వెందుకు జ్ఞాపకంవుండాలి?"

"ఏమో! ఓస్. నాకు మీమీదుంటే, మీకు నామీదుండదేమిటి?"

"నీకు నామీద ఏముంది?"

"అబ్బో చాలా చిలిపివారే ఏమో అనుకున్నాను. అవునుగాని, ఆ రాత్రివొచ్చి, నన్ను చూసి వెళ్లిపోయారంటుగా, నన్ను లేపలేదేం? మొద్దు నిద్ర నేనూ,—లేపితే పెళ్ళిచేసుకోమని గీక్కుతింటానని భయం కాదూ మీకు? నాకెప్పుడు ఆ గొడవేలేదు,—అంతా అమ్మ చంపుకు తినేది—" అని జ్ఞాపకంచేసుకుంటున్నట్లుగా నవ్వింది కోమలి.

"మీ అమ్మ ఎక్కడుంది?"

"మా అమ్మకూడా జ్ఞాపకంవుందే—ఉంది, ఎక్కడో చస్తావుంది,—

డబ్బు పీసలాట్లు--దానికదే రంధి"

"నేను లేనట్లు మహా" అన్నాడు.

"అట్లా గంటే నాకు కోపం వొస్తుంది. నాకు దబ్బెందుకు? ఎవళ్ల కోసమని—అంతా అమ్మకేగా"

మధ్యలో నిధి అందుకున్నాడు.

"అమ్మమీద అంత ఆపేక్ష వున్నదానవు, యిప్పుడు అమ్మని విడిచి పెట్టి, యిల్లా ఎందుకొచ్చావు?" అని సమాధానం కోసం ఎదురు చూస్తున్నాడు.

"మీ కోసమనే" అని మూతి ముందుకుచాచి, కళ్ళు పెద్దవిచేసి, గారాంగా అన్నది.

"ఓస్, ఎన్నడూ లేంది, యిప్పుడెల్లా వొచ్చిందో?"

"నాకు మొదటినుంచి వుండేది,—కాని ఎల్లా చెప్పాలో తెలిసేది కాదు. చిన్నతనం—రాత్రుళ్లు నిద్రే పట్టేదికాదు— అస్తమానూ కలలో మీరే. మీరూ నేనూ, కాలవొడ్డున కూర్చుని చేపలు పడుతున్నాంట— నన్ను మీరు కాలవలో గెంటారట—చీరకొంగు గిరవాటేశి, బైటకి లాగండని మొత్తుకున్నాట--" ధ్యానంతో, కళ్ళు దూరంగా చూస్తూ అంటోంది.

"ఇంకా ఎవర్నైనా నాకోసం వొదిలి వొచ్చావో!" ఈవాక్యంతో కోమలి సోఫాలోంచి లేచి అతని దగ్గరగా వెళ్ళి కళ్ళల్లోకి కోపంగా చూసి, అటూ యిటూ పచార్లుచేసి, మళ్ళా వొచ్చి కూర్చుంది

"వెనక యిల్లాగే అన్నారు-- నేను మళ్ళా ఏదో అన్నాను, లెంప కాయ కొట్టారు,--" అని అనడంతో, చెక్కిళ్లు సద్దుమణిగె. హాల్లో ఎవరో మసలు పన్నట్లు అలజడైంది. కోమలి గది తలుపులు చేరేసింది.

"నేను మహాపతివ్రతనని మీతో చెప్పడంలేదు." "నువ్వు చెప్పనక్కర్లేదు.అయినదీ లేందీ నీ వాలకమే చెప్తోంది." అని నిధి గది తలుపులు తెరిచాడు.

"నిజం చెప్తే మొగాళ్ళు సహించలేరు"

"పాపం అనుభవంమీద తెలుసుకున్నావు." దూరంగా వున్న నారయ్యను సంబోధించి— "చూడు నారయ్యా, మేస్త్రీ వెక్టేకల్, వొచ్చాడా? ఐదుగంటలకి అతన్నీ, ఛాయప్ప శెట్టిని యిక్కడికి తీసుకురా,— తవ్వ రేపు ప్రారంభించాలి—"

"ఎవరండి, మాట్లు?" అంటూ నారయ్య లోపలికొచ్చి తొంగి చూశాడు.

"కోమలి"

"అబ్బో యీ మెగారు మళ్ళా యిక్కడి కొచ్చిందే, నోవ ఎవడు సెప్పాడూ అంట.—"

"ఏం నారయ్యా, బాగున్నావా?"

"ఏదో నీలాగే నేనూ వున్నా—ఎక్కడ వుంటుంటం?" అని అడిగాడు.

"ఎక్కడేమిటి,—నాకు కొంపా గోడా—"

"నాటకాలు తొక్కడం అయిందేమిటి?"

"ఏం మాట్లు నారయా,—నే పెద్దదాన్నయ్యాను, తెలుసా? వెనకటి కోమల్ననుకుంటున్నావా?"

"ఎన్నేళ్ళొస్తే నేం, ఆడపాకిళ్ళేమవుతాయి—" "ఇంటికొచ్చిన వాళ్ళని, యిల్లాగేటండీ మర్యాద చెయ్యడం, ఎంత భాగ్యవంతులైతే మాత్రం?" అని నిధిని సంబోధించింది. నారయ్య అందుకున్నాడు.

"ఇప్పుడు నిన్నెవరేమన్నారే ఎబ్బిదానా—పాతూసులాడాను" అంటూ వెళ్ళిపొయ్యాడు, నారయ్య. నిధికూడా తలుపుదగ్గరగా మూసి, హాల్లోకి నడచాడు. కోమలి మొహాన్ని చేతుల మధ్య దాచుకుని, సోఫాలో పడుకుని, నిశ్శబ్దంగా ఏడుపు సాగించింది.

ఆరోజూ, మొన్నాడుకూడా అనంతాచారిగారింట్లో జనం వొక్క

లొక్కళ్ళే వొచ్చి కోమల్ని వింతగా చూసి పోతున్నారు. నిధిభార్య కాదని తెలియగానే రాజమ్మగారికి కూడా, చూడాలని బుద్ధిపుట్టి కాత్యాయన్ని తీసుకుని చక్కా వొచ్చింది. సాయంత్రం ఐదు గంటలు దాటింది. కోమలి స్నానం చేసి, తల్లో పూలు అమర్చుకుంటూ డాబామీదకొచ్చి, చుట్టుపక్కలంతా చూస్తోంది. దూరంగా కొండ వెనక దిగుతూ సూర్యుడు కోమలి మొహాన్ని ప్రమాదంగా వెలిగించి, మాయమయ్యాడు. కడసారి కిరణం, ఆమె తల వెంట్రుకల అలలలోంచి. వొడ్డుకు చేరుకుని వెళ్లిపోయింది. దూరంగా డిస్పెన్సరీదగ్గర నడుస్తున్న నిధిని చూసింది. షికారుగా ఆ వేంపుకి నడుద్దా మనుకుంటోంది. ఇంతలో రాజమ్మగారు డాబామీదికే వొచ్చింది.

"రండి, రండి" అంది కోమలి. 'చిట్టిని' కేకేసి, పైకి రెండు కుర్చీలు తీసుకు రమ్మంది. రాజమ్మగారు వొద్దంది—"నాకీ కుర్చీలు సరిపోవు--హాయిగా కిందే బాగుంటుంది" తరవాత ఏం మాట్లాడాలో ఎవరికీ తెలీడం లేదు.

"మీ అమ్మాయి కాత్యాయని చాలా మంచిపిల్ల—నా కష్టసుఖాలు కనుక్కుంటోంది.—ఇల్లా రా అమ్మా,—జడేశేదా?--వుండు పూలెడతాను" అని కోమలి కాత్యాయన్ని దగ్గర తీసుకుంది. కాత్యాయినిముందు, కోమలి ఎత్తుగా, ఠీవిగావుంది; రాజమ్మగారిముందు, సన్నంగా నాజూకుగావుంది. ఈ రెండూ కోమలికి కొంత చనువిచ్చాయి.

"అద్దం దువ్వెనా తీసుకొస్తా, జడేస్తారా?" అంటూ కాత్యాయని మెట్లు దిగింది.

"నీతో మీవాళ్లెవరూ రాలేదా? వొక్కదానవు ఎల్లా ప్రయాణం చేశావమ్మా—"

"నాకు నావాళ్ళెవరూ లేరండి--

"ఏం? మీ అమ్మా నాన్నా లేరు? నీ విషయం నిధి మాతో ఎప్పుడూ చెప్పలేదే—పైగా తన కెవ్వరూ బంధువులు లేరంటాడు——?" అని

సమాధానంకోసం ఎదురు చూసింది.

"ఎందుకులేండీ? బోలెడు మందున్నారు. వాళ్ళకి ఆయనంటే గిట్టదండి."

"ఏం?"

"వాళ్ళకీ వాళ్ళకీ ఏవోవున్నాయి, నాకు బాగా తెలవదు."

"నీ కేంలాంటి చుట్టరికం?"

"నాకా?" కోమలి అటూయిటూ చూసి, తలకాయ వొంచుకుంది. చివరికి తెగించి చెప్పింది.

"నన్ను, ఆయన పెండ్లి చేసుకుంటానన్నారండి?"

"అతనికి పెండ్లాం వుండగానే?"

"ఇప్పుడు కాదు, పెండ్లికాక పూర్వం అనేవారు. మేం కులం తక్కువవాళ్ళం అని, చేసుకోలేదు. అత్తారికీ, యీయనకీ చెడిపోయిందిగా."

"మరి నీకు అయిందా, పెళ్ళి."

"నేను చేసుకోలా, ఈయనకోసం—"

రాజమ్మగారు అర్థం చేసుకుంది. ఇంతలో కాత్యాయని వొచ్చింది అద్దం దువ్వెనా తీసుకుని. అప్పటికప్పుడే చీకట్లు కమ్ముకున్నాయి. నిర్మలమైన ఆకాశంలో చుక్కలు నిర్మయంగా పొడుస్తున్నాయి. కాత్యాయని జడవిప్పింది. కోమలి దువ్వుతోంది. రాజమ్మగారు పొద్దోయింది వెడతానని లేచింది.

"ఈపూట మాయింట్లో భోజనం చేద్దాం, రండి" అన్నది, కాత్యాయని.

"అబ్బో,—మర్యాదలన్నీ తెలుసే నీకు.— నీకు మంచి మొగుడొచ్చాక, నీ యింటికొచ్చి తింటాలే" అంది కోమలి.

"అట్లాగైతే నే వెళ్ళిపోతానంతే."

రాజమ్మగారు, కూతుర్ని లేవదీసింది. ఇద్దరూ మెట్లు దిగారు.

"మీరు రండి" అంది కోమల్ని, కాత్యాయని.

"కాసేపుండి వొస్తాలే."

ఇద్దరూ వెళ్ళిపోయారు. కోమలి, చిట్టిని కేకేసి, డాబామీదికి వొక చాప తెప్పించి వేయించి, పడుకుంది. జడని మెలితిప్పి, దాన్ని దిండుగా పెట్టుగుంది.

ఎవరోవచ్చిన చప్పుడైంది.

"ఎవరు?"

"నేనే."

కోమలి కూర్చుంది. పమిటి గాలికి జారి, చాపమీద పరిచివుంది. "ఇట్లా కూర్చోండి." అని చాపని దులిపింది.

దయానిధి స్నానంచేసి వొచ్చాడు, తలని తువ్వాలతో తుడుచు కుంటూ.

"దువ్వెన యిలా యియ్యి" అన్నాడు.

అందిచ్చింది. అతను దువ్వుకుంటూ మెట్లు దిగడం మొదలెట్టాడు. స్నానంచేసిన సబ్బువాసన గాలిలో క్షణం మెదిలింది.

"ఇక్కడ కూర్చుని దువ్వుకోరాదూ?" అంది కోమలి. అతనేమీ సమాధానం చెప్పలేదు; మెట్లుదిగి వెళ్ళిపోయ్యాడు.

మూడు నిమిషాలు గడిచింది. కోమలికూడా మెట్లు దిగింది.

*　　　*　　　*

దయానిధి కిందిగదిలో సోఫాలో కూర్చుని ఎదురుకుండా అద్దంలో మొహం చూసుగుని తలదువ్వుకుంటున్నాడు. కోమలి వెనకాలే నిశ్శబ్దంగా వొచ్చి, 'చిట్టి' కలిపిన కాఫీ, కప్పులోపోసి తీసుకొచ్చింది.

"ఇదుగో కాఫీ."

అతను వెనక్కి తిరిగి చూశాడు. పెట్రోమాక్స్ దీపం వెలుగులో

కోమలి మొహం తళుక్కున మెరిసింది. అప్రయత్నంగా అతని మనస్సులో ఆరాటం బయులుదేరింది. పశ్చాత్తాపంతో దీనత్వం అలవరచుకున్న ఆమె నేత్రాలు, అనుభవంతో పరిపూర్ణత తెచ్చుకున్న ఆమె నిండు అవయవాలు, అతన్ని పాత సౌందర్యపు చిహ్నాల స్మరణ, వొత్తిడిచే వూపివేశాయి. ఇది వరకు అతను చూడని వొక కొత్త కీవి, ప్రపంచం పిచ్చిని చూసి వెక్కిరించకుండా నవ్వగల నిశ్చల ఔదార్యం చివరికి యదార్థమైన ప్రాచీన స్వప్నంలా గోచరించింది.

"మరి నువ్వో?"

"నేను అస్తమాను కాఫీ తాగను; తాగితే వొళ్ళొస్తుందటగా!" అని తన పాదాలకేసి చూసుకుని 'మీకు తెలుసు' నన్నట్లుగా నవ్వింది.

"వొస్తేనేం! వయస్సు మళ్ళినకొద్ది ఎన్నో మార్పులొస్తుంటాయి. ఆ మార్పులని మనం అంగీకరిస్తాం—" ఇంకా అతని వాక్యం పూర్తి కాకుండానే—

"మరి మీరు మార్లేదేం?"

"ఎందుకు మార్లేదు? చూడు, కళ్ళకిందగీతలు. పగలుచూస్తే కనబడ తాయి,—తెల్ల వెంట్రుకలు—ఎప్పుడూ లెక్కబెట్టలేదు—"

"నిజంగా యిప్పుడే మీరు ఎంతో బాగున్నారు."

"నీకు నాలో కనిపించిన బాగు నీమనస్సులో వున్నదేకాని నాలోది కాదు."

"అబ్బో, వేదాంతం మాట్లాడుతున్నారే." అంటూ లేచి అతనికి కప్పు అందిచ్చింది. "ఏవీ ఎన్ని నెరసిన వెంట్రుకలున్నాయో లెక్కపెట్ట నివ్వండి" అని పెట్రోమాక్స్ లైట్ ఎత్తుగా బల్లమీద పెట్టి, అతని జుట్టుని నిమరడం మొదలెట్టింది. ఆమె చేతిని తన చేతితో పట్టుకుని కిందికి దించి వేశాడు; దించిన చేతిని అరచేతిలో పరిచి, మెత్తగా అదిమి పరీక్షగా చూశాడు.

"ఏం ముట్టుకోకూడదా?" అని అడిగింది. అతని చేతిని గట్టిగా నొక్కింది. అతను చెయ్యి వొదిలేశాడు.

"ఆరోజుల్లో రాత్రిపగలు నాకోసం తపించి పొయ్యేవారు, యిప్పుడిలాగై పొయ్యారేం? దగ్గిరుంటే తప్ప, దూరంగా వెడితే మొగాళ్ళు మారిపోతారు."

"దగ్గరున్నప్పుడు కూడా దగాచేసే శక్తి వొక్క ఆడాళ్ళదే కాబోలు!" అన్నాడు.

"నేను మిమ్మల్ని ఏం దగా చేశాను?"

"నీకే తెలుసు"

"అబ్బ, ఎంత నొప్పించే మాటలంటారండీ-" అంటూ మూతి వొంకర చేసి, వెనక్కి జరిగి, అతని కళ్ళల్లోకి లోతుగా చూసింది.

"నేనేంచేశేది? అప్పుడు నాకు ప్రేమంటే ఏమీ తెలిసేది కాదు. మిమ్మల్ని చూస్తో కూర్చుంటే చిత్రంగావుండేది. మీరు నాతో మాట్లాడే వారేకారు, — నాకేం తెలుసు.—నన్ను మీరు ఎందుకు పెండ్లి చేసుకోలేదు? ఇప్పుడంతా తల్చుకుంటే, ఏమిటోలాగా, భయమేస్తుంది—"

"ఇప్పుడంతా తెలిసిపోయిందా?"

"ఓ, నాకు తెలుసు ప్రపంచం ఎల్లాంటిదో; ప్రేమంటే ఏమిటో నామనస్సులో ఏముందో మీకెట్లా తెలుస్తుంది?" తలవొంచి, దిగులుగా అతనికేసి చూసింది. అప్రయత్నంగా చేత్తో, జడని విప్పుకుంటోంది.

"ప్రేమంటే ఎల్లాంటిదో చెప్పు" అన్నాడు, కొంచం నవ్వుతూ. "నాకు చెప్పడం తెలీదు. అదోకలాగుంటుంది. మీరు, వెనక అదోకలాగ చూసేవారే— ఎప్పుడూ మీరూ నేనూ కలిసి వుండాలనిపిస్తుంది. మీరు నాదగ్గరగా వుంటే చాలు, యింకేమీ వొద్దు. మీరు లేకుంటే నే బ్రతకగలనా? అమ్మో—" అని తలని అతని బుజంమీద ఆనించి కళ్ళుమూసుకుంది. కోమలి అతని చెయ్యిమీద గడ్డం ఆనించి సోఫామీద ప్రక్కకి తిరిగి

వొరిగాడు. కిరసనాయిలు తక్కువై, పెట్రోమాక్స్ దీపం సన్నగిల్లుతోంది. దాని 'షేడ్' మీద పురుగులు కొట్టుకొంటున్న చప్పుడు తప్ప అంతా నిశ్శబ్దంగా వుంది. కోమలి కళ్ళల్లోంచి, కన్నీరు చుక్క అతని ఎడమ మోచెయ్యి మీద పడింది—బాధతో వేడిగా తొణికిన కన్నీరు. అతను ఆమె మొహాన్ని తన బుజంమ్మీదనుంచి తొలిగించి, లేచి, 'చిట్టీ' అని కేకేస్తూ, పెట్రోమాక్స్ దీపం తీసుకుని ముందుహాల్లోకి నడిచివెళ్ళాడు.

* * *

వారం గడిచింది. ఇంటి పనులన్నీ కోమలి చూసుకుంటోంది; వంట కూడా తనే స్వయంగా చేస్తోంది. దినచర్య యథావిధిగా జరిగిపోతోంది. భోజనానికి తప్ప, నిధి పగలల్లా పనులలోనే బైట తిరగడానికి సరిపోతోంది. రాత్రుళ్ళు, తనూ, నారయ్యా కింద వరండాలో పడుకుంటారు. కోమలి పైన తనగదిలోనే పడుకుంటుంది; మెట్లముందు చిట్టిగాడి పక్క వుంటుంది. అప్పుడప్పుడు కాత్యాయని, రంగడు, కోమలికి సాయంగా పడుకుంటారు. కోమలికి పగలు పొద్దు పోయేదికాదు. గవ్వలు, పచ్చీసు, వైకుంఠపాళి వీట్లతో కొన్ని రోజులు కాలక్షేపం చేశేవారు. తరవాత కోమలి రెండు రాట్నాలు తెప్పించి వడకడం ప్రారంభించింది.

ఓసారి, అనంతాచారిగారింట్లో జరిగిన నాటకంలో కోమలి తనకి తెలీకుండా నాయికఐంది. రాజమ్మగారి కోరిక ప్రకారం, నిధి, కోమలితో కలిసి, ఆచారిగారింటికి భోజనానికి వెళ్ళారు. రాజమ్మగారు, కోమలి వొక్కదానికీ బైట అరుగులో వొడ్డించి, మిగతవాళ్ళకి హాల్లో పీటలు వేసింది. తనని హీనంగా చూడ్డానికే భోజనానికి పిలవడం అనుకుని, కోమలి విడిగా భోజనం చెయ్యనని వెళ్ళిపోయింది. అనంతాచార్లుగారు, రాజమ్మగారు వాదించుకున్నారు. ఆఖరికి రాజీ కుదిరింది. ఈ వొక్కసారేనా, అందరూ కలిసి కూర్చోవాలని నిర్ధారణ జరిగి, నిధిని వెళ్ళి కోమల్ని పిలవమని కోరు

న్నారు. కోమలి చరచరా వెళ్ళి నిధి తల్లి విగ్రహం ముందు, సిమెంట్ గట్టు మీద కూర్చుంది. అక్కడికొచ్చాడు దయానిధి.

"అందరం కలిసి తిందాం,—రా" అని ఆహ్వానించాడు. కోమలి కళ్లు వర్షాన్ని బిగపెట్టి నిలుపుకున్న నల్లమేఘాల్లా ప్రమాదంగా మెరుస్తున్నాయి,

"నేనిక్కడ వుండటం యిష్టంలేకపోతే, వెళ్ళిపొమ్మనండి, వెళ్ళి పోతాను—అంతేకాని, యిట్లా మీ స్నేహితులతో చెప్పించి పరాభవిం చక్కర్లేదు." అంది.

"నేను వాళ్ళతో నిన్ను భోజనానికి పిలిపించి పరాభవించండని చెప్పాననా నీవూహ?" అని అడిగాడు.

"లేకపోతే వాళ్ళెందుకూ నన్ను పిలవడం? నా తమాషా అంతా తెలుసుగుని యాగీచేద్దామనేగా—"

"వాళ్ళ కేందు కుంటుంది నీమీదపగ?"

"మీకే తెలియాలి. మీ లోటుపాట్లు తెలుసుగుని, మిమ్మల్ని లోకువ కడుతున్నారు వాళ్లు. నన్నుమీరే గౌరవం చెయ్యందే, వాళ్ళెందుకు చేస్తారు? వారూ, మీరూ కలిసి అన్యోన్యంగా వుండకుండా మధ్య నే నెందుకు వెళ్ళిపోతాలెండి—" అంటూ కోమలి చీర కొంగుతో మొహాన్ని కప్పేసుకుంది.

"వాళ్ళెంత మంచివాళ్ళో నీకేం తెలుసు! బ్రాహ్మల కుటుంబాలలో ఆచారం నీకుకొత్తా, దేశంఅంతా చూసినదానవు! వీళ్ళింకా నయం, నచ్చ చెబితే సరేనంటారు నిన్నుతీసుకు రమ్మన్నారుగా, లే—అందరం కలిసి తిందాం."

"మీరెళ్ళి తినండి-నాకీపూట ఆకలిగాలేదు"

"కోపం వొచ్చిందా!"

"నాకు కోపంవొస్తే, ఎవరికిలెక్క—"

"నేను బాధపడటం నీకిష్టమా?"

"———"

"మాట్లాడవు?"

చీరకొంగు దించి, మసగ్గా నవ్వింది కోమలి

"ఏం?"

"అమ్మో మీరు బాధపడితే నేచచ్చిపోనూ," అంటూ గుండెమీద ఐసువేస్తూ్య పరుచుకుంది.

"మరైతే లేచిరా——"

"లేవఖేండి——" అని అతని రెండుచేతులూ దగ్గరగా లాక్కుని, మెడ వెనక్కివేసి, శరీరాన్ని వూపి లేచి నిలబడింది. కోమలి లేవగానే, రెండు చేతులూ వొదిలేసి దులుపుకున్నాడు. కరీం సాహెబు, కాత్యాయని, దీపం పుచ్చుకొని వొచ్చారు.

"మా అమ్మ రమ్మంటుంది." అంది కాత్యాయని

"వొస్తున్నాం" అన్నాడు నిధి.

భోజనాలు నిశ్శబ్దంగా జరిగిపొయ్యాయి.

ఇది జరిగింతర్వాత, కోమలి బాహ్యప్రపంచంలో కొంచం వుత్సాహం చూపుతూ, గని తవ్వేచోటికీ, హాస్పిటల్ వేపుకీ షికారుగా వెళ్ళి, అవన్నీ చూస్తూ, తనూ ఏదో పనిచేస్తూవుండేది సాహసించి. మొదట్లో అంద రికీ కోమలి వింతగా తోచింది——ఎడారిలో మోటారులాగా అడవిలో నూటువ్యక్తిలాగా. తరవాత, ఆ వాతావరణంలో వొక ముఖ్యమైన అలం కారంలాగా కలిసిపోయింది కోమలి. ముఖ్యంగా హాస్పిటల్ వాతావరణంలో కోమలి బాగా అతికిపోయింది. రోజూ నిధితోకలిసి, రోగులందర్నీ చూసేది. టెంపరేచర్ పరీక్షచేసేది. 'చార్ట్'లో గుర్తులు పెట్టేది; రోగులని నవ్వించి; సంతోష పెట్టడానికి యత్నాలు చేశేది. వాళ్ళ కష్ట సుఖాలన్నీ ఆదరంతో వినేది. వాళ్లకోసం వొక రీడింగ్ రూమ్, బోలెడు పత్రికలూ

ఏర్పాటైయింది. అందులోకి గ్రామఫోన్ తెప్పించింది.

తనే స్వయంగా, పత్రికలూ, పుస్తకాలు చదివి వినిపించేది. ప్రతిగాగి మంచంగ్గరా, వో 'ఫ్లవర్ వేజ్' పెట్టించి వాటిల్లో పూలూ తనే పెట్టేది ప్రతిరోజూ. అప్పుడప్పుడు పొరుగూళ్ళనుంచి జనంవొచ్చి, యీ దయానిధి ఆశ్రమాన్ని చూసిపోతుండేవారు. విరాళాలివ్వ సంకల్పించినవారికోసం వోడబ్బీ ఏర్పాటు చేశారు. అభిప్రాయాలకోసం 'విజిటర్స్ బుక్కు' కూడా పెట్టించారు.

ఆనాడు ఆదివారం, సాయంత్రం నాలుగైంది. నిధి పనిమీద బళ్ళారి వెళ్ళి రెండు రోజులైంది. ఆసాయంత్రం రావాలి, పనివాండ్రకి శెలవు రోజు. వాళ్ళంతా ఆరాత్రి జంగంకథ పెట్టించడానికి యేర్పాట్లలో వున్నారు. అన్నివొక్కసారి తణిఖీచేసి రావాలన్న సంగతి జ్ఞాపకం వొచ్చి, కోమలి అప్పుడే నిద్రనుంచి లేచి, మొహం కడుక్కుని కొత్తబట్టలేసుగుని, టీతాగి, షికారుకి బైలుదేరపోతుంటే, 'చిట్టి'గాడు 'ఎవరోవొచ్చారండి' అన్నాడు. గబగబా కోమలి మెట్లుదిగింది. వరండాలో కుర్చీమీద కూర్చున్నాడు రాజభూషణం. అతన్నిచూసి తెల్లబోయి, అప్రయత్నంగా వో అడుగు వెనక్కేసి నిలిచిపోయి, "ఎవరికోసం?" అనిపలకరించింది.

అతను ఆమెకేసి పరీక్షగా చూస్తున్నాడు.

"ఆయన వూళ్ళోలేరు. తరవాత రండి." అంది.

"నీకిక్కడకీళ్ళూ, తిండీ సరిపడ్డాయన్నమాట — బంతి పువ్వులా. వున్నావు,—ఐతే నేను ఆయన కోసమే వొచ్చానని ఎంగుక నుకున్నావు?" అన్నాడు రాజభూషణం.

"అవేం మాటలు?"

"ఏం తప్పా?"

"ఇక్కడి కెందుకొచ్చావు?" అనికోమలి మెట్లమీద కూర్చుని చేతులు నలుపుకుంటోంది.

"నా స్నేహితుడు కోసం వొచ్చాను. నీకోసం కాదులే."

"నాకోసం వొస్తే ఏం జరుగుతుందో జ్ఞాపకం వుండే వుంటుందిలే,"

"ఇప్పుడు కొట్టిస్తావా ఏమిటి నన్ను? కాసేపు క్రాస్ఎక్సామినేషన్ నన్ను చెయ్యనీ. అక్కడ రాజాగారి దీపం ఆరింది కాబట్టి యిల్లావొచ్చావా? దీపం ఎక్కడుంటే పురుగులు అక్కడికి చేరుకుంటాయన్నాడు వేమన్న,"

"దీపం వొక్కటే కాదు బురదలోనూ వుంటాయి దోమలు."

"చిత్రోత్తరానికి టోపీలుదించి చప్పట్లు కొడుతున్నాం." అని రాజభూషణం చప్పట్లుకొట్టాడు. కోమలి చప్పట్లుకొట్టి "చిట్టి"ని కేకేసి ఆచారిగారి శేషుని, కాత్యాయన్ని తను దబ్బుని రమ్మంటున్నానని తీసుకురమ్మని పంపింది.

"నిజంగా తన్నిస్తావా ఏమిటి, అందర్ని రమ్మంటున్నావు?"

"గుమ్మడి కాయల దొంగవు నువ్వు కాబట్టి అల్లా అనుకున్నావు.—"

"ఈ ఎడారిలో వొయసిస్‌లా కనిపించావు గాని యీ ప్రాణి నాలుక మీద వో టీచుక్క పోద్దూ,—"

లోపలికెళ్ళి, టీకప్పు తీసుకొచ్చి యిచ్చింది కోమలి. అతను తాగుతూ అన్నాడు—"బైదిబై కాత్యాయనన్నావు,—వెనకనే చూసిన కాత్యాయనన్న మాట. మీనిధిగారి ప్రాణస్నేహితురాలు. అతని హృదయ వీణకి తీగ. క్లియోపాట్రా To the fallen Antony."

"మీకెట్లా తెలుసు ఆ అమ్మాయి.?"

"నేను సమాధానం చెప్పను. ఐతే, కోమలీ ఎవర్లు-ఎన్ని మాటలన్నా వొక్కటి మాత్రం సత్యం. ఆంధ్రదేశంలో నీ అంతటి అందమైన స్త్రీని నేనింతవరకూ చూళ్ళేదు. ఫిలిం డైరెక్టర్లు ఆత్మహత్యలు చేసుకోక పోవడం ఆశ్చర్యమే."

"ఇట్లాంటి మాటలంటె నేపూరుకోను. ఇన్నేళ్ళొచ్చాయి, నీకెప్పుడొస్తుంది బుద్ధి?"

"ఓసి పిచ్చిదానా, స్త్రీలపట్ల బుద్ధిని కోల్పోవడంకంటె వేరేజ్ఞానో దయం ఎక్కడుందీ పురుషుడికి! Men can become wise only when they are fooled by women."

"నువ్విలాంటి మాట్లంటే వెళ్ళిపోతాను. నిధి గారిముందు నా గొడవ ఎత్తకుసుమా."

"ఎత్తకుండా వుంటాను ఏమిస్తావ్ ఒక్కరాత్రి నీతో గడపనిస్తావా?"

"ఛీ, పో, — దుర్మార్గుడా మీ స్నేహితుడు నిధిగారు, నన్ను ప్రేమించారు తెలుసా?"

"నిన్ను ఎవడు ప్రేమించలేదో చెప్పు?"

"నాకాయన తప్ప యింకెవ్వరూలేరు."

"ఓహో, నీజీవిత గ్రంథంలో కొత్త ప్రకరణం ప్రారంభించావన్నమాట. ఆంధ్రదేశం అంతా పంచుకున్న సౌందర్యంతో నాకూ కూడా కాస్తంత పడెయ్య కూడదా అని అడిగాను."

"నేనట్లాంటి వృత్తిఎప్పుడూ చెయ్యలేదు. తెలుసా—అదేపెట్టుగుంటే లక్షలు గణిద్దును. నువ్వు బలవంతంచేస్తే ఏం జరిగిందో అప్పుడే మరిచి పోయ్యావా—"

మరిచిపోలేదు కాబట్టే వొచ్చాననుకో — నేను మీ నిధిగారితో అవన్నీ చెబుతా నని భయపడొద్దు." అన్నాడతను.

"చెప్పేటందుకు ఏమున్నయ్? పాతవన్నీ వూహించుకుని బాధపడ తారేమోనని భయం నాకు, అంతే."

"అవున్లే. అతనీ పాత గొడవలు నీకు తెలీనట్లూ, నటిస్తూవుండాలి. ఉందనుకుంటే వుంది; లేదనుకుంటే లేదు.—ఏమంటావ్?" అని, కన్ను మెదిపాడు, రాజభూషణం.

"నేను మగొకడి భార్యనై వుంటే నన్నిల్లాలోకువ కడుదువా?"

"సరే, ఆమాటకొస్తే, నాకూ భార్యలేదు., — ఏటివొడ్డున యిల్లు

కడదామంటే, యిక్కడ వీరూ లేదు" అని మరో సిగరెట్టు ముట్టించాడు.

"ఊరికే తమాషాకంటున్నాను కోమలీ—నువ్వేమీ అనుకోకు."

"తమాషాచేస్తే ఏం చేస్తానో తెలుసుగా నీకు"

"ఏముంది, గిల్లుతావ్, గుచ్చుతావు—లేక కరుస్తావ్. ఆవిధంగానైనా, సినిమాలో విల్లన్‌లానిన్ను తాకడం జరుగుతుందిగా, అందుకనే సినిమాలో, హీరోకంటె, విలన్ వేషం కోసం జనం ఎగబడతారు.—"

ఇంతట్లోకే, కాత్యాయని, యితన్ని చూసి భయపడి, నిలబడిపోయింది. కోమలి, ఆమెదగ్గరగా వెళ్ళి భుజంమీద చెయ్యివేసింది.

"ఇప్పుడే వొస్తాం" అంటూ, యిద్దరూ వెళ్ళిపోయారు. రాజభూషణం, వొక్కడూ, బట్టలూ అవీ సర్దుకుని, పేపర్ చదువుతూకూర్చున్నాడు. కాసేపు చదివి, తోచక బైటకొచ్చాడు. అటుయిటూ పచార్లు చేస్తున్నాడు. దూరంగా వస్తున్న నిధిని చూసి, ఎదురెళ్లాడు. ఇద్దరూ కలుసుకుని మళ్లా యింటికొచ్చారు.

"ఎలక్షన్లొస్తున్నాయి-కాన్వాసింగ్‌కి బైలుదేరాను. అంటే వుత్తచేతులతో రాలేదులే. క్షామం నిధికి విరాళాలు తీసుకునే వొచ్చాను— నువ్వుసహాయం చెయ్యాలి." అన్నాడు రాజభూషణం, ఆతనికో సిగరెట్టు యిస్తూ. నేను కాల్చనన్నట్టుగా సంజ్ఞచేసి, కోటు విప్పి, కూర్చున్నాడు, దయానిధి.

"నీకే జిల్లాలంటే యిష్టంలేదుగా, ఎందుకొచ్చావు?"

"రాజకీయాలకీ, నా యిష్టా యిష్టాలకీ సంబంధం ఏముంది. నాఅభిప్రాయం మార్చుకోలేదు- వీళ్ళకి సంస్కారం లేదు, భాష లేదు, సారస్యంలేదు, నాగరికతలేదు—"

"అంటే నువ్వుఅనుకున్నట్లుగా వారికవి లేవు—అంటే నేనుఖండించను. మన జిల్లాలలో వుండే, కుళ్లు, దగాకోరుతనం, అసహనం, కుట్ర, డాబుసర్లు, సోమరితనం, పట్టింపులు, యిక్కడ లేవు. అవి వుండడం నీవుద్దేశంలో

నాగరికత; లేకపోవడం వీరి నాగరికత—"

"అబ్బాయి, నువ్వువీళ్లమధ్యవుంటూ యిట్లాఅంటూ వుండకపోతే, తంతారని భయం చొప్పున అంటున్న మాటలుగాని' నీ అభిప్రాయాలకీ, నా అభిప్రాయాలకీ భేదంలేదు—"

"భేదం వుంది—నాకిదేనచ్చింది గనకనే, నేనిక్కడే వుండిపోడానికి సంకల్పించాను—"

"ఉండిపోడానికి కారణాలు నాకు తెలియక పోలేదు"

"అంటే?"

"ఇక్కడుండే ఆదివాసులకి, నీ వెనకటి జీవితం తెలవదు కాబట్టి—" యింకా వాక్యం పూర్తికాకుండానే నిధి అందుకున్నాడు.

"అవును...నా చుట్టుపక్కలవున్న వాతావరణంతో సమత్వం పొందటంలో తప్పేమురిది?"

"ఏముంది, ఆవాతావరణం పాడవుతుంది" అని బిగ్గరగా నవ్వాడు. నిధికి కోపం వొచ్చినట్లుకళ్లమీదికి రెప్పలు చటుక్కున జారాయి.

"రాజా—నీకూ నాకూవెనక యీ విషయంలో కలహం జరిగింది. నిన్ను వెళ్లిపొమ్మన్నాను. నామీద దయవల్చి వెళ్ళావు— సంతోషించాను. మళ్లాయిప్పుడు ఆమాట నానోటంట అనిపించడం భాగ్యంకాదు—

"నీ శ్రేయస్సు కోరే వాళ్లల్లో నేనూ వొకణ్ణి గనకనే, యిల్లా రావడం జరిగింది-వొక్క కోమలేకాదు-"

"కోమలి సంగతి నీకెల్లా తెలుసు!" "నీలాగే పాత చుట్టం-"

"కోమలి?"

"ఏం? మహాపతివ్రత లనమంటావా?"

"నువ్వు?"

"ఏం? ఏకపత్నీ వ్రతుణ్ణి ఎల్లానూకాను—అసలు నాకుపత్నే లేదుగా-"

"నాతో చెప్పడంలో నీవుద్దేశం?"

"ఏముంది-శ్రేయస్కామిని కాబట్టి 'జాగ్రత్త' అంటాను. ఎందరో మహాను భావులయ్యారు. నువ్వు ఆఖరు అసామీ కావడం యిష్టం లేదు నాకు-" అని రాజభూషణం లేచి, వెళ్ళడానికి సిద్ధమయ్యాడు. అతను ఎనిమిది గంటల రైలుకెళ్ళాలి. మళ్ళా వారం రోజుల్లో వొస్తానని ప్రయాణమయ్యాడు. బండికూడా వొచ్చింది.

"కోమలితో నువ్వు మాట్లాడావా?"

"ఓ"

బండి కదిలింది.

దయానిధి స్నానాని కెళ్ళాడు; లాల్చీ, పైన తువ్వాలూ వేసుకుని, బైట వరండాలోకొచ్చాడు. సూర్యుడు కొండవెనక్కి జారాడు. ఏకొంత చూడ్డంకోసం అన్నట్లు నల్లమేఘాలు, పడమటి వెలుగు వైపుకి కదుల్తు న్నాయి. చాపదింపుతున్న పడవలా, అన్ని వొస్తువులూ తమ నీడలని లాగేసి, చీకటి స్వరూపాలని బైట పెట్టాయి. జేబులో కాగితాల్ని, వుత్తరాలు వోసారిచూసి, వాటిని వుండచుట్టి అవతల గిరవాటేసి, తూర్పు వేంపుకి చరచరా నడిచివెళ్ళి పొయ్యాడు.

దయానిధి వెళ్ళింది జీవితాన్ని స్పృశించడానికి. ఆ చీకట్లో, ఎక్కడో జీవిత రహస్యం దాగివుంటుంది-దాన్ని పట్టుకోవాలి. అతన్ని గురించి అతనికి అనుమానాలు, సందేహాలులేవు నేలమీద నడుస్తూ, అనుకోకుండా నీళ్ళల్లో దిగినట్లుగా వుంది. ఈత చేత నైతేకాని నీళ్ళల్లో దిగలేడు; దిగితేకాని ఈతరాదు; ఏమిటో వుపమానాలకి అర్థం ఏముంది? పోనీ, జీవితం వొక కుండ లాంటిది. కాలం, వ్యక్తులు అందరి చేతా, తలో చుక్కాపోయిస్తుంది; ఇంక వొక్కచుక్క పడితే కుండ నిండు తుంటుంది. ఆ సాయంత్రం, ఆవొక్క చుక్కా ఎవరో పోసినట్లుంది. నీళ్ళా? కుండా? ఏదియదార్థం? చీకట్లోకాలికి కుండ పెంకు తగిలింది. అది స్మశానమా? తూర్పు కొండవెనక చంద్రుడు, కొమ్మలమధ్యనుంచి కనబడే

ఎద్దు మూపులా కదుల్తున్నాడు. నీటికుండని మృత్యువు పగల కొడుతుంది. ఆ నేలమీద అన్నీ కుండ పెంకులే. ఎందరెందరో రాజులు రాణులు, విహారాలు చేసి, జీవించి నింపుకున్న కుండలని మృత్యువు తన్ని ముక్కలు చేసింది– ఆ పెంకుల జీవితగాథ అది. ఏమిటో వుపమానాలకి అర్థంలేదు.

అనుమానం, ప్రశ్న, సంశయం, అసంతృప్తి, వాంఛ, ద్వేషం, రాగం ——యివేవీ కుండలో నీటిని కదపని సమయం అది. రాళ్ళమధ్య కూర్చున్నాడు. అన్నీ రాళ్ళు. రాళ్ళకింద మారిపోయిన నీటికుండలు, ఎండకిమాడి 'నిప్పునిప్పు' అని కేకలు వెయ్యవు; వానకి తడిసి 'చలిచలి' అని భావగీతాలు పాడవు. చంద్రుణ్ణి చూసి గానం చెయ్యవు; వాటికేమీ అక్కర్లేదు; కాని అవి అక్కడ లేకపోతే ఏదీలేదు. అట్లాంటిది, అతని హృదయం. ఏడవాలని పించదు. నవ్వాలనిపించదు. అతనితో దేనికీ, ఎవ్వరికీ నిమిత్తంలేదు; కాని అతనక్కడలేకపోతే వొక శూన్యం ఏర్పడుతుంది. కాలం, స్థలం, పరిమాణం మార్పు, తను,...అన్నీ ఏకమైన తాత్కాలిక యదార్థం...దాన్ని ఎవరు స్పృశించగలరు?

ఎవరో స్పృశించారు. కుండలో నీటిని ఏవరో కలికారు. బాధతో, కుండలోనికిస లాడింది. స్థలం, పరిమాణం మారింది; కాలం, గతులను వెతుక్కుంటోంది; మార్పు కొనసాగుతోంది; తను తనైపోయి వెనక్కి తిరిగితే కోమలి.

"వొక్కదానవు చీకట్లో ఎందుకొచ్చావు?"

"మీరుండగా చీకటెందుకుంటుంది?"

"అసలెందు కొచ్చావు?"

"మీకోసం..." అతని బుజంమ్మీద తన కుడిచెయ్యి ఆనించి ఆచేతి మీద తల ఆనించింది కోమలి. గాలికి చీరకొంగులేచి, అతని ముందు రెపరెప కొట్టుకుంటోంది. సూదిలో దారంలా అతని నడుంచుట్టూ చల్లటివేడి పెన వేసుకుంది! సౌందర్యం క్షణంలో బలిసి బరువెక్కి అతన్ని వూపుతోంది

హృదయంలోనీళ్ళు కదులుతున్నాయి. అవి వొలికి పోకుండా నిలుపుకోవాలి. ఎవరి శరీరాన్నో ఎవరో ముట్టుకుంటుంటే తను దూరంగా వుండి వారించడం లాగుంది అతని పెనుగులాట.

"కోపమా?" అంది.

"..............."

"నే నేం చేశాను...?" గడ్డం పట్టుగుని ఆమె వెంపుకి తిప్పుకుంది. అతను చూస్తూనే వున్నాడు కాని ఆమె కనిపించడంలేదు. మేఘాలలోంచి వొస్తున్న ధ్వనులలా, నిశ్శబ్దం నిట్టూర్చింది, కోమలి కంఠంలో. ప్రేమతో పగిలిన కంఠం అది. భావస్వరూపం తెలీక, హృదయం ధ్వనిస్తోంది. సముద్రం లోతులో జరిగిన చప్పుడు ఎవరో నక్షత్రమండలంలో విన్నట్లుగా వుంది.

"ఎందుకు కోపం?" ఏదో పిచ్చి ప్రశ్న అడిగాడు. సమాధానం కోరని పిచ్చి ప్రశ్న.

"నేను చెడ్డదాన్ని! మీతో బాగావుంటాను. అవన్నీ తల్చుకోకండి. నేనప్పుడు పట్టిలా. నాకు తెలీకుండా అవన్నీ జరిగాయి. ఇప్పుడన్నీ తెలుసు నాకు. మీ దగ్గరే వుండనియ్యండి....లేకపోతే చచ్చిపోతాను..." చెఱువులో చేపలు కదలిన పరిమళం శ్వాసలో అతని మొహాన్ని కాల్చింది. పెరిగి, పెరిగి పెద్దవయి, విశ్వరూపం దాల్చిన ఆరెండు పెదవులూ అతన్ని కప్పివేశి, శూన్యం చేశాయి. ఆనోరు, తుంపరగా జనించి, నురుగై, కెరటమై, గుండమై, నీటిలోయలై, మహాసముద్రమై అతన్ని ముంచివేశింది. ఎంపరి రక్తమో ప్రవహించి, ఆర్పివేస్తున్న మంటల రంగు పెదవులది. తరతరాలుగా ఎఱ్ఱబడి, భవిష్యత్తులో వాడిపోయిన రోజా పుష్పం ఆనోరు.

"మీరన్నీ మరిచిపోండి. జమీందారు గారి దగ్గరున్నప్పుడు ఆయన వొచ్చి నన్ను బలవంతం చేశాడు. మీస్నేహితుణ్ణే అన్నాడు. మీ దగ్గరకి తీసుకొస్తానన్నాడు. నేనువొప్పుగోలేదు. రక్కాను పారిపోయి జమీందారు

గారితో నేనుమంచిదాన్ని కాదనిచెప్పాడు. ఆయనకొట్టేవాడు, తన్నేవాడు. ఒకరోజున పెద్దదెబ్బలాట జరిగింది, మిమ్మల్నిగురించే. మిమ్మల్ని ప్రేమించానని చెప్పాను. ఆయనకి కోపంవచ్చింది. ఆయన తన్నాడు నన్ను. సంచిలోంచి బైటకితీసి ఆయన డబ్బు మొహాన్నకొట్టాను. ఆయన బూటుతీసి కొట్టాడు. నా వొళ్ళుమండింది. నొన్న నగలన్నీ బీరువాలోంచి తీసి ఆయన మీద పడేశాను. మీదకొచ్చాడు జమీందారు..... పూలతొట్టి విసిరి కొట్టాను. నుదురు పగిలింది, చచ్చినాడికి. పారిపోయి మా అమ్మ దగ్గరకెళ్ళి పోయ్యాను. అమ్మకీ నాకూ రోజూ దెబ్బలాటే — అట్లకాడుచ్చుకొని అమ్మ నెత్తినకొట్టింది లేచ్చక్కా వొచ్చా మీ దగ్గరికి.

కోమలి చిత్రించిన భయానక దృశ్యాలని భరిస్తున్నాడు దయానిధి. అతనికి కోపంలేదు, యీర్ష్యలేదు. గమ్యస్థానంలేని జలపాతంలా కారుణ్యం పొంగుతోంది. అతని హృదయంలో. అందరూ పంచుకోడంవల్ల నే వస్తువులు, స్థిరత్వాన్ని గోల్పోయి, నశింపవుతాయి. సౌందర్యం, ఆనందం, విచారం,- పంచుకోడంవల్ల కృశిస్తాయి. భక్తులుకూడా మతాన్ని పంచుకుని దైవాన్ని హత్యచేశారా అనిపిస్తుంది. తన సర్వస్వమూ సంఘానికి పంచిపెట్టి తన నిజవ్యక్తిత్వాన్ని తెలుసుకున్నది కోమలి. ఎందరెందరో తమ పెదవులకు పట్టినబూజును ఆమెకు రాసి తులుపుకున్నారు. ఎందరెందరి స్వప్నాలనో యదార్థంచేసి, తనలో యదార్థాన్ని రహస్యంగా స్వప్నంచేసుకుంది కోమలి. ఆ కృత్రిమస్వేచ్ఛా జీవనంవొదిలేసి, మళ్ళా తనదాస్యం ఎందుకు అభిలషిస్తోంది. ఆమెకి ఏంకావాలి? పురుషుడి ద్వారాతప్ప, స్త్రీ తన స్వేచ్ఛ సాధించుకోలేదు కాబోలు. తన స్వేచ్ఛకోసం, అతన్ని బానిస చేస్తానంటోంది.

"నీకా జీవితంపైన అసహ్యం పుట్టిందికదా, మళ్ళాఅదే వాదగ్గర కావాలంటావెందుకు?" అని ఆమె మొహాన్ని పక్కకి తొలిగించి, కళ్లలోకి చూశాడు. ఎందరి పురుషుల రహస్య జీవితాలనో బంధించిన ఆమె

శిరోజాలు, గాలిలో ముళ్ళడ్డాయి. వుద్రేకంతో కళ్ళు మెరిసి మాటలు పడ్డాయి.

"ఛఛా—నేను పోకిరిదాన్నిగాను—కాని నేను మిమ్మల్ని ఎంత ఎక్కువగా ప్రేమించానో, మీకు తెలియపర్చడం ఎట్లాగ!" అంది కోమలి.

"ప్రేమలో ఎక్కువ తక్కువలుండవు. నువ్వొక వ్యక్తిని ప్రేమిస్తావు లేక ద్వేషిస్తావు అంతే"

"ఎట్లా చెప్పాలో నాకు తెలీదు. జ్ఞానం వచ్చాక, ప్రేమంటే ఏమిటో తెలిశాక, నాదంతా మీకిచ్చివేస్తే, నా ప్రాణం స్థిమిత పడుతుంది"

"ఇచ్చేటందుకు నీదగ్గర ఏముంది!"

"అంతా మీ కోసమే అట్టేపెట్టుకున్నాను— నాకు మరి ఎవ్వరితోనూ నిమిత్తంలేదు. మీకు నేనుతప్ప ఎవ్వరూ పనికిరారు. నాకు తెలుసు, తెలుసు—" అంటూ అతని నడుం చుట్టూచేతులు బిగించి, అతని వొళ్ళో వాలిపోయి, మెడని చేతుల్తో బంధించి చంద్రుడికేసి చూస్తూ ఏడ్వసాగించింది.

"నీ శరీరంతోతప్ప నాకు నీతో పరిచయంలేదు. ఆశరీరం నీ కిప్పుడు లేదు. నాకు నువ్వుపరాయిదానవు. తెలుసా?"

"ఇదివొట్టిది-నేనెంత అందంగా వుండగలనో మీరు వూహించుకోలేరు. నాతో సంబంధం లేనందునకనే నన్ను మీరు ప్రేమిస్తారు. అంతే-"

"అట్లాంటప్పుడు సంబంధంతో యిప్పుడు ఆప్రేమని ఎందుకు పాడుచేసుకోడం? మనం యిట్లాగే, పరాయివాళ్లల్లా, అపరిచితులుగావుంటే ఎంత బాగుంటుంది-వూహించు" అని కిందికి వాలిపోయిన తలను, పైకితీసుకున్నాడు. కన్నీరు, అతని బొటనవ్రేలిమీద ధారలాపడుతోంది.

ఏడ్చేందుకు యింతకన్నీరు ఎక్కడ దాచుకుందో!

"మీరు నన్ను ప్రేమిస్తాననండి—ఇంకేమీ అడగను. నా జన్మ ధన్యం అవుతుంది. నేనీ సంతోషంలో చచ్చిపోతాను"

"చూడు కోమలి-నాకు ప్రేమంటే ఏమిటో యింతవరకూ తెలిసింది కాదు. అందరిలాగా, శరీరవాంఛనే ప్రేమనుకుని, నన్ను నేను దగా చేసుకోలేను ఇతరులు ఎవ్వరితోనూ, ఏ వొక్కరితోనూ పంచుకోలేనిది నా ప్రేమ. అదొక దృష్టి-జీవితం అంతటినీ, గుదీ మొగలూ, ముందు వెనకా; అన్నింటినీ దూరంగా చూసి అర్థంచేసుకునే ప్రపంచంపై వొక చూపు. నా ప్రతిమాటనీ, భావాన్నీ, చర్యనీ ఆదృష్టి పురిగొల్పుతుంది నీతో స్నేహంవల్ల ఆదృష్టి పోతుంది- నీ కేమన్నా అర్థమౌతోందా,-పోనీ నీ వుద్దేశంలో ప్రేమంటే ఏమిటి?"

"ఓయబ్బ, ఆమాత్రం అర్థంకాదు!-నాకన్నీ తెలుసు. మీరొక్కరూ ఎక్కడో సన్యాసిలాగ వుండిపోతానంటారు. దానివల్ల ఏమిటి ప్రయోజనం? ప్రేమంటే,-ఇద్దరూ, వొక్కరిలాగుండి, కలిసి సంతోషపడి, యితరులకి సహాయపడి, వారినికూడా సంతోష పెట్టడం. మనం వొకళ్ళకి వొకళ్లు తన్మయత కలిగించుకుంటాం. అప్పుడో ధైర్యంగా, బలంగా, సరదాగా వుంటుంది.'ఆ టైమ్లో ఎన్నో మంచి పన్లు చేస్తాం.-చూశారా, నాకెంత బాగా తెలుసో-"

లేచి కూర్చుంది కోమలి.

"ఏనా ప్రేమంటే నాకేం తెలుసు? చూడండి, గుండెలెల్లా కొట్టుకుంటున్నాయో-శరీరం వేడిగా, మీకోసం-అసలదంతా ఎందుకు-?" అని అతని నోటిని తన పెదవులతో నొక్కేసింది.

"ఇదేనా ప్రేమంటే-ఈగుని ఎంత మందితో, ఎన్నిసార్లు చేశావో-"

"అది వేరు, యిది వేరు-అసలు మీరు మనిషే వేరుగా, వాళ్ళంతా పశువులు-మీరు దేవుడు-"

"దేవుణ్ణి పూజించాలికాని, ముద్దెట్టుగుంటారా?"

"ముందు ముద్దు, తరవాత పూజ-"

మీదికి ఎగబ్రాకుతున్న శరీరాన్ని, వెనక్కి నెట్టేశాడు నిధి,

సముద్రప్రవాహానికి ఎదురీదే శక్తిగల శరీరం, వర్షించి కొండ శిఖరాన్ని కరిగించివేసే వేగంగల మేఘంలాంటి శరీరం; వికసించిన పుష్పాన్ని మళ్లా మొగ్గని చెయ్యగల విచిత్రమైన శక్తిగల ఆ శరీరం,-యీ అల్పమైన ప్రేమ కోపం ప్రాకులాడి, నశింపవడం విషాదంగా తోచిందతనికి. ఆమె నోటి మీద తన అరచేతిని నొక్కి—

"వొద్దు కోమలి—నా ప్రేమని పంచుకుని పాడుచెయ్యకు. నాకు మిగిలింది ప్రేమ వొక్కటే" అన్నాడు.

"నా కేమీవొద్దు. వూరికే మీతో ఎప్పుడూ యిల్లా వుండనివ్వండి —సరేనా?"

"సరే—ఐతే యింకేమీ చెయ్యకూడదు నన్ను—" అంటూ అతను లేచాడు.

"కోపం రాదుకదా—మీకు ఎవరేనా వున్నారా?" అని అతని చెయ్యి పట్టుకుని లేచి నిలబడింది.

"వున్నట్లుగా వున్నానా?"

"ఏమో—నా కేం తెలుసు మీ లోపల ఏముందో? నామీద యిష్టం లేకపోతే నేనల్లా అనుకోకూడదా?"

"నాకు ఎవరిమీదేనా వుంటే, నీకు నామీద పోతుందా?"

"పోదు. 'అయ్యో, పాపం' అనుకుని వూరుకుంటా. ఏమ్మల్ని వేధించుకుని తినను."

"ఎవరున్నా లేకపోయినా, నాకు భార్యవుందిగా."

"ఆమె యిక్కడ కెందుకురాదు?"

"వొస్తే, నువ్వు యిక్కడుంటావా?"

"ఎందుకుండను? ఇద్దరం హాయిగా అక్క చెల్లెళ్ళలాగుంటాం."

"నీ కందులో ఏం సుఖముంది?"

"మీతో వుండటమే—"

ఇద్దరూ నడవటం సాగించారు. నిశ్శబ్దంగా. కోమలి, ముళ్ళనీ, గతుకుల్నీ తప్పుకున్నప్పుడు అతని బుజంపట్టుకుని నడుస్తోంది.

"ఇందిరకి నిన్ను నే వుంచుకున్నానని అనుమానం–నీకు తెలుసా?" అని అడిగాడు.

"అయ్యో, ఖర్మ—నా గొడవే మీకక్కర్లేదు. చూశారా ప్రపంచం ఎట్లాగనుకుంటుందో—నేను మీకోసం పిచ్చిదాన్నయిపొయ్యాను గాని, ఎందుకురాదు అవిడ? మీ కిష్టంలేదా?"

"జబ్బుగా వుందిట! మామగారుత్తరం వ్రాశారు. నన్ను వొచ్చి చూడమన్నారు"

"అయ్యో పాపం—ఏం జబ్బు? నేకూడా వొచ్చేదా?"

"క్షయ. మామగారు, 'రావ్ బహద్దూర్' రాకుండానే నిప్పైరయ్యారు. నన్ను పాతవన్నీ మరచిపోయి, క్షమించమని వ్రాశాడు. మొన్న మందుల నిమిత్తం వోవెయ్యి పంపించాను."

"మనం వెళ్లి చూసొద్దామా—"

"నువ్వొస్తే, జబ్బుయింకా యెక్కువవుతుందేమో?"

"పోనీలెండి—" మళ్ళా మాట్లాడం మానేసింది.

"నన్ను ప్రేమించానంటావ్ — మాటిమాటికి కోపంవస్తే ఎట్లాగ? ప్రేమించకుండా పరాయి దాన్లా వుంటే కోపాలూ, తాపాలు, యీర్ష్యలూ బాధలూ, ఏమీ వుండవు—"

"అవన్నీ వుంటేనే, బాగుంటుంది నాకు. అవి లేకపోతే వైరాగినే—వైరాగి బ్రతుకు నాకొద్దు."

మళ్ళా నిశ్శబ్దం. దూరంగా మేడ వెన్నెలలో తెల్లమేఘంలా మెరుస్తోంది.

"ఐతే అమృతంగారెక్కడున్నారు?" అని అడిగింది.

"అమృతంగారు—"

కోమలి నవ్వింది.—పడిపోబోతూ అతని బుజాన్ని గట్టిగా పట్టుకుంది.

"అబ్బో మీకింకా జ్ఞాపకంవుందే—నా కష్టదు నోరుతిరిగేది కాదు బాగున్నారా ?"

"నీదగ్గర ఆ యేభై రూపాయలూ, వొడ్డితోసహా వసూలు చెయ్యమంది."

"అంటే—?"

"జ్ఞాపకంలేదు ? ఆరాత్రివొచ్చి, నిన్ను నిద్ర లేపకుండా; దిండుకింద డబ్బెట్టి వొచ్చేశాను. ఆ డబ్బు, అమృతం దగ్గరుచ్చుకున్నదే—"

"ఆవిడ చాలామంచిది—ఆవిడ లేకపోతే, మీరునాదగ్గరకే వొచ్చేవారు కారు—ఔనా ? నల్లగావున్నా, మనిషి, భలేఎత్తుగా, గుండ్రంగా దర్జాగా వుంటుంది—"

"నీకు తెలుసా ? అమృతానికి ఆడపిల్ల" అన్నాడు.

"నిజంగా? ఆవిడకే ?"

"అవును, జగన్నాథం వుత్తరం వ్రాశాడు. కొవ్వూరులో, గోదావరి గొడ్డున, పాకేసుకుని, హాయిగా ఆశ్రమంలోలా వుంటున్నాడట. వొచ్చి చూడమన్నాడు."

"అబ్బో-అప్పుడే, భలే చిలిపల్లరి చేశేవాడు. నన్ను చెక్లోకి తోసేవి, చాకా—తోడుకో—డానికిచ్చాడు. ఏంచేస్తున్నాడు? పెళ్లయిందా?"

"లేదు- కూలివాళ్ళకీ, బీదవాళ్ళకీ, వూరికే చదువునేర్పుతున్నాడట. అదే వుద్యోగమంట......"

"సుశీలగారు ఎచ్చి పోయిందటగా- పాపం"

"స్త్రీలని నమ్మకూడదు."

"ఓయబ్బ- నాకు చెప్పకండి- మొగాళ్ళే వాళ్ళగొంతుకలుకోస్తారు. సల్లంగా కబుర్లుచెప్పి-వాళ్ళపని కానిచ్చుకున్న తర్వాత, యిదెల్లా సచ్చింపే వాళ్లకి పట్టదు—"

"స్త్రీలకి ప్రేమించటంచేతకాదని గ్రహించుకుని, మొగాడు,

చివరికి వాళ్ళ సంపర్కం వొదులుకుంటాడు......"

"ఎప్పుడు? అన్నీ అయినాక నా? ఏకదుపో కాలోవొస్తే వాళ్ళకేం?"

"చెంపలేసుకుగో-అట్లాంటి మాట్లనొచ్చా?" అన్నాడు నిధి. కోమలి వేసిన ప్రశ్నతో, అమృతం అతని వూహాలో కదిలి వ్యాపించింది.

"అవును. మీరనొచ్చా, అట్లాంటి మాటలు! అస్తమానం ఆడాళ్ళని తిట్టిపోసి, శాపనార్థాలు బెట్టే మొగాళ్లకి, అస్తమానూ, ఆ వాళ్ళ సంపర్కమే కావాలి. స్త్రీలని తిట్టడం, మళ్లా స్త్రీలచుట్టూ తిరగడం—"

"ఊ"—అని గర్జించి, మందలించాడు నిధి. ఇంటికి చేరుకున్నారు. కోమలి గబగబా మెట్లెక్కి మేడమీది కెళ్ళిపోయింది. దయానిధి, మండువాలో కుర్చీలో కూర్చున్నాడు, "అమ్మ" విగ్రహం కేసిచూస్తూ. స్త్రీ జాతిపైఅతనినమ్మకం పోయినందుకు,"అమ్మ" కారణం అనుకున్నాడు. క్షణం అపకారం చేస్తే, వారిసంతతి యిల్లాగైపోతుందని తెలుసుకోగలిగితే, ఏ స్త్రీ యేనా అపకారం చేస్తుందా! "అమ్మ"—స్త్రీ జాతికి వొక చిహ్నం — ఆచిహ్నం, వొకనల్లటి తెరగా తన దృష్టిని మరుగుపరుస్తుంది. ఆ తెర ఎక్సరే లాంటిది. బైటరక్తం, మాంసం, సొదను, ఊహ, ఆదర్శం, జ్ఞానం గల స్త్రీలున్నా, లోపల్నించి యితనికి కనబడేది. అస్థిపంజరమే. అతని అనుభవాలని, ఆత్మవంచన లేకుండా తరచి చూసుకుంటే, స్త్రీలని ఆదర్శవ్యక్తులుగా పరిగణించేటందుకు తగిన ఆధారాలు లేవు. ఏది యథార్థం? తనఎక్సరే దృష్టా? బైటమాంసం, రక్తం మనుషులా?

"మామయ్యగారు భోజనాలైన తర్వాత రమ్మన్నారు." పక్క తిరిగిచూస్తే కాత్యాయని.

"ఎందుకు?"

"ఏమో— ఏదో పనుందట. ఎవరోవచ్చారు, బళ్ళారి నుంచి."

"సరేలే.—అల్లాగే వొస్తానని చెప్పు—"

కాత్యాయని వెళ్ళబోతూ, నిలిచిపోయి.—

"నాకు పాఠం చెప్పడం మానేశారు—"

"ఏం చెయ్యను తీరికలేదు— రేపుచెప్తాగా. వారం రోజుల్లో మేష్టరు వొస్తోంది. నేను పాఠాలు మరిచి పొయ్యాను సుమా—" కాత్యాయని అమాయకంగా నవ్వి వెళ్ళిపోయింది.

ఈలోగా వుత్తరాలకట్ట విప్పి చూసుకున్నాడు. అమృతం పిల్లకి అన్న ప్రాశన. రమ్మని ఆహ్వానం. మరో పది నిముషాలలో నాయ్యా వొచ్చి, అనంతా చార్లుగారు దబ్బున రమ్మన్నారని చెప్పాడు. వెంటనే నిధి వాళ్ళింటికి వెళ్ళి, అక్కడే భోజనంచేసి, వ్యవహారాలు మాట్లాడుకొని, తిరిగి యింటికొచ్చే టప్పటికి, రాత్రి, పదకొండు దాటింది, క్యాంపుకాట్ వరండాలో వేద్చుకుని పడుకున్నాడు, నక్షత్రాల కేసిచూస్తూ. కనపడే నక్షత్రం, ఆస్థానంలోంచి కదిలి పోయినా, అక్కడే వున్నట్లు మెరుస్తుంది. అంతటి విశాలమైన విశ్వంలో యీఅల్పుడైన మానవుడికి యింత అశాంతి ఎందుకో—? లేక, విశ్వం అంతటి విశాలమైందని గ్రహించుకో డానికి మానవుడి మనస్సు, ఊహా, యింకెంత విశాల మైందిగా ఉండాలో!

అమృతం ఆడపిల్లకి అన్నప్రాశన! ఆతనికి భయమేసింది. పసిపాప, తన గుండెల్లో మెదిలి ఏడుస్తున్నట్లుగా వుంది. అనుమానంతో, భయంతో శరీరం పీక్కుపోతోంది. సృష్టి, తనరహస్యాన్ని ఛేదించమని, సవాల్ చేసింది. సంతానం ఇంతసులభమా? సృష్టికి, మనుషులు, రాగద్వేషాలతో, నిమిత్తం లేదు. లేక, వుందా? స్త్రీ, వొక చెట్టులాంటిది: చూస్తోండగానే, ఎదిగి పోయి, మానులు చామకుని, ఆకులు, మొగ్గలు, ఫలాలు తెచ్చుకుంటుంది. ఆనీడలో ఎవడో యాత్రీకుడు నిలబడి, సేద తీర్చుకుని, దాని శ్వాసపీల్చి, ఆ ఫలాన్ని కొరికి, వొక్కసారి కదిపి పోతాడు. ఏదో చప్పుడవుతుంది, వెనక్కి తిరుగుతాడు. అప్పుడే పండు కిందికెరాలింది. అమృతాన్ని కదపింది తనే-ఎట్లా తెలుస్తుంది- వెళ్ళిచూస్తేగాని, ఆతనికి మతి పొయ్యేటట్లుంది.

ఆలోచనలో పొద్దు వేడెక్కి పోతోంది. ఏహోరంపు, మెత్తటి

చల్లటి చేతులు నుదుటి మీద వొత్తుతున్నాయి. వాటిని తొలగించి పైకి చూశాడు.

"ఇందాక అల్లా అన్నందుకు కోపం వొచ్చిందా?" అంది కోమలి. అతనేమీ మాట్లాడలేదు. పిల్లల విషయం కోమల్ని అడుగుదామనుకున్నాడు. కాని ఆ ప్రశ్నని దిగమింగేశాడు.

"ఇంకెప్పుడూ అన్ను, క్షమించండి" అంటూ అతని కళ్లు మూసేసి, ఆకాశమంతా వ్యాపించిన నక్షత్రంలా తననోటిని, అతని నుదుటికిఆనించింది. ఆమె చేతులని తొలగించి వేశాడు.

"నేనింక మిమ్మల్ని వేధించను. హాయిగా పడుకోండి..."అని లేచి వెళ్లిపోయింది కోమలి. నిధి వొంటిసి నిద్రాదేవి వరించింది. తపస్సు చేస్తున్న "భయం" అనే వొక ఋషిని, ప్రశాంతం అనే కన్యక తన నాట్యంచేత, భంగపరిచింది. కను రెప్పలకి కట్టిన దారాలని, నిద్రాదేవి నక్షత్రానికి ముడివేసింది.

ముందు వేసంగిలో, ఏప్రిల్ ఇరవైయ్యో తేదీని ఆంధ్రరాష్ట్ర కమిటీ వారు కడపలో సభచేశారు. ఆ సభకి, అనంతాచార్లు గారు, దయానిధికూడా వెళ్ళారు. దత్తమండలం జిల్లానుండి, ఎందరో నాయకులు, పెద్దలు, సభ్యులు వొస్తారు వారందరి పరిచయం పొందడం అవసరమని ఆచారిగారి ప్రోత్సాహంమీద నిధి అక్కడికి రావడం జరిగింది. అతన్ని ఎలక్షన్‌లో నిలబెట్టి, నెగ్గించి, పెద్దవాణ్ణి చెయ్యాలని ఆచారిగారి సంకల్పం. కాని అతనేమీ వుత్సాహం చూపడంలేదు. ఐనా వెళ్ళక తప్పిందికాదు.

సాయంత్రం ఐదుగంటలవుతోంది. రెండు మూడొందలమంది జనం మూగారు. ఉపన్యాసాలు ప్రారంభమయ్యాయి. మూడో వుపన్యాసకుడు రాజభూషణం. పదివాక్యాలు మాట్లాడింతర్వాత, జనంలో కలకలం బైలుదేరింది.

"—ఈ జిల్లాలలో కొందరి మతం, ఆంధ్రరాష్ట్రం అక్కర్లేదనీ దాని

అవసరం వారికి కనబడలేదని, అసలు రాష్ట్రం ఏర్పడకుండా చెయ్యడానికి వారు కృషిచెయ్యడానికి అభ్యంతరం లేదనికూడా. వారు అల్లా అనడంలో ఆశ్చర్యంలేదు. ఎందుకంటే, ఆంధ్రరాష్ట్రోద్యమం సర్కారుజిల్లాలలో బైలు దేరింది, ప్రతి వుద్యమంలోనూ, సారస్వతోద్యమం కానివ్వండి, మరేయితర నూతన వుద్యమం లేవదియ్యాల్సివొచ్చినా, సర్కారు జిల్లావారే ముందంజ వేశేది. వారే మార్గదర్శకులు. రాజకీయ, ఆర్థిక, కళా, సాంఘిక అభ్యుదయానికి పునాది రాళ్ళువేసింది వారు. ఆంధ్రనాగరికతని భద్రపరచింది వారే. అంచేత వాళ్ళేదో బాగుపడి, గొప్పవాళ్ళయి పోతున్నారని, మిగత జిల్లాలవారు, అసూయబడి వెనక్కితగ్గి, వారి అభివృద్ధికి అంతరాయం కల్పించడంలో ఆశ్చర్యం లేదేమో. నాకీ జిల్లాలతో పరిచయం లేకపోలేదు. కారణాలేమైతే నేం, యిక్కడి ప్రజహీనస్థితిలో వుంటున్న సంగతి అందరికీ తెలిసిందే. కట్టుకునేందుకు బట్టలేదు, తినేటందుకు తిండిలేదు; తిండి,బట్టా లభ్యం చేసుకొని, తీరికగా వుంటూ, ప్రాణంనిలబెట్టుకునేందుకు వుపకరించని వాటిని సాధించటమే నాగరికత. అవే కళలు, మతం, శృంగారం, ఆధ్యాత్మిక విలువలు. తిండి, బట్టాలేని యీ బీద ప్రజకి ఆ నాగరికత అలవడాలంటే వారి యీర్ష్యలని, పట్టింపులనీ దిగమింగి, సర్కారు జిల్లాల వారితో ఏకమై రాష్ట్రం కోసం కృషి చెయ్యడమే కర్తవ్యం."

కొందరు చప్పట్లు కొట్టారు. వాని మరికొందరు మందలించారు! మాటా మాటా అనుకున్నారు. గంద్రగోళమైంది. కొంచం సేపటికి అలజడి తగ్గింది. మళ్లా మొదలెట్టాడు.

"—ఉదాహరణకి— నేను మొన్న రాఘవ శ్రేష్టిగారింట్లో దిగాను. నాకు నవ్వొచ్చింది. ఆయింట్లో నాలుగు భాషలేనా విన్నాను.

ఒకరు తెలుగు మాట్లాడతారు; వొకరు సంస్కృతం; మరి వొకరు కన్నడం—అత్తగారు తమిళం మాట్లాడుతుందిట. నైజాం సరిహద్దుల దగ్గర వుండడం వల్ల కాబోలు, అందరికీ కొద్దో గొప్పో హిందీకూడా వొచ్చే

వుంటుంది. వీరికి మాతృభాష లేదేమో అనిపిస్తుంది. ఒకపత్రికా సంపాదకుడు గాని, గొప్ప గాయకుడు గాని, చిత్రకారుడు గాని, కవిగాని, రాజకీయ వేత్తగాని, ప్రతిభాశాలి గాని, ఎవర్నైనా మనం ఎరుగుదుమా? వీరు తెలివి తక్కువ వారనను. తెలివి తేటలు బైటపడి, రాణించే, ఆర్థిక, సాంఘిక, పరిస్థితులు ఏర్పడలేదు. అవి ఏర్పడాలంటే మాతో కలవడమే సాధనం. మాతో కలవండని ప్రాధేయపడుతున్నామని బిగిస్తారేమో! ఎవర్నైనా ఏదైనా కోరితే, వారు చెట్టెక్కడం మానవ లక్షణం. ఆ పక్షంలో మేం భయపడి మా వుద్యమం విరమిస్తామనీ, ఆంధ్రరాష్ట్ర రథం, కదల్లనీ కలలోకూడా భ్రమించవద్దని విన్నపం. వీరిని మినహాయించి, మిగతవాళ్ళమే రాష్ట్రాం సంపాదించుకొని తీరతాం—"

వాక్యం పూర్తికాకుండానే ప్రజలు అతన్ని ఆపుచెయ్యమని అల్లరి చేశారు. అతను చేసిన సవాల్, అక్కడి పెద్దలకికూడా కష్టంగాతోచింది. మధ్యలో వొకాయన నిలబడి "నాకు మాట్లాడే అవకాశం యివ్వండి" అని అధ్యక్షుణ్ణికోరాడు. జనం చప్పట్లుకొట్టి ఆయన్ని వుపన్యాస వేదికమీదికి తీసికెళ్ళి నిలబెట్టారు. వొకాయన లేచి ఆ వుపన్యాసకుణ్ణి పరిచయం చేశాడు.

"వీరిపేరు తిప్పేస్వామి. వీరు కర్నూలు కార్మికుల సంస్థకి, కార్యదర్శిగా వుంటున్నారు. పనివాండ్ర కనీసపు వేతనాల ప్రణాళిక తయారు చేశారు. అంతకంటె వేరేచెప్ప నక్కరలేదు." అని కూర్చున్నాడు. తిప్పేస్వామి యిల్లా ప్రారంభించాడు

"నేను యీ సాయంత్రం, మాట్లాడాలని వొచ్చుండలేదు. ఇంతకు ముందు చెప్పినాయన చాలా జోరుగా సాగిస్తుంటే బండికి బ్రేక్ వేద్దామనిపించింది. ఆ ఛాన్సు ఇచ్చినందుకు అధ్యక్షుడికి నా కృతజ్ఞా పూర్వక వందనాలు.

మా సర్కారు మిత్రులు,— క్షమించండి,— సర్కారు జిల్లాల మిత్రులు యీ కరువు సమయంలో క్షామనిధిగా ఐదువేలు రొక్కం యిచ్చిన

మాట వాస్తవం. దానికి వారికి మేం కృతజ్ఞులం. ఇట్లాంటి కరువు సంభవించ డానికి మా తెలివి తక్కువతనమే కారణం అన్నట్లుగా వారు మాట్లాడటం, విన్న, మీ అందరికీ నవ్వొచ్చిందంటే ఆశ్చర్యంలేదు, ఎంతకంగారా! కలరా ప్లేగులు, వుప్పెనలు, వరదలు, వానలుపడక పంటలు నాశనం కావడాలు- యివన్నీ, సర్కారు జిల్లాలలోకూడా వుండటం అందరికీ తెలిసిందే. ఐతే వారు మమ్మల్ని చూసి జాలిపడటం వారి ఎక్కువతనాన్ని చూపెడుతుంది కాబోలు. వారికి సంభవించే యిక్కట్లని చూసి సంతోషించి జాలిపడు తున్నా ననుకోకండి.

నాగరికతను గురించి వారేదో శెలవిచ్చారు; నేను అనాగరికుణ్ణి గనక నాకది అర్థంకాలేదనుకోండి. తిండీ, బట్టా వున్నవాళ్ళకే యీనాగరికత అనే జాడ్యం పట్టుతుందని వారి వుద్దేశం కాబోలు, వారి జిల్లాలలో జమీం దార్లు తిండి బట్ట వున్నవారనీ. వారు నాగరికులా? కార్మికులను, కర్షకులను కవులకిచ్చిన వాళ్ళనీ పీడించి, వూటీ, సిమ్లా బొంబాయిలలో త్రాగుడు, జూదం, స్త్రీలోలత్వంతో ఆడబ్బంతా తగలెయ్యటం నాగరికత? మహాను భావులు గొప్పవాళ్ళు చాలామంది బీదవాళ్ళేనని చరిత్ర చదివిన వారికి తెలుస్తుంది. బీదత్వమే వారి కృషికి కారణం అంటాను. పూర్వీకులు కష్టపడి సంపాదించిన సంస్కారాన్ని నాగరికతని, తగలెయ్యటంలో ప్రథమస్థానం సర్కారు వారిదే—క్షమించండి — సర్కారు జిల్లలవారిదే. నేను మొన్న బెజవాడ రైల్వే స్టేషన్లో ఒక హాస్యరచన గ్రంథంకొని చదివాను. దాన్ని బట్టి అక్కడి జనం ఎట్లాంటివారో తెలుసుకొన్నాను. డబుక్కులు, —వారు దాన్ని కోతలంటారు — యీర్ష్య, సోమరితనం, ఆరంభ శూరత్వం, కుళ్ళు, దగా, మోసం, స్వార్థ పరత్వం —యివి వారి జాతీయ లక్షణాలంటే, నామిత్రులు బాధపడతారు. ఆ గ్రంథం హాస్యరచన కాదు. విషాదగీతం. అది చదువుకొని వారు ఏడవడానికి బదులు నవ్వుతున్నారంటే నాకు ఏడవాలని పిస్తోంది.

ఈ జిల్లాలలో కవులు లేరట. మారేడింగ్ రూమ్‌కొస్తే, సలభై పేజీల గ్రంధం వుంది. అందులో నూటతొంభైమంది కవుల పేర్లున్నాయి. చిత్రకారులు లేరట, కీర్తిశేషుడు వెంకట్రావు పేరు యీ చర్చలోకి దింపడం నాకిష్టంలేదు.

ఇక ఆంధ్రరాష్ట్రం మాట. మేం రాష్ట్రం వొద్దనడంలేదు. మేం దానికి తగం అన్నట్లుగా ఆ జిల్లాల వారు మాట్లాడతారు ఎందుకో! మా ప్రాజెక్టులు ఫలించి, ఆర్థికంగా సమానత్వం తెచ్చుకున్న తర్వాత, రాష్ట్రం అవశ్యం తెచ్చుకుంటాం. ఈతరాని వాడిని అవతలొడ్డుకి తీసికెడదామంటే యిద్దరూ మునిగిపోతారు.

మా సర్కారు మిత్రుడు—క్షమించండి—సర్కారు జిల్లాల మిత్రుడు—రాఘవశ్రేష్ఠిగార్ని గురించి వ్యక్తిగతంగా మాట్లాడాడుగనక, ఆ మాటక్కూడ నేను చలాయించు గుంటాను. ఇక్కడికి 90 మైళ్ళ దూరంలో న్యాయం పల్లి గ్రామంలో వొక సర్కారు వ్యక్తి వున్నాడు. ఆయన డాక్టర్. ఇక్కడికి ఫకీరుగా వొచ్చాడు, రాళ్ళసీమలో వజ్రం దొరికింది. ఇప్పుడు లక్షాధికారయ్యాడు. వజ్రాల గని త్రవ్విస్తున్నాడు. హాస్పిటల్ పెట్టాడు. ఆ సిరిసంపద మాదిగాక సర్కారు జిల్లాల వారిదా? రాఘవశ్రేష్ఠిగారింట్లో నాలుగుభార్యలున్న విషయం మీరు విన్నారు. అ సర్కార్ డాక్టర్‌కి.—క్షమించండి సర్కార్ జిల్లాల—డాక్టర్‌కి నలుగురు భార్యలున్నారని వినికిడి—"

జనంలో గోలబైలుదేరింది. అధ్యక్షుడు ఆయన్ని నిలిపివేసి కూర్చోమన్నాడు. బలవంతంగా అందరూ ఆయన్ని కిందికి దించి తీసుకుపొయ్యారు. అక్కడ అమర్చిన రెండు గ్యాస్‌లైట్లల్లో వొకటి ఆరిపోయింది. ఉపన్యాసకుల వేదిక దగ్గరది మాత్రం వెలుగుతూనే వుంది. ఇంతలో నిధిని వేదికి పైకి రమ్మనమని ఎవరో పిలిచారు. నిధికోసం, ఆచారిగారు అటూయిటూ చూశాడు. ఎక్కడా కనిపించలేదు. అప్పుడు అనంతాచారిగారు వొంట్లో

బాగుండలేదని అంచేత ఆయన మాట్లాడే స్థితిలోలేదనీ సర్ది చెప్పి, శ్లోకాలు, వుపమానాలు, గీతావాక్యాలు చదివి, సర్కారు జిల్లాలవారికీ, దత్తమండలం వారికి ఐక్యత వుండాలంటూ, వుపన్యసించి సభికులను రంజింప చేశారు.

దయానిధి వెంటనే కార్లో యింటికి వొచ్చేశాడు. రాత్రిపన్నెండు గంటలు కావొస్తోంది. నిశ్శబ్దంగా మేడమీదికి నడిచి వెళ్ళాడు. నారయ్య హాల్లో గుజ్జట్టి నిద్రపోతున్నాడు. 'చిట్టి' మంచువాలో పడుకున్నాడు. పక్కగదిలో కోమలి పడుకుంది. సన్నగా దీపం వో మూల వుంది. కిటికీ లోంచి నిశ్శబ్దంగా, చల్లటివెన్నెల కోమలి మంచంమీద పడింది. మెడలో నగలు లేకపోవడంవల్ల ఆమె కంఠం గుండ్రంగా, మెత్తగా కనబడుతోంది. వెన్నెల యింద్రజాలాన్నుండి తప్పించుకోవాలని, రహస్యమైన శ్వాసతో రొమ్ములు లయతో లేచిపడుతున్నాయి. వికసించడం మరిచిపోయిన ఎఱ్ఱ మందారం మొగ్గల్లా కళ్ళు మూసుకున్నాయి. కోమలి అందం అనంతం; క్షణ క్షణానికీ, రోజురోజుకీ, యుగయుగానికీ, అభివృద్ధి పొందే సౌందర్యం అది. వయస్సు, చక్కదనంలోని చాంచల్యాన్ని తొలిగించి, మార్దవాన్నీ, గాంభీర్యాన్నీ యిచ్చింది. జీవితంలో రాపిడి, యవ్వనంలో వుండే కుటిలత్వాన్ని తొలిగించి, వైరాగ్యాన్నిచ్చింది.

అతను ప్రక్కన సోఫాలో కూర్చున్నాడు. పర్వతం ఎక్కి, శిఖరం చేరుకున్నట్లుగా వుంది, ఆమె ప్రక్కన కూర్చోవడం. వెన్నెల వాతావరణాన్ని కోమలి వునికి, ప్రశాంతంగా బంధించివేసింది. గోళం మరి తిరగదు. అతనికి ఆమెని తాకాలని లేదు; మందారం రేకులని విప్పి వికసింప చెయ్యాలనీ లేదు, ఆ సంగీతం వూహిస్తే భయమేస్తుంది. తిప్పేస్వామి వుపన్యాసం ఆమె కంఠంలో వినబడుతోంది. ఎన్నో ముళ్ళు, ఎన్నో కీటకాలు, ఆ శరీరాన్ని మైలపరిచాయి.—ఏమీ తెలీనట్లు యిక్కడ ఆత్మనిద్ర పోతోంది. అతనిలో వొక కోరిక జనించింది.;—ఆమె కంఠాన్ని తన రెండు చేతులతో పట్టుకుని, నులిమి, ఆ వదలిపోని సౌందర్యంలో చంపి వెయ్యాలని. అది

వొక వ్యసనం లాంటిది; వొక తృష్ణ; బడబాగ్ని. శిఖరంతాలి సముద్రాన్ని ఎండింపచేసే ప్రాచీన శక్తి అది. అతని కోర్కెలు, తీరని వాంఛలు, యదార్థంకాని కలలు, అనుసరించలేని ఆదర్శాలూ, అంతరంగికమూ—అన్నీ కోమలై నిద్రిస్తున్నాయి. ఆమెని చంపితే, హత్యకాదు; ఆత్మహత్య. ప్రపంచంలో మరి 'చెడుగు' వుండదు. అమ్మలు, అమృతాలు, దయానిధులు వుండని సంతోషమయి ప్రపంచం. ఆ సంకల్పంతో పెద్దపోరాటం సాగించాడు. అధోలోకంలోని క్రూర మృగాల వేట అది. బాల్యంలో బంధింపబడ్డ జంతువులు సంకెళ్లు తెంచుకుని స్వేచ్ఛా విహారానికి గర్జిస్తున్నాయి. లోపల అధికారం, ఆఘాతం, చీకటిలోయ, మృగాల సంచారం, ఆకాశంలో తలుపులు తెరుచుకున్నాయి. అతను చూసి, దిగివొచ్చి మధ్య నిలబడి పెనుగులాడుతున్నాడు.

సోఫా మంచానికి దగ్గరగా లాగి కోమలికి అడుగు దూరంలో కూర్చున్నాడు. ఎవరో హృదయంలోని ఆలయపు తలుపు తెంచారు. కోమలిపై అతనికున్న ద్వేషం, చంపాలన్న కోర్కె, వెనక్కి ప్రయాణంచేసి, జన్మస్థానం వెతుక్కుంటోంది. అమ్మపై ద్వేషంగా మారిన తన సహజప్రేమ వాటి జన్మస్థానం. ఆ దృశ్యం నిజంగా జరిగిందా? లేక తను వూహించిందా? తనతండ్రి, తల్లిని పీక పిసుకుతున్నట్లు, అతనెక్కడో, ఎప్పుడో చూశాడు. తన ఆదర్శాలని, అందాన్ని, స్వప్నాలని ఎవరో పీకనులిమి చంపినదృశ్యం అది. అమ్మమాత్రం యదార్థం; జగత్తంతా మాయ; ఆసత్యాన్ని ఎందుకో, పీకనులిమి హత్యచేశారు. హంతకుడు మృత్యువాతపడ్డాడు. తను ఎవర్ని చంపడం? అందం, ఆదర్శం స్వప్నం అన్నీ అమ్మనిచూసి నేర్చుకున్న కోమలినా తను చంపడం. ఆలయంలో గంటలు మ్రోగాయి. ఆధ్వనిలో తప్పిపోయిన కడపటి వాక్యాలు గిరగిరా తిరుగుతున్నాయి; తెర, చినిగి జారింది; ఆకాశం అంతా వొకే తెరచిన తలుపు; మొగ్గలే లేవు. అన్నీ వికసించిన మందారాలే; వెన్నెల మేఘాల సంకెళ్ళు విప్పుకుంది. వాతావరణం స్వాతంత్ర్యం తెచ్చుకుంది. కోమలి అతన్ని అన్నో

లోకాన్నుంచి విముక్తిచేసి, సత్య సామ్రాజ్యానికి రాణీ అయింది. ఆమెను ముట్టుకో కూడదు.

మూలనున్న దీపం తెచ్చి పెద్దదిచేసి, ఆమె మొహంవైపు చూశాడు. అప్రయత్నంగా తన కుడిచెయ్యి అతని చెయ్యిమీద వేశింది. "అబ్బో అంతా తెలుసు" అన్నట్లుగా నిద్రలో నవ్వుతోంది. క్షణం వెలుగు చూశాడు.

ఆమె కుడిచెయ్యి అతన్ని శోధిస్తోంది—అతని బుజంకోసం వుద్దేశింప బడిన ఆ అ చెయ్యి దాని దగ్గరకే చేరుకుంది అప్రయత్నంగా; వొళ్లు విరిచి, గీర్వాణంగా సింహాసనంమీద కదిలి సౌందర్యాన్ని దిక్కులకు నెట్టి వేసింది రాణి. చెయ్యి దీపాన్ని కొట్టింది. దీపం కిందపడి చప్పుడైంది. తట్టాలునలేచి కూర్చుంది.

"వీరా!"

"ఎప్పుడొచ్చావు!"

"ఎందుకు లేపలేదు—!"—ఏవో మసగ ప్రశ్నలు ఆవలిస్తూ అడిగి, అతన్ని మంచంమీదికి లాక్కుంది.

"కోమలీ—నీకు తెలుసా, చిత్రం జరిగింది?"అని అడిగి, ఆమె చేతులని తొలగించి, పాదాల దగ్గర కూర్చున్నాడు.

"ఏమిటి?"

"నాకు నలుగురు భార్యలున్నారని యిక్కడ మనుషులు చెప్పు కుంటున్నారు."

"ఇందులో చిత్రం ఏముంది. అందరు మొగాళ్ళు అంతేగా, చేసు కున్న పెళ్ళాలు కారనుకోండి, మొన్న రాజమ్మగారు చెప్పింది.-ఇక్కడ నా మందికి యిద్దరు పెళ్ళాలుండటం మామూలేట. ఒక యింతేనా?" అని మొహం పక్కకితిప్పి తలగడ వేసి నవ్వింది.

"దాని అర్థం నీకు తెలుసా?"

"ఆ ఎంకరు పెళ్ళాలుంటేనేం; ప్రేమించడం ఎప్పుడూ వొకళ్ళేగా నే నంతేగా—"

"ఈ విషయం విన్నతర్వాత నీకు నామీద అసహ్యం వేయదా-"

"వెయ్యాలా-యిమ్మల్నింకా, యిదిగా ప్రేమిస్తున్నాను"

"నాకు నామీదే అసహ్యంవేస్తోంది. నా మనస్సు నిజంగా ఎల్లాంటిదో తెలుసుకున్న వారెవ్వరూ నన్ను ప్రేమించరు."

"నాకు తెలుసు-అందుకనే ప్రేమిస్తాను కూడా" అన్నది కోమలి.

అతను లేవబోయ్యాడు.

"ఉండండి-గాజుపెంకులు తీస్తాను" అంటూ కోమలిలేచి, అతన్ని పక్కగా నడిపించి, యిద్దరూ బైటికి వొచ్చారు. అతను గబగబా మెట్లెక్కి, పైడాబా మీదికి వెళ్లాడు. కోమలి కూడా వెనకాలే వెళ్ళింది. వారి రహస్యాలు వినేందుకన్నట్లు వెన్నెల వారిదగ్గిరిగా వొచ్చి విశాలంగా ప్రకాశిస్తోంది. చంద్రుడు మచ్చని మేఘంలా రహస్యంగా దాచుకున్నాడు.

"నాకు ప్రేమించబడే అర్హత పోయింది కోమలీ-"

"నేను బ్రతికివుండగా పోదు-" అని అతని బుజంమీద తలకాయ ఆనించింది. వేడి నిట్టూర్పు వెన్నెలలో చల్లబడింది. ఆమె కళ్లల్లోకి చూస్తే విశ్వానికి అవతలొడ్డు కనిపిస్తోంది. అతను అవతలకి అడుగు వెయ్యలేదు.

"మనం స్నేహంగా వుండకూడదమూ?" అన్నాడు.

"ఉన్నాంగా-"

"ఇంతదగ్గరగా కాకుండా వుండలేమూ?"

"ఇంతకంటె దగ్గరగా ఏవ్వరూ వుండలేరు"

"శరీరాలులేని ఆత్మలమైతే ఎంత బాగుండును!" అన్నాడు

"ఆత్మలు విడివిడిగా వుంటాయి-వొకళ్ళ శరీరాలే దగ్గరగా కలిసి వుండేది-"

"నీ కెవరు చెప్పారు?"

"నేనూ చదువుతున్నాను భగవద్గీత"

"నీకర్థమౌతోందా?"

"ఓ-అసలది నాలాంటివాళ్ళ కోసమే వ్రాశారు ఎవళ్ళో"

"అంటే?"

"ఏమో నాకు తెలీదు. చదువుతున్నప్పుడు అదంతా నిజంగా వుంటుంది. పుస్తకం మూసేస్తే ఏమీ వుండదు"

"అట్లాంటప్పుడు, నువ్వెందుకూ ప్రేమించడం?"

"ప్రేమ పవిత్రమైంది-"

"ఓస్"

"నిజం"

"మరి నా మీద కోరికెందుకు?"

"అది మనస్సుకి-ఇది శరీరానికి-అదేనా మీరు కాబట్టి"

"అల్లావొద్దు-అసలు కోర్కెలేవొద్దు-ఇద్దరం యిల్లాగే స్నేహంగా వుందాం ఏం? శరీరాల స్నేహం ద్వేషంగా మారుతుంది. ఆత్మలని చంపేస్తుంది-"

"అబ్బో-అంత అల్లాగ నేనుండలేను-"

"మరి ఆ అలవాటు వొదుల్చుకోవాలి. అదే యోగం, తపస్సు అంటే"

"కష్టంకాదు? ఎప్పుడూ, చచ్చిపొయ్యేదాకా అల్లాగే-?"

"ఊ"

"అమ్మో-వొక్కసారి కూడా వొద్దూ-వొక్కసారి మళ్ళా వొద్దు"

"అట్లా చేస్తే మనం అందర్లాగే ఐపోతాం.- అట్లా చెయ్యకపోడం లోనే వుంది అందం. జీవితం వింతగా వుంటుంది. బ్రతుకుమీద ఆసక్తి పుట్టింది. గొప్పగొప్ప పనులు చెయ్యొచ్చు-" అన్నాడు.

"అట్లాగైతే మీ శరీరాలాగో వుంటారు. కొత్తగా వుంటారు" అన్నది.

"అల్లా వుంటేనే తమాషాగా వుంటుంది. చూడు. నీ మొఖంతో నాకు పరిచయం వుంది. కాని శరీరంతో లేదు. మనం రోజూ చూసే వాటిని, బాగా ఎరుగున్న వాటినీ ఆదరంతో చూసి ప్రేమిస్తామా? అల్లా చెయ్యం. రోజూ వుండేదే-యింతేగా-అనుకుని అసహ్యించుకుంటాం. కాని, తెలీనిదాన్ని, కొత్తదాన్ని తెలుసుకుందామని శోధిస్తాం-ఆ పరిశోధనే ప్రేమంటే. ప్రియుడు ప్రియురాల్ని ఎంతవరకూ ప్రేమిస్తాడు?-ఆమె పరిచయం దొరికి, భార్యగా చేసుకునే వరకూ-అంతే...తర్వాత, వాళ్లు మామూలు మొగుడు పెళ్ళాలుగా కీచులాడుకుంటారు. పిల్లలు పుడతారు. మళ్ళా వాళ్ళ శరీరాలు కొత్తవవుతాయి. ఐనా వాటిని సహించలేరు. ఆమె పిల్లాడిని ప్రేమిస్తుంది. 'అయ్యో నన్ను మరిచిపోయిందే అని మొగాడు ఏడ్చి, ద్వేషిస్తాడు. అల్లాగే చిత్రకారుడు అందాన్ని ప్రేమిస్తాడు. ఎంతవరకూ? అది తన రంగు ద్వారా, పటంలో లక్ష్యమయ్యేవరకూ, అందాన్ని బంధించిన తర్వాత, అతను బాహ్య ప్రపంచానికి దాస్యం చేస్తాడు.

కవుల విషయం అంతే-'సత్యాన్ని మాటలలో బంధిస్తారు. సత్యానికి దగ్గరగా రావడమే కవిత్వం'. భక్తుడు దైవాన్ని అన్వేషిస్తాడు. జీవితం అంతా వొక అనంతమైన అన్వేషణ, జీవిత రహస్యాన్ని శోధించడం, రహస్యం తెలుసుకున్న తర్వాత అన్వేషణ మానడు-అర్థం కాక అన్వేషణ మానెయ్యడం జరుగుతుంది. అల్లాగే మనం వొకరికి వొకరు అర్థం కానంత వరకూ, శరీరాలు పరిచయం కానంతవరకూ ప్రేమించుకుంటాం" అంటూ అతను మాట్లాడుతుంటే, ఆమె అతని కళ్ళల్లోకి నిశ్చింతగా చూస్తోంది. మెదడులో, పెద్దలం మరిచిపోయిన వూహాలు పేడిస్తున్నాయి. పెదిదు గుండెలదగ్గరగా వెళ్ళినట్లయింది. కోమలికి అనేక వింత అనుభవం. కోమలి తన్మయతతో అతన్ని బిగించేసి, నేలమీదికి కూలి, అతన్ని కిందికి లాగేసింది.

ఆమె పడుకొంది, అతని తొడపై, తల ఆనించి ఆకాశంకేసి చూస్తూ.

ఆమెలో మరి కోరికలేదు. ఊహని కలవరపెట్టే, క్రొత్త అనుమానాలే అన్నీ.

"ఐతే జీవిత రహస్యం అంటే ఏమిటి?" అని అడిగింది. అతనికి నవ్వొచ్చింది.

"చూశావా,-నీచేత యీ ప్రశ్న అడిగించేటట్లు చెయ్యడమే జీవిత రహస్యం"

"పోండీ-మీ దంకా వేళాకోళం-చెప్పకపోతే పోనిలెండి. నేనే కనుక్కుంటా-"

"తప్పకుండా-నిద్రపో-స్వప్నంలో కనబడుతుంది లే-" అని అతను కూడా వెన్ను వాల్చాడు.-

"నే కనుక్కున్నా-రహస్యం. మీరే-" అని మత్తుగా నవ్వి నిద్రలో చూపు తెరిచింది- తెల్లారింది. సూర్యకిరణాలు చెవుల్లో గిలిగింతలెట్టి వారిని లేవగొట్టాయి.

—o—

# 10

## ఆకులు రాలడం

నెలగడచిం తర్వాత, ఇందిరకి జబ్బు తీవ్రరూపం ధాల్చింది. నిధిని వెంటనే రమ్మనమని టెలిగ్రాం వొచ్చింది. శీతాకాలం, చలిరోజులవి. టెలిగ్రాం చూసుకుని దయానిధి మేడమీద గదిలోకొచ్చాడు. కోమలి రాట్నం వొడకుతూంది. అతను తొందరగా సామాన్లు సర్దుకున్నాడు.

"టపా చూసుకున్నారా? యిందాక, వొచ్చాయి—" అంటూ వుత్తరాలకట్ట అతనికిచ్చింది. అందులో వొకటి రిమాటిక్ సీమా దగ్గరనుంచి. అందులో కొంతభాగం:

"నాకు నిన్ను చూడాలనుంది. నేను వొస్తాననడం, మళ్ళా రాలేక పోవడం, నీకూ నాకూ మామూలైపోయింది. ఈసారి వొస్తున్నానని వ్రాస్తే నువ్వు నమ్మవేమో, గొల్లవాడు తోడేలు కథలా మాదిరి. ఐనా హిందూదేశం యింత పెద్దది కావడం, భారతీయుల దౌర్భాగ్యం అనుకుంటా. దేశం వైశాల్యమే, యీదేశంయొక్క అభివృద్ధికి అంతరాయం అనుకుంటా. ఒక్క రోజు చూడక పోతే సూర్యుడు అస్తమించ డనుకునే బాల్యస్నేహితులు, నెలలు, సంవత్సరాలు, కలుసు కోకుండా, ఎవరి యిళ్ళల్లోవాళ్లు బంధించ

బడి, జీవితం ముగిస్తారేమో. చిన్నప్పుడు అంగా ప్రేమ, స్వేచ్ఛ, వెలుగు. రోజులు గడిచిన కొద్దీ వెలుగు సన్నగిల్లుతుంది. శైలు కడ్డీల నీడలు పొడుగవు తుంటాయి. బాల్యస్నేహాలు, శృంగారంతో కొట్టుకునే హృదయాలు, వొక్కొక్కటే విడిపోయి, జారిపోతాయి, ఒక్కొక్కరే చెట్లు ఆకులమాదిరిగిరాలి పోతారు.జనసమూహంలోంచి,ఏకాంతంలోకి నడవడంలాంటిది. నావుద్యోగం, నాకుటుంబం, నాపిల్లలు; నావూరు, నాదేశం, నామతం, -యీ "నా"లో మానవుడు బంధించబడతాడు. "నా"లేకుండా వుంటే ఎంత బాగుండును! ఇట్లాంటి వెన్నో నీతో మాట్లాడుకోవాలనుంది రేపు సాయంత్రం బండికి వొస్తున్నానంటే నవ్వకు సుమా"

ఆవుత్తరం చదువుకుని, సర్దిన పెట్టిని వొక మూలగా నెట్టివేసి, సోఫాలో కూర్చున్నాడు. కోమలి సోఫా వెనకాలకొచ్చి, అతని బుజం మీద చెయ్యి వేసింది.

"నన్నుకూడా తీసుకెళ్ళరూ, ఇందిరని చూస్తాను." అన్నది!

"నేను వెళ్ళడంలేదు. రేపువొక స్నేహితుడొస్తున్నాడు."

"ఎక్కువగా వుందిటగా. వెళ్ళకపోతే బాగుండదు. స్నేహితుడికి, రావొద్దని టెలిగ్రాం యివ్వండి."

"ఐనా నేను వెళ్ళి చేసేదేముంది?"

"అదేమిటి అల్లాగంటారు. పెళ్ళాంకి ప్రాణంమీదికి వొచ్చినా, వెళ్లి చూళ్ళేదని, విమర్శిస్తారు అంటారు—"

"ఇప్పుడనడం లేదు గనక నా—"

"పైగా నామూలాన్నుంచి అంటారు, తెలిసిందా—"

"నువ్వు నాతో కూడా వొస్తే, యింకా యేమనుకుంటారో అని భయం లేదు నీకు"?

"ఉందనుకోండి—నేను యిట్లాంటి వాటికి అలవాటు పడ్డదాన్ని, తెగించిన దాన్ని—"

"నేనూ అంతే—"

"నేనొచ్చి, ఆవిడకి సంరక్షణ చెయ్యాలని వుంది."

"నిన్ను నన్నూ చూస్తే, జబ్బు మరింత ఎక్కువయి అప్పుడే కళ్ళు మూస్తుంది. ఏస్త్రీ; మరో స్త్రీని క్షమించదు."

"ఏంమ్మాటలంటవి—ఆడదాని మనస్సు మీకు బొత్తిగా తెలీదు. పోనీ మీరు రేపు వొద్దురు గాని, యీలోగా నేనూ, నారయ్యా వెళ్ళి రామా—?"

ఇంతలో మెట్లమీద అడుగుల చప్పుడైంది. ఐదారుగురు పనివాళ్ళు, మేస్త్రీ నెక్టేకల్ తొందరగా లోపలికొచ్చి "యిట్లారండి" అని సంజ్ఞ చేశారు. దయానిధి, కోమలీ, గబగబా మెట్లుదిగి కిందికి వెళ్ళారు. ముందు వరండాలో నారయ్య చాపమీద పడుకున్నాడు. బుజాల మీద రెండు పెద్దగాయాలు, నెత్తిమీద చిన్నగాయం తగిలాయి. రక్తం కారుతోంది. తొందరగా బాగ్ తీసుకొచ్చి, నిధి చికిత్స చేస్తున్నాడు.

"సోమప్పగాడిపనండి" అన్నాడు మేస్త్రీ.

"ఏంఽ" అని అడిగింది కోమలి.

"మీరేం సెప్పక్కర్లే, మీపన్లమీదకి మీరు పొండి—"అని నారయ్య మూలిగాడు.

"నారయ్య పెద్దంగా రెడ్డిమీద అరుస్తాడు. ఓసారి పనికాడ అంఽ యిప్పమంటుండాడు నారయ్య, నేయిప్పేది లే ంటుండాడు రెడ్డి. ఆపలికి నారయ్య లెగిసిపోయుండడు. రెడ్డి, సోమప్ప, నీదేంది, నువ్వేకూలోడివని యీన్ని గదమాయించినోడు. ఈడు, ఆళ్ళని అటేసి, తంతానవుండడు. అదికాస్తా బోసు,తన్నుండారు."

కోమలికి యీకథ యేమి అర్థంకాలేదు. తెల్లబోయి నిరికేసి చూస్తూ నిలబడింది, మరోపని వాడు సింగప్ప, చెప్పడం మొదలెట్టాడు

"ఈపేపులాటు బుద్ధుకడొచ్చుండది అయ్యవారా, అయ్యవారితో

సెప్పి, రెడ్డిబత్తెంలో బొట్టుతగ్గిస్తననుండడు నారయ్య. ఇది యనంగానే సోమప్పకి సివమెత్తింది, మారెమ్మ లేదండి స్వామే,—రెడ్డికో పరాచికాలాడు తుంది అని నారయ్యకి పట్టలేదంకొయ్యవోరా. దాని జోలికి పోవొద్దని, నారయ్య పెద్దగా అరిసి ఏరుచేసుండడు. నారయ్యకీ మారెమ్మకియేందో వుందని రెడ్డి, లెగిసినాడు. మారెమ్మని, రెడ్డినీ వొకాడ నేవొద్దనీ యేరేయంగా తొవ్వండని, నారయ్య డోకాయించినోడు. మారెమ్మసోమప్పతో సెప్పకుంది. అది రెడ్డికి కన్నెర్ర. ఇద్దరూ యేకమై సెత్తగా తన్నుంతోరు—"

ఈకథకూడా కోమలికి పూర్తిగా అర్థంకాలేదు. వాళ్ళని కూకలేశాడు నలుగురు పని వాళ్ళు జారిపోయ్యారు. గిరిగుప్పన్న మాత్రం మిగిలాడు. దీనంత టికి కారణం అతను చెప్పడం మొదలెట్టాడు.

"ఇదంతా అల్ల కర్నూలు స్వాముండడే, ఆడెక్కించిన బిస—"

"కర్నూలు స్వామెవరు?" అన్నాడు నిధి.

"ఆడాయీడా, గుంపుల్లో ఎగడి ఏకో సెప్తుంటాడు. ఆమద్దినమీరు యీడలేరు సామీ. కర్నూల్‌లో మీటింగు చేసుండడు. ఏనోళ్లని రమ్మని డబుకేయిస్తే, నేపోయుంటిని. ఆడు, దుడ్డుబాగా, యిస్తేగాని, పనుల్లో కెళ్ళొద్దని, యినుకిచ్చిండోడు. రెడ్డికి సివమెత్తింది. నారయ్య, దుడ్డుకోయిస్తా నంటుండడు అయ్యవోరితోచెప్పి. యీణ్ణి ఏసెయ్యాల్రెహో అని సోమప్పతో సెప్పి, మరెమ్మ సాకుమీద బాగాతన్నుండడు."

తన బాధ్యత తీరిపోయినట్లు, అతను కూడా వెళ్ళిపోయాడు. మూడు కథలు విన్నతరవాత నారయ్యని, వాళ్లు ఎందుకు కొట్టారో నిధికి బోధపడింది. నారయ్య మాట్లాడడం మానేశాడు. కట్టుకట్టింతర్వాత నిధి లోపలికి వొచ్చేశాడు.

"మీకేమన్నా బోధపడిందా?" అని అడిగింది కోమలి.

"నారయ్య రెడ్డిమీద అధికారం చెలాయించ బోయ్యాడు. మారెమ్మ తో రెడ్డి సరసాలాడటం నారయ్యకి నచ్చలేదు, తిప్పేస్వామి, పనివాండ్రని

ఎక్కువ జీతాలకోసం సమ్మె చెయ్యమని ప్రోత్సహించాడు. ఇవన్నీ కారణంగా, రెడ్డి, సోమప్ప కలిసి, నారయ్యకి పాఠంచెప్పారు. ప్రజా ప్రభుత్వం "ఎట్లాగుంటుందో కాస్త రుచి చూపించారు."

"ఐతే మీరెళ్ళరూ?"

"ఎట్లా వెళ్లను."

మాట్లాడుతుంటుండగా ఇందిరకి మరీ తీవ్రంగా వుందని మరో టెలిగ్రాం వొచ్చింది. తనే చూడ్డానికి వొస్తున్నానని, శ్రీనివాసరావుకు సరే టెలిగ్రాం యిచ్చి ప్రయాణం కట్టాడు, సాయంత్రం బండికి. మధ్యాహ్నం రెండు దాటింది. స్టేషన్‌కి బండికోసం కబురు చేశాడు నిధి. ఈ లోగా అనంతా చార్లుగారు చక్కా వొచ్చాడు. ఆయన్ని చూడగానే కోమలి లోపల గదిలో కెళ్ళిపోయింది. తలుపు వెనక నిలబడి, వాళ్ళ సంభాషణ వింటోంది.

"మొన్న దేవరకొండలో మళ్ళా గంద్రగోళమైంది విన్నావా?" అన్నాడు అనంతా చార్లుగారు.

"సూఛాయగా తెలిసింది"

"మళ్ళా మీ రాజభూషణమే అల్లరి పడ్డాడు. మీటింగు ముగిసిం తర్వాత గుండప్ప గారింట్లో భోజనా లేర్పాటయ్యాయి. అక్కడ పెద్దవాదం జరిగింది. గుండప్పగారికి యిద్దరు భార్యలు. ఇతను ఆయన్ని ఆక్షేపిస్తూ మాట్లాడుతున్నాడని అనుమానపడి, గుండప్ప, సర్కారు వాళ్ళకి నీతి, మర్యాద లేదని వాదించేడు. ఆ ఘర్షణలో నీ పేరొచ్చింది. కోమలి పేరు కాదా ఎత్తినట్లు నాకు గుర్తు —"

"గుండప్పగారి ఫిర్యాదు ఎట్లాంటిది?"

"ఏముంది,—ఏవో అనవసరపు ప్రదేశాలు తెచ్చుకుని, మాటామాటా అనుకోడం, పెండ్లిలేకుండా పరాయి స్త్రీతో వుండటం కంటే, యిది మెరుగే అంటాడు. భార్యని ఇతరులు అపహరించకుండ కాపాడు కోడమే పెండ్లని

రాజభూషణం అన్నాడు. దానిమీద ఆయన తేలిపోయ్యాడు. కొట్టుకు చేందుకు సిద్ధపడ్డారు. నేను అడ్డంపడి సర్దిచెప్పాను. నన్నుమట్టుకు వొది లారనా?"

"ఏం?"

"ఏముంది, తుంటర్లు కాత్యాయనికి పెండ్లికావడం కష్టం అంటాడు గుంపన్న. పోన్లేమాఅమ్మాయి విరాగిణిగానే వుంటుందిలే. నీకెందుకన్నాను. ఇంతకీరాజభూషణం, ఆరాత్రే, మాఎవళ్ళకీ కనబడకుండా వెళ్ళిపొయ్యాడు, ఈ రెడ్లు, పాపం నారయ్యని చావదన్నారు చూశావా—"

"అవును, మరి, నారయ్యదే తప్పనుకుంటా." అన్నాడు నిధి.

"ఏడిశారు వెధవలు. వాళ్లు పొగరెక్కి, ఇద్దర్నీ పనిలోంచి తీసెయ్యా ల్సిందే—" అన్నాడు ఆచారిగారు.

"దానివల్ల సమస్య పరిష్కారం కాదు. అంతకీ కారణం, ఏదో వుంటుంది. దాన్ని తొలిగించాలి. మీకేమన్నా తెలుస్తోందా—"

"నాకేమీ కనబడ్డంలేదు—"

"జాతి వైరం, సరిహద్దుల కొట్లాట, పేదలకీ ధనికులకీ, నిరంతరం జరిగే యుద్ధం. ఆర్థిక సమానత్వం వుంటేగాని, మానవుడు అందరినీ సమా నంగా ప్రేమించడం నేర్చుకోడు—"

"సోషలిజమ్ రావాలనా నీవూహ?"

"నావూహ కాదు. దయాదాక్షిణ్యాలు. ఔదార్యం, ప్రేమ— యిట్లాంటి విలువలకీ భౌతిక సంపదకి అంతటి దగ్గర సంబంధం వుంది. వుత్తమ ఆధ్యాత్మిక జీవనం, అన్నింటినీ త్యజించి చీకూ చింతాలేని యోగికే సాధ్యం అవుతోంది గాని, కుటుంబీకుడుకి సాధ్యపడటం లేదని మీకు తెలి యంది కాదు, అందరూ యోగులు ఎల్లానూ కాలేరు; కారు; కాకూడదు కూడానేమో! అంచేత, అందరికి సమాన భౌతిక సంపదని సమకూర్చడం తప్ప, గత్యంతరం లేదనుకుంటా, దాన్ని సోషలిజమ్ అనండి, మరోటనండి."

"అవన్నీ గాలిలో మేడలుకాని, జరిగేపనా, జరిగినా, మనిషికి కావల్సింది, తిండి, బట్ట, అంతేనా?"

"అంతే అనను. అవి లేందే, యింకేమీ రావంటాను. అంతే. ప్రభుత్వం, ద్వీపాంతరవాస శిక్షలో వున్నవాళ్ళకి, తిండి బట్ట సమానంగా ఏర్పాటు చేస్తుంది, ప్రేమ, ఔదార్యం, ఆధ్యాత్మికచింతన వనంవాళ్ళల్లో చూడొచ్చు. ఉత్తమ గ్రంథాలు, జైళ్ళల్లో వ్రాయబడినవే - బట్టని విసర్జించిన వ్యక్తి న్యూడిస్టు కాలనీలో మోక్షం పొందుతాడేమో చెప్పలేను కాని, తిండిని విసర్జించి మోక్షం పొందిన జీవిని ఎవ్వరూ చూడలేదు—"

అనంతాచార్లుగారు ఆలోచనలో పడ్డా, ఏదో ప్రశ్న అడగడానికి సందేహిస్తున్న వాడికిమల్లేవున్నారు. రెండుమూడుసార్లు ఆ ప్రశ్ననోటిదాకా వొచ్చింది. ఐనా దిగమింగేశాడు. మరోప్రశ్న తెగించి అడిగేశాడు.

"పోనీ, మనిద్దరంవెళ్ళి నీ భార్యని తీసుకొద్దామా?"

"జబ్బుగా వుందట. ఇప్పుడే వెడుతున్నా, చూడ్డానికి. తవ్వ, ఇరవై అడుగులేనా పూర్తయినట్లులేదు —"

"వారంలో అవుతుంది. పనివాళ్ళు పల్చబడక పోతే."

"గని తవ్వించడం విరమిద్దామా అని వుంది."

"ఇంతవరకూ వొచ్చి, యిప్పుడు మానెయ్యడం ఎందుకు? ఆపనులన్నీ నేచూస్తాలే. నువ్వెళ్ళి నింపాదిగావున్న తరవాత తీసుకురా."

ఇంతలో, కోమలి గూట్లెముక్కలు పంచదార పళ్ళెంలోవేసి, కప్పుతో పాలు తీసుకొచ్చి, ఆచారిగారి ముందు బల్లమీద పెట్టింది. ఆమెని చూడగానే, ఆచారిగారు, కుర్చీలో కదిలాడు.

"నేనుకూడా వొస్తానంటున్నానండి-"

"ఇక్కడా వొక్కదానవు వుండనక్కర్లేదులే. మాయింట్లో వుందువుగాని." అన్నాడు ఆచార్లుగారు.

'నామూలాన. మీకూ్కూడా కష్టం ఎందుకు కలగాలి?"

"కష్టం ఏముంది?"

"కష్టం కాకపోతే, పోనీ, నింద. కాశ్యాయనికి పెండ్లయితే, ఎవ్వరికీ బెంగవుండదు"

ఆచార్లుగారు. మాట్లాడలేదు పాలుతాగేసి వెళ్ళొస్తానంటూ, వెళ్ళి పొయ్యాడు.

"పాపం నారయ్యాని, వొదిలివెళ్ళనా?" అన్నాడు నిధి.

"నేచూస్తాలెండి, ఏం భయంలేదు. డాక్టర్లు నర్సులు యింత మంచున్నారుగా." అంది కోమలి. ఇంతలో బండి వొచ్చింది. కోమలి పెట్టి బెడ్డింగు, బండిలో పెట్టింది. నిధి నారయ్య దగ్గఱ కెళ్ళాడు.

"సులువుగానే వుంటుంది. మీరెళ్ళిరండి. కోమల్ని తీసుకెళ్ళరా కండేం" అంటూ నీరసంగా అన్నాడు నారయ్యా.

"లేదు వొళ్ళుణ్ణి ఖెడుతున్నాను"

"కపలు తగువంతా దాని మూలకంగానే వొచ్చిందండి."

"ఏం"

"ఆళ్ళ కూతలకే. గాని, ఆరెడ్డి, కోమల్ని గురించి ఏదేటో అనబొయ్యాడు. మూతిమీద వొక్క టంటించాను. దాన్ని ఆళ్ళకాడికి యీళ్ళ కాడికీ పంపి, నేనూ, మీరూ డబ్బు గణిస్తున్నా మన్నారండి, తొత్తు కొడుకులు. నాకుసీదరేసి, వుతిగానండి. ఇట్లాసేసినారు ముండాకొడుకులు. లెగనీండి మక్కలిరగ దంతాను"

"నారయ్యా! మన పరిస్థితులు సవ్యంగా లేనప్పుడు, లోకులు అనేకం అనుకుంటారు. అది నిజం కానప్పుడు, మనం కోపగించుకోటం దేనికి? మంచితో వాళ్ళని జయించాలి గాని, పగసాధిస్తే, సర్వనాశనం అవుతుంది"

"ఈ నాకొడుకుల్తో మంచేటండి? ఏ ఎండకి, ఆగొడుగేనండి-"

"సరేలే-పడుకో-"

"ఏం భయంలేదు. ఎళ్ళిరండి"

నిధి వెళ్ళి బండిలో కూర్చున్నాడు.

కోమలి నిలబడి, బండిలోకి వొంగి, అతని చేతులు పట్టుకుని, కళ్ళల్లోకి జాలిగా చూసింది.

"దర్శ్నని రావాలి"

"ఎన్నిరోజులవుతుందో, ఏం చెప్పగల్ను?"

"మిమ్మల్ని చూడకపోతే వుండలేను నేనూ వొచ్చేస్తా రేపో మాపో, కోపగించుకోకండేం"

"నారయ్యని వొదిలే-!"

"ముసిలాడిది దుక్క శరీరం, చావడు" అని నవ్వింది.

"వొచ్చేటప్పుడు అమృతంగార్నీ, ఆవిడ తమ్ముడునీ, అందర్నీ తీసుకురండి-".

బండి కదిలింది. కోమలి పడబోయి, వెనక్కి తుళ్ళిపడి, బండి సందు తిరిగేదాకా, చూస్తూ నిలబడింది. దూరంగా ఎఱ్ఱచీరలో, చిన్ని చుక్కలాగై, ఎండలో కలిసి, మెరిసి, మాయమైంది కోమలి.

*　　*　　*

స్టేషన్‌కి ఎవ్వరూ రాలేదు. బండి దిగి మామగారింట్లో అడుగు పెట్టేటప్పటికి సాయంత్రం నాలుగైంది. ఇంట్లో మనుషుల సందడిలేదు. పనిమనిషి మండువా వూడుస్తోంది; మధ్యలో నిలబడి "ఎవరికోసమండి?" అని అడిగింది. నిధికి ఏం సమాధానం చెప్పాలో తెలిసిందికాదు. ఎవర్నీ వరసలెట్టి పిలవడం అలవాట్లేదు. బెడ్డింగు బల్లమీద పెట్టించి, అరుగుమీద పచార్లుచేసున్నాడు. ఇంతలో ఏడెనిమిదేళ్ళ వయస్సుగల కుర్రాడు, అతని దగ్గరగా వొచ్చి 'ఆ బల్లకింద నా బొంగరం యిరుక్కుంది తీసిపెట్టరూ" అన్నాడు.

"ఎవరమ్మా నువ్వు!"

"మాధవయ్యగారబ్బాయిని. మీ రెవరు?"

"ఇందిర తమ్ముడివా?"

"ఊఁ- నా బొంగరం తియ్యరూ."

అబ్బాయి మొహాన్ని బట్టి ఇందిరని వూహింప యత్నిస్తున్నాడు నిధి. బల్లకిందికి పాకి, కఱ్ఱతో బొంగరాన్ని యివతలికి లాగాడు-దాంతో పాటు వచ్చిన ఎలకకూడా యివతలి కొచ్చింది.

"నే నెవర్నో ఎరగవు?"

"ఊహుఁ" అంటూ తలపంకించి, బొంగరంతో రోడ్డుమీదికి నడిచాడు కుఱ్ఱాడు.

"అయ్యగారు లోపలుండారు. రమ్మంటుండారండి" అన్నది పని మనిషి. లోపలి గదిలో చాపమీద గోడకి జార్లపడి కూర్చున్నాడు మాధవయ్యగారు. మొహం చేతుల్లో దాచుకుని కాళ్ళమీద ఆనుచుని చతికిల బడ్డాడాయన. ఇతన్ని చూడగానే—

"ఆ,-ఎవరు-ఆ" అంటూ నివ్వెరపడి చూస్తూ, వొక్కసారి లేచి, ముందుకు గెంతి, 'వొచ్చావా, 'వొచ్చావా' అంటూ నిధిని వెఱ్ఱిగా కౌగలించుకుని, కళ్ళమ్మట నీళ్ళురాకుండా అతని భుజాన మొహం నొక్కి వుంచాడు.

"ఇక నువ్వే బతికించాలి. మమ్మల్ని దేవుడు వీట్లోకి నెట్టేశాడు-" అంటూ కూలబడి, నిశ్శబ్దంగా బాధపడుతున్నాడాయన.

"ఇందిరేదీ?" అన్నాడు నిధి, మొహం అవతలకి తిప్పేసుకుని. బాధ పడుతున్నవాళ్ళ మొహాలు చూడడానికి అలవాటుపడ్డా, అతనికి యిదో వింత అనుభవం. ఈదృశ్యంలో అతనికి బాధ కనపడలేదు కాని, వొక అవాంతరాన్ని సాగింపేటంగును, మరో అవాంతరాన్ని అహ్వానించినట్లుగా వుంది.

"నిన్ను, పోగొట్టుకున్నాను-శాస్తి జరిగింది-కర్మఫలం వూరికే పోతుందా?" ఏవేవో అంటూ మాధవయ్యగారు కూర్చున్నవాడు లేచి, తొట్రుపాటుతో పచార్లుచేస్తూ, పైన తువ్వాలు వేసుగుని, నిధిని తీసుకుని, బైటకి నడిచాడు. ఇద్దరూ నడవడం మొదలెట్టారు. నిధి, మాధవయ్యగార్ని

పరకాయించి చూశాడు. జీవితం ఆయన్ని ఎత్తునుంచి, లోయలోకి గిరగా టెట్టింది. కాలం, ఆయన్ని మళ్ళా లేవదీసి, పైకి గిరవాటెట్టింది. ఐనా పైన వుండే అస్థాత పోగొట్టుకున్న వ్యక్తికిమల్లే పదేపదే లోయలో పడి, గాయాలు తగిలించుకున్న మనిషి. పైన రెండు పళ్ళులేవు; వెంట్రుకలు బుర్రవేడికి తట్టుకోలేక వూడిపడ్డాయి. వూడ గానికి వోపికగలేని తెల్ల వెంట్రుకలు, నెత్తినే ఆశ్రయించుకున్నాయి. చర్మం ఎముకల్ని పట్టుకునే శక్తిలేక, జారిపోయి నీళ్ళమన్య రాతిగుహలో జారి వ్రేల్లాడే వృక్షజాలం మాదిరి, నిలబడి వుంది. శరీరంలోపల చూసొచ్చు వినొచ్చు ననిపించేటట్లుగావుంది.

ఊరకతల చెరువుగట్టుకి చేరుకున్నారు. దూరంగాపాక, ముందు పందిరి కనిపిస్తున్నాయి. ఊరు తగలడుకున్నట్లు, పాకవెనుక పడమటి ఆకాశాన్ని సూర్యుడు కాలుస్తున్నాడు. దూరంగా ఆవులమంద కదుల్తోంది. పక్షులు వాటి నిస్సత్తువకి వెక్కిరించినట్లుగా, వెన్నంటి గుంపులుగాలేచి, చెరువులో పడుతున్నాయి.

"ఊళ్ళో వుంచడానికి వీల్లేదన్నారు. ఏ ఖానిటోరియములోనూ ఖాళీ లేదన్నారు, ఏంచెయ్యం, ఇక్కడఏర్పాటు చేశాను." అన్నాడు మాధవయ్య గారు. పాకవెనుక, వొక ముసలావిడ గిన్నెలు తోముతోంది.

"మా వొదినగారు. పాపం ఆవిడే రాత్రిపగలూ—"

మంచంపైన మిగిలిన ఇందిర పడుకునివుంది. పక్కనవున్న రెండు పెట్టెలాక్కొని మంచంప్రక్కన కూర్చున్నాడు దయానిధి. వికృతంగా నవ్వింది ఇందిర అస్తిపంజిరం. ప్రక్కకి కదిలింది—చెయ్యి యివతలికి తీసింది—ఆ చర్యలో శిశువు జన్మించిన ఆశ్చర్యం వుంది.

"కదలకు,—బెడ్ సోర్స్" అంటూ బైట నిలబడి మాధవయ్యగారు అరుస్తున్నాడు.

అతనికేసి నిశ్చలంగా చూసింది ఇందిర. ఎవరో ఎక్కడివో లాగే

స్తున్న చూపులని, బలవంతంగా వొక్కసారిలాగి నిలబెట్టింది. అన్ని శక్తులూ, కంఠంలో వొక్కసారి ప్రజ్వరిల్లాయి. గుండెల్ని కాసేపు కొట్టుగోడం ఆపు చేసి, శబ్దరూపం దాల్చిన అంత్య శక్తుల ఆర్భాటం అది.

"వొచ్చారా—".

ముసలమ్మగారు యీదృశ్యం చూడలేక లోపలికెళ్ళి ఏడవటం సాగించింది.

"ఇక్కడ పారేశారు నన్ను—నన్ను వొదిలి వెళ్ళకండేం—" అని వోపికలేక ఇందిర కళ్ళుమూసింది.

దయానిధి మనస్సు, నిశ్చలంగావుంది. చుట్టూ శిఖరాలుకరిగి, కరిగి పడిపోతున్నాయి. నదులు జన్మస్థానానికి ఎగ్రబాకుతున్నాయి. నేలమీద పడిపోయిన ఆకులు పైకిలేచి చెట్లని కలుసుగున్నాయి. ఇంత అనిశ్చలమైన వాతావరణంలో తనొక్కడే స్థిరంగా, ప్రశాంతంగా, వున్నాడు. అతనిలో వుద్రేకంలేదు. బాధలేదు, బెంగలేదు, దిగులులేదు. ఇందిరతో కలిసి సూర్యోదయ సౌందర్యంలో ఆవులించ లేదతను; చందమామ చల్లటి అందంలో నిద్రలో ప్రేమతో కదలలేదతను, నక్షత్రాల కనుసన్నలకి కామంతో వొణకలేదతను. చల్లటి నీళ్ళ పులకింతలలో సొమ్మసిల్లలేదతను; గుండెలూ, గుండెలూ విశ్వగానంతో మేళవించికలిసి కొట్టుకోలేదు. అన్నినదులూ కలిసిపొయ్యే మహాసముద్రలాంటి ప్రేమ ప్రవాహంలో వారి రక్తాలు వేరువేరుగానే ప్రవహించాయి. సృష్టికోసం పెనుగులాడటం నేర్చుకుని అమాయకపు ప్రాణుల పిచ్చిప్రశాంతం అతన్ని ఆవరించింది. పాటలు, పద్యాలు, యజ్ఞాలు, యోగాలు, క్రతువులు, ప్రార్థనలు,-ఎన్ని చేసినా, చందమామ అంతకంటె ఎక్కువగా ప్రకాశించదు. గాలి అంతకంటె జోరుగా వీయదు; కెరటాల సంఖ్య పెంచుకోదేగు సముద్రం; ప్రేమించదు మానవహృదయం. సుఖపడటం నేర్చుకోని వాళ్ళకి బాధపడటం చేతకాదు.

మళ్ళీ ఇందిరమాస్తున్న లోకంలో తలుపులు తెరుచుకున్నాయి;

కళ్ళు తెరిచిందా—!

"నన్ను ఎప్పుడూ వొదిలి వెళ్ళకండేం—" శరీరంలోంచి విడి పోయిన చెయ్యి అతని చేతిని ప్రమాదంగా స్పృశించింది. చేతి చర్మం తిరగేసినట్లుంది. ఇంకా యీ పెనుగులాట ఎందుకో! ఎవరికోసమో యీ గుండెలు కొట్టుకోడం, ఎందుకో! చర్మాలని పట్టుకొని పీక్కుతినడాలెందుకో! యీ లోకంలో మూసుకుని మరోలోకంలోకి చూస్తున్న ఆమె నేత్రాలకి యీ చీకటిలో దాగుడు మూతలెందుకో!

ఏమనాలి? ఏం చెయ్యాలి? అతనికి తోడంలేదు. లేచి బైటకి వొచ్చాడు. పడమటి ఆకాశం మంటలోపడి సూర్యుడు దగ్ధమై పోయాడు. నల్లని మేఘాలు కొట్టుకుపోతున్నాయి. ప్రకృతి బాధతో చీకటైంది. పాక చుట్టూ పెనవేసుకుని గాలి మూలుగుతోంది. టెలిగ్రాఫ్ స్తంభంపై కాకి ఏకాంతంగా ఏడుస్తోంది. ఎవరికోసమో లోపల్నించి "నాన్నా" అని పెద్దకేక వినబడింది. "చూడునాయనా" అంటూ మాధవయ్యగారు నిధిని లా పలికిగెంటాడు. "వెళ్లిపోతున్నారా!" అని ఇందిర రెండుకళ్లని ప్రశ్నార్థకంగా త్రిప్పి, చూపునిలబెట్టి వేసింది. అది మృత్యువు జీవాన్ని అడిగిన ప్రశ్నని అతనికి తెలుసు. అతని చేతిని పట్టుగుని వూపింది. ఆపడవకి లంగరి అందాక ఏశక్తీ దాన్ని నిలబెట్టలేదు. మత్యువుని స్పృశించాడు. జీవం యొక్క కడ సారి మాధుర్యం. అతని చేతుల్లో తన్నుకులాడింది. సృష్టి రహస్యాన్ని అతను శోధించినట్లయింది. అతని హృదయంలో ప్రాశాంతమైన వెలుగు వాహిని. సుఖదుఃఖాలని విసర్జించి, వుద్రేకాలకి అతీతమైన మహత్తర చైతన్యం అతన్ని వుత్తమ మానవుణ్ణి చేసింది.

లోపల ముసలమ్మ, బైట మాధవయ్యగారు, ప్రపంచానికి అర్థమయ్యే ఏడుపు సాగించారు. ఏడుపులో గాంభీర్యం, పరిపూర్ణతవుంది. దానికి అంత రాద్ధాంతం వుండకూడదని. మానవుణ్ణి జీవితానికి కట్టిపడేసేద కన్నీరు. ఆది అంతాలున్నది కన్నీరొకటే. దానికి అతీతమయ్యేసు దయానిధి. మానవ

జీవితాన్ని కన్నీటి బిందువుగామార్చి అరచేతిలో వుంచుకొని, దాన్ని పరీక్షగా చూసి, కరిగించివేసే సమయం అది. ఆ కన్నీటి బిందువులో కలిసినవెన్నో ప్రేమ వాహినులు; ఎన్నో నవ్వు అలలు; మనిషినీ మనిషినీ బంధించిన తుంపరల గొలుసు. యవ్వనంలో వెక్కిళ్ళు, వార్థక్యం లో మంచు గడ్డయ్యి, మృత్యువులో పరమార్థం పొందిన కన్నీటి బిందువుకి అర్థమే లేదా? లేదు. కన్నీటికి అర్థంలేదన్న తలంపుకి కన్నీరు తప్ప, కన్నీటికి వేరే అర్థంలేదు.

కర్మకాండంతా తనే జరిపాడు. ఇందిర మహాయిల్లా లన్నారు; పుణ్యం చేసుకుని పునిస్త్రీచావు చచ్చిందన్నారు. పిల్లలు లేక పోవడం మెరుగన్నారు పెద్దలు. అతన్ని మళ్ళీపెళ్ళిచేసుకోమన్నారు పెద్దలు. శవాన్ని తగుల బెట్టి నడిచి వొచ్చిన కాళ్ళతో పెండ్లి పీటమీద కూర్చోమన్నారు. చితికి అగ్గిపుల్లగీసిన ఆచేత్తో, అగరొత్తులు ముట్టించ మన్నారు. ఆత్మశాంతి కోసం అర్థంలేని ధ్వనులు చేసిన ఆనోటితో గదిలో బాటసారి చెవులో ప్రేమమంత్రం పఠించమన్నారు. ఈమనుషులు గోని బస్తామనుషులు. ఏబస్తా ఖాళీగా వుండకూడదు; అందులో పుష్పాలు వెయ్యాలి; లేకపోతే రాళ్లు వెయ్యాలి; కట్టెలు వెయ్యాలి. ప్రతివాణ్ణీ ఆబస్తాలో దిగేసి, చెట్టు కొమ్మకి వ్రేళ్ళాడ తీస్తారు.

ఐదువేలు కట్నం అన్నారు; పదివేలన్నారు; ఎవరి పీకకో తాడుకట్టి నులప మన్నారు; అందుకు లంచం ఐదువేలు — అందమైన, గుండ్రని, మృదువైన అమాయకపు పీకలు. అతను రైలు ఎక్కేదాకా, అంటూనే వున్నారు. అతన్ని సెకండుక్లాస్‌లో కూర్చోబెట్టి, పక్కపెట్టెలో కొంత దూరంవరకూ ప్రయాణం చేశారు పెద్దలు. వారిని తప్పించుకుని బైటపడ్డాడు ప్లాట్‌ఫారం మీద ఆడాళ్ళ పీకలు చూసి భయపడ్డాడు. టికట్ యిచ్చేసి, వొంటెద్దు బండి కట్టించుగుని గోదావరొడ్డుకేసి పోనీ మన్నాడు.

*   *   *

గోదావరి గట్టమ్మటే నాలుగుమైళ్ళు వెళ్ళింతర్వాత దయానిధి, జగ

న్నాథం ఆశ్రమానికి చేరుకున్నాడు. తొమ్మిది గంటలైంది. గట్టుకి ఫర్లాంగు దూరాన, పల్లంలో, ఒక పెద్దపూరిపాక, రెండు మూడు చిన్న గుడిసెలు వున్నాయి. ముందు రెండు పెద్ద చెట్లు చల్లటినీడల్ని వేస్తున్నాయి. వెనక గడ్డివాము, రెండు మూడావులు, దూడలు గంతులేస్తూ మేస్తున్నాయి. ఒడ్డున సగం నేలపైకి లాగిన పడవ, కఱ్ఱకి కట్టేశివుంది. నిధి బండిలోంచి తన బెడ్డింగు దింపి, బండివాడికి డబ్బులిస్తుండగా, దూరంగా లోపల్నించి వొక సన్నటి పొడుగాటాయన పరుగెత్తుకుంటూ వొచ్చాడు. మధ్యపాపిడి, పక్కలకి అణిచి దువ్విన పొడుగాటి కంఠ్రకుకలు, సన్నగా ఎత్తుగా, లేచిన ముక్కు, కొంచం బైటికి వొచ్చే కింది పెదవి, తెల్లటి వొదులు ఖద్దరు పైజమా, బొత్తాలు లేని కంటి మెడ లాల్చీ, పైనగువ్వాలు, ఎడం చేతిలో పొట్టి కఱ్ఱ—ఆ వ్యక్తి జగన్నాథం.

"రుగావబా, రుగావబా-" అన్నాడు, పూర్తిగా బొంగురుకాని కంఠంతో యవ్వనంలోని అబలత్వం యింకా ఆ కంఠంలో వుంది.

నిధి వెనక్కి తిరిగాడు. జగన్నాథం రెండు చేతులూ, అతని మెడ చుట్టూవేసి, కౌగలించుకుని రుగావబా; కిళ్ళన్నా ఎ, కిళ్ళన్నాయె..." అన్నాడు. అర్చిలా అమర్చబడ్డ నల్లటి కనుబొమ్మలు అతని కళ్ళకి వొక తీవ్రతనిచ్చాయి. ఆ తీవ్రత, వుద్రేకంతో చలించింది.

"తమిళం నేర్చుకుంటున్నావా-" అన్నాడు నిధి.

"మహాపాఠశాలలో చేనవారై శిష్యత్వం స్వీకరించి, వోనమాలభ్యసించొచ్చు. లైక్ మై లైఫ్- నా జీవితంలాగా, నా భాషయున్ గూడ తల క్రిందులైందని గ్రహించకేల, రుగావబా!" అన్నాడు. ఇద్దరూ కసిగా నవ్వుకున్నారు. అతని రెండు చేతులు పట్టుకుని కళ్ళల్లోకి చూశాడు నిధి. పక్కన నవ్వాడు.

"ఓస్-మనమూ చెయ్యగలం" అంటూ జగన్నాథంకూడా పక్కన నవ్వాడు. అట్లా యిద్దరూ, నిలిపి, నిలిపి, నాలుగైదుసార్లు అర్థం లేకుండా

నవ్వుకున్నారు. బండివాడు కొల్లబోయి, పకపకాన నవ్వి, ఎగ్గునిహుషార్ చేసి, యీల వేసుగుంటూ, బండిని తోలుకుపోయ్యాడు

"కఱ్ఱతీసుకొచ్చావ్, కొడతావా ఏమిటి?" జగన్నాథం, చేతులో కఱ్ఱని పైకెత్తి, దానికేసి చూస్తూ,

A dog hath a bone to lick
A girl hath a flower to pick
The king hath a bed to fall sick
But a Lord of the world, (అంటే జగన్నాథ్) has only a stick. మదీయ జీవకఱ్ఱ—జ్ఞాపకంవుంచా, జీవము+కఱ్ఱ— అగమ సంధి—The staff of my Life—

ఏ కొంపకొంపల మడిసి గుంటిరి? ఏకీమదాగియుంటిరి — యిన్ని వాళ్ళు. చెప్పండి.—" అని కఱ్ఱని శెంకుసొగ్గ గాలిలో విదిల్చాడు. జగన్నాథం తువ్వాలుతో పోగావట్టి, శెట్టింగ్ నెత్తికి చెట్టుగుని, "ఆహ్వా స్వాగతం, సుస్వాగతం—తదీయ రాకచే, యక్స్కూజ్ బాడ్ గ్రామర్,—మదీయగృహంబు, (ప్యూర్లీ సర్ ది సేక్ ఆఫ్ రైమ్—పావనంబయ్యె—దయచేయుడు—లేదా,—ది గుడ్ ఓల్డ్ ఐడీవల్ క్రెడిపన్—శ్రీశ్రీశ్రీ మహా, మహా, తత్ ఓం, ఓం, ఓం— శ్రీ శ్రీ శ్రీ,—బహుపరాక్—" అంటూ యిద్దరూ నడిచియింట్లోకి చేరుకున్నారు. యింకానలుగురు కుఱ్ఱాళ్లు చెట్టుక్రింద చాపలమీద కూర్చుని చదువుకుంటున్నారు. వాళ్ళు లోపలికొచ్చారు. ఒకబ్బాయి నిమ్మరసం నీళ్ళల్లోపోసి, పంచదార కలిపి తీసుకొచ్చాడు. ఈలోగా జగన్నాథం తువ్వాళ్ళు తెసుకొచ్చాడు.

'స్నానంబాచరింతామా?'

"ఓ, ఐతే నీ ఆశ్రమానికి ఏం పేరెట్టావ్—"

"ఈ పుణ్యభూమిని ఆశ్రమం అనడం, పాపమని గ్రహించండి స్వామీ. ప్రపంచంతో నిమిత్తంలేని వాడికీడ తావులేదు.—టు యూస్

"ఎవరి పెళ్లాంకో మహాత్మా? వుడ్‌హౌసియన్ జోక్—కాదు స్త్రీలు అర్థం కారండి—వాళ్ళకో నిమిత్తం కనపళ్ళేదండి— బొమ్మలతో మాదిరి, వాళ్ళతో ఆడుకోవాలనిపిస్తుంది. కాని, ఏవొక్కరితోనూ, ఫర్ ఆల్ టైమ్ వుండడం అంటే భయం, అండి.—నా వుద్దేశం—మొదటి మనిషికి, తోచక యిదవుతుంటే కాలక్షేపానికి, 'స్త్రీ'ని సృష్టించుకున్నాడని నా అనుమానం-హాల్డేన్‌కి వుత్తరం రాసి కనుక్కోవాలి-"

"ఏరు వాంఛ,-

"Say, passion_"

"అదే-పోనీ- లేదు నీకూ?"

"ఏమీ పనీపాటు లేనివాడికవన్నీను-చేతినిండా పనుంటే, అదో పెద్ద బాధకాదు-టేక్ మై లైఫ్---ప్రొద్దున్నే లేస్తాను. గోదావరిలో గంట స్నానం చేస్తాను. స్వయంగా పాలు పితుకుతాను-తరవాత మొక్కలు, తోటా చూసుకుంటాను. అన్నం వొండుతాను-మధ్యాహ్నం, పత్రికా పఠన, చదరంగం, పాఠాలు చెప్పడం-సాయంత్రం, తేలికైన తేయాకు-డ్రింక్ ఇండియన్ టీ-దెన్ బోట్ షైర్-రోయింగ్ ఎ గేలిక్ ఎక్సర్‌సైజ్-నైట్ సీ, చెట్టుకింద, నో పాతిక మంది పోగవుతారు-పదింటివరకూ వాళ్ళకి చదువు నేర్పడం-కానీ ఖర్చులేదు రాజాలాంటి జీవితం-ఎవర్దగ్గరా దమ్మిడి పుచ్చుగోను. శిష్యబృందం వొకడు చింతపండు, మరొకడు మిరపకాయలు, ఇంటిదగ్గర నుంచి బియ్యం వొస్తాయి. ఆ, అవుచూకండి. శిష్యులిచ్చిందే-అసలు వాళ్ళే వొండి పెడతా మంటారు. బట్ ఫర్ మి ఎందుకు, ఐదేళ్లలో, యిది పెద్ద యూనివర్సిటీ అవుతుంది. అప్పుడు మన దర్శనార్థం, మాళవ్యాజీ, గాంధీ చక్కావొస్తారు. జీవిత రహస్యం అదే—ఏవీ కోరకుండా ఏదో పనిచేసుకుపోండి—ప్రపంచం మీ కాళ్ళముందు వాల్తుంది. ఏమన్నా అడిగారా, చెట్టెక్కుతుంది.—ప్రపంచం, వరల్డ్."

వంటలయ్యాయి, భోజనాలుచేసు. కాసేపు పడుకుని లేచారు.

అమధ్యజాతిది అనొచ్చు-"

'అసందర్భంగా మాట్లాడావంటే, పడవ వూపుతాను." అంటూ నిధి పడవని కదల్చడం మొదలెట్టాడు.

"ఏమంటోయ్-"కన్నీరై, అగానమై, అపరిచితుడై, అగౌరవుండై

**Anwept, unsung, unknown, unhonoured,**
**One,two, three**
**Timeless waters of Godavary,**
**Swallowed jagnnath's mystery,**
**And flowed into the sea of Eternity.**
**But,** కాని, **who is the boatman?** నావికుం డెవడు.—?
**The wealth of kindness,**
**Dayanidhi,**
**He, the boatman, made a childish mess,**
**Of loving humanity,**
**With kindness killed,**
**With burning passion, chilled,—**

అయ్యో, మనం కేవలం పూరికేవుండటం, వొక్క ఆంధ్రదేశానికీ వొక్క భారతభూమికి కాక, జగత్తంతకీ నష్టం అనవొచ్చు- మనపాట్లు, వొక్క తెనుగు, ఆంగ్లంలోకాక, నార్వీజియన్ భాష ... కాబడే దినం, దగ్గరలో రానున్నది. అన్నికార్యాలూ, దయానిధివి కలయు నారు, కేర్ ఆఫ్ కోమలి, నాగుమణీ గ్రంథమాల, తప్పొప్పుల పట్టిక సుశీల టిప్పణు, నారయ్య ఆఖరికూర్పు, వెయ్యిప్రతులు, వెల—'తెలిసుకో లేరు'—"

తరవాత జగన్నాథం సంగీతం మొదలెట్టాడు, ఇసిక తెన్ను మీదికి చేరుకున్నారు.

"నీ జాబితాలో అమృతం పేరు వొదిలేశా వేం?"

"మీరు కోపం వొచ్చినట్లుంది. తమాషా కన్నాను."

"నాకేమీ కోపంలేదు. ఐతే నేనొకటడుగుతాను చెప్పు."

"శెలవియ్యండి—"

"నువ్విట్లా, చిత్రంగా మాట్లాడతా వెందుకు? స్వభావమా, తెచ్చి పెట్టుకున్నదా?"

"తెచ్చి పెట్టుకోనేది ఏదీలేదు."

"ఎప్పుడేనా, నువ్వు, నువ్వుగావుంటావా?"

"నేను నేనుగా వుండే అవసరం, పుస్తకాల్లో మనుషులకి తప్ప మామూలు లైఫ్‌లో మనుషులకి రాదు. వొస్తేవాళ్ళు చస్తారు"

"ఇప్పుడు మాట్లాడుతున్నట్లుగా, ఎప్పుడూ ఎందుకు మాట్లాడవు?"

"ఇట్లా మాట్లాడితే, ఎవ్వరూ లైక్ చెయ్యరు—"

"నీ సంభాషణంతా వొక నటనన్నమాట!"

"అసలు జీవితమే, నాటకరంగం; మనం అందరం పాత్రలం; సంభాషణ నటనెందుకు కాకూడదు? నటుడు, నటించడం మానేసి, తననిజస్వరూపం ప్రదర్శించి, గొడవలు మొదలెడితే, ప్రేక్షకులు ఏంచేస్తారని మీవూహ? అందుకనే భర్తృహరి ఏమన్నాడంటే—! భర్తృహరి గాడి స్పెల్లింగ్ గాదండి—"

"ఇస్, మళ్ళా మొదలుకొస్తున్నావు—"

"ఆయన, హృదయ ద్వారంబుల్ మూసి, చిల్లు పడ్డ డోలువలె,— ఆర్ టు వేరీది మెటఫర్,—తల్లిపాలు తాగిన పాపవలె—వూరకుండును—"

"క్లీర్ ఆఫ్ కోమలి అన్నావుకదా, నీవుద్దేశం?"

"........"

"చెప్పు, నిన్నే — అబ్బో, కోపంకాబోలు" మళ్ళా ఇద్దరూ పడవెక్కి, వొడ్డుకు తోసుకొస్తున్నారు.

ఆరాత్రి, భోజనంచేసి, చెట్టుకింద మంచాలు వేసుకున్నారు. దయానిధి అప్పు డన్నాడు.

"కోమలి నాతో వుంది — తెలుసా? అందుకనే కేరే ఆఫ్ కోమలి అన్నావను కున్నాను."

నే జీవిత రహస్యాన్ని ఛేదించే వరకూ మీరు నిద్రపోరను కుంటాను. కోమలి పేరెత్తారంటే, నేను నిష్కారణంగా పొయిట్రీలో దిగిపోతాను.

Where art thou roaming
O, Komali;
In the wastefull valley
Of poisoned honey,?
In the arms of strong stupidity?

చంద్రశేఖర్ గారు, భావకత్వం మీద వ్యాసాలు దంచేస్తున్నారు మన్యా, ఆంధ్ర కవి పుంగవులు. కోమలి ఫొటోగ్రాఫ్ కింద విశ్వంగా సంతకాలు పెడితే సరిపోను.

"నిన్ను చూడాలి, తీసుకురమ్మంది. నువ్వు నీళ్ళల్లోకి గెంటావుట — రానీ, తగిన శాస్తి చేస్తానంటోంది."

"చప్పనే ఆంధ్రరాష్ట్రం వొస్తుందని జైగ కాబోలు —"

"అంటే?"

"ఏదో అన్నాను పోనిస్తురూ, చంపక —"

ఇంతలో, ఓ పదిమంది, చదువుకోడాని కొచ్చారు. వాళ్ళతో కలిసి జగన్నాథం యింట్లోకి వెళ్ళిపోయాను. తెల్లారింది. బండివచ్చింది. నిష్ప్రయాణం కట్టాను.

"నువ్వు తప్పకుండా రావాలి సుమా!"

"తప్పకుండా వొస్తాను — కోమలి కివి నా మాటలుగా చెప్పండి, —
ఏవూర నున్నయమున్, నీనల్లటి తలంపే, గాడ్పుని వడ గండ్లు సేయవా.
ఏటి హోర్గానిస్టిప్పూ, బిలహరిలో, నాలుగున్నర, —
ఏ మందలో చేరినా,
ఏకాకినై, అలికి ముగ్గట్టంగ

నోసుకోని, నీ బ్రతుకు తెరువు,

సూపకో, వొద్యాన్యకమైన,—

అప్పో, యీపూట రావడం లేదండీ—ది లీజన్ యూజ్, ఇద్యంగా మొదలెట్టి, పాటల్లోకి దిగాను—ఎనివే,—దీపావళి కొస్తాను—మా అమృతాన్ని చాలా, చాలా అడిగా—నని చెప్పండి—" బండి దూరంగా వెళ్ళిపోయింది.

దయానిధి అమృతంగారి వూరు చేరుకునేటప్పటికి సాయంత్రం ఐదు గంటలైంది. సామాన్లు స్టేషన్లో పెట్టేసి, వొకట్టుడూ, వూళ్ళోకి నాలుగు మైళ్ళు బండిమీద ప్రయాణం చేశాడు. బండి వొంతెన దగ్గర నిలిచింది. బండివాడు, అమృతంగారింటి గుర్తులు చెప్పి వెళ్ళిపోయాడు. దయానిధి చీకటిపడే వరకూ వూళ్ళోకి వెళ్లదల్చుకోలేదు. దూరంగా కుడివైపున పొలాలు కనిపిస్తున్నాయి. పొలాన్నుంచి అందరూ యిళ్ళకొచ్చే సమయం అది. అమృతం భర్త, కాంతారావు ఎదురవుతాడేమో అనిపించి, నిధి ఎడం వైపు చెరువుకేసి నడవడం సాగించాడు.

జగన్నాథం నవ్వినప్పుడూ, తల వూపుతూ దెప్పినప్పుడూ, అతనిలో ఎక్కడో అమృతం ఛాయలు కనిపించినట్లు, నిధికి అనిపించింది. ఎవ్వరూ చూడకుండా, అతనొక్కడూ, అమృతం కాస్త 'రహస్యంగా' చూసి వెళ్లాలని సంకల్పం. అందుకే తెలిసేట్లుగానే వెళ్లి, బహిరంగంగా ఎందుకు చూడగూడదో, అని ప్రశ్నించుకుంటే సమాధానం లేదు. అందులో వొక నిగూఢమైన. రహస్యమైన ఆనందం వున్నట్లుంది. అది ఎవ్వరితోటీ చెప్పుకోడానికి వీల్లేనిది. ఇతన్ని చూసి అమృతం సిగ్గుతో తలవొంచుకుంటుంది. పిచ్చి సంతోషంతో పొంగిపోతుంది. "ఎందుకొచ్చావు నాన్నా? నువ్వు శాశ్వతంగా నాదగ్గరే వుంటావు. నిన్ను పంచుకున్న ఫలితం చూడు, యీపిల్ల" అని, తొట్టిలో పిల్లకేసి చూపి, అంటుంది కాబోలు ప్రపంచానికి అర్థంకాని ఆనందంతో అమృతం మూగదై బాధపడుతుంది. ఆ అమృతం బాధని

ఏకాంతంగా చూడాలి. ఆపిల్ల ఏడ్పులో, అనాదినుంచీ మానవుడు రహస్యంగా పడిన తపన వినబడుతుంది. పుణ్యంలాగే పాపంకూడా అమరత పొందుతుంది కాబోలు. "నేనెవర్ని?" అని ఆ పసిది వేసే ప్రశ్నకి ఏ వేదాంతి సమాధానం చెప్పగలడు, "ఆత్మ" "పరమాత్మ." "విశ్వరూపం" "సృష్టి రహస్యం" "జీవాత్మ"-అంటారా! లేక— "అంధత్వం" "చీకటి" "అజ్ఞానం" పశుత్వం" పోనీ, సాధారణ భాషలో "గోడ దూకడం" "తలుపుసందు" "ముసుగు" "మోసం" మంచంకింద"—అంటారా! "కారాగారం" "కోర్టుతీర్పు" "హత్య" "ద్వీపాంతరవాసం" అంటారా! జన్మాంతరవాసం కాబోలు! తలుచుకుంటే కవిత్వం వొస్తుంది.

"గుళ్లను, గోపురాలను, గులకరాళ్ళను—
ప్రేమ ప్రవాహం కరిగించిందీ—
రక్తమై, గట్టున చేరిందీ—
రాత్రంతా అడవిలో ధ్వనించింది.
ఉదయాన వ్యాపించేకోసం, పసిదై ఏడ్చింది.
ఇదే అనుభవాన్ని ఆధునిక కవి ఏవిధంగా చెప్పగలడో!
కాళిదాసుకేం తెలుసు కావమ్మ సొగసు!
స్విచ్ నొక్కు, సెకండ్ షోకి పోదాం.
ఆమె 'జూలియట్'
అతను "మజ్ను"
ఫైనల్లీ, "ఫోలియస్, బెర్ జక్"—
టాక్సీలో 'సన్నటి నడుంక్లోజప్'
భవభూతికేం తెలుసు ఆ షోల్డర్ బ్లేడ్ సొంపు!
జుట్టంతా రేగింది, గ్రామఫోన్ పెట్టు వాట్సన్.
రాత్రి టోపీ వోవర్టైమ్ బిగువైంది,
క్లియోపాట్రా లిప్‌స్టిక్‌కి బదులు,

ఎంకి చొంగతో తృప్తిపడదాం!
శకుంతల 'కాసియో' కిచ్చిన కర్చీఫ్
బెరి బెరి బెర్నార్డ్‌షాకి తెలీదు; బుచ్చెమ్మ విడోడ్ ట్రెస్ట్‌లో.
భర్తృహరికీ తెలీదు మా గాంధీ అన్నాడంటే.
పొలిటికల్ స్టంట్——పొమ్మన్నారు."

ఈ భావాలు ప్రవాహంలా తిప్పుకుంటూ నిధి చెరువుగట్టున కూర్చున్నాడు. అలలు మెల్లిగా గట్టుమీగద ప్రాకి తీసుకుంటున్నాయి. మట్టిలో వేడిగాలి, పైకి వెళ్ళలేక భూమినే ఆవరించుకుంది. పొడుస్తున్న చుక్కల ప్రతిబింబాలు, చెరువులో పడ్డాయి. ఎర్రనీళ్ళు తాగడానికొచ్చి, తామరాకుల్ని కలికేశాయి. వాడు కాంతారావుగారి పాలేరాడు కాడు గదా! ఐనా తనకెందు కంతభయం? అమృతం వుందిగా, చమత్కారంగా ఏదో సద్ది చెప్పకపోతుందా. అంచేత వీధిగుమ్మాన బహిరంగంగా వెళ్ళడం మంచిది. తను చాలా గొప్పవాడు, ధనికుడు,——అతన్ని ఎవరేమన గలరు· తిట్టుకుంటే ఫరవాలేదు. ఎన్నింటినేనా కప్పేస్తుందన్న వేమన పద్యం జ్ఞాపకం రావట్లేదు: ఆకాశం నిర్మలంగావుంది; చంద్రుడుకూడాలేడు. నక్షత్రాలు ప్రశాంతంగా మెరుస్తున్నాయి. మేఘాలన్నీ పడమటి ఆకాశంలో స్నానానికి పోయినట్లు మాయమయ్యాయి. ఎక్కడో ఓపక్షి, 'నేనూ ...రుస్తోంది. పిల్లలు, కర్రకి మేకుదిగేసి యినప చక్రాలని తోస్తున్నారు. జనం పల్చబడ్డారు. సందడి తగ్గింది. అతనికి ...స్తోంది. వొంతెన దగ్గర కిళ్లీ దుకాణం దగ్గరకొచ్చి, రెండరటిపళ్ళుతిని, సోడా తాగాడు. ఎనిమిది దాటుతోంది. అమృతంగారింటి సందులోకి చేరుకున్నాడు.

"అప్పి, కాంతారావుగారి యిల్లు, ఏదీ—" అనిఅడిగాడు, గడ్డెపొపు తీసుకెడుతున్న ఆసామిని. "అమృతంగారిల్లు—?" ఆసామీ కాసేపు నిదానించి "అద్దగదిగో,——ఆ మూలగా వున్న మేడేనండి...కాముము కాంత

చూస్తూ నడిచివొచ్చివుంటాడు—కాదు బావా"

ఎవరో: ఈ వూళ్ళో ఏం వింతలుంటాయే, నీది మరీ సోద్యం.

అమృతం: "మీరు తెలీదత్తయ్యా—బావకిప్రతిది వింతగా తోస్తుంది —తొట్టిలో మన పాపాయిలాగ, కాదు? అంటూపాపాయి బుగ్గ గిల్లుతుంది.

అప్రయత్నంగా అతని చెయ్యి తలుపుమీద ఆనింది—తలుపు కిర్రుమని జరిగింది. తీసేవుందన్నమాట, గబుక్కున చెయ్యితీసేసి, తలుపునిదగ్గరగా మూశాడు. అమృతం దొడ్లోకిరాకుండా వుంటుందా? వొచ్చినా, చూరాన్నించి అతను గుర్తుపట్టగలడా? అత్తగార్ని, అమృతం పిలిస్తే, యింకేమన్నా వుందీ? దొడ్డిచాలా పెద్దది. దుడిపెంపుర, గడ్డివామి కనబడుతోంది- దూడ పడుకోంది; పేడకంపు. ఏ అర్ధరాత్రో అమృతానికి నిద్రపట్టక వసారాలోకొచ్చి, బాదంచెట్టుకింద కూర్చుని నక్షత్రాలకేసిచూస్తూవుంటుంది. అతన్ని చూస్తుంది.

అమృతం? ఎవరది?

అతను: నేను.

అమృతం: బావా, నువ్వా—(ఏడుస్తుంది)

అతను: ఎందుకు ఏడుపు?

అమృతం: బావా,—నీకు తెలుసు. ఘోరంజరిగింది. నీదగ్గరవుండే సాహసంలేదు; నిన్ను వొదిలివుండే గుండెకాదు. నేను బ్రతకనుబావా.—

అతను: నన్ను మరచిపో అమృతం. అది చెప్పడానికే వొచ్చాను.

అమృతం; నీలా సులభంగా మరిచిపోలేను బావా. మరచిపోయిననాడు, యీ అమృతం విషంకాదూ! నిన్ను మరిచి స్త్రీత్వాన్ని గోల్పోనా—(రెండు నెత్తిన కప్పుకుని. మల్లెపూలు వూడదీసి పారేసి అతని కాళ్లని కన్నీటితో తడిపేస్తుంది.

అతను: ఎక్కడికి అమృతం?

అమృతం : నిశీధిలోకి —

అతను : నేను రానక్కరలేదా ?

అమృతం : జ్ఞాపకాలులేని, యీ మనుషులతో నాకు నిమిత్తంలేదు. ఎక్కడో గుండె రాయి చేసుకుని, సముద్రంలో కెరటాల మధ్య శిలగా మారతాను...బావా.

అతను : మరి నీ పాపాయి? ప్రపంచానిది. ఆపాప జ్ఞాపకాలేనా సంతతి—

అల్లా మాట్లాడుతుంది కాబోలు అమృతం. ఊహించుకుంటే అతనికి నవ్వొచ్చింది, భయమేసింది. స్త్రీలు ఎంత సాహసమేనా చేస్తారంటారు పెద్దలు. స్త్రీలు ప్రేమలేకుండానే, పిల్లల్ని కనగలరు; మహాయిల్లాలులూ కాగలరు; ఖ్యాతి గడించగలరు. చరిత్రలో అమరత గడించగలరు. వారేకనక నిజంగా ప్రేమించగలిగితే, యింకేమన్నా వుందా ? సంఘం తారుమారవుతుంది. ప్రపంచం తలక్రిందు లవుతుంది. ఆకాశం నెత్తిమీద పడటం లాంటిది. దాన్ని వారించి మోసే పురుషుడు యీ జగత్తులో వున్నాడా ! భారత స్త్రీ ప్రేమించక పోవడం- నిజంగా మంచికే. చరిత్రలో యుద్ధాలేనా తగ్గుతాయి. గాంధీగారు నిశ్చింతగా నిద్రపోవొచ్చు.

ఎంతకాలం అతను అల్లానుంచోడం! ఎంతో సిగ్గుగానూ, చిన్నతనం గానూ వుంది. తనకెందుకు, చూడాలన్న వుబలాటం. అమృతానికి లేనిచింత తనకెందుకు ? అదుగో, ఎవరో వసారాలోకొచ్చినట్లున్నారు. అదుగో ఆమెయే అమృతం. తలుపునెట్టి లోపలికొచ్చాడు. చేతులో విస్తళ్ళకట్ట దూరంగా గోడవతలకి గిరవాటెట్టి, వెనక్కి తిరిగిచూసి,—"ఎవరు ?" అంటూ మెట్లుదిగి—

"బావా, దా, దా,—"

"ఉస్" అన్నాడతను, చూపుడువేలు నోటిమీదవుంచుకుని "బిగ్గరగా మాట్లాడకు—నేనొచ్చినట్లు ఎవరికి......" ఇంకా అతని వాక్యం పూర్తి

కాకుండానే అమృతం, సంతోషంతో నవ్వుతూ,— "బలేబావవే—యింట్లోకిరా, యిదేం చిత్రం.—అత్తయ్యా,—బావ వొచ్చాడు—" అని ఇంటి వైపుకి తిరిగి బిగ్గరగా కేకేసింది.

"బండి పొద్దుపోయింది. కాబోలు,— లోపలికి రా బావా—" అంటూ దొడ్డి తలుపులు మూసి, గడియెట్టింది. ఇంతలో అత్తగారు వసారలో కొచ్చింది.

"ఎవరదీ!— దీపమేనా పెట్టారు కారేమర్రా—" అన్నది.

"మా నిధి బావండత్తయ్యా—రైలు ఆలస్యమైంది,—పాపం వీధిగుమ్మం తెల్సిందికాదు— రా బావా, మాఅమ్మాయిని చూద్దువుగాని—"

ముగ్గురు లోపలికెళ్ళారు.

"కాంతా రావుగారేరి?" అన్నాడు నిధి. "నరసయ్య మేష్టారింటికి పేకాట కెళ్ళారు. —చూశావా మా యిల్లు. నీకేం, నువ్వు జమీందారయ్యావు, మేం కనిపిస్తామా— నీబంగాళా బాగుంటుందిటగా, నన్ను తీసుకెళ్ళి చూపించకూడదా ఏమిటి—?" అంటోంది అమృతం. స్నఫ్ కలర్ చీర చిందరవందరగా కట్టుకుంది. చీర బిగించిన ముడికీ, చుక్కల జాకెట్టుకీ మధ్య కడుపుమడత దీపం వెలుగులో కనబడుతోంది.

అమృతం ఎదిగింది; పెద్ద ఆరిందాలాగుంది. జడంతావూడి చుట్టలు చుట్టలుగా మెడమీదనుంచి జారింది; మధ్య మధ్య, దుద్దుల రాళ్లు-తళుక్కున మెరుస్తున్నాయి.

"నా బంగాళాని నీ కెవరు వర్ణించారు?"

"ఓయబ్బ,—మేం ఎంత పల్లెటూళ్ళో వున్నా, మాకన్నీ ఆమాత్రం తెలియవా ఏమిటి? —చూశారా, అత్తయ్యా,—నేను చెప్తుండేదాన్నీ— ఆబావ. చెఱుగ్గలంటే మహాయిష్టం—"

"అల్లాగా — మావాడు నీదగ్గర కొస్తానంటూ ప్రయాణం కడుతుంటాడు. మంచివాడవు గనక అపేక్ష పడేవాడవు గనక పాపం, జ్ఞాపకం

వుంచుకోసి నువ్వే వొచ్చావు. అల్లావుండాల నాయనా చుట్టరికాలంటే –"
అంటూ ఆవిడ దీపం బుడ్డితో ఏదో సవిరిస్తూంది.

"నామనవరాల్ని చూద్దువుగాని యిల్లారా–"

"ఇల్లారాబావా—" అంది అమృతం.

ముగ్గురూ పక్క గదిలోకి నడిచారు. అమృతం దీపంవొత్తి పెద్దదిచేసి, తొట్లోకి చూపించింది. అందులో చిన్నపిల్ల, అమాయకంగా కళ్ళు మూసుకుని పడుకుంది. పిల్లనల్లగావుంది, మొహాన అక్కులుచుక్కవుంది; పొంతులు తిరిగిన లేతజుట్టు, నుదుటిని కప్పేసింది. ఎవరిపోలికో అతనికి తెలియడంలేదు. అత్తగారూ, తనేస్వయంగా కన్నట్లు, గర్వంగాచూసి, పిల్లబుగ్గని తాకి–

"ఒసే, గడుగ్గాయి పిల్లకానా–బాబయ్యొచ్చాడే– వజ్రం దొరికిందే –ఆజమీందారు బాబయ్య – నిన్ను చూడాల నొచ్చాడు – బాబయ్యకి వజ్రం దొరికింది. మారు నువ్వెవొరికావు – "

ఆవిడ దేన్లాకనుక్కుంటో!

"అత్తయ్యా, అచ్చంగా బావపోలిక కాదు?" అతని గుండెలు, దడదడ కొట్టుకుంటున్నాయి. ఇదేమిటి, యిల్లా నిశ్చయంగా అనేస్తుంది. అతన్ని కదిపి వేసిన మహత్తర అనుభవం: తనకి జరగనట్లుగానే, ప్రవర్తిస్తుంది అమృతం. వొంకాయల బేరం తెగింప్రకాక, కూరల మనిషిని పొమ్మన్నట్లు– అంత మలకన!

"చూడండి–దానికళ్ళు, నోరు – అంతా బావపోలికే – " అన్నది, అమృతం. అతని కళ్ళల్లోకి, వయ్యారంగా చూస్తూ.

"పెద్దయితేగాని పోలికలు బైటపడవు. – బాబయ్యల పోలికలు రాకుండా పోతాయామ" అన్నది అమృతం అత్తగారు.

"ఏవేళైంగో భోజనంచేసి. వొడ్డించు." అంటూ అత్తగారు, వంటింట్లోకి నడిచింది.

"ఎల్లావుంది బావా, నీకూతురు?" అన్నది అమృతం. "నిజంగా

నా కూతురే?" అని అడగాలిని పించింది తనకి ధైర్యం తెచ్చుగుని. గొంతు సవరించుకున్నాడు. "ఐతే, అమృతం ...నన్నో అనుమానం బాధిస్తోంది—" అని మాటలు వెనుక్కుంటున్నాడు.

"నేనూ వారూ, మీవూరెందుకు రాలేదనేనా? సరే. మంచివాడివే లే, – మమ్మల్ని రమ్మన్నావా ఏమిటి?" అని లోపలి కెళ్ళి, చెంబుతో నీళ్లు తువ్వాలు నుయ్యి పెట్టి, తీసుకొచ్చింది. ఇంతలో కాంతారా వొచ్చాడు. అందరూ భోజనానికి కూర్చున్నారు. అమృతం, స్నానంచేసి పల్చటి తెల్లచీర, తెల్లజాకెటు తల్లో పూలు – సింగారించుకొని వడ్డన కొచ్చింది. 'బావకి?' ఏవేవి యిష్టమో కనుక్కుంటూ జాగ్రత్తగా వొడ్డిస్తోంది.

"అన్నగారు రావడంవల్ల మాకు పిండి వంటలూ, పెరుగూ తగిలాయి" అన్నాడు కాంతారావు నవ్వుతూ.

"మీది మరీసోద్యం. ఎప్పుడూ పెరుగు మొహం ఎరగనట్లు చెబుతున్నారు బావ నిజం అనుకుంటాడు కూడాను" అన్నది అమృతం. అందరూ నవ్వుకున్నారు. ఇంతలో పిల్లమేడ్చింది. అమృతం లోపలి కెళ్ళింది. భోజనాలయ్యాయి. అమృతం, తమలపాకులు చిలకలుకట్టి వక్కలు యాలకులు వొక డబ్బీలోపోసి తీసుకొచ్చింది. నిధికి వీధి అరుగు మీద పక్క వేశారు. జగన్నాథం కబుర్లు, అనంతాచార్లుగారి కబుర్లు కాసేపు చెప్పుకున్నారు. ఇంతలో అమృతం కూడా భోజనంచేసి వొచ్చింది కాంతారావు చుట్టముట్టించి, నీళ్ళుతీసుకొని, అవతలి కెళ్లాడు.

"అబ్బ చుట్టకంపు. చస్తాం" అంది అమృతం పెద్దయిదిగా. ఇందిర పోయినందుకు విచారం ప్రకటించింది. కాసేపు మౌనంలో పడ్డారు. యిద్దరూను.

"ఐతే బావా, కోమలి నీదగ్గరే వుంటుందిటుగా."

"అవును నీకెవరు చెప్పారు?"

"అమృతం తెలీకుండా వుంటుందా, నువ్వు మమ్మల్ని విడిచి

పోతావేమోగాని-"

"మీ ఆయనకి కూడా తెలుసా?" అన్నాడు.

"తెలీదను కుంటాను. నాతో ఆవిషయం యెప్పుడూ అన్లేదు"

"కోమల్ని పెండ్లిచేసు కుంటావా?"

"నీసలహా యేమిటి?" అని అడిగాడు.

"నాకేం తెలుస్తుంది-"

"అసలు నీకా సందేహం యెందుకు కలిగింది?"

"చిన్నప్పటి స్నేహం-నీదగ్గరే వుంటోందంటే,-చేసుగుంటావేమో అనుకున్నాను." అంది అమృతం, కళ్ళు కిందికి దించేసి.

"చేసుకో మంటావా?"

"ఏమో-"

"చేసుకోదగ్గ మనిషే నంటావా?"

"మనుషులు ఎప్పుడూ వొకేలాగుంటారా. ఇప్పుడేమన్నా కుదురుగా వుందేమో"

అతనికి నవ్వొచ్చింది, అమృతం ఆమాట అనడం. అత్తగారు రాక వల్ల వారి సంభాషణ నిలిచిపోయింది. అమృతం అత్తగారు ఇందిర పుట్టింటి వారి పుట్టు పూర్వోత్తరాలు స్మరించడం మొదలెట్టి-"ఇందిరకి చెల్లెలుందిటగా పెళ్ళీడు కొచ్చిన పిల్లట-నువ్వు చేసుకోకూడదు నాయనా!" అన్నది ఆవిడ. "ఇంతకీ ఎవళ్ళెవళ్ళకీ రాసుందో" అనుకుంటూ, 'నిద్రొస్తోంది' అని లేచి లోపలికెళ్ళింది.

"నేను కూడా ఏమన్నా మారానా బావా?" అంది అమృతం.

"ఏమో నాకేం తెలుస్తుంది-"

"పోదూ, నీదంతా చిత్రం చెప్పకూడదా యేమిటి-కొంచం లావయ్యాను గదూ" అంటూ తనవొంటికేసి చూసుగుంది. మంచి నీళ్ళకి మెట్లమీది

కూజాకోసం వొంగినప్పుడు జాకెట్లోంచి, రొమ్ములు బరువుగా కదలడం, కనిపించింది.

"నువ్వేది శరీరం మార్చావ్!" అన్నాడు నిధి పెదవి చప్పరిస్తూ.

"ఇంకేరకం మార్పుంటుందేమిటి,- అబ్బో,-నువ్వు బలే యిదైనవాడివే -నీకురావాలి ఆమార్పులన్నీ-"

"అంత కంగాడు పడకా వెందుకు అమృతం? ఇంతకి, నిన్నడగవల్సిన ప్రశ్న మర్చేపొయ్యాను. అసలు నేనందుకే యిక్కడి కొచ్చాను"

"బావా, అడుగు — కాని, నువ్వు యేదో కొంపంతా మునిగేట్లు పెద్దప్రమాదంగా మాట్లాడకావు. ఏమిటిబాబూ, ఆసందేహం."

"ఐతే మీ అమ్మాయి..."అతనకి వాక్యం పూర్తిచేసే అవకాశం లేక పోయింది. కాంతారావొచ్చాడు. కాసేపు వజ్రాల కబుర్లు చెప్పగున్నారు. "నాకు నిద్రొస్తోంది" అని అమృతం వయ్యారంగా ఆవులించింది.

"నీకు నిద్రొస్తేను వ్వెళ్ళిపడుకో" అన్నాడు కాంతారావు.

"బావకీ నిద్రొస్తోంది — అదిగో కళ్ళు మూసుగు పోతుంటేనే —" అన్నది అమృతం. పావుగంటులో కాంతారావు, అమృతం లోపలి కెళ్ళారు. తలుపు గడియపడింది. దయానిధి పక్క సర్దుకొని పరున్నాడు.

"ఇంకా యేమన్నా కావాలా, బావా-" అంటూ అమృతం గడియ తీసి బైటకొచ్చింది.

"ఏమీ అక్కర్లేదు."

"కావలస్తే లేపేం" అన్నది. గుమ్మంమీద చూస్తూ నిలబడింది అమృతం.

"చెప్పు, నీసందేహం ఏమిటో" అని అడిగింది రహస్యంగా — కాంతారావు యింతలో, "అబ్బ, నిద్రపట్టడం లేదండి, లోపల — మరో చుట్ట తగలేస్తాను." అంటూ బైటకొచ్చి చుట్టముట్టించి, అరుగుమీద కూర్చొన్నాడు.

"నే వెళ్ళి పడుకుంటా — వొచ్చేటప్పుడు, తలుపులు వెయ్యండి." అని, భర్తతో చెప్పి, అమృతం తలుపులు దగ్గరవేసి లోపల కెళ్ళింది.

నిదకి నిద్రపట్టేసింది. మళ్ళా అరగంటలో లేచాడు. ఇంట్లో గడియారం పాడైంది కాబోలు, ఆరుగంటలు కొట్టింది. అమృతం వో రాత్రివేళ బైటకి వొస్తుందని అతనినమ్మకం. అరగంటలు గంటలూ గడచిపోతున్నాయి. అతనికి నిద్రపట్టలేదు. అప్రయత్నంగా అతని దృష్టి, తలుపుల మీదికి వెడుతోంది. అమృతాన్ని, భర్త హస్తాలలో వూహించి బాధపడ్డాడు. తన కెందుకో అంతబాధ! దూరంగా వున్నప్పుడు, యెన్ని వూహించుకున్నా వాటిల్లో బాధలేదు. దగ్గరగా వున్నప్పుడే! ఆరు గజాల దూరంలో అమృతం తన బరువైన సౌందర్యాన్ని భర్తకి వప్పగించేసింది. అతని వునికి ఆమెను యే మాత్రమూ కలవర పరిచినట్లు లేదు. స్త్రీలుచిత్రం. వారు, లోన వుండే మనోవ్యధలు, అవస్థలు, తికమకలు, బైటకి ప్రకటించరు. లేక ఇవన్నీ, పురుషుడి ప్రత్యేకమైన జాడ్యాలా? వాళ్ళకి వ్యక్తిత్వం వున్నట్లులేదు. శరీరాలపైన అభిమానం — యిదినాది "దీన్ని ఫలానావాడికే వప్పగిస్తాను" అన్న పట్టుదల వున్నట్లు కనుపించదు. ఎవరో వొకరు తమది కోరి అన్వేషించటంలో నేనా వారి తృప్తివుంటు! ఏమిటో, తనుయిల్లా అనుకోడానికి ఆధారాలేమున్నాయి. కోమలి, యివన్నీ తప్పని ఋజువు చెయ్యడంలేదు! స్త్రీలకి వ్యక్తిత్వం లేక పోతే, కోమలికి మాత్రం ఎల్లా వొచ్చింది?

తలుపు చప్పుడైనట్లనిపించింది. లేచి మంచంమీద కూర్చున్నాడు. ఏమీలేదు, పక్కింట్లో తలుపులు కాబోలు. కోడికూసింది. అతను నీరసంతో కళ్ళుమూశాడు. తెల్లారిపోయింది. జనం అటూయిటూ తిరుగుతున్నారు. పాలేళ్ళ సందడి, పాచిమనిషి అలికిడీ, అమృతం అత్తగారు దగ్గుతో మాట్లాడడం, అమృతం యితన్ని లేపక . అన్నీ జరిగిపోయాయి.

"ఏం బావా, నిద్రబాగా పట్టిందా?" అని అడిగింది.

"ఆహా —"

"మొహం అల్లా బరువుగా వుందేం" ఆమె మొహంలోకి చూశాడు. కళ్లకిందనలుపు, నిద్రలేని అలసట్ని చూపింది.

"కొత్తచోటికి వెడితే నిద్రపట్టదు కాదు!" అంది అమృతం. ఆనాడు అమృతం అలిసి మంచంమీద పడుకున్న దృశ్యం జ్ఞాపకానికి వొచ్చింది. అతనికి నవ్వొచ్చింది. మనుషులు అనుకునే దానికీ, అన్నదానికీ యెక్కడా సమన్వయం వుండదు. సంభాషణంతా వొకనటన. ఊహిస్తే యిల్లావుంటుంది.

అమృతం: నీకు నిద్రలేనట్లుంది. చోటుకొత్త. (నన్నుగురించి ఆలోచించడం మూలాన)

అతను: బాగాపట్టింది. (అసలు కళ్లు మూయందే)

అమృతం: నాకుమొద్దు నిద్రపట్టింది. (తెల్లవార్లు నేనూ ఆ నా సరసాలు)

అతను: ఓస్, నేను నమ్మను. (నన్నుగురించి ఆలోచిస్తుంది కాబోలు)

అమృతం: ఫో, కొంటే, (ఏంచెప్పను బావా. నాబాధ ఎవరికి అర్థంకాదు)

అల్లా జరుగుతుంది సంభాషణ—లోపలొకటీ, బైటొకటీ, నిజానికి చోటులేదు; సత్యానికి వ్యవధిలేదు. మొహం కడుక్కున్నాడు; కాఫీ తీసుకొచ్చింది. స్నానం అయింతర్వాత నిధి ప్రయాణం కట్టాడు. కాంతారావు అన్నాడు.

"అన్నగారు, నేను సంతకెడుతున్నాను, నా బండిలోరండి, స్టేషన్ దగ్గర దిగబెడతాను."

"పోనీ, బావా, వో నాలుగురోజులపాటు మా యింట్లో వుండకూడదా యేమిటి—అల్లాగైతే, మేం మీవూరు, రాము—అంతే." అన్నది.

"ఈసారొచ్చినప్పుడు తప్పకుండా వుంటాను." అన్నాడు

"మళ్ళా మళ్ళా మావూరు వస్తావాయేమిటి—ఏదో పొరపాటున

చచ్చావుకాని".

"పోనీ నువ్వూ, మీ ఆయనా నాతో రాగూడదూ ?" అన్నాడు నిధి.

"అరుమళ్ళ హడావుడి తగ్గుతుంది నెలరోజుల్లో— అప్పుడొస్తాం లెండి" అన్నాడు కాంతారావు.

"పగలు చూద్దువుగాని అమ్మాయిని, రా" అంది అమృతం. కాంతారావు, నిధి, గదిలోకి వెళ్ళారు.

"బావ పోలికంటుంటే కాదంటున్నాడంటోయ్." అన్నది అమృతం. కాంతారావు, నీరసంగా నవ్వాడు. నిధి పిల్లకేసి పరీక్షగా చూశాడుగాని, ఎవరి పోలికో నిర్ణయించలేకపోయ్యాడు. అమృతం పోలిక తెలుస్తూనేవుంది. మిగతాసగం తనా, కాంతారావా ? ఐదారేళ్ళు పోతేనేగాని బైటపడదు.

ఎడ్లబండి సిద్ధమైంది. కాంతారావు, దయానిధి అందులో కూర్చున్నారు. అమృతం పసుపుపచ్చ పట్టుచీర, పెద్ద కుంకుం బొట్టు, నల్లటిరవిక వేసుగుని మెట్లమీద నిలబడింది. నిట్టూర్పుతో ఆమె రొమ్ములులేచి పడుతున్నాయి. వాటిమధ్య చీర నాలుగు మడతలుపడి, నిండైన ఆకృతినిచ్చి దిద్దింది. 'తెలుసు నన్నట్లు, అమృతం నవ్వింది. అత్తగారు పిల్లని ఎత్తుకొచ్చి కోడలి చేతికిచ్చింది, అమృతం పిల్లని ఎత్తుకుని, — "బాబయ్య వెళ్ళిపోతున్నాడు—గుడ్ మార్నింగ్ పెట్టు—" అని పిల్లచెయ్యి వూపించింది.

"గుడ్‌మార్నింగు కాదు. గుడ్‌బై అనాలి అని కాంతారావు సరిజేశాడు.—

"ఏదో వొకటిలెండి—బావకి ఏదన్నా కోపంరాదు.—మీరు మరీ నేర్పుగున్నారు. మాజగ్గునిచూసి—" అన్నది.

"జగ్గు అంటే, పూరుసన్నా ! జగన్నాథం, అనాలి." అన్నాడు నిధి. అందరూ నవ్వుతున్నారు.

"గుడ్‌బై—చైల్డ్, ఆఫ్ క్రియేషన్" అన్నాడు నిధి, చెయ్యి వూపిస్తూ.

"అబ్బో, మా అమ్మాయితో యింగ్లీషు మాట్లాడేస్తున్నావే. నువ్వే తీసుకెళ్ళి దానికి చదువు చెప్పించెయ్యి—"

"సరేలే, ఆ భూతకిని లోపలికి తీసుకెడుదూ" అని భర్త విసుక్కున్నాడు.

"అదేమిటండి—మా దొరసాన్ని పట్టుగుని భూతకంటారు. ఎప్పు బాహా ఆయనకి, ఏవనాలో, ఏవనగూడదో—"

బండి కదిలింది.

"ఉత్తరంముక్క రాస్తోండే-" దూరంగా చెయ్యివూపుతోంది, పిల్లతో కలిసి.

"అడ్రెసు మా వార్నడుగు—"

తరువాత మాటలు వినబడలేదు. బిందెలతో వెడుతున్న అమ్మలక్కలు అమృతంకేసి వింతగా చూసి వెడుతున్నారు, కడపటి దృశ్యం. బండి మలుపు తిరిగింది.

—o—

# II

## చివరకు మిగిలేది!

దయానిధి యింటికి చేరుకునే టప్పటికి సాయంత్రం ఆరుగంటలైంది. అతని రాక తెలియగానే పాతిక మంది పనివాళ్ళు యింటిదగ్గర అతని చుట్టూ మూగారు. పనివాండ్రు సమ్మెచేసి రెండు రోజులనుంచి పనిలోకి రావడం మానేశారన్నవార్త చెప్పారు. క్రితం రోజునే వజ్రపురూర్‌లో పెద్ద సభ చేసి, అందులో సర్కారువారు వారిజిల్లాలొచ్చి చేస్తున్న అన్యాయాలన్నీ యేకరువుపెట్టి, వారికి సహకారం యివ్వకూడదని తీర్మానాలు చేశారు. దానిఫలితంగా పనివాళ్లు సమ్మెచేశారు. దీనికి కారణం ఎవ్వరూ చెప్పలేక పోతున్నారు. అనంతాచార్లుగారిని కూడా వెలివేసినట్లు చూస్తున్నారుట. కొన్ని కారణాలు తెలుస్తూనే వున్నాయి. నాగయ్యరెడ్డికి చేసిన శిక్ష; కోమలి గదమాయించడం; అనంతాచార్లుగారు కోమల్ని వెనకేసుకొచ్చి సమర్థించటం. నిధి అస్పష్టమైన గతం, రాజభూషణం ఆ జిల్లాల అనాగరికతను గురించి చేసిన ప్రచారం—యివికొన్ని. గనికోసం పెట్టుబడి పెట్టిన ధనికులు, లాభాలు కనబడక పోవటంచూసి, యిదంతా యేదో దగా, ఇంద్రజాలం అని శంకించి, డబ్బువిషయం చికాకు చెయ్యడం జరుగుతూనే వుంది. హాస్పటల్‌కి సంబంధించిన వ్యక్తులు మాత్రం స్నేహభావంతోనే వున్నారు

క్షీరప్పగారు ధనికుడు. ఆయనకి గనిలో వాటావుంది. ఆమధ్య జబ్బుచేసి, నిధి ఆరోగ్యమందిరంలో చేరాడు. అసిస్టెంటు నాగేంద్రరావు ఇన్‌జెక్షన్లు అవీ యిస్తూనే వున్నాడు. మూడురోజుల క్రితం క్షీరప్పగారు చని పోయారు. ఆయనకి విషం ఎక్కించి చంపారని పుకారుపుట్టి కొంత అల్లరి జరిగింది. క్షీరప్పకి ఎక్కువగావుండి కబురంపినప్పుడు, అసిస్టెంటు వెంటనే రాకుండా నర్సు తాయారమ్మతో కార్లో షికారెళ్ళాడని ఫిర్యాదు చేశారు. అసిస్టెంటు తిరిగివచ్చేలోపల, క్షీరప్ప కాలం చేశాడు. సమయానికి అక్కడ లేకపోవడం పెద్దఅపచారం అని, కోమలి అసిస్టెంటు మీద కేక లేసి, నిధితో చెప్పి వుద్యోగం తీయించి వేస్తానని బెదిరించిందట. అసిస్టెంట్ 'నీకేం హక్కుంది, నువ్వెవతివి?' అని చెడామడా తిట్టేశాడట. కోమలి ఏమీచెయ్యలేక యేడుస్తూ కూర్చుందట. ఆ మొన్నాడు అసిస్టెంట్ "ఇదుగో ఫండాకోర్ వుద్యోగానికి నారాజీనామా" అని కాగితం కోమలి మీద గిరాటేసి అడ్డం తగిలిన అనంతాచారిగారిని— "నీ కూతురికింక పెండ్లి కాదులే" అని, వెళ్ళిపోయాడుట. అతనుకూడా శత్రుపక్షంచేరి నిధి గతాన్ని గురించి యాగీ చెయ్యడం సాగించాట్ట. ఇన్ని జరిగాయి నిధి వూరెళ్ళిన వారంరోజుల్లోనూ.

నారయ్య గాయాలు నయమైనా, నీరసంగా లేవలేనిస్థితిలోనే, వున్నాడు. అతన్ని చూడగానే అంత్యకాలం సమీపించిందని, నిధికి తెలిసి పోయింది. పనివాళ్ళు యిళ్ళకిపొయ్యారు. నిధి స్నానంచేసి హాల్లోకి వచ్చాడు. నారయ్య పక్కన కాత్యాయని రంగడు, కూర్చుని వున్నారు.

"ఎల్లావుంది నారయ్యా—"

"అల్లాగే వుందండి— నాలుగు రోజుల్లో నింపాదిగా వుంటుందండి. మనకిచైలు సరిపడదు. లేచినక్కాలా తిరగాలి, యీళ్ళ పొగర్లు అణచాల."

"ఇంకా నీజోరు తగ్గలేదు—"

"ఆ రెడ్డిగాణ్ణి ఆఖరుచెయ్యకపోతే చూడండి—ఏంటనుకున్నారో

మా తధ్ధాకా."

"తప్పు నారయ్యా-నువ్వు పెద్దవాడివి. నెమ్మది, ఓర్పు,—నేర్చుకోవాలి. మందిమీద మనుషుల్ని బాగుచెయ్యాలి కాని, పగసాధించి కాదు."

"ఈనీతులు పశువులకాడ పనిసెయ్యవండీ—యీ బుల్లమ్మ వుసురోసుకుంటుండారు, నా యెసం గాక్క—" అంటూనారయ్య కాత్యాయన్ని చూసి బోసిగానవ్వాడు.

"పడుకో, పడుకో—"

"మానాన్న వూర్నుంచి వొచ్చారు." అంది కాత్యాయని.

"రాత్రి భోజనంచేసి వొస్తాను—పొద్దుపోతోంది. నువ్వింటికెళ్ళు." అన్నాడు నిధి. కాత్యాయని మొహంలో, అసూయకోత్వం, నిరుత్సాహంగా మారింది. అతనికేసి దిగులుగాచూసి వెళ్ళిపోయింది. కాత్యాయని చిక్కిపోయింది. ఏదో చెప్పరాని దిగులు—ఎవ్వరికీ అర్థంకాదు.

మేడమీది కెళ్ళి వుత్తరాలు చూసుగున్నాడు. అందులో వొకటి శ్రీనివాసరావు దగ్గరనుంచి, రెండో మహాసంగ్రామం ప్రారంభమైంది. భారత దేశంకూడా ఇంగ్లండుతో చేరి, యుద్ధం ప్రకటించింది. ప్రభుత్వానికి కాంగ్రెసుతో చేరాలాడే టందుకు వ్యవధిలేక కాంగ్రెస్‌ని సంప్రదించకుండానే, దేశాన్ని యుద్ధ మేఘాలతో చీకటి చేశారు. ఏవుద్యోగం దొరికినా చాలురా భగవంతుడా అనుకొనే యువకులు వేలకివేలుగా యుద్ధంలో చేరిపోతున్నారు. గాంధీగారి మాట వినిపించుకోకుండా, యుద్ధానికి వెళ్ళిన యువకులలో శ్రీనివాసరావొకడు-రిమాటిక్ సీమా హిట్లర్ మీదికి కత్తినూరడం, నిజంగా హాస్యాస్పదం. డేరాడూన్‌లో ట్రైనింగు ముగిసిం తర్వాత, ఇరాక్ వెడుతున్నాట్ట. పాడుకుంటూ గంతులేస్తూ కోమలి చక్కావచ్చింది.

గాలికి కదిలిపోయిన చింతచెట్టు లాగున జుట్టంతా రేగింది. వాన వెలిసిం తర్వాత, ఆకులనుంచి నీళ్లబొట్లు రాలినట్లు, స్నానం చేసిన తడిచీరని వొంటికి పట్టించింది. నీటి చుక్కలు మొహమీది జడలోంచి పడుతున్నాయి.

సృష్టి రహస్యాన్ని కనుక్కున్న పరిశోధకుడులా, కళ్లు సంతోషంతో మెరుస్తున్నాయి. కళ్లు బహిర్గతం చేసిన ఆనందాన్ని పెదవులు దాచలేక పోతున్నాయి.

"ఏం కోమలీ-చాలా హుషారుగా వున్నావు?"

"ఎందుకో చెప్పుకో-చూశారా నాచారవు-ఎందుకు చెప్పుకోండి-" అంటూ చూపుడువేలు పైకితీసి కదిల్చింది.

"ఏమో!"

"ఓస్", తెలీనట్టు మహా-కొంగ మీరు-కాసేపు నిదానించి, "'అండి'-'మీరు'-అని గౌరవంగా అనబుద్ధికాదు మర్యాదగా పిలిస్తే ప్రేమలేనట్లు, ఏవిటోదూరంగా, ఎవళ్ళనో పరాయివాళ్ళతో మాట్లాడినట్లుంటుంటండీ-ఎందుకూ-అవునా,-దయా మయా-"

"దూరంగా—పరాయివాడనేగా —" అన్నాడు.

"అట్లాగంటే కోపం వొస్తుంది — చెంపమీద కొట్టబుద్ధేస్తుంది.— వుండండి, కసిగావుంది, హుషారంగా చంపేస్తున్నారు." అని అతనిదగ్గర గావొచ్చి, బుగ్గని గట్టిగానలిపి, ఎడంచేత్తో లెంపకాయకొట్టి ముక్కు మొన పట్టుగుని వూగించింది.

"ఆగు, ఆగు—తెగించి, విప్లవంచేశేస్తున్నావు. హుషారుకి కారణం ఏమిటో—?" అన్నాడు.

"కారణమా ? నిజంగా చెప్పాలా ?"

"ఊఁ"

"ఇది" గట్టిగా అతని నుదుటికి తనపెదవుల్ని తగిల్చింది.

"మనం అనుకున్నదంతా వారంరోజులలో మరిచిపోయావా ?"

"లేదు. అదంతా గుండెల్లోవుంది. చూడండి-" అని అతని చేతిని తీసుకుని, ఆమె రొమ్ములమధ్య ఆనించింది.

"ఎప్పుడూ విచారంగా దిగులుగా వుండాలేమిటి—అప్పుడప్పుడు,

కులాసా, హుషార్ లేకపోతే ఏం బాగుంటుంది?" అని ఆతని మెడనిపెన-
వేసుగుని, పూనకం పట్టినట్టుగా మొహాన్ని రొమ్ములతో కప్పవేసింది. అతను దూరంగా జరిగేశాడు.

"బలాత్కారం, రాక్షసం ప్రారంభించావేంటి?"

"నాకీ వొక్క రోజూ లైసెన్స్."

"ఏం కథ"

ఆ ప్రశ్నకి సమాధానం ఏం చెప్పగలదు? అకలి ఆమె కళ్ళల్లో గుడ్డిప్పగుని గంతులేస్తున్నట్లుంది.

ఆమె పాదాలకింద, అనుభవం యిసిక కణాలుగా జారిపోతోంది. శరీరం చేస్తున్న దౌర్జన్యానికి, ఆపర్శం తట్టుకోలేక, తుపానుగా కదిలిపోతున్న గడ్డిపోచ లాగా, అతన్ని పట్టుకుంది. అతనికి లంగరు.

"మళ్ళా మనం విడిపోతాం. యీ నాలుగు రోజులేగా—"

"స్త్రీలకి జ్ఞాపకాలుండవు? కావాలు—ఎప్పటి కష్టాలు కొత్తే—" అన్నాడు ఏదో స్మరించుకుంటూ.

"నాలా యింకెవ్వరూ వుండరు—మీకే తెలుస్తుంది."

"మొగాడు జ్ఞాపకాలతో కాలక్షేపం చేస్తాడు—గతం, భవిష్యత్తు లేని, జీవితం, ఎంతబాగుంటుంది.—ఇల్లా, స్నేహితుల మాదిరి, వాంఛలు, అనుమానాలు, పెడింపులు లేకుండా వుండకూడదూ? ప్రశాంతమైన నీటిని ఎందుకు కెలికేస్తావు. నీ సౌందర్యాన్ని నాచేత హత్య చేయిస్తావు. తర్వాత నిన్ను త్యజిస్తాను. ఆ కిరాతక అనుభవం మనకొద్దు—" అన్నాడు నిధి. అతని వొళ్ళోతలకాయ పెట్టుగుని, ఏడవడం సాగించింది కోమలి. ఆశ, యథార్థం కావడంకోసం సాగిస్తున్న ఏడుపు, అది.

"ఈ శరీరాలు, వొకర్ని చూసి వొకర్ని అసహ్యించుకోడానికి వుపయోగిస్తాయి. సంపూర్ణమైన యావగింపు లేకుండా, 'మృత్యువు' అంటూ వుంది, సృష్టిలో. మృత్యువు లేకపోతే, యి సంసారాలు,—యీసంసుజీవి

తాలు, దేశమతావాదాలు, అంతర్జాతీయత, వొక్క క్షణంలో పటాపంచలైపోతాయి. శక్తులు నశించిపోయిన శరీరం, అంత అసహ్యంగా వుంటుంది. —అందరి మనస్సులూ వొకటై, అందరి ఆత్మలువొకటై, ప్రపంచం ఏకమై పోవాలంటే, శరీరాలని త్యజించి దూరంగా, ఏకాంతంగా వుండాలి.—

"ఎందుకు అసలు ఏకం కావడం? ఆనందంలేని బ్రతుకు, ఎందుకు? మీరు చెప్పింది నిజమైతే అసలు, మగా, ఆడా, ఎందుకు?— తప్పు, అంతాతప్పు—భ్రమ—" అంటూ అతని మోకాళ్ళమీద కోపంతోగుద్దింది! కోమలి శరీరంలో చలిమంటవుంది. అందులోకి అతన్ని తోశేస్తోంది. జ్వాలలా ఆమె సౌందర్యం, అతన్ని చుట్టుకుంటోంది. తర్కం, జ్ఞానం, ముందు వెనుక చూపు,—ఏవీ ఆ మంటని చల్లార్చలేదు. ఆమె జడని అతనిచేతిలో పట్టుగుని మొహాన్నిపైకి లేవదీసి చూశాడు. సూర్యాస్తమయాన పశ్చిమ ఆకాశంలో మేఘంలా కళ్ళు ఎఱ్ఱగా అయ్యాయి. కళ్ళకింద నలుపు చీకటిలా, ఎగబ్రాకుతోంది. వొడ్డున పడ్డచేపలలా, పెదవులు వొణికి పోతున్నాయి.

"నాకు తెలుసు—మీరింకెవరినో ప్రేమిస్తున్నారు." అన్నది.

"అది నీప్రేమకి అంతరాయం కాదుకదా? మన శత్రువులకీ యీ చందమామే వెన్నెలిస్తోందని, చందమామని మెచ్చుకోడం మానం" అన్నాడు.

"అమృతంగారా?"

అతనికి నవ్వొచ్చింది.

"ఇంకా—? వుండు, ఎవరో వచ్చినట్టుంది.—కాత్యాయని కాబోలు" అన్నాడు.

"ఇంకా — కాత్యాయనా?"

నిధి, కోమల్ని వొక్క లెంపకాయకొట్టి, తోసేసిలేచాడు. కాత్యాయని తలుపులుతీసి, వాళ్ళిద్దరూవున్న, దృశ్యాన్నిచూసి, తలుపులుమూసి, వెళ్ళిపోయింది. నిధి బైటకి నడిచి మెట్లకింద ఆమెను కలుసుకున్నాడు.

"నారయ్యా, మూల్గు ఎక్కువైంది, మాశాన్నగారు వొచ్చారు."

ఇద్దరూ తొందరగా కిందికి వెళ్ళారు. నారయ్యకి జ్వరం ఎక్కువైంది. బాధపడుతున్నాడు. నిధి ఇంజక్షన్ యిచ్చాడు! నారయ్య చూస్తూ పడుకున్నాడు గాని మాట్లాడలేక పోతున్నాడు. అనంతాచారిగారు, నిధిని దూరంగా వరండాలోకి తీసికెళ్ళాడు. అతను లేని వారం రోజుల్లోనూ జరిగిన అల్లర్లను గురించి చెబుతున్నాడు. సర్కారు జిల్లాలవారిపై, అక్కడ వారికి వుండే వైషమ్యాన్ని అరికట్టేటందుకు ఏదైనా మార్గం చూడాలన్నారు. ఒక సభ ఏర్పాటుచేసి, వారివుద్దేశాలు బైటపెట్టి, వాళ్ళని మంచిచేసుగోటానికి నిర్ణయించారు. వారి కోపానికి గురికావటానికి అతనుచేసిన తప్పు ఏమిటో నిధికి అర్థంకాలేదు. అతన్ని సర్కారు జిల్లాలవాడని అనడంకూడా న్యాయం కాదు; తను అక్కడ స్థిరపడిపోయ్యాడు గనక, వారిలో వాడిలాగే ఎందుకు భావించరో తెలీడంలేదతనికి. ఈర్ష్య, అసహనం, అతని సంపదని చూశా? అతను వారికి చేస్తున్న వుపకారాన్ని చూశా? 'వాడెవడో వొచ్చి మన్ని బాగుచేసేది ఏమిటి? అనా? అనంతాచార్లుగారుకూడా సరియైన కారణం చెప్పలేక పోతున్నారు. స్వార్థం, జాతీయత కింద మారడం కాబోలు అన్నారాయన. ఇతరుల దృష్టిలో, వారి సమానత్వం ఋజువు చేసుకోడమో! ఆచారిగారు చదవమని వోవుత్తరం యిచ్చారు. నిధి చదువుతున్నాడు;

"......యీ పరిస్థితులలో కాత్యాయనికి వేరే సంబంధం చూసుకోడం మంచిది. మీరు సంబంధాలు వెదుక్కునే అవసరంకూడా లేదనుకుంటాను—మీరు ఆప్తులు, యీ విషయాలలో ఆదుకునే వారు వుండనే వున్నారు. ఇందుచే మీకు కలిగిన చీకాకుకి చింతిస్తున్నాము. క్షమింప ప్రార్థన......"

అది పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా వుంటున్న ప్రభంజన మూర్తిగారు వ్రాసినలేఖ. మొదట్లో వారి కుర్రాడికి, కాత్యాయని చేసుకోడానికి వొప్పు

గుని, తరువాత వ్రాసిన వుత్తరం అది.

ఇట్లాంటి పరిస్థితులలో, నేనిక్కడనుంచి మరోచోటికి వెళ్ళిపోవడం మంచిది అనుకుంటాను" అన్నాడు నిధి.

"తెలీనివాళ్ళు అనేకం అనుకుంటారు. మనకర్తవ్యం మనం మాన కూడదు. అల్లా భయపడి, యీలోకంలో ఎంతకాలం బ్రతకగలం? నువ్వెక్కడికీ వెళ్ళడానికి వీల్లేదు." అన్నాడాయన కచ్చితంగా.

"నాతో స్నేహంగావుండి, నన్ను ఆదరిస్తున్నారు కాబట్టి, నామీద వుండే యేవగింపంతా, మీమీదికి తిప్పినట్లు కనిపిస్తోంది. నామూలంగా మీకే యిబ్బందులు రావడం నాకిష్టంలేదు" అన్నాడు నిధి.

ఇంతలో కోమలి బుజాన తువ్వాలువేసుగుని గబగబా వారిముందు నుంచి నడిచివెళ్ళింది. నిధి ఆమె వెళ్ళడం చూస్తూనే వున్నాడు. అనంతాచారిగారు మళ్ళా ప్రారంభించారు.

"నీకు నేను చెప్పదగ్గవాణ్ణికాను-అయినా, పెద్దవాణ్ణి గనక ఏదో సలహా యివ్వాలని పిస్తుంది."

"తప్పకుండా"

"భార్య పోయింది-ఇంకా వయస్సులో వున్నవాడవు. బోలెడు కార్యాలు సాధించాలి. నువ్వు మళ్ళా వివాహం చేసుకోడం మంచిది" అన్నాడు, ఆచారిగారు. నిధికి భయంవేసింది, కొంపతీసి, కాత్యాయన్ని చేసుకోమనడుకదా!

"నాకా వుద్దేశం పుట్టలేదు. ఆ అవసరం కూడా కనిపించలేదు" అన్నాడు నిధి.

"ఇల్లా పెండ్లి లేకుండా, వూరికే కలిసి వుండటం లోకులకి నచ్చదు".

ఆచారిగారు కోమల్ని మనస్సులో పెట్టుగుని అన్న మాటలని, నిధికి తెలుస్తూనే వుంది.

"నిర్బంధ స్నేహంలో నాకంత నమ్మకంలేదు."

"కావొచ్చు. కాని సంఘం హర్షించదు. సంఘానికి బహిర్గత చిహ్నాలు కావాలి"

"అల్లాంటి చిహ్నాలు వున్నప్పుడు కూడా నన్ను సంఘం క్షమించింది కాదు. సంఘాన్ని గౌరవించే అవసరం నాకు కనపడలేదు. మరణించినవాణ్ని కూడా, సంఘం తిడుతూనే వుంటుంది. ఫలానా జిల్లా వాడివి-అని రాజకీయంగా ద్వేషించింది సంఘం; ఫలానా తల్లి కొడుకువి-అని నైతికంగా హింసించింది సంఘం..." అంటూ అప్రయత్నంగా, ఫౌంటన్‌లో అమర్చబడ్డ, తల్లి రాతివిగ్రహంకేసి చూశాడు నిధి. ఇవన్నీ ఆచార్లగారితో చెప్పుకున్నందుకు నిధి విచారించాడు. ఆచార్లుగారు వోదారుస్తూ అతని బుజాన్ని తట్టాడు.

'నారయ్యని చూసొస్తాను' అని ఆచారిగారు లోపలి కెళ్ళారు. నిధి తల్లివిగ్రహం దగ్గరికి వెళ్ళాడు. విగ్రహం కుడిచెయ్యి విరిగింది; మొహాన, పైనుంచి కిందవరకూ పెద్ద పగులుంది. ఎవరో అతని ఆయువు పట్టుమీద కొట్టిన దెబ్బ అది. ఆపని ఎవరు చేసింది?

గేటు దాటి అవతలకి నడిచాడు. ఎక్కడికో దూరంగా నడిచి వెళ్ళిపోతోంది కోమలి. కోపం వొచ్చింది కాబోలు. మళ్ళా తిరిగిరాదు! ఏదేనా అఘాయిత్యం చేస్తుందా? అటుకేసి నడవడం సాగించాడు. ఆకాశం నిర్మలంగా వుంది; చంద్రుడులేడు; మేఘాలులేవు; పువ్వుల దుప్పటి కప్పుకున్నట్లుంది భూమి; మందంగా వీస్తోంది గాలి; ఊరు, చెట్లు, పుట్ట అన్నీ దాటాడు. "నీకు ఎవ్వారు లేరు, నాకు ఎవ్వారు లేరు" పాట జ్ఞాపకం వొచ్చింది. అవన్నీ తాటిచెట్లు. ఏకాంతాన్ని భంగం చెయ్యకుండా నిశీధి ఏర్పాటు చేసిన ఫారావాళ్లల్లా, తాటిచెట్లు. ఫర్లాంగు దూరంలో వుంది కోమలి.

"కోమలీ" అని కేక వేశాడు. అతని కంఠం అతనికే చిత్రంగా తోచింది. కొత్తగా ఎవరి కంఠంలాగో వినిపించింది. 'జాగ్రత్త' అంటూ భయంకరంగా తాటిచెట్లు ఆకులు గర్జించాయి. కీచురాయి కూత మానింది. అదిరినట్లుగా నక్షత్రాలు మినుకు మనడం మానుకున్నాయి. గాలిరాలేక నిట్టూరుస్తోంది. కోమలి వెనక్కి చూడదు; భూమి అనుకుని ఆకాశంలోకి నడుస్తున్నట్లుంది.

తొందరగా నడిచి ఆమె దగ్గరికి చేరుకున్నాడు. మట్టిలో రాళ్ళని తోసేసి, కూలబడి పోయింది కోమలి. అతను చతికిల బడ్డాడు. అతని వొళ్లో తువ్వాలు కప్పి దానిమీద మొహం ఆనించి ఏడుస్తోంది-చల్లబడిన రక్తపు చుక్కలు.

"ఎందుకు?"

"........."

"కోపమా-?"

"........."

"చూడు మరి."

"నాకోసం ఎందుకొచ్చారు.-మీరు వెళ్ళిపొండి... నేను రాను-రాను."

"ఉస్-ఊరుకో నక్షత్రాలు జడుసుకుంటాయి."

"నిన్ను యింకెప్పుడూ కొట్టను. క్షమించు" అన్నాడు.

"నేను వొక్కసారి కొడతాను" అని, అతన్ని కోమలి మెత్తగా లెంపమీద కొట్టింది.

"తీరిందా అలక! ఏవేవో మనస్సుని బాధిస్తే, అకారణంగా, కోపం వొచ్చి, ఆవిధంగా బైట పడుతుంది" అన్నాడు నిధి.

"నన్ను క్షమించండి-కష్టపెట్టే మాటలు అన్నాను-అబద్ధం అని నాకు తెలిసుండి కూడా-"

"నీకూ నాకూ క్షమాపణ లేదు. కోమలీ- మనంతట మనం కలుసుగోలేం; సంఘం మనని విడదీయలేదు"

కోమలి కళ్లు పెద్దవిచేసి, మూతి సున్నాలాచుట్టి, అతని జుట్టులో చేతులు పోనిచ్చి, కిందికి, నెట్టేసి, అతని కంఠం మీద తన బుగ్గని ఆనించింది.

"ఇల్లాగే వుండి, ఇక్కడే చచ్చిపోతాను" అంది కోమలి

"పొద్దవుతోంది, లే, వెడదాం. ఆకలెయ్యడం లేదూ?"

"నిన్ను కొరుక్కు తింటాను"

"ఇంకేంమిగుల్దు, మళ్ళా ఆకలేస్తే-

"మళ్ళా వెంటనే బాగుచేసేస్తా"

"చెడిపోయిన వొస్తువు బాగుపడటం లేదు సృష్టిలో. ఉన్నదానికి విలువలేదు. అది ఎవ్వరికీ అక్కర్లేదు" అన్నాడు.

"ఎవళ్లకీ అక్కర్లేదు? దేవుడికి కూడా?"

"నువ్వు దేవుడివా?"

"ఓ—దేవతని-"

ఆమె శరీరం పొంగిపోయి, రాతిమీద భగ్నమైన కెరటం తుంపరలలాగ విడిపోయింది. మనిషంతా జీవుడై, మృత్యువుని వెతుక్కుంటోంది.

"నేనేమీ చెయ్యను,-ఊరికే పడుకుంటాను" గుండెలు కొట్టుగోడం వినిపిస్తోందతనికి. రక్తం ప్రవాహంలాగ వెలుస్తోంది. నాశాలనృత్యం చూస్తున్నాడు. నక్షత్రాలు తీవ్రంగా మెరుస్తున్నాయి. తాటిచెట్లు, నిద్రనుంచి లేచాయి; కీచురాయి సంగీతం ప్రారంభించింది. ప్రకృతి, స్వప్నంలోంచి లేచింది—యదార్థాన్ని చూచి, జడుసుకుని కళ్లుమూసింది.

కోమలి ఆ అనుభవంతో మానసికంగా ఎదిగి పోయింది. జీవితంలో సంపర్కం చాలించుకుని ఏకాంతంలో వార్ధక్యం పొందింది.

"చూశారా—నిమ్మళ్ళి ఏమీ చెయ్యలేదు. నాశామాత్రం తెలీదా?"

"ఇల్లా వుండగా, ఎవరేనా మన్ని చూస్తేఏమీ జరగ లేదంటే నమ్ముతారా?"

"నమ్మరు. వాళ్లు ఎల్లాగా అనుకోడం మానరు గనక. మనం ఏమీ చెయ్యకుండా వుండడం ఎందు కనిపిస్తుంది నాకు," అన్నది.

"అదే పొరబాటు, — నిజమైన ప్రేమకి, మానవుడు నిర్మించిన సరిహద్దులుండవు. ఉంటే అది ప్రేమకాదు."

"ఐతే మీరు నన్ను నిజంగా ప్రేమిస్తున్నారన్న మాటే — నాతో యిన్ని రోజులు ఎందుకు చెప్పలేదు? చెపితే వేధించుకు తినకబోదునుకదా—"

"చర్చిస్తే మిగలనిదే ప్రేమయొక్క ఓ—"

కాసేపు నిశ్శబ్దంలో పడ్డారు — రెండు కెరటాలు కొట్టుకుని, సుడిగుండంలో కలుసుకున్నట్లు— కళ్లలోకి చూసుకోడం వెర్రిగానవ్వుకోడం —అంతే వారి ప్రేమ. ఎన్నెన్నో కొత్తవి అవగాహన అవుతాయి. గతాల అస్తిపంజరాలు నశిస్తాయి; భవిష్యత్తు ముందుకి సాగి శూన్యమై పోతుంది. దూరాలు, లోతులు, శిఖరాలు, — అన్నింటికీ, ప్రతిచోటునుంచి, ప్రతిక్షణంనుంచీ, వారే కేంద్రమౌతారు. క్షణం వెలుగుని చూశారు, ఉద్రేకానికి, ఊహకీ, ముందు వెనకలకీ స్థలానికీ, కాలానికీ అతీతమైన జీవజ్ఞానం.

లేచి నడడం సాగించారు, చెయ్యి చెయ్యా పట్టుగుని — ఆనడక, కాలం చివరికి; స్థలం చివరికి; పరమావధిలేని అన్వేషణ; గమ్యస్థానం లేని యాత్ర. అవన్నీ భ్రమలు. ఊళ్ళోకి చేరుకున్నారు. నిశీధి దట్టమై, తన్ను చూసి తాను జడుసుకుని, నక్షత్రాలని కిందికి దించుకుంది. ఆ నాలుగు తాటిచెట్ల మధ్య నిలబడి; ఆకాశంకేసి చూస్తున్నారు. కోమలి చెట్టుకి జార్లపడింది, అతని నడుంని తన చేతులతో బిగించి.

"ఆయాసంగా వుందా?"

"నాకేం ఆయాసం! అప్పుడే యింటి కొచ్చామని బెంగ." అని నీరసంగా నవ్వింది. 'ఉజ్' మని ఏదో చప్పుడైంది. నిధి వెనక్కి తిరిగి

చూశాడు. తాటిచెట్టుకి వొక కత్తిఅతన్ని దూసుకుపోయి, గుచ్చుకుని, వ్రేళ్ళాడుతోంది. అటూ యిటూ చూశాడు. దూరంగా పొదలు; మరీ దూరంగా గుడిశెలు, మనుష్యులలికిడిలేదు. కత్తిని బైటికిలాగి పరిశీలించాడు. అది కత్తికాదు; పొడుగాటిచాకు — దానిమీద 'స' అన్న అక్షరం చెక్కబడి వుంది. ఆ చాకు ఎవరిదో అతనికి తెలుసు.

"అదేమిటి!" అన్నది కోమలి. చాకుని తీసుకుని చూసింది.

'ఎవళ్ళో పొగరమోతు చచ్చినాళ్ళు—'

'పాపం ఎవరో మనిని మేలుకోమంటున్నారు' అన్నాడతను.

"అరెస్టు చేయాల్సిందే—యింక వూరుకో కూడదు" అన్నది.

"మనుష్యుల్ని, సంస్థల్ని, దేశాలని, అన్నింటినీ ఎదుర్కొవచ్చు; అన్నింటినీ జయించవచ్చు; అన్నిటినీ, వొక్క అకారణద్వేషాన్ని తప్ప." అన్నాడు నిధి. మళ్ళా నడవడం సాగించారు.

"నువ్వు డాక్టర్ని డిస్మిస్ చేశావుటగా."

"అవును రోగి మందులేక చస్తావుంటే, వాడికి నర్సుతో షికార్లేమిటి?" అంది.

"అవును, మరి నారయ్య చస్తూవుంటే, మనం షికారుకు రాలేదు? అల్లాగే అతనూను." అన్నాడు.

"మీరింత మంచివారు గనకనే, వాళ్ళింత నెత్తికెక్కుతున్నారు."

"స్వచ్ఛంగా 'మంచి' అనేదిలేదు. ఎవళ్ళో ఒకళ్ళ కంటె 'మంచి' వుండొచ్చు."

నడక తొందరగా సాగించారు. గనులు దగ్గరకి చేరుకున్నారు. కాని గనుల పల్లాలు, తవ్వాలు, కనిపించడం లేదు. పెద్దగనులు మూసు రాళ్ళతో, మట్టితో పూడ్చబడి వున్నాయి.

"ఇదేమిటి?" అంది కోమలి.

"ప్రేమ; ఆరు నెలలు తీసుకున్న పనిని ద్వేషం రెండు గంటలలో చేసేసింది"

అతనికి నవ్వాలో యేడవాలో తెలిసిందికాదు. మానవుడి ద్వేషం, క్రూరత్వం, పశుత్వం, యెల్లావుంటుందో చూడగలిగాడు. అతను ఆమానవ జాతికి చెందినవాడే. తనని తాను ఎల్లా ప్రేమించుకోగలడు? తనని తాను ప్రేమించుకోలేనివాడికి యితరులని ప్రేమించే అర్హత ఎల్లా వుంటుంది?

ఇంటికి చేరుకున్నారు. 'అమ్మ' విగ్రహం చెయ్యివూడిపోయి, బీటుతో అల్లాగే వుంది. తలకాయ వూడివుంటుం దనుకున్నాడు. కాని అల్లాలేదు. హాల్లోకి చేరుకునేటప్పటికి, రెండు గంటలైంది. అరుగుమీద తువ్వాలతో దులుపుకుని పడుకున్నాడు. లోపల్నించి నాకయ్య మూలుగు వినబడుతోంది. దూరంగా మూల 'చిట్టి' చాపమీద పడుకున్నాడు. దీపం తన్నుకులాడి, ఆరిపోయింది. కోమలి నిధి పక్కనే గోడని చేర్లబడి ప్రక్కన వొరిగిపోయింది. ఆ యిద్దరూ తమతమ ఏకాంత భవనాలలో బంధించబడి, వొకర్ని వొకరు నిద్రలో చూసుకుని, దగ్గర్నుంచి కలుసుకోలేమే అని నిశ్చలంగా ఏడుస్తున్నారు.

ఆ సూర్యుడే వుదయించాడు. ఆ కిరణాలే వారి నేత్రాలని మాధుర్యంతో మత్తెక్కించి మేలుకొలిపాయి. చుట్టూ జనం పోగడ్డారు. రాత్రి జరిగిన దురంతానికి కారకులెవరో అంచనాలువేస్తున్నారు. నేరారోపణ చేస్తున్నారు జిల్లా మేజిస్ట్రేట్ కూడావొచ్చాడు. అసలుగనులేలేవనీ, వాటిపేరు చెప్పగుని,రాయలసీమ ప్రజలని మోసంచేసి, వొకసర్కారుజిల్లావ్యక్తి,యిష్టం వొచ్చినట్లు అమాయకపు ప్రజలపై అధికారం చలాయిస్తున్నాడని, మేజిస్ట్రేట్ కి, ఆకాశరామన్న పేరిట పిటిషన్లు వొస్తే వాటి నిజానిజాలు తెలుసుకుందామని, ఆ ప్రభుత్వోద్యోగి చక్కావచ్చాడు. ప్రణాళికలు పరిశీలించాడు; ఇంజనీర్లని పరామర్శించాడు. గనులు పూడిపోయి వున్నాయి. షిర్యాదులు. విచారణ, శిక్షణ—సాక్షులు అంతా పూర్తయి, మేజిస్ట్రేట్ ప్రభుత్వంవారికి పంపడానికి రిపోర్ట్ తయారయ్యేటప్పడికి మధ్యాహ్నం రెండు గంటలైంది. మేజిస్ట్రేట్, ఆ పిటిషన్లలో యథార్థం లేదని, దయానిధి

తల పెట్టిన కార్యం న్యాయబద్ధమైందని వ్రాశి పంపించాడు.

ఈ వార్త వజ్రకరూర్‌లో పాక్కింది. అక్కడ వొక పెద్ద సభ చేశారు. మేజస్ట్రేట్ అనంతాచారిగారి స్నేహితుడనీ, ఆయన మొహమాటాన ప్రభుత్వంవారు న్యాయంగా విచారించక, తగిన చర్య తీసుకోడం మానివేశారనీ, వారు నిశ్చయించి, సభలో వుపన్యాసాలుచేసి, గవర్నరుగారి దగ్గరకు వో 'డెప్యుటేషన్'ని నిర్ణయం చేసుకున్నారు. వారు గవర్నర్‌కి నివేదించుకోవలచిన అంశాలు.

(1) ఆంధ్రరాష్ట్రం విషయంలో, సర్కారు వారితో యేకీభవించలేము.

(2) తమకి ప్రత్యేక రాష్ట్రం వుండాలి. అవి యివ్వలేని పక్షాన, ఆర్థిక జాతీయ సమానత్వం సమకూర్చే అవకాశాలు ప్రభుత్వం వెంటనే కలిగించాలి.

(3) ఇతర జిల్లాల వ్యక్తులకు, యీ జిల్లాలలో పారిశ్రామిక సావకాశాలుండగూడదు.

(4) ఉద్యోగం, కళాశాలలలో 'సీట్సు'— వీటిల్లో యితర జిల్లాల వారికి ప్రవేశం వుండకూడదు.

ఈ తీర్మానాలు సమగ్రంగా లేవని, కొందరు పెద్దలు నిర్ణయించి సమర్థించేంగా,— "ప్రధాన స్థానం రాయలసీమ వారికే ఉండాలి, వారు లభించనప్పుడు యితర జిల్లాలవారిని తీసుకోవొచ్చు" అన్న సవరణ చేశారు. కడపలో వొక కాలేజీ వెంటనే పెట్టాలి. దానికి ప్రిన్సిపాల్‌గా, మళయాళీ కాని, తమిళ సోదరుడుగాని, సర్కార్ జిల్లావ్యక్తిగాని, అవకూడదు, అని మరో తీర్మానం. ఆ సభలో అనంతాచారి గారూ, నిధికూడా వున్నారు.

ఇంకా నయం ప్రిన్సిపాల్‌గా వుండేవాడు కనీసం మనిషైవుండాలని సంకల్పించి నందుకు, సంతోషించ వన్నిందే—" అన్నారు అనంతాచార్లు గారు అక్కడ వుపన్యసిస్తూ. అక్కడ జనానికి, యిదివరకు ఆచారిగారి

పైన వున్న గౌరవం యిప్పుడు లేదు. ఆయన ప్రసంగం ఎవరూ వినే స్థితిలో లేరు.

సభ ముగిసింది—జనం పల్చబడ్డారు. చీకటి పడుతోంది. నిధి దూరంగా అరుగుమీద కూర్చున్న సరయ్యగారి దగ్గర కెళ్ళాడు.

"ఈ చాకు మీ దేననుకుంటాను. మీవాళ్ళెవళ్ళైనా గమలదగ్గర పారేసుగోనుంటున్నారు." అని చాకునితీసి సరయ్యకిచ్చాడు.

సరయ్య దానికేసి పరకాయించి చూశాడు.

"అవును నాదే,—మా తమ్ముడు, పారేసుకున్నాడేమో!" అని చాకును తీసుకున్నాడు.

నిధి, ఆచార్లుగారు యింటికి చేరుకున్నారు.

"ఇవాళ అంకరం మా యింట్లో వుండగూడదూ?" అన్నారు ఆచార్లుగారు. నిధి సరేనన్నాడు. కాశ్యాయన్ని పంపి. కోమన్ని ఆచారిగారింటికి తీసుకురమ్మన్నారు.

అనంతాచారిగారు వీధిలో మడతమంచం వాల్చుకుని కూర్చున్నారు. సరయ్య, యిద్దరు పోలీసులూ వొచ్చి ఎదురుగా నిలబడ్డారు. తక్షణం ఆచారిగార్ని తీసుకు రమ్మనమని మేజస్ట్రేట్ గారి దగ్గర మంచి 'సమ్మన్' వొచ్చింది.

"అంత అర్జంటా? ఉదయం రాకూడదూ?" అని అడిగారు ఆచార్లుగారు.

"ఇప్పుడే రమ్మన్నారు" ఆచారిగారు, యింట్లోకెళ్ళి, కోటు, కండువా వేసుకొని, కర్ర తీసుకొని, మళ్ళీ వుదయమే వొస్తానని చెప్పి, కార్లో ఎక్కి వెళ్ళిపోయారు.

దయానిధి ఏమీ పాలుపోక, రోడ్డుమీద నడుస్తూ పోతున్నాడు. దూరంగా వొంతెన మీద కొందరు వ్యక్తులు కూర్చుని మాట్లాడుకోడం వినబడుతోంది అతనికి.

"ఆ నిజలింగప్పగాడి కన్ను దానిమీద పడింది. దాన్నెప్పుడో లేగ

దీసుకుని కొట్టుక పోతాడు."

"అయ్యవోరి పెళ్ళాం కాదంటగా—"

"ఆరమ్మా యిదేమాదిరిట— బల్లకట్టుగుని సంపాదించిన దుడ్డే—"

"అమ్మబుద్ధులే కొడుక్కీ వొచ్చాయా—"

నిధికి, ప్రపంచం శ్మశాన భూమిగా కనబడుతోంది ఆచీకట్లో. ఆ రొదలో.

అక్కడనుంచి వొచ్చేద్దామను కుంటున్నాడు — కానిఇంకా ఏం చెప్పగుంటారోనన్న కుతూహలం వొదలడం లేదు. ప్రపంచంతో నిమిత్తం వొదులు కోలేని స్వార్థం. మళ్ళా కంఠాలు వినిపిస్తున్నాయి.

"సర్కారోళ్లు అందరూ అంతేరా— ఆళ్లకి ఆడోళ్ల భాగోతమే —అళ్ళుపోతేగాని కనిపడట్లు, మీటింగులో తీర్మానం అయిందిగా—"

నిధిని, స్వార్థం వాళ్లలోకి నెట్టివేస్తోంది. తను తనగౌరవం, తనఆత్మ తన ఆదర్శాలు, తనజాతి, తనదేశం, తన ప్రపంచం — అన్నీ వొక్కసారి ప్రేరేపించి, శక్తిలాగ్గా, రంగంలోకి నెట్టేశాయి. భయం, సిగ్గు, మొగమాటం, ఔదార్యం అన్నీ ఏమయ్యాయో!

"నేను నిజంగా మీకుచేసిన అపకార మేమిటో చెబుతారా, బ్రతిమాలుకుంటాను." అన్నాడు గుంపులోకి వెళ్ళి, ఆవ్యక్తులు తెల్లబొయ్యారు.

"మిమ్మల్నేమన్నాం—మేం వేరే మాట్లాడు గుంటున్నాం" అన్నాడు వాళ్ళల్లో పెద్దమనిషి.

"మీ రనుకునేవన్నీ నాకూడా అన్వయిస్తాయి. వాటిని అబద్ధం అని ఋజువు చెయ్యలేను. నా తప్పు నాకు తెలియపరిస్తే, మహోపకారం చేసినట్లు," అన్నాడు.

ఎవ్వరూ సమాధానం చెప్పరు.

"నేను సర్కారు జిల్లాలవాణ్ణనా మీకోపం?"

సమాధానం లేదు.

"మాట్లాడ రేం?"

నిశ్శబ్దం.

ఎవరో సకిలించారు.

"అదే ఐతే, రేపు వుదయమే, నేను వెళ్ళి పోతున్నాను.—"

నిశ్శబ్దం.

"నాకు పెండ్లికాలేదనా?— రేపుదయమే పెండ్లిచేసుకుంటాను."

ఎవరో నవ్వారు.

"నవ్వులాట కాదు. మీరెవరో నాకు తెలీదు. అనేకుల మనస్సులలో వుంటున్న భావాలని మీరు బైటికి విపులంగా వెళ్ళబుచ్చారు. మీ మధ్య నేను వుంటున్నాను గనుక, మీతో సమాధానపడటం నా విధి. మీ రేది కోరితే అది చేస్తాను. ఆస్పత్రి. గని, భవనం, స్కూలు, లైబ్రరీ,—అన్నీ మీకు వప్పగించేస్తాను.—"

"రాష్ట్రం" అన్నా రెవరో.

"నాకు రాష్ట్రం అక్కర్లేదు, మనందరం స్నేహంగా, సుఖంగా, వుండటం కావాలి. వొద్దని ప్రచారం చెయ్యమంటే నే చేస్తాను. మాట్లాడ రేం—"

అంతా నిశ్శబ్దంగా వుంది.

"ఎవరో మా అమ్మ విషయం ఎత్తారు మీలో. నే నేం చెయ్యను. —మా అమ్మ చచ్చి పోయింది.— చచ్చినవాళ్ళని, నే నేం చెయ్యను." ఒక్కసారి, కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి; కంఠంపగిలి పోయింది. ఆపుగోలేక, నిధి దగ్గరగా ఏడుస్తూ, 'చచ్చిపోయింది' అనుకుంటూ, పిచ్చివాడిలా నడిచి వచ్చేశాడు. దూరంగా ఎవరో ముక్కు చీదుకొని నిట్టూర్చారు.

ఆచారిగారింట్లో దీపం మసగ్గా కనబడుతోంది. అంతా చీకటి. ఇంక తనికి ఏడ్పు రావడంలేదు. కన్నీరంతా ఎండిపోయింది. స్మశానంలో భూతాలతో ప్రసంగంచేసి వొచ్చింతర్వాత, యింక గుండెలమీదభయరక్షాండ

వించలేదు.—బరువుని సముద్రం మింగేసి, కుంపటల్ని మొహాన కొట్టింది—ఆ బరువు, సముద్రంలోని వుప్పునంతా పీల్చేసింది.— కన్నీరింక వుప్పగా వుండదు.

'రంగ' డొచ్చాడు. "మరేమోనే, మా అమ్మ—ఏమందో చెప్పకొండి—" అని అతనిచెయ్యి పట్టుగుని లాగుతున్నాడు.

"ఏమంది"

"చెబితే ఏమిస్తారు?"

"నేనివాళ చచ్చిపోగా ననుకో—పోయేంలోగా నీకేదేనా కావాలంటే ఏం కోరతావు?"

"ఒక్క రూపాయి."

"ఓస్" యింతేకదా—యిస్తాలే—"

"ఏమీ లేదు. అమ్మ భోజనానికి రమ్మంది." అన్నాడు రంగడు.

"రూపాయిస్తాను. యెప్పుడూ ఏడవకేం, అన్నాడు నిధి. రంగడు గంతులేస్తున్నాడు.

"అమ్మ చచ్చిపోయినా ఏడవకూడదు." అన్నాడు నిధి. ఇంటికి చేరుకున్నారు.

కోమలి వొచ్చింది. ఎన్నడూ లేంది, ఆరాత్రి నల్లచీర కట్టుగుంది. జాకెట్టు రంగు తెలీడంలేదు. తల్లో గులాబీలు, మల్లెపూలు దవనం—అన్నీ ఎత్తుగా పెట్టుగుంది. రాణీ అత్తవారింటి కెళుతోన్నట్లుంది.

"పొద్దు పోయింది—ఎక్కడ తిరుగుతున్నారు? అన్నది.

"నారయ్య కెల్లావుంది?"

"అల్లాగే వుంది మాట్లడంలేదు. గొడవలన్నీ వొదిలి పొయ్యాయా—

అత నేమీ మాట్లాడలేదు, భోజనాలుచేశారు. రాజమ్మగారు దిగులుగా వుంది. ఎవ్వరూ ఎక్కువ మాట్లాడకుండానే భోజనాలు కానిచ్చారు.

దయానిధి, తువ్వాలు బుజాన వేసుగుని వీధులో కొచ్చాడు.

"అంటే?"

"ఏం కావాలో తెలిస్తే, ఆ వొస్తువుని ప్రేమించి, దాన్ని పొందటం కోసం యత్నిస్తాడు. అది తెలీనప్పుడు, హృదయంలో మిగిలేది ద్వేషం."

"మీకు నేను కావాలని, మీకు తెగీదన్న మాటేగా?" అంటూ. తను వేసిన ప్రశ్న తెలివైందని సూచిస్తూ తనే నవ్వడం సాగించింది.

"కొందరికి ఏమీ అక్కర్లేదనుకోండి, వారి మాటేమిటి?"

"అక్కర్లేదని తెలుసుకుంటే కూడా ద్వేషం వుండదు." ఆ

రాళ్ళమీద కూర్చున్నారు. ఆకాశంలో చంద్రుడు లేడు. వొణికిపోతోంది. నిధి తలని కోమలి తన వొళ్ళోపెట్టుకుం పొయ్యాడతను.

"మీకు వెలుగుకనబడితే, నాకు చెంద్రుడు కనబడి కోమలి.

"అంటే."

"వెళ్లు సద్దుతుంటే, వొకకవరు దొరికింది. దాన్లోచూస్తే పొడుగాటి వెంద్రుక దొరికింది--నన్ను నేను కనుక్కున్నా

"అదేమిటి"

"నాదేగా,—సిదాచుకున్నారు— మనిషి నే వుం కావాలి?"

అది అమృతాంశని చెబుదామనుకున్నాడు. కాని దాని జనం? సంతోషం ఢుచ్చిన భ్రమని తుంచెయ్యడం దేనికి?

"అది నీదనే నమ్మకం ఏమిటో?" అన్నాడు.

"నాకేంకావాలో నాకుతెలుసు. అంతేకాదు, మీకేం కూడా నాకుతెలుసు. అనుమానం వుంటేగా సం దేహానికి — ద్వేషంలేదు —"

అంటూ అతని తలని గట్టిగా అదిమి,త దవుల్ని కగిల్చింది.

జ్వాలలు కోమలై, అతన్నిచుస్తేశాయి అతను పిలిచాడు మంటలు సమాధానమిచ్చాయి—'నిధీ'అని. మధ్య దూలం పక్కనుంచి ఎవరో గెంటి వేశారు; దూలం పడింది. దానికి చీర, కోమలి చెయ్యి వున్నాయి. ఆదూలంతో పెనుగులా తలకిలాగి, బైటకొచ్చాడు. కోమలికి నుదిటిమీదా, చేతి లాయి; మాటలేకుండా పడిపోయింది.

జనాన్ని, సామాన్నీ, నిధి, తన భవనంలోకి కోమల్ని, స్తంభాని కానించిన బండిలో ఎక్కించి. యిద్ద ఆబండిని ఇంటివైపు లాక్కెళ్ళారు. ఆచారిగారి కుటుం మేడమీదికి చేరుకున్నారు. కోమలి వున్న బండిని, గేటుద అటూ యిటూ తిరుగుతున్నాడు. తన్నకోసం తెప్పించిన య నాశనమై పొయ్యాయి; గనులు పూడ్చబడ్డాయి. వజ్రం సిరి, సంపదా, అంతా ఆహుతిఐంది. తనకున్న బంధనాలు సంకెళ్ళు వూడిపడ్డాయి. తనింక స్వతంత్రుడు,—స్వేచ్ఛా బరువుతో పగలడం లేదు. బరువుగా నడిచి గేటు దగ్గరకొచ్చా

ఏదో మిగిలింది.—అంతా నాశనంకాలేదు నైకమాశా విగ్రహం.—విరిగి పడిపోయింది—పాదాలుమాత్రం మిగిలాయి అనుకున్నాడు ఇప్పుడతనికి పరిపూర్ణ స్వతంత్రం. అయ్యో యి మిగిలిపోయిందే! అని ఏడవక్కర్లేదు.

నారయ్య, తిట్టుతో, దీవిస్తోలేవబోయ్యాడు. అతన్ని కోమలికి కట్టుకట్టి చికిత్సచేసి, నెత్తికింద దిండ్లుపెట్టి,—యింత జ్ఞాపకంవొచ్చి గబగబా ఆచారిగారింటికి పరుగెత్తుకు పొయ్యా ముందు మంచాలు అల్లాగే వున్నాయి. పక్కదుప్పట్లు యివతలికి దిండ్లువూడదీశాడు —వాటికింద,—రాత్రి చదవకుండా రెండు కవర్లు దొరికాయి. మంటల వెలుగు బోలెడుంది. మొదట చించి చదివాడు.

"అయ్యా, నేను, మీకు జ్ఞాపకం వుండే వుంటాను. వైకు రబ్బాయిని, మా నాయన గారు, నెలక్రితం పక్షవాతంవల్ల, స్వగస్థులై (వా మకుటకు చింతిస్తున్నాను. వారుచనిపోయేముందు, నాకోశవరు వప్ప

రానిని మీకు పంపమన్నారు. దుఃఖసముద్రములో మునిగి, నేను యిన్ని రోజులూ ఆలస్యం చేసినందుకు క్షమిస్తారని తలుస్తాను. మాతండ్రి గారి కోర్కె ప్రకారం, ఆకవరు యిప్పుడు వేరే పంపుతున్నాను. అందినదీ, లేనిదీ వెంటనే వ్రాయించ కోరతాను.

ఇట్లు
జనార్దనం

ఆ రెండో కవరు చించాడు నిధి. అందులో వొకవుత్తరం. మరొక బుల్లికవరూ వున్నాయి. ఆవుత్తరం చదివాడు.

"దయానిధీ, నువ్వు కొన్ని సంవత్సరాల క్రితం జీవితానికి అర్థం ని ప్రశ్నించావు. అప్పుడు నీకు ఏసమాధానం చెప్పినానో గుర్తులేదు. చెప్పివున్నా, అది నిజమైన సమాధానం అయివుండదు. ఇప్పుడు నం నాకు దొరికింది. నువ్వు నాప్రియశిష్యుడవైనందున, ఆరహస్యం వెయ్యడం నావిధి. ఆప్రశ్నకి సమాధానం, యిందులో పంపుతున్న వర్‌లో వుంటుంది. అది నువ్వుబుజువు చేసుకున్నదీ, లేనిదీ, నేటంత వరకూ నేను జీవించి వుంటాను. దైవకృప అట్టిది.

ఇట్లు
వైకుంఠం

తృతతో ఆచిన్నికవరు చించి చూశాడు. అందులో ఏమీలేదు.— కవరు— జీవితాని కర్థం లేదన్నమాట!

టల అందం చూస్తూ, జనం నిలబడ్డారు. కొందరు ఆర్పడానికి చేస్తూనే వున్నారు. నిధి తన మేడ వైపుకి నడిచి వెళ్ళి . కింద వరండాలో రాజమ్మగారు, పిల్లలు ఏదో తడుముకూ రు.

"మీరందరూ పడుకోండి" అన్నాడు నిధి.

రాజమ్మగారు నిశ్శబ్దంగా ఏడ్పు సాగించింది.

"ఇదంతా నామూలాన జరిగింది" అన్నాడు.

ఆవిడ ఏమీ మాట్లాడలేదు. అరగంట గడిచింది. రాజమ్మగారు న వూళ్ళో లేక పోవడంవల్ల యిల్లా జరిగింది" అంటూ, పిల్లల్ని ని పైకి నడిచింది.

నిధి, వొక వుత్తరం వ్రాసి, కిటికీలో పెట్టి గేటుదగ్గిర బండిదగ్గ కొచ్చాడు. కోమలి అతన్ని నీరసంగా పిలిచింది. ఆమెను బండిలోంచి దింపాడు. చేతికిమాత్రం బలమైన గాయం తగిలింది. ఆ చేతిని తన భుజంమీద వేసుగుని, నిధీ, కోమలీ, మెల్లిగా నడవడం సాగించారు.

"ఎక్కడికి యీ చీకట్లో?" అంది కోమలి, నవ్వడానికి బాధపడుతూ.

"ఎక్కడికో తెలిస్తే, యికనేం—జీవిత నిరంతర యాత్ర—గమ్య స్థానం లేదు. నడవగలవా నువ్వు—?"

"ఓ." అని మూంతి సున్నాల్లా మట్టి, జుట్టు వెనక్కి తోసుకు అతని భుజాన్ని బిగించి పట్టుగుని తొందరగా నడవడం సాగించింది. మనుషులు, వెనకపడ్డారు. తాటిచెట్లు నిద్రలో లేచి, ఆవులించి, జాగి మళ్ళా పడుకున్నాయి—కాపలా కాసేటందుకు ఏమీలేక.

వెనక్కి తిరిగి చూశాడు. తీరాచేసి వాళ్ళు వొక ఫర్లాంగే దూరంగా, మేడముందు, గేటుదాటి ఎవరో యివతలికొచ్చి, త స్తున్నారు. వెనక ఎవరో వడిగా, ముందు నడిచేవారిని నిలిపి, మళ్ళా వెనక్కి వెళ్ళిపోయిన దృశ్యం చూశాడు నిధి. ఎవ తెలిసింది.

రాళ్ళు, గుట్టలు, పొదలు, కాలిబాట ఆవలగట్టు, పుట్టలు దాటి కొండల దగ్గరికి చేరుకున్నారు.

అంతా చీకటి. కాలం ఎంతైందో ఎవరికీ తెలియదు. పైన అన్నీ నక్షత్రాలే. తన సిరి, సంపదా, 'కాత్యాయని'—అన్నీ కో ఆకాశాన అలంకరించాయి.—ఎవరికి అందకుండా—ఎవరూ చెయ్యేకుండా. వెనకా ముందూ, ఎడమా కుడి అంతటా చీకటి విశ్వమంతా. దాటిలో వొక చిన్న నక్షత్రం స్ఫుటిలా వికసించి వి వ్యాపించింది అంతా తమదే—కాని చెయ్యి చాస్తే ఏవీ అందవు తమరివే కాని నోరెత్తిపిలిస్తే, ఏవీ పలకదు.

రెండుకొండల మధ్యనుంచి నడిచి, అవతలికి చేరుకున్నారు లంటూ లేని ఆవకల నడిచీనడిచి, నడిచినడిచి నడిచినడిచి—మనా డికే చేరుకోటమా! అంతేనా విశాల ప్రపంచం! అదేనా అనంత ఇదా ఎడతెగని జీవిత రహస్యం!

కోమలి గడ్డిలో వాలిపోయింది.

"ఇక నేను నడవలేను బాబు—యిక్కడ పడుకుందాం."

చీరకొంగు వుండకింద చుట్టి తలకింద పెట్టుకుని కోమలి పడుకుంది. 'నిధిగారు' అని దగ్గరగా కేకవేసినట్లు వినిపించింది. కొండమధ్యనుంచి వొచ్చిచూశాడు, దూరంగా ఎవరో కదులుతున్నట్లు కనిపించింది. గారూ' అన్నది ఆ కంఠం. గబగబా వెనక్కి నడిచాడు.

నారయ్య పడిపోయాడు.

"నాపని పోయిందండి—మీ కెందుకూ పనికిరాకుండా వున్నాను. భద్రంగా వుండండి...మీరు..." నారయ్య మరి కదలడు.

నిధి దూరంగా నడిచి కొండపక్క చెట్టుదిమ్మమీద పడుకుని ఆకాశం చూస్తున్నాడు. ఆనాడు కాలువగట్టు, యీనాడు కొండలమధ్య— ఆకాశం, అవే నక్షత్రాలు. తను ఎంతదూరం వొచ్చినట్లు! ఎంతసేపు ట్లు! స్థలం, కాలం, తనూ—యీ మూడింటిలోనూ, ఏది యదార్థం. మీద పడివున్నది ఎవరు? చివరికి మిగిలిందేది?

తన జీవితం పాడు చేసుకున్న వ్యక్తి. యితరుల జీవితాలు బాగుచేద్దామని స్తే, అన్నీ పోతే, తన జీవితం బాగుచేసుకున్న వ్యక్తికి, యితరుల అక్కర్లేదు. ఇతరులు బాగులేక పోతేనే, తను బాగుంటం అనేది తోంది. అసలు మంచిచెడ్డల విలువలు నిర్ణయించేది, యితరులు. కంటె' ఒకరు మంచి. కాని అసలు 'మంచి' అంటూ ఎక్కడుందీ! తో వుండాలి. లేకపోతే, 'కొంచెంమంచి' "యింకా మంచి" ఎల్లా యి! మంచికి కావల్సినవి మూడు. ప్రేమా; ధనం; కీర్తి మొదటిది వంలో; చివరిది చివరలో; రెండోది ఎప్పుడూ కావల్సింది. రెండోది , మొదటిదీ; చివరిదీ; యిట్టే లభ్యమౌతాయి. అపాలి: కాని అతనికేం లో అతనికి తెలీక. ఇప్పుడతనికి ఏమీ అక్కర్లేదు.

ప్రేమా!

నీరసించిన నరాలు, కాలేకడుపూ, ఎండిన నాలుకా. దానికోసం, , స్నేహాలు, మనస్సులు కలబోసుకోటం; గుండెలు విడిబోటం; లు, నాటకాలు.

మబ్బుమేఘాలు, కెరటాల తుంపర; పువ్వు వికసించటం, సంధ్య

మంచులోనదీ, మేక అఱుపు; పిల్లల ఆట, కుక్క విశ్వాసం. పిల్ల వేసంగివాన, మొక్క మొలిచిన వయ్యారం, ఎండిన ఆకు వై దాహమేస్తే మంచినీళ్ళుత్రాగడం,—ప్రియురాలి లేతపెదవులు—అదా ధనమా!

భవనాలు, కార్లు; బాంక్ పుస్తకాలు; రెండు కళ్ళమధ్య పర రోమ్ములబరువు; వేడిశ్వాసమధ్య వుక్కిరి బిక్కిరి కావడం. అం అధికారం; తనకి తనే దాస్యం. నలుగురు యువకులు, నాలుగు పారేశిన విస్తళ్ళకోసం తన్నుకులాడుతుంటే, కారులో కళ్ళుమూ హార్నొడం—తన జాగిలాన్ని వాళ్ళమీదికి యిస్కు కలపడం—అద కీర్తా?

ఏమో, ఉపన్యాస వేదికలమీద మహానుభావుడు — వం మృగం: గ్రంథాలలో గొప్పవాడు; పడగ్గదిలో జంతువు, రోడ్డుమీద సేవకుడు; ఇంట్లో సర్వాధికారి; పదిమంది లోనూ మహాపురుషుడు; ఏకా దౌర్భాగ్యుడు.

అతను జయించిన పరదేశాలన్నీ మహా రాజ్యాలయ్యాయి స్వదేశం స్మశానమైంది. అతన్ని ప్రేమించిన స్త్రీలందరూ రాణుల అతను ప్రేమించింది అడుక్కుతింటోంది. గడ్డిపోచ బంగారు కణిక పిచ్చిపువ్వుమణి; మట్టి వెన్నెలయింది: కణికలు, మణులు వజ్రాలు మంటగలిశాయి. శరీరాన్ని ఎందరెందరో పంచుకున్నారు; కీర్తిని క ప్రేమని విషంపోసి హత్య చేశారు, సౌందర్యం జుట్టు విప్పగునియవ కౌగలించుకుని. యేడ్చింది శాంతం 'అహాని' కేశి తిలపగలగొట్టుకుంది; పగ పొడిచింది. మతాన్ని విజ్ఞానశాస్త్రం పూడ్చేసింది. దైవాన్ని యంలో బంధించారు. మంచితనం సింహాసనం యెక్కి ప్రాణం వి మోహం నాగరికత నడుంని సాగేశింది. నాగరికత రోజూ కా రైళ్ళ కింద, విమానంలోంచి దూకుతూ, ఆత్మహత్య చేసుకుం 'మనం' ముక్కలై "నువ్వు" "నేనూ" అయి ఉత్తర దక్షిణాలకి ప్ర చేసింది. వారూ, వీరూ, ఎవరో, కొందరు, వొకరు, మీరూ, ఎ ఎమో!—"అందఱూ" మాత్రం లేరు.

అన్నీ ప్రశ్నలే—సమాధానంలేదు.



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA108B192 |
| పుస్తకం పేరు | చివరకు మిగిలేది |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 443 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | [illegible] |
| లేని పేజీలు | 273TO276 |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనిది | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |